# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 9 సంచిక : 1 హైదరాబాద్ 114 జనవరి 2011 పేజీలు : 88 రు. 15

- ఫోకస్ : వనరులు, ప్రజలు, సమస్యలు, పోరాటాలు
- బినాయక్ సేన్‌కు శిక్ష - అన్యాయమైన తీర్పు
- నిజం చెప్పినందుకే వికీలీక్స్‌పై దాడులు
- కొండలను కొల్లగొడుతున్న దోపిడీ
- ప్రజల కోసమే ప్రత్యేక తెలంగాణ
- సమాజ దుస్థితికి సూచిక అసహజ మరణాలు
- ఆధ్యాత్మిక గురువుల బూటకత్వం

# వీక్షణం

పాఠకులకు, చందాదారులకు,

రచయితలకు, అనువాదకులకు,

అసహజ మరణాల సమాచార సేకర్తలకు,

ఏజెంట్లకు, డిస్ట్రిబ్యూటర్లకు,

దాతలకు, వ్యాపార ప్రకటనదారులకు,

ప్రింటింగ్ ప్రెస్ యజమానులకు, కార్మికులకు,

మిత్రులు, శ్రేయోభిలాషులు అందరికీ...



సామాజిక సమస్యలపై స్పందిస్తున్న 'వీక్షణం' కు అభినందనలతో..

నూతన సంవత్సర శుభాకాంక్షలతో ....





తెలంగాణ ఎన్జీవో కేంద్ర సంఘ అధ్యక్ష - ప్రధాన కార్యదర్శులు

**శ్రీ కె. స్వామి గౌడ్, శ్రీ జి. దేవి ప్రసాద రావు**

నేతృత్వంలో వెలువడుతున్న

# తెలంగాణ ఎన్జీవో కేంద్ర సంఘ అధికార మాస పత్రిక




## చదవండి ... చదివించండి

సర్క్యులేషన్ మేనేజర్ : జి. వెంకటేశ్వర్లు

ఎడిటోరియల్ బోర్డ్ : బి. రేచల్, కె. వెంకటేశ్వర్లు & ఎం. హరిబాబు

జీవితకాలం చందా : రూ. 1000/-
6 సంవత్సరాల చందా : రూ. 500/-
సంవత్సరం చందా : రూ. 100/-

" తెలంగాణా ఎన్జీవో. కేంద్ర సంఘం "
పేరిట చెక్కులు పంపించగలరు

114

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

జనవరి 2011
సంపుటి : 9
సంచిక : 1



## లోపలి పేజీల్లో...





ప్రింటర్స్
**డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**
మైత్రీ రెసిడెన్సీ,
3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email: veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు/లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

ఫోకస్ 'చదవదగిన పుస్తకాలు' వ్యాసాలూ, లేఖలూ మొత్తం అక్షరం వదలకుండా చదివేను. ఎక్కువ భాగం, ఇంగ్లిషులోనూ, తెలుగు అనువాదంలోనూ చదివేను. సంక్షిప్తానువాదాలూ, పరిచయాలూ సమర్థనీయం కావచ్చు. పూర్తిస్థాయి అనుసరణలు మాత్రమే చదవడం మంచిది. ఉదాహరణకు, 'స్పార్టకస్'కి ఆకెళ్ల కృష్ణమూర్తి అనువాదం, 'అమ్మ' నవలకు క్రొవ్విడి లింగరాజు (మాస్కో పరిష్కృత ప్రతి) యామాదిపిట్ – అలెగ్జాండర్ కుప్రిన్, 'నేరమూ–శిక్షా' ఫ్యోదోర్ దొస్తేవ్‌స్కీ మొదలైనవి. ఎన్. వేణుగోపాల్ వ్యాసం, కొడవటిగంటి రోహిణీప్రసాద్ వ్యాసం (ఇప్పటికే ఆయన వ్యాస సంపుటాలు నాలుగు వెలువడ్డాయి) నూటికి నూరు పాళ్లూ సమర్థించదగినవి. కంటిచూపు ఇబ్బంది కానంత వరకు 'వీక్షణం' చదువుతూనే ఉండాలని నిర్ణయించుకున్నాను. బహుశా ఆ తరవాత కూడా, చదివించుకోవాలన్నది నా ప్రగాఢ వాంఛ. రచయితల రచనల చివర ఏక వాక్య పరిచయం బాగుంది. కానీ, ఇంకో వాక్యం పెంచి, కనీసం పూర్తి పోస్టల్ చిరునామా, లేక కాంటాక్ట్ ఇవ్వగలిగితే బాగుంటుంది. ఆలోచించండి.

**– డా. మానేపల్లి**
యలమంచిలి, విశాఖపట్నం

పీడిత ప్రజల ఆశాజ్యోతి 'నవ చైనా' నినాదం లాగ మీరు నడుపుతున్న 'వీక్షణం' పత్రిక పీడిత ప్రజల ఆశల్ని, ఆక్రందనల్ని, ఆక్రోశాల్ని ప్రతిబింబిస్తుంది. పత్రిక ఇలాగే చిరకాలం కొనసాగాలని నా ఆకాంక్ష. కానీ పత్రిక నడిపించడంలో గల ఇబ్బందులు అన్నీ పత్రిక ద్వారా తెల్పినవి. నేను కూడా డా. జయగోపాల్ గారి సంపాదకత్వంలో నడిపిన 'నాస్తికయుగం' పత్రిక విశాఖపట్నంలో ప్రచురిస్తున్నప్పుడు ప్రెస్ నిర్వహణ, పత్రిక ప్రచురణ, పంపిణీ మొదలైన అన్ని కార్యక్రమాలలో పాల్గొనేవాడిని. కావున పత్రిక నిర్వహణ, పత్రిక అమ్మకం ద్వారా సాధ్యం కాదు అన్న విషయం నాకు తెలుసు. నేను భారత నాస్తిక సమాజం ఎక్స్ ఎగ్జిక్యూటివ్ మెంబర్‌గా పనిచేసాను. 1978–80 మధ్యకాలంలో ఆర్.వై.ఎల్. ఆధ్వర్యంలో నడిచిన కార్యక్రమాల్లో పాల్గొనే వాడిని. తప్పక చదవాల్సిన పుస్తకాల్లో కొన్ని చదివాను. గోర్కీ 'అమ్మ', 'విముక్తి', 'రక్తాక్షరాలు', 'భారతదేశంలో నా జైలు జీవితం', మార్క్స్ జీవిత చరిత్ర మొదలైనవి. అలాగే సృజన, అరుణతార, పిలుపు మొదలైన పత్రికలు చదివాను.

**– ఎం. రామచంద్రరాజు**
నర్సీపట్నం

వీక్షణం డిసెంబర్ 2010 సంచికలో వచ్చిన బి.డి. దమయంతి వ్యాసం 'నారాయణపట్నా ఆదివాసీల పోరాటం' చాలా బాగుంది. ఆదివాసీ ప్రజల జీవన స్థితిగతులను, పోరాటాలను బయటి ప్రపంచానికి కళ్లకు కట్టినట్టుగా ఉంది. ఇది ఒక పరిశోధనాత్మక వ్యాసం. ఇలాంటి వ్యాసాలు ఇంకా ఇంకా రావాలని కోరుకుంటున్నాను.

**– లక్ష్మణరావు**
నెల్లిమర్ల, విజయనగరం

వ్యాస రచయితలు కాదల్చుకున్న విద్యార్థులకు మూడు నెలలుగా అధ్యయన తరగతులు నిర్వహిస్తున్నట్లు చూసి చాలా సంతోషించాను. ఎందుకంటే నాకు కూడా విద్యార్థి దశ నుండి వ్యాసాలు రాయాలనే ఆసక్తి ఉన్నప్పటికీ తగిన విధంగా రాయలేక పోతున్నానన్న అసంతృప్తి వెంటాడింది. ఆ సమయంలో తగిన సూచనలు, ప్రోత్సాహం లభించకపోవడం వల్ల నేటికీ నా వ్యాస రచనను మెరుగుపరుచుకోలేక పోయాను. ఇప్పటికైనా వీక్షణం వారి ద్వారా ఇలాంటి కృషి జరగడం అభినందనీయం. వ్యాస రచన పట్ల ఆసక్తిగల విద్యార్థులు వీక్షణం నిర్వహిస్తున్న అధ్యయన తరగతుల్ని సద్వినియోగం చేసుకొంటారని, తద్వారా భవిష్యత్ సమాజ నిర్మాణంలో విద్యార్థులు కీలకపాత్ర పోషించేందుకు ఈ అధ్యయన తరగతులెంతో దోహదపడతాయని ఆశిస్తున్నాను.

**– ఎ. కొండయ్య**
జిల్లా జైలు, తుముకూరు, కర్ణాటక

వీక్షణం డిసెంబర్ 2010 సంచిక చదివాను. ఎన్. వేణుగోపాల్ రాసిన 'చదవాల్సిన పుస్తకాలు' వ్యాసం ప్రతి ఒక్కరూ చదవదగినది. కరపత్రాలుగా పంచాల్సిన అవసరముందని నాకు అనిపించింది. నేను మార్కాపురంలో 'నెల నెలా వెన్నెల' సాహితీ వేదిక ద్వారా 'జిరాక్స్' తీసి పంచుతాను. అలాగే వరవరరావు రాసిన 'దండకారణ్య సాహితీ సాంస్కృతికోద్యమ చరిత్ర' స్ఫూర్తినిచ్చింది. 'మార్పుకు ప్రేరణ ఇచ్చే పుస్తకాలు' పలమనేరు బాలాజి బాగా చెప్పారు. 'దోసిట్లో పుస్తకాలు ఇన్నేనా?' అని ముక్తవరం పార్థసారథి బాగా ప్రశ్నించారు. బొజ్జాతారకం, సి. మృణాళిని, కత్తి పద్మారావు, అరుణ్, బి.ఎస్. రాములు, గీతారామస్వామి, ప్రశాంత్, ఎస్. శేషయ్య, చలసాని ప్రసాద్ వంటి ప్రముఖుల ద్వారా ఏయే పుస్తకాలు చదవాలో అవగాహన కలిగింది. డిసెంబర్ 2010 వీక్షణం సంచిక ఫోకస్ 'చదవవలసిన పుస్తకాలు' పత్రికకే హైలెట్. అభినందనలు.

**– కె.వి. రమణారెడ్డి**
టీచర్, నెల నెలా వెన్నెల సాహితీ కార్యదర్శి, మార్కాపురం, ప్రకాశం

డిసెంబర్ 2010 వీక్షణంలో వచ్చిన వ్యాసాలన్నీ కూడా చాలా బాగున్నాయి. ఏ ఒక్కదాన్ని మినహాయించడానికి వీలులేదు. కాని కొన్ని వ్యాసాలకు మాత్రమే పరిమితమై నా అభిప్రాయం రాస్తున్నాను. బి.డి. దమయంతి ఆదివాసీల పోరాటం వ్యాసం వారి పోరాటం గురించి అర్థం చేసుకోవడానికి ఎంతగానో ఉపయోగ పడుతుందని నా అభిప్రాయంగానే కాకుండా ఇంకొంతమంది మిత్రులకిచ్చి చదివించాను కూడా. అంటే అంత బాగా ఉంది. దాని మీద విశ్లేషణ చేయాలంటే ఇంకొక పెద్ద వ్యాసమే అవుతుంది. ఇంతవరకు ఆదివాసీల పోరాటం గురించి తెలియని వారికి బాగా అర్థమయ్యేటట్లుగా రాశారు. వారికి నా కృతజ్ఞతలు. వరవరరావు 'దండకారణ్య సాహితీ సాంస్కృతికోద్యమ చరిత్ర' పరిచయ వ్యాసాన్ని చదువుతుంటే ఆ పుస్తకాన్ని మొత్తంగా చదివినట్లుగానే ఉంది. అంత బాగా రాశారు. ప్రత్యక్షంగా పోరాటాన్ని చూసినట్లుగానే, ఆ పోరాటంలో పాల్గొన్నట్లుగానే ఉంది. ఇంతకన్న ఎక్కువ రాయడం నా శక్తికి మించినపని. ఎడ్ల పోచయ్య వ్యాసం '2జి స్పెక్ట్రమ్' అంటే ఏమిటో పత్రికలలో చూస్తున్నానే గాని సరిగా అర్థం కాలేదు. వారి వ్యాసం చదివిన తర్వాత ఆ వాస్తవ విషయాలు చాలా సుబోధకంగా అర్థమయింది. ఆ కొరతను వీరు తీర్చగలిగారు. చాలా సంతోషం. ఎన్. వేణుగోపాల్ పుస్తక పఠనం ప్రయోజనమేమిటో చాలా సవిస్తారంగా, అర్థవంతంగా రాశారు. పుస్తకాలు చదవడం మరిచిపోయిన ఈ రోజులలో తిరిగి పుస్తక పఠనం ప్రయోజకత్వాన్ని ఎంతో గొప్పగా రాశారు. పుస్తకాలు చదివే వాళ్లకన్న పుస్తకాలు చదవని వారికి ఈ వ్యాసం బాగా ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను. చాలా వివరణాత్మకంగా రాశారు. మొత్తం మీద ఈ వ్యాసాలన్నిటిని మిత్రులుగా ఉండే ఎంతో మంది చేత చదివిస్తే బాగుండునని నా అభిప్రాయం. చందాదారులే ఈ చదివించే ప్రయత్నం చేస్తే సమాజానికి ఎంతో మేలు చేసినవారు అవుతారు. ఎవరిపాటికి వాళ్లు చదివి తృప్తిపడకుండా, ఇది అందరూ కూడా చదివేటట్లుగా చెయ్యవలసినదిగా చందాదారులయిన మిత్రులందరిని వియనపూర్వకంగా విజ్ఞప్తి చేస్తున్నాను. ఇటువంటి ప్రయత్నాలతో ముందు ముందు వీక్షణం మరింత బలంగా తీసుకొని రావలసినదిగా సంపాదకవర్గానికి విజ్ఞప్తి చేస్తున్నాను.

**– కడియాల సుబ్బనాచారి**
దుత్తలూరు, నెల్లూరు

వీక్షణం ఒక విలక్షణమైన, విజ్ఞానదాయకమైన పత్రిక. డిసెంబర్ 2010 సంచికలో పుస్తకాల గురించి చాలా వ్యాసాలు ఉన్నాయి. అన్ని రకరకాల సమాచారం అందిస్తున్నాయి. ఇంత వైవిధ్యం మన తెలుగు పుస్తక ప్రపంచంలో ఉందా అని ఎవరైనా ఆశ్చర్యపోవాలి. పుస్తకం పెన్నిధి, మంచి స్నేహితుడు. మంచి పుస్తకాలు చదివే వ్యక్తిలో మంచి ఆలోచనలు ఉదయిస్తాయి. హృదయం చైతన్యవంతమవుతుంది. ఈ పత్రికలో వ్యాసాలు ప్రతిదీ చదివి జీర్ణించుకోవాల్సిందే.

**– డా. పోతుకూచి సాంబశివరావు**
సంపాదకుడు, విశ్వ రచన, హైదరాబాద్

### కొమురం భీం అభిమానులకు విజ్ఞప్తి

'సాహు', అల్లం రాజయ్య గార్లు రాసిన ప్రసిద్ధ తెలుగు నవల 'కొమురం భీం'ను నేను ఇంగ్లిష్‌లోకి అనువదించాను. 2011 జనవరి రెండవ వారంలో దీన్ని ప్రచురిస్తాను. కావున మీ వద్దగల కొమురం భీంకు సంబంధించిన ప్రత్యేక సమాచారం గానీ ఫొటోలు గానీ ఏవేని ఉంటే ఈ రాబోయే పుస్తకంలో వేసే అవకాశాన్ని కల్పించండి. ప్రజాసాహిత్యోద్యమ అభిమానులు, ప్రజాస్వామిక వాదులు తమ వద్దగల ప్రత్యేక సమాచారాన్ని అందించగలరని కోరుతూ...

**ఎనిశెట్టి శంకర్**
104, శ్రీ వేంకటేశ్వర అపార్ట్‌మెంట్, ఆర్.టి.సి. కాలనీ, ముబారక్‌నగర్,
నిజామాబాద్ – 503003, తెలంగాణ
సెల్ : 9866630739; ఇమెయిల్ : anishettyshankar@gmail.com

వీక్షణం

# పాలకులకు రైతులపై ఎంత ప్రేమ!

రాష్ట్రంలో ఎన్నో దశాబ్దాలుగా సాగుతున్న వ్యవసాయ సంక్షోభం ఇప్పుడు హఠాత్తుగా రాజకీయ రంగు అద్దుకున్నట్టు కనబడుతున్నది. కనీసం పదిహేను సంవత్సరాలుగా నానాటికీ పెరుగుతూ వస్తున్న రైతుల ఆత్మహత్యలు రాజకీయ నాయకులకు సమయానుకూలంగా ఇప్పుడే కనబడుతున్నాయి. తాము పాలకులుగా ఉన్నప్పుడు జరిగినవి ఆత్మహత్యలు కానట్టూ, తాము ప్రతిపక్షంలో ఉన్నప్పుడు మాత్రమే ఆత్మహత్యలు జరుగుతున్నట్టూ రాష్ట్ర పాలకవర్గంలోని రెండు ముఠాలూ మాట్లాడుతున్నాయి. రైతు రాజ్యం సాధిస్తామని చెప్పి అధికారంలోకి వచ్చి, వ్యవసాయానుకూల పథకం పేరుతో జలయజ్ఞం అనే ధనయజ్ఞాన్ని ప్రారంభించి, రైతుల మేలుకోసం ఏమీ చేయని కాంగ్రెస్ వేలాదిగా రైతులు ఆత్మహత్యలు చేసుకోవడానికి కారణమైంది. అంతకు ముందు తొమ్మిది సంవత్సరాల పాటు అసలు వ్యవసాయం దండగమారిదని అక్షరాలా ప్రకటించి, అందరికీ కంప్యూటరే భోజనం పెడుతుందని నమ్మించిన తెలుగుదేశం తన వంతుగా వేలాది మంది రైతుల ఆత్మహత్యలకు కారణమైంది. ఆ పార్టీనో ఈ పార్టీనో గద్దెనెక్కించడానికి సహకరించిన మిగిలిన అన్ని రాజకీయపక్షాలూ ఈ ఆత్మహత్యలకు బాధ్యత వహించవలసిందే. కాని ఈ బాధ్యులందరూ ఇప్పుడు తమదే అసలైన రైతుపక్షమని అంటున్నారు. రాయితీలూ, ప్యాకేజీలూ, సహాయాలు ప్రకటించడమూ, అవి చాలవనడమూ, నిరాహారదీక్షలకూ లక్ష్యదీక్షలకూ సత్యాగ్రహాలకూ పూనుకోవడమూ, రైతుకోసం సభలూ సమావేశాలూ జరపడమూ రసవత్తరంగా జరిగిపోతున్నాయి. ఈ హడావుడిలో రైతుల పేరుమీద రాజకీయ పాత్రధారులు నడుపుతున్న నాటకాలూ, వారి రాజకీయ లక్ష్యాలూ కనబడుతున్నాయి గాని అసలు రైతులూ కనబడడం లేదు, వారి అసలు సమస్యలూ వినబడడం లేదు. రాష్ట్రంలో రైతాంగ సమస్యల విషాదగాథ సుదీర్ఘమైనది. అది గత యాభై సంవత్సరాల పాలనలో పేరుకుపోతూ వచ్చింది. అందులో అన్ని రాజకీయపక్షాలకూ, అధికారవర్గాలకూ, వ్యాపార పారిశ్రామిక వర్గాలకూ, మధ్య దళారీలకూ అందరికీ పాత్ర ఉంది. ఆ చరిత్రనంతా విస్మరించి, తమకెవరికీ ఆ పాపంలో భాగం లేనట్టు, హఠాత్తుగా ఈ సంవత్సరం ప్రకృతి వైపరీత్యాలవల్లనే రైతు సమస్యలన్నీ వచ్చినట్టు నటించడం అచ్చమైన వంచన. ఈ సంవత్సరం ప్రకృతి వైపరీత్యం ఉన్న మాట నిజమే. అటు నైరుతి రుతుపవనాల వర్షాలూ, ఇటు ఈశాన్య రుతుపవనాల వర్షాలూ కూడ అసాధారణంగా ఎక్కువ పడ్డాయి. ఈ మధ్యలోనే మూడుసార్లు బంగాళాఖాతంలో తీవ్రమైన వాయుగుండాలు వచ్చాయి. మితిమీరిన వర్షపాతం వరదలకూ, చేతికి వచ్చిన పంట రాలిపోవడానికీ, నిలువనీటిలో మునిగి కుళ్లిపోవడానికీ కారణమైంది. కాని ఒక్క సంవత్సరం వర్షాకాలపు ఒడిదుడుకులే రైతాంగ జీవితాన్ని ఇంతగా సంక్షుభితం చేసే స్థితి ఎందుకు ఏర్పడింది? ఎలా ఏర్పడింది? రాష్ట్ర వ్యవసాయరంగపు దుస్థితిని సమగ్రంగా గుర్తించకపోతే, ఏరోజుకారోజు కనబడే దృశ్యాన్నే చూస్తే ఎప్పటికప్పుడు నెపాన్ని ప్రకృతి మీదకో, మరొకరి మీదికో నెట్టవచ్చు. కాని 'అరయంగా కర్ణుడీల్గె నార్గురి చేతన్' అన్నట్టు వ్యవసాయ సంక్షోభానికి, రైతుల ఆత్మహత్యలకు అనేక కారణాలున్నాయి. అసలు మన వ్యవసాయరంగపు వ్యవస్థాత్మక మూలాలే సంక్షోభానికి దారితీసేలా ఉన్నాయి. దున్నేవారి చేతుల్లో భూమి లేదు. భూయాజమాన్యంలో తీవ్రమైన అసమానతలున్నాయి. ఎప్పుడో రెండు మూడు తరాల కిందనే భూమితో సంబంధం వదుల్చుకుని, ఇతర వృత్తులలో, ఉద్యోగాలలో, వ్యాపారాలలో, పరిశ్రమలలో స్థిరపడినవారు, ఇతర ఆదాయమార్గాలు ఉన్నవారు ఇప్పటికీ భూయజమానులుగా కొనసాగుతున్నారు. విదేశాలలో, ఇతర ప్రాంతాలలో, నగరాలలో స్థిరపడినవారు, ఎన్నడూ తిరిగి వ్యవసాయంలోకి రావాలనే ఆలోచన లేనివారు స్థిరాస్తి పెట్టుబడిగా ఇంకా భూములు ఆక్రమిస్తున్నారు. నిజమైన సాగుదార్లు మాత్రం చిన్నరైతులుగానో, కౌలుదార్లుగానో ఉన్నారు. సాగు గిట్టుబాటు కాని విధంగా చిన్న, సన్నకారు కమతాలు అతి ఎక్కువగా ఉన్నాయి. ఆ కమతాలు గిట్టుబాటు అయ్యేలా సాగువ్యయం తగ్గించడానికి గాని, నిజమైన సహకార పద్ధతులు ప్రవేశపెట్టడానికి గాని ఎటువంటి ప్రయత్నాలు జరగడం లేదు. ఈ కౌలుదార్లకు, చిన్నరైతులకు వ్యవసాయం కనీస మనుగడకు కూడ సరిపోవడం లేదు. వ్యవసాయం చేయడమే సమస్యగా ఉంది. చాల చోట్ల తగిన నీటి పారుదల సౌకర్యాలు లేవు. బావుల మీద ఆధారపడడమంటే, నమ్మకం లేని విద్యుత్ సరఫరా మీద ఆధారపడడమే. విద్యుత్తు ఒడిదుడుకుల వల్ల మోటర్లు కాలిపోయి అదనపు ఖర్చు. సరైన విత్తనాలు దొరకవు. ఎరువుల కొరత. పశువుల కొరత. యాంత్రీకరణ ఖర్చు. అన్ని ఇబ్బందులూ పడి వ్యవసాయం సాగిస్తుండగా చీడపీడలు. పురుగుల మందులు. అన్నీ ముగిసి పంట దిగుబడి వచ్చేదాకా నమ్మకం లేదు. ఆ దిగుబడిని అమ్ముకుందామంటే గిట్టుబాటు ధరలు లేవు. గిట్టుబాటు ధర వచ్చేదాకా పంట నిలిపి ఉంచుకుందామంటే గిడ్డంగి సౌకర్యాలు లేవు. ఈ మొత్తం వ్యయానికి రుణ, పరపతి సౌకర్యాల మీద ఆధారపడదామంటే బ్యాంకులు, రుణ సంస్థలు అవసరమైన వారికి రుణాలివ్వవు. ఇచ్చిన రుణాల వసూళ్లలో అతి దుర్మార్గమైన పద్ధతులు అవలంబిస్తాయి. పంట నష్టాలకు హామీగా ఉండవలసిన బీమా సౌకర్యాలు తగినంతగా లేవు, అన్ని పంటలకూ లేవు. ఈ అన్ని సమస్యలకు తోడు ఇటీవలి పాలక విధానాల వల్ల ఎన్నో రైతు వ్యతిరేక విధానాలు వ్యవసాయ రంగంలోకి ప్రవేశించాయి. ఇలా సమస్యల వలయంలో చిక్కుకుని ఉన్న రైతు మీద మూలిగే నక్క మీద తాటిపండు పడ్డ చందంగా ప్రకృతి వైపరీత్యాలు సంభవిస్తున్నాయి. ఈ రైతు సమస్యలు సమసి పోవాలంటే కావలసింది రాజకీయపక్షాల నాటకాలు కాదు. రాష్ట్ర వ్యవసాయరంగ సంక్షోభాన్ని, రైతుల ఆత్మహత్యలను అరికట్టడానికి చేపట్టవలసిన శాశ్వత పరిష్కార మార్గాలెన్నో ఉన్నాయి, తక్షణ సహాయ, పునరావాస, ఉపశమన చర్యలూ ఉన్నాయి. ఇటు ఇవాళ్టికివాళ తక్షణ పరిష్కారాల అమలు కోసం పోరాడుతూనే, శాశ్వత, దీర్ఘకాలిక పరిష్కారాల అమలు ప్రారంభించమని పాలకుల మీద ఒత్తిడి తేవలసి ఉంది. వీ

## గొంతెత్తేవారిని బెదిరించడానికే బినాయక్ సేన్‌కు శిక్ష

పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ (పియుసిఎల్) ఛత్తీస్‌గఢ్ రాష్ట్ర అధ్యక్షుడు, ప్రపంచ ప్రఖ్యాత వైద్యుడు, ఆదివాసుల అభ్యున్నతి కోసం అహరహం శ్రమిస్తున్న వ్యక్తి డా. బినాయక్ సేన్‌కు రాయపూర్ రెండవ అదనపు సెషన్స్ కోర్టు డిసెంబర్ 24న యావజ్జీవ శిక్ష విధించింది. నిషిద్ధ మావోయిస్టు పార్టీకి సహకరిస్తున్నాడనే అబద్ధపు నేరారోపణతో, కనీస సాక్ష్యాధారాలు లేకుండా బనాయించిన ఈ కేసులో ఎంతమాత్రం శిక్ష విధించడానికి వీలులేదు. ఈ శిక్షను న్యాయవ్యవస్థలో అత్యున్నత స్థానాలలో పనిచేసినవారు, సాధారణ ప్రజలు, ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ వంటి సంస్థలు, నోమ్ ఛామ్‌స్కీ, అమర్త్యసేన్, అరుంధతీరాయ్‌ల వంటి ప్రముఖులు ఎందరో ఖండిస్తున్నారు. ఈ తీర్పుకు రెండు కోణాలున్నాయి. ఒకటి, న్యాయవ్యవస్థ అనేది స్వతంత్రమైనదీ, నిష్పాక్షికమైనదీ కాదని, అది రాజ్యంలో భాగమేననీ, సంక్షోభం తీవ్రస్థాయికి చేరనంతవరకూ ప్రజలను భ్రమల్లో ఉంచడానికే అది తటస్థ వైఖరి ఉన్నట్టు నటిస్తుందనీ ఇన్నాళ్లుగా మార్క్సిస్టులు చేస్తున్న వాదనను ఈ తీర్పు ధ్రువపరుస్తోంది. ఒకవేళ ఆ కిందిస్థాయి న్యాయమూర్తి ఇంత ఉద్దేశపూర్వకంగా రాజ్యంలో భాగం కాలేదని అనుకున్నా, కిందిస్థాయి న్యాయమూర్తులను పోలీసు అధికారులు, ప్రభుత్వం, పాలకవర్గాలు ప్రభావితం చేయగలుగుతున్నాయని, ఆమేరకు న్యాయవ్యవస్థ స్వాతంత్ర్యం రద్దయిపోతున్నదని అంగీకరించకతప్పదు. అంతకన్న తీవ్రమైన రెండో విషయం, మొత్తంగా దండకారణ్యంలోనూ, ప్రత్యేకించి ఛత్తీస్‌గఢ్‌లోనూ విస్తరిస్తున్న విప్లవోద్యమాన్ని అణచివేయడానికి, ఆ ప్రాంతపు ఖనిజ వనరులను బహుళజాతి సంస్థలకు అప్పగించడానికి పాలకవర్గాలు ఐదు సంవత్సరాలుగా సాగిస్తున్న చర్యల పరంపరలో భాగంగానే ఈ తీర్పును చూడవలసి ఉంటుంది. విప్లవోద్యమాన్ని అణచడానికి మొదట ఆదివాసులలోనే కొందరిని చీలదీసి సాల్వాజుడుం అనే కిరాయి హంతక ముఠాను ఏర్పరిచారు. ఆ ముఠా ఆదివాసులపై సాగించిన దారుణ దమనకాండను బైటి ప్రపంచం దృష్టికి తేవడంలో పియుసిఎల్ తో సహా పౌరహక్కుల సంఘాలు గణనీయమైన కృషి చేశాయి. సాల్వాజుడుంకు వ్యతిరేకంగా ప్రపంచవ్యాప్తంగా నిరసన పెల్లుబికింది. విప్లవోద్యమాన్ని అణచడంలో, విప్లవోద్యమానికి సహకరించకుండా ఆదివాసులను భయభీతావహులను చేయడంలో సాల్వాజుడుం విఫలమైన తర్వాత, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఉమ్మడిగా ఆపరేషన్ గ్రీన్‌హంట్ ప్రారంభించాయి. ఆ రాష్ట్రంలోనే అరణ్య యుద్ధ శిక్షణా కళాశాలను ఏర్పరచాయి. ఇప్పుడు అబుజ్‌మాడ్ ప్రాంతంలో సైనిక స్థావరాన్ని ఏర్పాటు చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. ప్రజల మీద పాలకవర్గాలు చేస్తున్న ఈ యుద్ధాన్ని ఖండించడంలో, ప్రపంచం దృష్టికి తీసుకురావడంలో, ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడంలో పనిచేస్తున్న వేలాది మంది మధ్యతరగతి బుద్ధిజీవుల, ప్రజానుకూల మేధావుల సమూహంలో ఒకానొకరు డా. బినాయక్ సేన్. ఆయనకు శిక్ష విధించడం ద్వారా అటువంటి పనులు చేసేవారందరినీ బెదిరించడానికి పాలకవర్గాలు ప్రయత్నిస్తున్నాయి. కాని అది వారి సామాజిక బాధ్యత. వారు ఆ బాధ్యతను నిర్వర్తించకుండా, ప్రజలమీద పాలకవర్గాల దమననీతిని ఎండగట్టకుండా ఏ శిక్షలూ ఆపలేవు.

## నిజాలు బయటపెట్టడమే నేరం

ప్రభుత్వాలు ప్రజావ్యతిరేకంగా ఉన్నప్పుడు, ప్రజల చేత ఎన్నికయి, ప్రజలవల్ల నడుస్తూ, ప్రజల కొరకు పనిచేసే ప్రజాస్వామిక ప్రభుత్వాలమని తమకు తాము కితాబు ఇచ్చుకుంటున్న ప్రభుత్వాలే తమ కార్యకలాపాల వివరాలను ప్రజలనుంచి దాస్తున్నప్పుడు, వాటిని అధికారిక రహస్యాలుగా పిలుస్తున్నప్పుడు ఎవరో ఒకరు ఆ రహస్యాలను బట్టబయలు చేయక తప్పదు. 'ప్రభుత్వాలను బహిరంగం చేయడమే మాపని' అనే లక్ష్యంతో వికీలీక్స్ అనే ఇంటర్నెట్ సంస్థ ఆ పనే చేసింది. అందుకే ప్రభుత్వాలనుంచీ, పాలకులనుంచీ దానిమీద దాడి సాగుతున్నది. అమెరికా ప్రభుత్వం తన దేశంలో వికీలీక్స్ వెబ్ సైట్లను చూడడాన్ని నిషేధించింది. వికీలీక్స్ కు నిధులు రాకుండా అడ్డుకుంటున్నది. వికీలీక్స్ సంస్థ పైనా, దాని అధిపతి జూలియన్ అసాంజె పైనా ప్రభుత్వ ఆస్తిని దొంగిలించడం, అధికారిక రహస్యాలను బయటపెట్టడం వంటి నేరారోపణలు చేసి బోనెక్కించాలని ప్రయత్నిస్తున్నది. లేదా ఆయన వ్యక్తిగత ప్రవర్తనను సాకుగా తీసుకుని నేరారోపణలు చేయిస్తున్నది. అసాంజె ప్రయాణాలను అరికట్టడానికి కూడ అమెరికా ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. అసాంజెపై కేసులు పెట్టమని ఆస్ట్రేలియా, బ్రిటన్, జర్మనీ ప్రభుత్వాలపై కూడ ఒబామా ప్రభుత్వం ఒత్తిడి తెస్తున్నదని వార్తలు వస్తున్నాయి. తన పనిలో వికీలీక్స్ కొన్ని పొరపాట్లు చేసి ఉండవచ్చు, కొంత అతిని ప్రదర్శించి ఉండవచ్చు. అది బయటపెట్టిన సమాచారం వల్ల ప్రభుత్వాలకూ, పాలకులకూ, వ్యాపారవేత్తలకూ మాత్రమే కాక, అందులో ప్రస్తావనకు వచ్చిన మామూలు మనుషులకు కూడ నష్టం వాటిల్లి ఉండవచ్చు. అసాంజె వ్యక్తిగత ప్రవర్తనలో లోపాలు ఉండవచ్చు. కాని ప్రజలనుంచి సమాచారాన్ని దాచిపెట్టి, తమ పబ్బం గడుపుకుంటున్న ప్రభుత్వాలను బహిర్గతం చేయడం అనే పెద్ద పనిలో ఈ నష్టాలు చిన్నవే. నిజానికి 2006 డిసెంబర్ నుంచి పనిచేస్తున్న ఈ వెబ్‌సైట్ ఈ నాలుగు సంవత్సరాలలో ప్రపంచంలోని డజన్ల కొద్దీ ప్రభుత్వాల పత్రాలను సేకరించి, బహిరంగపరచింది. ఆయా దేశాల ప్రభుత్వాలు తమ ప్రజలనుంచి దాచిన సమాచారాన్ని బయటపెట్టింది. ఇందులో మానవహక్కుల ఉల్లంఘనల వివరాలున్నాయి, వ్యాపారవేత్తలూ ప్రభుత్వాధికారులూ కలిసి చేసిన అవినీతి కుంభకోణాల వివరాలున్నాయి. అగ్రరాజ్యాలు పేదదేశాలకు వ్యతిరేకంగా చేసిన కుట్రల వివరాలున్నాయి. చిన్న దేశాల, అక్కడి పాలకుల రహస్యాలు బయట పెట్టినంత కాలం పట్టించుకోకుండా ఉన్న అమెరికా, దాని తైనాతీ రాజ్యాలు, వికీలీక్స్ అమెరికా రహస్యాలను బయటపెట్టడం మొదలుపెట్టగానే విరుచుకుపడ్డాయి. ఇరాక్‌లో, అఫ్ఘనిస్తాన్‌లో అమెరికన్ సైన్యాలు సాగిస్తున్న దురాగతాలను, హింసాకాండను తేటతెల్లంచేసే పత్రాలు వికీలీక్స్‌లో వెలువడడం మొదలుకాగానే అమెరికాకు కోపం వచ్చింది. చివరికి 274 దేశాలలోని తన రాయబార కార్యాలయాలతో అమెరికా ప్రభుత్వం 1966 నుంచి 2010 దాకా జరిపిన సంభాషణల రికార్డులను వికీలీక్స్ సంపాదించింది. ఈ రెండున్నర లక్షల రికార్డులనుంచి మొదటి విడతగా 220 రికార్డులను నవంబర్ 28న విడుదల చేసింది. దానితో అసాంజె మీద, వికీలీక్స్ మీద దాడులు పెరిగిపోయాయి. దాచేస్తే దాగని సత్యాలను వెల్లడి చేసి శిక్షకూ విచారణకూ గురవుతున్న వికీలీక్స్‌కు సంఘీభావం ప్రకటించవలసి ఉంది. వీ







- **రాజ్యం – సంక్షేమం – కె. బాలగోపాల్ ఉపన్యాసాలు** – పర్‌స్పెక్టివ్స్ ప్రచురణ – 161 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన్ భవన్, బ్యాంక్‌స్ట్రీట్, హైదరాబాద్ – 500 001. ఫోన్ : 040 – 24744580
- **చంద్రగిరి శిఖరం** – బిభూతి భూషణ్ బంధోపాధ్యాయ – తెలుగు అనువాదం : కాత్యాయని – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 50
- **ముహమ్మద్ ప్రవక్త జీవితం** – క్యారెన్ ఆంగ్‌స్ట్రాంగ్ – తెలుగు అనువాదం : పి. సత్యవతి – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 203 పేజీలు, 1/8 డెమీ, రు. 80

పై రెండు ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీ నగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500 067; ఫోన్ : 040 – 23521849; www.hyderabadbooktrust.blogspot.com

- **చదువుల సారం – 5 – పాడుకుందాం** – మంచి పుస్తకం – జన విజ్ఞాన వేదిక ప్రచురణ – 171 పేజీలు, 1/8 డెమీ, రు. 85
- **చదువుల సారం – 6 – భాషా వ్యాసాలు** – మంచి పుస్తకం – జన విజ్ఞాన వేదిక ప్రచురణ – 163 పేజీలు, 1/8 డెమీ, రు. 85

పై రెండు ప్రతులకు : జన విజ్ఞాన వేదిక ప్రచురణల విభాగం, 162, విజయలక్ష్మి నగర్, నెల్లూరు – 524004; ఫోన్ : 9440503061; మంచి పుస్తకం, 12–13–450, వీధి నెం. 1, తార్నాక, సికింద్రాబాద్ – 500017; ఫోన్: 9490746614; ఇమెయిల్ : info@manchipustakam.in, website : www.manchipustakam.in

- **కొమరం భీమ్** – ఎస్.ఎం. ప్రాణ్‌రావు – రమణ పబ్లికేషన్స్ – 84 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : ఎస్.ఎం. ప్రాణ్‌రావు, 9–14/1, రవీంద్రనగర్ కాలనీ, హబ్సిగూడ, హైదరాబాద్ – 500 007. సెల్ : 8008950101, 040 27170319; ప్రజాశక్తి బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, దిశ పుస్తక కేంద్రం, విశాలాంధ్ర బుక్ హౌస్
- **మోదుగు పూలు** – తెలంగాణ పోరాట పాటలు, కొమరం భీమ్ సినిమా పాటలు – భూపాల్ – వెన్నెల ప్రచురణలు – 40 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : వెన్నెల ప్రచురణలు – 4, ఇ.నెం. 2–2–985, అంబర్‌పేట్, హైదరాబాద్ – 500013 సెల్ : 9866204260; దిశ, సహచర, నవయుగ, విశాలాంధ్ర
- **వర్షించని మేఘాలు** – జి.సి. జీవి కథలు – మల్లీశ్వరి ప్రచురణలు – 248 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : జి.సి. జీవి, నెం. 5, ఠాగూర్ స్ట్రీట్, సెంథిల్ నగర్, తిరుముల్లయివయిల్, చెన్నయ్ – 600 062; ఫోన్ : 044–26371565, సెల్ : 9500188343; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
- **లెనిన్ ఉపదేశాలు...** – పామీదత్తు – తెలుగు అనువాదం : రామమోహన్ (మహీధర రామమోహనరావు) – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ – 75 పేజీలు, 1/8 డెమీ, రు. 25
- **శ్రమ గురించి మార్క్స్** – డేవిడ్ మాక్‌లెల్లన్ – తెలుగు అనువాదం : ఇంగువ మల్లికార్జునశర్మ – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ – 16 పేజీలు, 1/8 డెమీ, రు. 8

పై రెండు ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, డి. రాధాకృష్ణమూర్తి, ఇ.నెం. 5–85–4/బి, పండరీపురం, 1వ లైన్, గుంటూరు – 522 002; సెల్ : 9848877596; విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్ హౌస్, మైత్రి, దిశ, సహచర, నవయుగ, మణి బుక్‌స్టాల్







## ఉద్యోగుల ఛలో హైదరాబాద్

దీర్ఘకాలికంగా అపరిష్కృతంగా ఉన్న తమ డిమాండ్ల పరిష్కారం కోసం రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల, కార్మికుల, ఉపాధ్యాయుల ఐక్య కార్యాచరణ సమితి ఇచ్చిన పిలుపు మేరకు నవంబర్ 23న 'ఛలో హైదరాబాద్' విజయవంతమైంది. ప్రభుత్వ పాఠశాలలు, కార్యాలయాలన్ని ఖాళీ అయ్యాయి. అధిక శాతం కార్యాలయాలకు అసలు తాళాలే తెరవలేదు. సామూహిక సెలవుతో సర్కారుకు సవాలు విసిరారు. తమ సమస్యలపై స్పందించకపోతే పోరాటాన్ని తీవ్రతరం చేస్తామని ప్రభుత్వాన్ని హెచ్చరించారు.

## మిద్దె రాములు కన్నుమూత

ప్రఖ్యాత ఒగ్గు కథ కళాకారుడు, రాష్ట్ర సాంస్కృతిక మండలి సభ్యుడు మిద్దె రాములు (70) (అసలు పేరు తీగల రాములు) నవంబర్ 25 ఉదయం మరణించారు. కొద్దిరోజులుగా క్యాన్సర్‌తో బాధపడుతున్న ఆయన కరీంనగర్ జిల్లా వేములవాడ మండలం తిప్పాపూర్‌లోని తన స్వగృహంలో తుదిశ్వాస విడిచారు. సంప్రదాయ కళలు కనుమరు గవుతున్న దశలో గ్రామీణులకు దగ్గరగా ఉండే ఒగ్గు కథను సజీవంగా నిలిపారు. అక్షరం ముక్క రాకపోయినా ఆశువుగా పాడుతూ, ఆడుతూ ఒగ్గు కథకు అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించి పెట్టారు. తెలంగాణలో ప్రాచుర్యం పొందిన ఎల్లమ్మ కథ, మల్లమ్మ కథ, సారంగధర, గంగ–గౌరీ సంవాదం, దేశంగరాజు కథ, అయిదు మల్లెపూలు, నల చక్రవర్తి, నల్ల పోచమ్మ, బాలనాగమ్మ కథలకు ఒగ్గు రూపంలో ప్రాణం పోశారు. బోనం నెత్తిన పెట్టుకొని నృత్యం చేస్తూ ఒగ్గు కథ చెప్పడం రాములు విశిష్టత.

## రాష్ట్రానికి కొత్త ముఖ్యమంత్రి - కొత్త కాబినెట్

ఆంధ్రప్రదేశ్‌కు 16వ ముఖ్యమంత్రిగా నల్లారి కిరణ్ కుమార్ రెడ్డి (50) నవంబర్ 25న రాజ్‌భవన్‌లోని దర్బార్ హాల్‌లో ప్రమాణ స్వీకారం చేశారు. రాష్ట్ర గవర్నర్ ఇ.ఎస్.ఎల్. నరసింహన్ ఆయన చేత ప్రమాణ స్వీకారం చేయించారు. ఆయన 39 మందితో కూడిన కొత్త మంత్రివర్గాన్ని ఏర్పర్చుకున్నారు. కొత్త మంత్రులంతా డిసెంబర్ ఒకటిన ప్రమాణ స్వీకారం చేశారు. మంత్రులలో కోస్తా ప్రాంతం నుంచి పదిహేను మంది, రాయలసీమ ప్రాంతం నుంచి ఎనిమిది మంది, తెలంగాణ పదహారు మంది ఉన్నారు.

## శరీర దానం

విశాఖపట్నంలోని సావిత్రిభాయి పూలే ఎడ్యుకేషన్, చారిటబుల్ ట్రస్ట్ చైర్‌పర్సన్ జి. సీతామహాలక్ష్మి అధ్యక్షతన నవంబర్ 30న జరిగిన కార్యక్రమంలో అరవై మంది మరణానంతరం తమ శరీరాలను దానమిచ్చేందుకు ముందుకు వచ్చారు. శరీర దానానికి అంగీకరిస్తూ ప్రిన్సిపల్ జి. భాగ్యారావుకు లేఖలు అందజేశారు. ఈ సందర్భంగా సీతామహాలక్ష్మి మాట్లాడుతూ దేశంలో లక్షలాది మంది అవయవ మార్పిడి కోసం ఎదురు చూస్తున్నారనీ, వైద్య, విద్యా బోధనకు, పరిశోధనలకు అవసరమైనన్ని మృతదేహాలు లభ్యం కావడం లేదనీ అన్నారు. ప్రభుత్వ సహకారం అందితే ఈ కార్యక్రమం మరింత విజయవంతమవుతుందని అన్నారు. బ్రెయిన్ డెడ్ అయిన వారి వివరాలను వారి బంధువులు వీలయినంత త్వరగా అందజేస్తే ఒక శరీరం నుంచి అవయవాలు మార్పిడి చేసి 18 మంది ప్రాణాలు కాపాడే అవకాశం ఉందని అన్నారు. శరీర దానం చేసిన వారిలో చలసాని ప్రసాద్, డాక్టర్ అవసరాల రామకృష్ణలతో పాటు ఇంటర్‌రి, ఇంజనీరింగ్ చదువుతున్న విద్యార్థులు కూడా ఉన్నారు.

## వర్గీకరణ కోసం దీక్ష

ఎస్.సి.ల వర్గీకరణ కోసం మందకృష్ణ మాదిగ డిసెంబర్ 4 నుంచి ఆమరణ దీక్ష చేపట్టారు. ఆయన ఆరోగ్యం క్షీణించడంతో డిసెంబర్ 8 అర్ధరాత్రి పోలీసులు అరెస్టు చేసి గాంధీ ఆస్పత్రికి తరలించారు. జనవరి 31లోగా అఖిల పక్షాన్ని ఢిల్లీ పంపుతానని, ఎస్.సి. వర్గీకరణకు రాష్ట్ర ప్రభుత్వం కట్టుబడుందని ముఖ్యమంత్రి ఇచ్చిన హామీ మేరకు డిసెంబర్ 10న మందకృష్ణ మాదిగ గాంధీ ఆస్పత్రిలో దీక్షను విరమించారు.

## మళ్లీ వరద నష్టం

ఈ ఏడాది మేలో తుపాను, జూలై–సెప్టెంబర్‌ల మధ్య భారీ వర్షాలు, నవంబర్‌లో 'జల్' తుపానులతో అల్లాడిన రైతులకు డిసెంబర్ రెండో వారంలో కురిసిన వర్షాలు తీవ్ర నష్టాన్ని కలిగించాయి. ఈ అకాల భారీ వర్షాలకు అయిదు లక్షల హెక్టార్లకు పైగా పంటలు దెబ్బతిన్నాయి. ఇందులో లక్షన్నర హెక్టార్లు పత్తి కాగా, మిగిలినది ప్రధానంగా వరి పంట. గుంటూరు, కృష్ణా జిల్లాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. చిన్న, సన్నకారు రైతులు, మత్స్యకారులు, పేదల బతుకులు ఛిన్నాభిన్నం అయ్యాయి. కోస్తా జిల్లాలతో పాటు ఖమ్మం, నల్గొండ, వరంగల్ జిల్లాల్లో కూడా పంటలు బాగా దెబ్బతిన్నాయి.

## తెలంగాణ కోసం సహాయ నిరాకరణ

పార్లమెంట్‌లో తెలంగాణ బిల్లు సాధన కోసం మూడు రకాల సహాయ నిరాకరణలకు సిద్ధం కావాలని తెలంగాణ ప్రజా ఫ్రంట్ అధ్యక్షుడు గద్దర్ పిలుపునిచ్చారు. డిసెంబర్ 9న హైదరాబాద్‌లో ఎన్.టి.ఆర్. స్టేడియంలో 'డిసెంబర్ 9 అమరుల త్యాగ ఫలిత దినం' బహిరంగ సభ జరిగింది. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ, తెలంగాణ రాజకీయ ద్రోహులపై సాంఘిక, ఆర్థిక, రాజకీయపరమైన సహాయ నిరాకరణ చేయాలన్నారు. ఈ సభలో తెలంగాణ కవులు, రచయితలు, కళాకారులు, విద్యార్థులు, మేధావులు, ప్రజాస్వామిక వాదులు, వివిధ ప్రజాసంఘాల నాయకులు పాల్గొన్నారు.

## మండుతున్న నిత్యావసరాల ధరలు

రాష్ట్రంలో నిత్యావసరాల ధరలు ఒక్కసారిగా ఆకాశాన్నంటాయి. ఈ ధరలతో సామాన్యుల పరిస్థితి ఘోరంగా మారింది. ఒక్కనెలలోనే ఉల్లిగడ్డ, వెల్లుల్లి రెట్లు ఐదు రెట్లు పెరిగాయి. చింతపండు, పసుపు ధరలు రెట్టింపయ్యాయి. వంటనూనె లీటర్‌కు ఇరవై రూపాయలు పెరిగింది. పెట్రోల్ మూడు రూపాయల దాకా పెరిగింది. దీనికి తోడు ఆటో చార్జీలు కూడా పెరిగాయి. మొత్తంగా సామాన్యుల పరిస్థితి ఏం కొనేటట్టు, తినేటట్టు లేకుండా అయిపోయింది.

## తెలంగాణ మహాగర్జన

ప్రత్యేక రాష్ట్రం కోసం టి.ఆర్.ఎస్. ఆధ్వర్యంలో డిసెంబర్ 16న వరంగల్‌లో మహాగర్జన సభ జరిగింది. ఇచ్చిన మాట నిలబెట్టుకోవాలని టి.ఆర్.ఎస్. కేంద్రాన్ని హెచ్చరించింది. పార్లమెంట్ బడ్జెట్ సమావేశంలో తెలంగాణ బిల్లు పెట్టాలని తీర్మానించింది. డిసెంబర్ 31 తర్వాత సత్యాగ్రహంతో మొదలుపెడతామని, అయినా కేంద్రం స్పందించకపోతే పెను ఆగ్రహమేనని 'కాసోజు శ్రీకాంతచారి ప్రాంగణం'లోని మహాగర్జన వేదిక నుంచి టి.ఆర్.ఎస్. అధినేత కె. చంద్రశేఖర రావు హెచ్చరించారు. ఈ సభలో ప్రపంచ ఆర్యసమాజం అధ్యక్షుడు, ప్రముఖ సామాజికవేత్త స్వామి అగ్నివేశ్‌తో పాటు పలువురు తెలంగాణవాదులూ, మేధావులూ, ప్రజా ప్రతినిధులు కూడా పాల్గొన్నారు. ఈ సభకు ఇరవై ఐదు లక్షల మంది హాజరయినట్లు ఒక అంచనా. వీ

*(ఛత్తీస్‌ఘడ్ పౌరహక్కుల నాయకుడూ, వైద్యుడూ డాక్టర్ బినాయక్ సేన్‌ను ఒక తప్పుడు కేసులో ఇరికించి ఏడాది పాటు బెయిల్ రాకుండా నిర్బంధించిన విషయం పాఠకులకు తెలిసిందే. సుప్రీంకోర్టు ఆదేశంతో ఆ కేసు విచారణను హడావుడిగా చేపట్టిన రాయ్‌పూర్ రెండవ అదనపు సెషన్స్ కోర్టు డిసెంబర్ 24న ఆ కేసులోని ముగ్గురు నిందితులకు – డా. బినాయక్ సేన్, నారాయణ్ సన్యాల్, పీయూష్ గుహలకు – యావజ్జీవ కఠిన కారాగార శిక్ష విధించింది. ఎటువంటి సాక్ష్యాధారాలు లేని, నిర్హేతుకమైన, అన్యాయమైన తీర్పు ఇది. ఈ తీర్పు మీద ఇప్పటికే ప్రపంచ వ్యాప్తంగా నిరసనలు చెలరేగుతున్నాయి. విచారణ పూర్తయిన సందర్భంలో చట్టం ప్రకారం నిందితులు ఇవ్వవలసిన కోర్టు ప్రకటనగా బినాయక్ సేన్ ఈ ప్రకటన చేశారు. తన మీద ఆరోపణలు ఎంత అబద్ధమో ఇక్కడ ఆయన వివరించారు. అయినా న్యాయమూర్తి ఈ వాదనలన్నిటినీ పెడచెవిన పెట్టి శిక్ష విధించారు.)*

# బినాయక్ సేన్ కోర్టు ప్రకటన

నేను వృత్తిరీత్యా వైద్యుడిని. శిశు వైద్యంలో ప్రత్యేక శిక్షణ పొందాను. వెల్లూరులోని క్రిస్టియన్ మెడికల్ కాలేజీ నుంచి 1972లో ఎం.బి.బి.ఎస్. పూర్తి చేశాను. ఆ తర్వాత అదే కళాశాల నుంచి 1976లో మద్రాస్ విశ్వవిద్యాలయ ఎం.డి. శిశువైద్యం పట్టా పొందాను. ఆ తర్వాత న్యూఢిల్లీలో జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలోని సెంటర్ ఫర్ సోషల్ మెడిసిన్ అండ్ కమ్యూనిటీ హెల్త్‌లో అధ్యాపకుడుగా చేరి రెండు సంవత్సరాలు పనిచేశాను. తర్వాత మధ్యప్రదేశ్‌లోని హోశంగాబాద్ జిల్లా రసూలియా గ్రామంలో ఫ్రెండ్స్ రూరల్ సెంటర్ పేరిట నడుస్తుండిన గ్రామీణ ఆరోగ్య కార్యక్రమంలో చేరాను. అక్కడ పనిచేసిన రెండు సంవత్సరాలలో క్షయ వ్యాధి గ్రస్తులను పరిశీలించడం, చికిత్స చేయడం చాలా ఎక్కువగా జరిగింది. ఆ క్రమంలో వ్యాధులకు ఉండే సామాజిక, ఆర్థిక కారణాల గురించి నా అవగాహన పెరిగింది. ఆ సమయంలో రసూలియా కేంద్రంలో నివసించిన మహాత్మాగాంధీ జీవిత చరిత్రకారుడు మార్జొరీ సైక్స్ ప్రభావం నా మీద చాల గాఢంగా పడింది.

1981లో నేను ఛత్తీస్‌ఘడ్ వచ్చాను. అప్పటికీ దుర్గ్ జిల్లాలోని దల్లీ రాజ్‌హరాలో అమరుడు శంకర్ గుహ నియోగీ ఛత్తీస్‌ఘడ్ మైన్స్ శ్రామిక్ సంఘ్ అనే కార్మిక సంఘాన్ని నిర్మిస్తున్నారు. వారు అక్కడ నిర్మించదలచిన షహీద్ హాస్పిటల్ పనులలో నేను భాగం పంచుకున్నాను. 1987 వరకు ఆ ఆస్పత్రిలోనే దల్లీ రాజ్‌హరాలో ఉన్నాను. ఆ ఆస్పత్రి ఇప్పటికీ పొరుగు ప్రాంతాల ఆదివాసులకూ, కార్మికులకూ చవుకగానూ, ఉచితంగానూ వైద్య సేవలు అందిస్తోంది. హేతుబద్ధ చికిత్సలు చేస్తోంది. దల్లీ రాజ్‌హరాను వదిలేసిన తర్వాత ధాంతారీ జిల్లాలోని బగ్రూమ్ నాలా గ్రామంలోనూ, చుట్టుపట్ల ఉన్న ఆదివాసీ ప్రజలకు ఆరోగ్య సేవలు అందించే కార్యక్రమంలో పాల్పంచుకున్నాను. ఈ కార్యక్రమంలో భాగంగా ఎంతోమంది గ్రామీణ ఆరోగ్య కార్యకర్తలకు శిక్షణ ఇవ్వడం, మార్గదర్శకత్వం వహించడం నా పనులుగా ఉండేవి. ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రం ఏర్పడినప్పుడు ఆ రాష్ట్ర ప్రభుత్వం ఆరోగ్య రంగ సంస్కరణల కోసం ఏర్పాటు చేసిన సలహాదారుల బృందంలో నన్ను ఒక సభ్యుడుగా నియమించారు. అందులో భాగంగా మితానిన్ అనే కార్యక్రమాన్ని మేము తయారు చేశాం. ఆ కార్యక్రమాన్నే నమూనాగా తీసుకొని ఇప్పుడు జాతీయ గ్రామీణ ఆరోగ్య పథకం కింద 'ఆశా' అనే కార్యక్రమాన్ని తయారు చేశారు. సలహా బృందంలో నన్ను సభ్యుడుగా నియమిస్తూ ఛత్తీస్‌ఘడ్ రాష్ట్ర ప్రభుత్వ ఆరోగ్య కుటుంబ సంక్షేమ శాఖ ఇచ్చిన ఉత్తర్వుల ప్రతిని ఇక్కడ ఒకటో అనుబంధంగా జత చేస్తున్నాను. (ఈ ప్రకటనతో పాటు తన వాదనలను రుజువు చేసే ఇరవై ఏడు అనుబంధాలను జతచేసి, బినాయక్ సేన్ న్యాయస్థానానికి సమర్పించారు. వాటిని ఇక్కడ ఇవ్వడం లేదు.)

సామాజిక ఆరోగ్య రంగంలోనూ, మానవ హక్కుల రంగంలోనూ నా కృషికి జాతీయ స్థాయిలోనూ, అంతర్జాతీయ స్థాయిలోనూ గుర్తింపు వచ్చింది. ఆ వివరాలలో కొన్ని ఇక్కడ ఇస్తున్నాను. సి.ఎం.సి. వెల్లూరు 2004లో నాకు పాల్ హారిసన్ అవార్డు ఇచ్చింది. ఇండియన్ అకాడమీ ఆఫ్ సోషల్ సైన్సెస్ 2007లో నాకు ఆర్.ఆర్. కీతన్ గోల్డ్ మెడల్ ఇచ్చింది. గ్లోబల్ హెల్త్ కౌన్సిల్ అనే అంతర్జాతీయ సంస్థ 2008లో నాకు జొనాథన్ మాన్ అవార్డ్ ఫర్ హెల్త్ అండ్ హ్యూమన్ రైట్స్ ఇచ్చింది. ఈ పురస్కారాల సందర్భంగా నా కృషి గురించి ఆయా సంస్థలు చేసిన ప్రకటనలూ, ప్రశంసా పత్రాలూ ఇక్కడ జత చేస్తున్నాను. (అనుబంధాలు 2, 3, 4, 5).

1981 నుంచి కూడా నేను పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ (పి.యు.సి.ఎల్.) సభ్యుడిగా ఉన్నాను. ఈ పి.యు.సి.ఎల్. అనే సంస్థను కీర్తిశేషులు లోక్‌నాయక్ జయప్రకాశ్ నారాయణ్ ఎమర్జెన్సీలో స్థాపించారు. రాజ్యాంగబద్ధమైన పౌరహక్కులను, మానవ హక్కులను పరిరక్షించేందుకు ఈ సంస్థ అంకితమైంది. దేశంలోని అనేక ప్రాంతాలలో లాగానే ఛత్తీస్‌ఘడ్‌లో కూడా పి.యు.సి.ఎల్. భావ ప్రకటనా స్వేచ్ఛను పరిరక్షించేందుకూ, పోలీస్ కస్టడిలో హింసను నిరోధించేందుకూ, పోలీసులు ప్రజలకు జవాబుదారీగా ఉండాలని చెప్పేందుకూ కృషి చేసింది. పి.యు.సి.ఎల్. ఛత్తీస్‌ఘడ్ శాఖకు 2004లో నేను ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యాను. ప్రస్తుతం ఆ శాఖకు అధ్యక్షుడిగా ఉన్నాను. జాతీయ కార్యవర్గంలో ఉపాధ్యక్షుడిగా ఉన్నాను.

ఛత్తీస్‌ఘడ్‌లో పోలీసుల అత్యాచారాలను వెలికితీసి ప్రజల దృష్టికి తెచ్చే కృషిలో పి.యు.సి.ఎల్. అగ్రభాగాన ఉంది. అణగారిన వర్గాల మీద ఖాకీ దుస్తుల అత్యాచారాలు రాష్ట్రంలో ప్రధాన సమస్యగా ఉన్నాయి. 2010 సెప్టెంబర్ 12 నాటి సండే టైమ్స్ పత్రిక మొదటి పేజీ వార్తా కథనం కూడా ఈ విషయాన్ని ధృవీకరించింది. అనుబంధం ఆరుగా దాన్ని కూడా జతచేస్తున్నాను. ఈ పరిస్థితిలో రాష్ట్రంలో పి.యు.సి.ఎల్. చేస్తున్న కృషి ముఖ్యంగా సత్పరిపాలనను, రాజ్యాంగబద్ధ విలువలను స్థాపించడానికే ఉద్దేశించబడింది. పి.యు.సి.ఎల్. చేసిన అన్వేషణలనూ,

పరిశోధనలనూ, నివేదికలనూ ఎప్పటికప్పుడు పత్రికా ప్రకటనల ద్వారా, సొంత ప్రచురణల ద్వారా బహిరంగ ప్రజాజీవనంలో ఉంచాం. కొయిలీబేడ పోలీస్ స్టేషన్ పరిధిలోని జిరంతరాయ్ గ్రామంలో పోలీసు అత్యాచారాల గురించి మా పరిశోధనల పత్రికా ప్రకటనను ఇక్కడ అనుబంధం 7గా ఇస్తున్నాను. అలాగే కాంకేర్ జిల్లాలో కట్‌గాం గ్రామంలో జరిగిన పోలీసు అత్యాచారాల గురించి మా పరిశోధనల నివేదిక నవభారత్, దేశబంధూ పత్రికలలో అచ్చయింది. ఆ పత్రికలు కూడా ఇక్కడ అనుబంధం 8, 9గా జత చేస్తున్నాను. అలాగే ఛత్తీస్‌ఘడ్‌లో మానవ హక్కుల వాస్తవ స్థితిగతుల గురించి పి.యు.సి.ఎల్. ప్రచురించిన పుస్తకాన్ని కూడా అనుబంధం 10 గా జతచేస్తున్నాను. ఈ క్రమంలో పి.యు.సి.ఎల్. జాతీయ మానవ హక్కుల సంఘంతోనూ, రాష్ట్ర మానవ హక్కుల సంఘంతోనూ నిరంతరాయంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపింది. ఆ ఉత్తరాలలో కొన్నిటి ప్రతులను కూడా ఇక్కడ అనుబంధం 11, 12గా జతచేస్తున్నాను.

పోలీసులకు సంబంధం ఉన్న మానవ హక్కుల ఉల్లంఘనల సంఘటనలను పరిశోధించడం, నమోదు చేయడం, ప్రచారం చేయడం వంటి పనులతో పాటు పి.యు.సి.ఎల్. సల్వాజుడుం అనే సంస్థ నిజమైన స్వభావాన్ని వెల్లడించడంలో ప్రధాన పాత్ర వహించింది. ఈ సల్వాజుడుం అనే సంస్థ 2005లో దంతేవాడ జిల్లాలో ప్రారంభమయింది. ఈ ప్రాంతంలో మావోయిస్టు ఉద్యమానికి వ్యతిరేకంగా, స్వచ్ఛందంగా ప్రజా ఉద్యమంగా ఈ సల్వాజుడుం మొదలయిందని ప్రభుత్వం చెబుతోంది. కానీ, పి.యు.సి.ఎల్. నాయకత్వంలో దేశంలోని ఎన్నో మానవ హక్కుల సంస్థలు సాగించిన పరిశోధనలో ఇందుకు సంబంధించిన వాస్తవం బయటపడింది. సల్వాజుడుం ప్రభుత్వ ప్రోత్సాహంతో, ప్రభుత్వ నిధులతో నడుస్తున్న ఎటువంటి జవాబుదారీతనం లేని కిరాయి ముఠా అని ఈ ముఠాకు ప్రభుత్వమే ఆయుధాలు సమకూర్చిందని ఈ పరిశోధన నిర్ధారించింది. సల్వాజుడుం కార్యక్రమాల వల్ల ఆరు వందల గ్రామాలు ఖాళీ అయిపోయాయి. అరవై వేల మందికి పైగా ఆదివాసులు బలవంతాన తమ ఇళ్ల నుంచి వెళ్లగొట్టబడ్డారు. సల్వాజుడుం కార్యకలాపాల ప్రమాదం గురించి జాతీయ మానవ హక్కుల సంఘంతో సహా అనేక స్వతంత్ర సంస్థలు విచారం వ్యక్తం చేశాయి. యునిసెఫ్ వంటి అంతర్జాతీయ సంస్థలు కూడా ఈ ప్రమాదాన్ని గురించి హెచ్చరిస్తూ సల్వాజుడుం ప్రభావిత ప్రాంతాలలో శాంతిని పునరుద్ధరించడం కోసం చర్చలు జరపడానికి నన్ను ఆహ్వానించాయి. ఎన్నో సందర్భాలలో గౌరవనీయ సుప్రీంకోర్టు కూడా సల్వాజుడుం కార్యక్రమాల పట్ల ప్రభుత్వ విధానంగా ఒక కిరాయి సాయుధ మూకను వాడుకోవడం పట్ల విచారం వ్యక్తం చేసింది. ఈ విషయాలన్నీ పత్రికలలో విరివిగానే వచ్చాయి. ఏయే సంస్థలు సల్వాజుడుం పట్ల విమర్శనాత్మక వ్యాఖ్యలు చేశాయో ఒక జాబితాను అనుబంధం 13 గా జతచేస్తున్నాను. ఛత్తీస్‌ఘడ్ పి.యు.సి.ఎల్. తదితర సంస్థలు సల్వాజుడుంపై విడుదల చేసిన నివేదికను అనుబంధం 14 గా, ఇండిపెండెంట్ సిటిజన్స్ ఇనిషియేటివ్ నివేదికను అనుబంధం 15 గా, ఏషియన్ సెంటర్ ఫర్ హ్యూమన్ రైట్స్ నివేదికను అనుబంధం 16 గా జతచేస్తున్నాను. సల్వాజుడుం కార్యక్రమాల వల్ల దంతేవాడలో ఏర్పడిన సంక్షోభాన్ని పరిష్కరించేందుకు జరిగే చర్చలో నన్ను పాల్గొనమంటూ యునిసెఫ్ ఛత్తీస్‌ఘడ్ ప్రాంతీయ కేంద్రం పంపిన ఆహ్వానాన్ని కూడా అనుబంధం 17 గా జతచేస్తున్నాను. సల్వాజుడుం పట్ల సుప్రీంకోర్టు వ్యక్తం చేసిన విమర్శనాత్మక వ్యాఖ్యలను గురించి హితవాద పత్రికలో 2010 అక్టోబర్ 23న వచ్చిన నివేదికను కూడా అనుబంధం 18 గా జతచేస్తున్నాను.

అలాగే, 2006లో పి.యు.సి.ఎల్. రెండు ముఖ్యమైన సదస్సులు ఏర్పాటు చేసింది. వాటిలో మొదటిది, ఛత్తీస్‌ఘడ్ స్పెషల్ పబ్లిక్ సెక్యూరిటీ ఆక్ట్ అనే చట్టం ప్రతిపాదనను వ్యతిరేకిస్తూ జరిగినది. ఈ చట్టం రాజ్యాంగం హామీ ఇచ్చిన పౌరహక్కులన్నిటినీ ఉల్లంఘిస్తుందని మా అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని నేను అనేకసార్లు పత్రికలలో వెల్లడించాను. మా సదస్సు గురించిన పత్రికావార్తను అనుబంధం 19గా, ఈ విషయంలో నా ఇంటర్వ్యూ ప్రచురించిన పత్రిక ఛత్తీస్‌ఘడ్ 2006 మార్చ్ 30 సంచికను అనుబంధం 20 గా జతచేస్తున్నాను. అలాగే, ఛత్తీస్‌ఘడ్ స్పెషల్ పబ్లిక్ సెక్యూరిటీ ఆక్ట్ రాజ్యాంగ వ్యతిరేకమని వాదిస్తూ దాన్ని సవాల్ చేస్తూ ఛత్తీస్‌ఘడ్ హైకోర్టులో పి.యు.సి.ఎల్. దాఖలు చేసిన రిట్ పిటిషన్ 2163/2009 ప్రతిని కూడా అనుబంధం 21 గా జతచేస్తున్నాను.

ఈ అన్ని కారణాల వల్ల ఛత్తీస్‌ఘడ్ పోలీసులు, ఛత్తీస్‌ఘడ్ రాష్ట్ర ప్రభుత్వం నా మీద కక్ష పెంచుకున్నాయి. అప్పటి ఛత్తీస్‌ఘడ్ డి.జి.పి. ఒ.పి. రాథోడ్ పి.యు.సి.ఎల్. మీదా, పి.యు.సి.ఎల్. కార్యనిర్వాహక వర్గం మీదా చర్య తీసుకుంటానని అప్పుడే బహిరంగంగానే బెదిరించాడు. ఆయన బెదిరింపు అప్పటి పత్రికలలో వచ్చింది. 2006 జనవరి 3 పత్రికలలో వచ్చిన ఆ వార్తలను అనుబంధం 22 గా జతచేశాను. ఒక మానవ హక్కుల కార్యకర్తగా ఖైదీల హక్కుల పరిరక్షణ కూడా నా పనులలో ఒకటి. అందువల్ల నారాయణ్ సన్యాల్‌ను 2006లో రాయపూర్ జైలుకు తీసుకువచ్చిన తర్వాత ఆయన ఆరోగ్యం గురించి పట్టించుకొమ్మని ఆయన కుటుంబ సభ్యులు నన్ను కోరారు. ఆయనను నేను మొట్టమొదటిసారి జైలులో కలిసినప్పుడు నా వెంట ఆయన కుటుంబ సభ్యులూ, ఆయన న్యాయవాదీ కూడా ఉన్నారు. ఆ తర్వాత ఆయనను జైలులో కలుసుకోవడానికి నేను పోలీసు అధికారుల అనుమతి పొందాను. ఆ అనుమతితోనే ఆయనను అనేకసార్లు కలిసాను. ప్రతి సందర్భంలోనూ ఆయనను నేను కలిసినది పి.యు.సి.ఎల్. రాష్ట్ర బాధ్యుడిగా మాత్రమే. ప్రతిసారీ ఆయనను కలిసి వచ్చిన తర్వాత ఆయన ఆరోగ్యం గురించి టెలిఫోన్ ద్వారా ఆయన కుటుంబ సభ్యులకు చెబుతుండేవాడిని. ఇలా కలుస్తున్న సందర్భంలోనే ఆయన చేతులకు అత్యవసరంగా చేయవలసిన శస్త్రచికిత్సను వాయిదా వేస్తున్నారనీ, జైలు అధికారులకూ, రాయపూర్ మెడికల్ కాలేజీ వైద్యులకూ మధ్య సమాచారం సక్రమంగా లేకపోవడం వల్ల ఈ వాయిదా జరుగుతోందనీ నాకు తెలియవచ్చింది. నేను జోక్యం చేసుకొని ఆయనకు శస్త్ర చికిత్స త్వరగా అయ్యేలా చూశాను. దాని గురించి ఆయన కుటుంబ సభ్యులకు తెలియజేశాను. ఈ సందర్భంగా ఖైదీ కుటుంబానికీ, జైలు అధికారులకూ, వైద్య అధికారులకూ మధ్య ఎన్నో ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి. వాటిలో కొన్ని నాకు కూడా పంపారు. నారాయణ్ సన్యాల్ సోదరుడు రాధా మాధవ్ సన్యాల్ జైలు సూపరింటెండెంట్‌కు రాసిన లేఖను నాకు కూడా

కాపీ పెట్టాడు. అది అనుబంధం 23 గా జతచేశాను. నారాయణ్ సన్యాల్‌ను నేను జైలులో కలుసుకోవడానికి సమాచార హక్కు చట్టం కింద దరఖాస్తు చేసి అనుమతి సంపాదించాను. ఆ దరఖాస్తును అనుబంధం 24 గా, రాయపూర్ సీనియర్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ బి.ఎస్. మరావీ ఇచ్చిన లిఖిత పూర్వక అనుమతి ప్రతిని అనుబంధం 25 గా జతచేస్తున్నాను. జైలు అధికారులకూ, రాయ్‌పూర్ మెడికల్ కాలేజీ వైద్య అధికారులకూ మధ్య సాగిన ఉత్తర ప్రత్యుత్తరాలు నాకు కూడా కాపీలు పెట్టినవి అనుబంధం 26 గా జతచేస్తున్నాను.

ఖైదీల పరిస్థితి గురించిన నా ఆందోళన వల్లనే రాయ్‌పూర్ సెంట్రల్ జైలులో ఖైదీల పరిస్థితుల గురించి మదన్‌లాల్ బర్‌ఖాడే రాసిన ఉత్తరం మీద నేను ప్రతిస్పందించాను. ఆ ఉత్తరాన్ని నేను రాయ్‌పూర్ పత్రికలలో వచ్చేలా చూశాను. పత్రికలలో అచ్చయిన ఆ ఉత్తరాన్ని అనుబంధం 27 గా జతచేస్తున్నాను. 2007 మే 19న పోలీసులు నా ఇంటిని సోదా చేసి జప్తు చేసుకున్నామని ఈ కోర్టులో ప్రవేశపెట్టిన కాగితాలు అన్నీ కూడా ఇటువంటి నా సాధారణ పారదర్శక కృషికి సంబంధించినవే. దేశవ్యాప్తంగా మానవ హక్కుల సంస్థలన్నీ నాకు వారి పుస్తకాలూ, కరపత్రాలూ, నివేదికలూ పంపిస్తూ ఉండేవి. నా ఇల్లూ, కార్యాలయమూ ఒకటే గనుక ఇటువంటి పత్రాలు వేలాదిగా నా ఇంట్లో ఉన్నాయి.

అయితే పోలీసులు జప్తు చేసిన కాగితాలలో ఏ ఒక్కటీ రహస్యంగానూ, దొంగచాటుగానో సంపాదించింది కాదు. పోలీసులు ప్రవేశపెట్టిన ఎ-19 అనే డాక్యుమెంట్ పీపుల్స్ మార్చ్ పత్రిక. దాన్ని సంపాదకుడు గోవిందన్ కుట్టీ పోస్టులో పంపించాడు. డాక్యుమెంట్ 20గా పోలీసులు చెబుతున్నది మదన్‌లాల్ బర్‌ఖాడే నాకు మామూలు పోస్టులో రాసిన ఉత్తరం. డాక్యుమెంట్ ఎ-21 అనేది డాక్టర్ కల్పన కన్నబిరాన్ సహ రచయితగా రాసిన వ్యాసం. ఆ వ్యాసాన్ని హైదరాబాద్ లోని నేషనల్ లా స్కూల్‌లో ప్రొఫెసర్‌గా పనిచేస్తుండిన ఆ రచయితే నాకు ఈమెయిల్ ద్వారా పంపించారు. ఒక చేతిరాత కరపత్రపు ఫొటో కాపీని ఎ-22గానూ, మరొక రెండు కరపత్రాలను ఎ-23, ఎ-36గానూ పోలీసులు ప్రవేశపెట్టారు. కానీ, ఈ మూడు పత్రాలను 2007 జనవరిలో న్యూఢిల్లీలో జామీయా మిలియా ఇస్లామియా విశ్వవిద్యాలయంలో నెల్సన్ మండేలా సెంటర్ ఫర్ పీస్ అండ్ కాన్‌ఫ్లిక్ట్ రెసల్యూషన్ అనే సంస్థ సల్వాజుడుం సమస్య మీద ఏర్పాటు చేసిన సదస్సు దగ్గర బహిరంగంగా పంచారు. ఆ సదస్సులో ఒక వక్తగా ఆహ్వానించబడిన నేను ఆ కరపత్రాలను అక్కడే తీసుకున్నాను. అలాగే ఎ-24 అనే డాక్యుమెంట్ నాకు పోస్టులో వచ్చింది. ఎ-25 నుంచి ఎ-35 దాకా నా దగ్గర దొరికిన వార్తా పత్రికల కత్తిరింపులు. ఛత్తీస్‌ఘడ్‌లో సాగుతున్న పరిస్థితుల గురించి ఆసక్తి కొద్దీ నేను సేకరించి పెట్టుకున్న కత్తిరింపులు.

నా ఇంట్లో ఈ సోదా కార్యక్రమం జరిగినప్పుడు పెద్ద ఎత్తున పోలీసులు నా ఇంట్లో జొరబడ్డారు. తలా ఒక చోట వెతుకుతూ పోయారు. పోలీసులు ఏదో ఒక కాగితం దొరకగానే, దాన్ని అక్కడ ఉన్న రాజ్‌పుత్ అనే అధికారికి ఇచ్చేవారు. రాజ్‌పుత్ దాన్ని చదివి, దాని మీద సంతకం చేయమని నాకు ఇచ్చేవాడు. ఆయన కూడా దాని మీద సంతకం చేసేవాడు. మేమిద్దరమూ ఆ పత్రం మీద సంతకం చేసిన తర్వాత జాగృత్ అనే మరొక అధికారికి జప్తు నివేదికలో ఏమి రాయాలో రాజ్‌పుత్ చెప్పేవాడు. ఆ మాటలన్నీ జాగృత్ రాసిన తర్వాత రాజ్‌పుత్ ఆ కాగితాన్ని జాగృత్‌కు ఇచ్చేవాడు. ఈ రకంగా ప్రతి ఒక్క పత్రాన్ని తీసుకోవడం సంతకాలు పెట్టడం, జప్తు నివేదికలో నమోదు చేయడం జరిగింది. కానీ, వీటిలో ఏ ఒక్క పత్రం మీద నా సమక్షంలో సాక్షి సంతకాలు జరగలేదు. అలాగే ఆ డాక్యుమెంట్లను నా సమక్షంలో సీల్ చేయడం జరగలేదు. సీలు వేయని ఒక కాగితపు సంచిలో ఈ పత్రాలన్నిటినీ పెట్టి, జప్తు కార్యక్రమం ముగించారు. ఎ-37 అనే డాక్యుమెంట్ మీద నా సంతకం లేదు. అసలు అది నన్ను సంతకం చేయమని కూడా ఇవ్వలేదు. అది నా కార్యాలయంలో ఉన్న పత్రం కాదు. జప్తు సమయంలో దొరికినదీ కాదు. నన్ను ఈ కేసులో ఇరికించడానికి పోలీసులే జప్తు తర్వాత బనాయించిన దొంగ పత్రం అది. నా కేసులో మొదటిసారి చలాన్ దాఖలైనప్పుడు నా న్యాయవాది అమిత్ బెనర్జీ కోర్టులో హాజరయి నా తరఫున చార్జ్‌షీట్ తీసుకున్నారు. అనుబంధం 28గా ఆ చార్జ్‌షీట్‌ను కూడా జతచేస్తున్నాను. ఆ చార్జ్‌షీట్‌ను గనుక ఒకసారి మీరు చదివితే ఎ-19 నుంచి ఎ-24 వరకు పత్రాల మీద సాక్ష్యుల సంతకాలు లేవని అర్థమవుతుంది. అలాగే, ఎ-25 నుంచి ఎ-37 వరకు పత్రాల ప్రతులను చార్జ్‌షీట్‌తో కలిపి ఇవ్వలేదు. నా కంప్యూటర్‌లో ఉన్న సమాచారాన్ని డి.వి.డి.ల మీదికి మార్చేటప్పుడు తప్పనిసరిగా ఆ పని నా న్యాయవాది సమక్షంలోనే జరగాలని న్యాయస్థానపు ఉత్తర్వు ఉన్నప్పటికీ పోలీసులు దాన్ని పాటించలేదు. వాళ్లు ఎంపిక చేసిన సమాచారపు డి.వి.డి.లను తర్వాత చాలా కాలానికి విచారణలో భాగంగా సమర్పించారు. వాళ్లు సమర్పించిన డి.వి.డి.లలో మూడు గొల్లపల్లి, జిరంతరాయ్, కట్‌గాంలలో జరిగిన పోలీసు అత్యాచారాల, బూటకపు ఎన్‌కౌంటర్ల పరిశోధనకు సంబంధించినవి. ఈ టేపులలో నేను కొందరు వ్యక్తులతో మాట్లాడుతున్న దృశ్యాలు ఉన్నాయి. అవన్నీ కూడా ఈ అత్యాచారాల బాధితులయిన గ్రామస్తులతో మాట్లాడుతున్నవి. కానీ, పోలీసులు ఆ దృశ్యాలకు వేరే అర్థాలు చెపుతున్నారు. ఈ న్యాయస్థానానికి వచ్చి నాకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పిన ప్రాసిక్యూషన్ సాక్షి దీపక్ చౌబేను నేను మొదటిసారి ఈ న్యాయస్థానంలోనే చూశాను. నేను ఆయనను ఎన్నడూ నారాయణ్ సన్యాల్‌కు పరిచయం చేయలేదు. అంతేకాదు, నారాయణ్ సన్యాల్‌ను తన ఇంట్లో అరెస్టు చేశాడని ఆయన చెప్పిన సాక్ష్యం పచ్చి అబద్ధం. ఎందువల్లనంటే సన్యాల్‌ను భద్రాచలంలో అరెస్టు చేసినట్టు పోలీసులే ఇతర కేసులలో చెపుతున్నారు.

అందువల్ల నాకు వ్యతిరేకంగా ప్రాసిక్యూషన్ చేస్తున్న ఆరోపణలన్నీ దురుద్దేశపూర్వకమైనవి. నిజానికి ఆ ఆరోపణలన్నీ నామీద కక్ష సాధింపులో భాగం. ఈ రాష్ట్రంలో మానవ హక్కుల మీద దుర్మార్గమైన అణచివేత సాగుతుండగా, వాటిని బహిర్గతపరిచిన ఎవరైనా భయపడేందుకు హెచ్చరికగా ఛత్తీస్‌ఘడ్ రాష్ట్ర ప్రభుత్వం నా మీద ఈ ఆరోపణలు చేస్తోంది. అందుకే పోలీసులు నాకు వ్యతిరేకంగా దొంగ పత్రాలు సృష్టించారు. దొంగ సాక్షులను ప్రవేశపెట్టారు. దొంగచాటుగా నన్ను ఈ ఆరోపణలలో ఇరికిస్తున్నారు. వీ

*కరీంనగర్‌లో గ్రానైట్లు, క్రషర్లతో పెద్ద ఎత్తున పర్యావరణ విధ్వంసం జరుగుతోందనీ, ప్రజలు తమ వనరులను కోల్పోవడమే కాకుండా ఆ ప్రాంతమే ఎడారిగా మారే ప్రమాదం ఉందనీ అంటున్నారు* **సుజాత సూరేపల్లి**

# కొండలను కొల్లగొడుతున్న దోపిడీ

కరీంనగర్‌లో 550కి పైగా గ్రానైట్లు, క్రషర్లకు (కంకర)కి అనుమతులు ఇచ్చినారు. అయితే ఏ ఒక్కటి కూడా నిబంధనలకు లోబడి ఉన్నాయనుకోవడం భ్రమనే అవుతుందేమో. దాదాపు సంవత్సరం నుండి తిరుగుతూ ఉంటే అనేక రకాలైన విషయాలు బయటపడుతున్నాయి. మైనింగ్ అధికారులు, పోలీసులు, రెవెన్యు అధికారులు, వీరికి తోడుగా రాజకీయ నాయకుల హస్తం అండగా ఉందని తెలుసుకోవడానికి ఎక్కువ సమయం పట్టలేదు. ముందుగా రాళ్లు మాత్రం పోతున్నాయనే బాధతో మొదలైన ప్రయాణం, ప్రజలు, నీళ్లు, పర్యావరణం దాక పోయింది, కొద్దిగా అనుమానంగా ఉన్నా కూడా ఇప్పుడు పూర్తిస్థాయిలో నివృత్తి అయింది. ఇక్కడి మిత్రులు నీళ్లకు, గుట్టలకు ఉన్న ప్రకృతి సిద్ధమైన సంబంధాన్ని ఇంకా పరిశోధిస్తూనే ఉన్నారు. చుట్టు పక్కల ఉన్న ఇళ్లు, పొలాలకి కలుగుతున్న తీవ్ర నష్టాన్ని, ఛిద్రమవుతున్న జన, జీవ, జంతు జాలాన్ని చూసి ఆవేశం పెల్లుబుకుతుంది. ఎందుకు ఇంత నిర్లిప్తత జనాల్లో అని ఆరా తీస్తే, ఇంత దోపిడీ కూడ చాప కింద నీటిలా మెల్లగా జరుగుతోంది. దీని గురించి మాట్లాడాలంటే ఇది మేజర్ మైనింగ్ కిందకి రాదు అని మైనింగ్ అధికారులు తెలుపుతున్నారు. ఓపెన్ కాస్ట్ మైనింగ్ లాంటివి మాత్రమే మేజర్ మైనింగ్ కిందకి వస్తాయి. అయితే అది సింగరేణి అధీనంలో ఉంటుంది కాబట్టి , పెద్ద పోరాటాలే చేయాల్సి వస్తుంది అని ప్రజలు భావించి ఉండొచ్చు.

ఈ సమస్య గురించి మాట్లాడాలంటే ముందుగా ఎక్కడనుండి మొదలు పెట్టాలో తెలియలేదు. పెద్దలు జగన్ మోహన్ రావు గారు ఏదో ఒకటి చేయాలని పట్టు పట్టడంతో ఆలోచనలు మొదలయినాయి. ప్రతి ఊరికి కరపత్రాలు రాసుకొని అయన ఒక్కడే ముందుగా తిరిగినారు. ఎవరు పెద్దగా పట్టించుకోలేదు. తరువాత కుమార్, సుదర్శన్, మానవ హక్కుల వేదిక ద్వారా కొంత ప్రచారం జరిగింది. నెమ్మదిగా కొన్ని తెలంగాణ సంఘాలని కలుపుకొని పోవడం ప్రారంభించాం. ప్రజలు కదలడం మొదలుపెట్టారు. అసలు సమస్య అంతా, అసలు ఇది సమస్య అని చాల మంది ప్రజలకి తెలియక పోవడం. చదువుకున్న వారికి కూడా. పెద్ద రాతి బండలు లారీల మీదుగా తరలి పోతూనే ఉన్నాయి. ప్రతి రోజు ఏదో ఒక ఊరిలో బ్లాస్టింగ్ శబ్దాలు వినపడుతూనే ఉన్నాయి. అయితే గత సంవత్సరం బద్దిపల్లిలో కొంత శ్రమ పడ్డాక ప్రజలు తీవ్రంగా తిరగ బడ్డారు. అక్కడ రెండు వేలకి పైగా ఇందిరమ్మ ఇళ్లు కడుతున్నారు, వాటికి నష్టం జరుగుతుంది. చుట్టూ పచ్చని పంట పొలాలు నాశనం అవుతాయి అని చెప్పడం జరిగింది. ముఖ్యంగా, కొండపైన ఉన్న గుడి అంటే అక్కడ ప్రజలకు విపరీతమైన నమ్మకం. మొక్కులు, పండుగలు చేసుకుంటారు. కేవలం ఆ ఒక్క నమ్మకమే ఆ గుట్టని కాపాడగలిగింది. మీడియా పుణ్యమా అని అన్ని టివి చానళ్లలో ప్రసారమైనది. అన్ని వార్తా పత్రికలూ ప్రచురించాయి. అది తాత్కాలికంగా నిలిపి వేయబడ్డది. అది ఒక రాజకీయ నాయకుడి గ్రానైట్ కంపెనీకి సంబంధించింది. అక్కడి నుండి హుస్నాబాద్ లంబాడాలు ప్రతిఘటించారు. అక్కడ అడవి పందులు, ఎలుగుబంట్లు, కోతులు, కొండెంగులు ఊళ్ల మీద పడి ఇండ్లని, పొలాలని పాడు చేస్తున్నాయని ప్రజలు తమ గోడువెల్లబోసుకొని, క్వారీ మిషన్లని ధ్వంసం చేసారు. ఎక్కడ గొడవ జరిగితే అక్కడ రాజకీయ ప్రతినిధులు జోక్యం చేసుకోవడం, లేదా తెరవెనుక నుండి పావులు కదపడం చేస్తున్నారు. ప్రజలని కులాలుగా, మతాలుగా విడగొట్టడం, గొడవ చేసే వారిని బెదిరించడం రోజు జరిగే సర్వ సాధారణ విషయం.

ఒక వైపు ప్రజలను అప్రమత్తం చేస్తూనే మరో వైపు ప్రభుత్వం, మైనింగ్ అధికారుల చుట్టూ తిరగడం జరుగుతోంది. ఒక వైపు సమాచార హక్కు కింద సమాచారం సేకరించడం, దానిని కరపత్రాల రూపంలో ప్రజలకు తెలియచేయడం, మీటింగులలో మాట్లాడడం, అనేక సంఘాలని ఈ ఉద్యమంలో రమ్మని ఆహ్వానించడం నేటికి కూడా జరుగుతోంది. ఈ క్రమంలోనే తెలంగాణ భూమి రక్షణ సంఘం అనే ఉద్యమ వేదిక ఏర్పాటు చేసి, దాని ద్వారా జిల్లా కలెక్టర్, మైనింగ్ అధికారులకి, ఇతర ప్రభుత్వ శాఖలకి ప్రజా ప్రతిఘటనని తెలియచేస్తూ 'జిల్లా క్వారీలు, కరీంనగర్ గోరీలు' అని పలు రకాలుగా ప్రచార ఉద్యమం నడుస్తోంది. చాలా ఊర్లలో గ్రామ పంచాయతీ తీర్మానం అయినట్టు తెలియదు. సదరు జిల్లా రెవెన్యూ అధికారి లేదా మైనింగ్ కంపెనీ ముందుగానే ఒక లోపాయకారి ఒప్పందాన్ని సర్పంచులతో లేదా కొద్ది మంది మనుషులతో జరుపుకుంటారు. గంగాధర మండలం కొండనపల్లి ప్రజలు ఇపుడు తిరుగుబాటు చేస్తున్నారు. మైనింగ్ ప్రదేశంలో బ్లాస్టింగ్‌ను ఆపి వేసి, మీడియా సహాయంతో, సాక్ష్యాధారాలతో పోలీసులకి కంప్లైంట్ ఇస్తే కనీసం వారు నమోదు కూడ చేసుకోలేదు. అన్నారం గ్రామం మానకొండూర్‌లో కూడ ఇదే పరిస్థితి. అయితే ఒక రాజకీయ పార్టీ జోక్యంతో, వారు కూడ ధర్నా చేయడంతో కాని కంప్లైంట్ తీసుకోలేదు.

ఇక గంగాధర నాయకపోడ్లు సున్నపు రాయి కోసం అధికారులు సర్వే చేయడానికి వస్తే వారిని తరిమి కొట్టారు. ఇక్కడి గుట్టలకు వారి జీవితాలకి మధ్య విడదీయలేని బంధాలు అక్కడికి పోతే కాని తెలియ లేదు. ఇక్కడ కేవలం మహిళలు ప్రత్యక్ష యుద్ధానికి దిగారు. అయితే ఇంకా భయంతోనే ఉన్నారు. ఇక బొమ్మలగుట్ట, ఈ మధ్య కాలంలో

విపరీతంగా ప్రాచుర్యంలో ఉంది. కారణం అక్కడ పురాతన తెలుగు, కన్నడ శిలా శాసనాలు, జైనుల చిహ్నాలు, పూజా స్థలాలు ఉండడం. ఉప్పు లింగయ్య అనే స్థానికుడు, అత్యంత పట్టుదలతో ఈ గుట్టకి జరిగే అన్యాయాన్ని బయటపెట్టి, అనేక విధాలుగా ప్రచారం చేయగా అనేక మంది హక్కుల కార్యకర్తలు, రచయితలు తరలి వచ్చారు. ప్రముఖ రచయితలు కవితలు రాసారు. ఈ అంశానికి సంబంధించి అన్ని పత్రికలలో ఎవరో ఒకరు నేటికీ రాస్తున్నారు, ఇంకా ఇంటర్‌నెట్‌లో కూడా ఈ సమాచారం పొందు పరచ గలిగినం. ఇప్పటికి బొమ్మలగుట్ట ఆగగలిగింది.

ఈ మధ్య కాలంలో కర్ణాటక సుప్రీం కోర్టు తీర్పు(సి.ఎ. నెం. 7042/2001 అండ్ విత్ డి.ఎ. నెం. 7043/2001 ఆర్డర్ ఇష్యూడ్ బై సుప్రీం కోర్ట్ ఆఫ్ ఇండియా, 08-04-2009) గ్రానైట్ల మీద ఇచ్చిన అతి ముఖ్యమైన మార్గదర్శక సూత్రాలు సంపాదించి వాటిని ఇక్కడ కూడ అమలు చేయాలనే డిమాండ్ పెడుతున్నాం. 1997 కర్ణాటకలో ఓబయ్య పూజారి అనే ఒక వ్యక్తి ప్రజా వ్యాజ్యం (పిల్ నెం. 17078) దాఖలు చేసారు. దానికి కర్నాటక హైకోర్టు ఇద్దరు న్యాయమూర్తులతో కూడిన బెంచ్ 98 లో అనుకూలంగా తీర్పునిచ్చింది. ఇందులో మైనింగ్‌లు జనావాసాలకు, గుడులకు, బడులకు, నీటి వనరులకు, జాతీయ రహదారులకు కనీసం రెండు కిలోమీటర్ల దూరంలో ఉండాలని సూచించింది. అయితే దీనిని సవాలు చేస్తూ క్వారీ అసోసియేషన్ సుప్రీంకోర్టుకు వెళ్లింది. అక్కడ సుప్రీం కోర్టు 2009లో కర్ణాటక ప్రభుత్వానికి కొన్ని మార్గదర్శక సూత్రాలను అనుసరించమని కోరింది. ఈ తీర్పులో ప్రజలకు క్వారీల వలన జరిగే జల, వాయు, శబ్ద కాలుష్యాలను వివరించింది.

ప్రజలకు అందులో ఉన్న అంశాలను వివరిస్తూ వారిని ఉద్యమాల వైపు మళ్లించడానికి చేసే ప్రయత్నం అతి క్లిష్టమైనది. ముందుగా వారు ప్రభుత్వాలని ఎదిరించడం సాధ్యమేనా అనే ప్రశ్న వేస్తారు. ఈ దేశంలో ప్రజలు తమ హక్కులను తాము కాపాడుకోవడంలో కూడ అమాయకులే. వారికి హక్కులు అంటే తెలియదు, ప్రభుత్వం అంటే తిరుగు లేనిది అంతే. గతి లేని పరిస్థితిలో ఉద్యమాలకు సిద్ద పడుతున్నారు. ఇక రెండవ ప్రశ్న మీకు ఏమి లాభం లేకపోతే మాదాక ఎందుకు వస్తారు అని. ఇది కూడ కష్టంగానే ఉంటుంది వింటే. కొన్ని రకాల సంస్థల వలన కేవలం డబ్బు కోసమో, లాభాల కోసమో, కొన్నిసార్లు పేరు కోసమో ప్రజల దగ్గరకు ఇతరులు పోతారు అని నమ్మకం కలిగించిన వాళ్లం మనమేనేమో. ఈ దేశంలో ఎ.సి. రూముల్లో ప్రజల గురించి, చట్టాల గురించి చర్చలు ప్రజలు లేకుండా జరుపుతారు, ఎంతో ఖర్చు పెట్టి సదస్సులను నిర్వహిస్తారు, గొప్ప సామాజిక కార్యకర్తలమని అనిపించుకుంటారు. వారు ఏం చేస్తారో మాలాంటి వారికి కాని, చదువులేని వారికి కాని తెలియదు. అవి కూడ ఉద్యమాలే అంటారు పైగా. ఒక వైపు ప్రజలు అనేక రకాలుగా ఇబ్బంది పడుతుంటే మరో వైపు ఇది నిరంతరం జరిగే పని. ఇక మైనింగ్, పోలీసు, కలెక్టర్, రాజకీయ ప్రతినిధులు కదలకపోవడంతో కోర్టులను ఆశ్రయించక తప్పలేదు. అన్నారం, నందగిరి ప్రజలు కోర్టు నుండి స్టే ఆర్డర్లు తెచ్చుకున్నారు. ఈ పని ఎంతో ఖర్చుతో, సమయంతో కూడుకున్నది. అందరికి అందునా 550 క్వారీలకి ఈ విధంగా చేయడం చాల కష్టం. ఇక తీవ్రంగా లాయర్ల వేటలో పడ్డాం, చాల మంది లాయర్లకు సమయం లేదు. సమయం ఉన్న లాయర్లకు సహనం లేదు. డబ్బు లేకుండా వారు పని చేయలేరు. ఇక్కడ మాత్రం బాలగోపాల్‌ని ఎన్ని వేలసార్లు తలచుకొన్నామో గుర్తులేదు. ఎప్పుడు ఫోన్ చేసినా వెంటనే సమాధానం, ధైర్యం చెప్పేవాడు. ఇప్పుడు అలాంటి వాళ్లు ఎవరు కనపడట్లేదు.

ఇక ప్రభుత్వాధికారులకు కోపం వస్తే ఏం చేస్తారో అన్నారం గ్రామ ప్రజలను చూస్తే తెలుస్తుంది. అక్కడ కవిత అనే దళిత యువతి మండల ఆఫీసర్‌పైన ఎస్.సి. అత్యాచార నిరోధక చట్టం కింద కేసు నమోదు చేసారు. దానికి కూడ ఉద్యమం చేయాల్సి వచ్చింది. పోలీసు వారు కేసులు పెట్టారు, అయినా బెదరలేదు. ఈ కేసు విచారణకు వచ్చే సమయానికి కవితని తమ వాళ్లతోటే తిట్టిపించడం, కుల బహిష్కరణ చేయడం, ఆమెను పొదుపు సంఘంలో నుండి తప్పించడం, అనేక రకాలుగా కష్టాలు పెడుతున్నారు. ఇక అదే ఊరికి చెందిన మరో ఇద్దరు యువకులకి మావోయిస్టులతో సంబంధాలు ఉన్నాయని, కేసులు పెడతామని వారిని బెదిరించడం, వారికి వచ్చే రేషన్ కార్డులను, కుల, ఆదాయ ధ్రువ పత్రాలను ఇవ్వకపోవడం లాంటివి చేస్తున్నారు. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో... కేసు వాపసు తీసుకునే దాక ఈ కష్టాలు తప్పవని రోజూ గుర్తుచేయడం, మొత్తానికి సమైక్యంగా పోరాటం చేసిన ఊర్లని, మనుషులని ముక్కలు ముక్కలుగా చేస్తున్నారు అధికారులు, పోలీసులు. ఇక రాజకీయ నాయకులు వీరిని ఏమాత్రం పట్టించు కోవడం లేదు. ఒకరిద్దరు మాత్రం రహస్యంగా మద్దతు తెలుపుతున్నారు.

విపరీతంగా జరుగుతున్న పర్యావరణ నష్టాన్ని పూడ్చేదెవరు? ప్రకృతి సిద్ధమైన, అపురూపమైన రాతి సౌందర్యాలని, అక్కడి జంతు జాలాన్ని కాపాడేదెవరు? ప్రజల జీవన విధానాలని నాశనం చేస్తున్న మైనింగ్ మాఫియాని అరికట్టేదెవరు? ఇదొక పెద్ద ప్రశ్న. ఒక వైపు మైనింగ్ వారు పట్టించుకోరు, మరో వైపు ప్రభుత్వ అధికారులు తప్పుడు రిపోర్టులు ఇస్తూ ఇబ్బడి ముబ్బడిగా అనుమతులు ఇస్తున్నారు. ఇక ఇక్కడ ఇరిగేషన్ వారికి, అసైన్డ్ భూములకి, అటవీ భూములకి తేడా తెలియకుండానే గుట్టలకి అనుమతులు ఇస్తారు. గత సంవత్సరం కాలంగా జరుగుతున్న ఉద్యమం ఫలితంగా కలెక్టర్ కొన్ని కఠినమైన నిబంధనలను పెట్టారు. అధికారాలు వికేంద్రీకరించారు. ఇదివరకు కేవలం రెవెన్యూ అధికారుల చేతిలో అన్ని అధికారాలు ఉండేవి. నిబంధనలకు విరుద్ధంగా బెబిరాజుపల్లెలో, అసైన్డ్ భూములు ప్రజలతోటే వాపసు చేయించి, వాటిని మైనింగ్‌కు కేటాయిస్తూ అనుమతులు ఇవ్వడం జరిగింది. అయితే ప్రజలు ఆందోళన చేయడంతో అధికారులు విచారణ జరిపిస్తున్నారు.

1972 యుఎన్ సదస్సు హ్యూమన్ ఎన్విరాన్మెంట్ పైన స్టాక్‌హోంలో జరిగింది. ఇందులో ముఖ్యంగా మైనింగ్ ఆపరేషన్‌లో ప్రజలను, పర్యావరణాన్ని కాపాడాలని కొన్ని రెగ్యులేషన్స్ చేసింది. దీనికి మనదేశం కూడా సంతకం చేసింది. ఈ విధంగా గుట్టలను పోగొట్టుకుంటే, తీవ్రమైన జలవనరుల విధ్వంసం జరుగుతుంది, ఆరోగ్యం అటకెక్కుతుంది. ఇప్పటికే శ్వాస సంబంధిత వ్యాధులు ఎక్కువైనాయి. చాల చోట్ల నీటి ఊటలు ఎండి పోయినాయి. ఎలగందల లాంటి గ్రామాలలో ఎలుగుబంట్లు ప్రజల మీదకి వచ్చి గాయ పరుస్తున్నాయి. అడవి పందులు, నెమళ్లు, ఇతర జంతువులు, పక్షులు నీడ లేకుండా పోతున్నాయి. చుట్టూ ఉన్న పచ్చని పొలాలు పంటలకి పనికి రాకుండా పోతున్నాయి. దగ్గరలో ఉన్న ఇండ్లు బీటలు వారుతూ,

***సామ్రాజ్యవాద రాజ్యాల రహస్యాలను ఛేధించి, నిజాలను ప్రపంచానికి తేటతెల్లం చేస్తున్న వికీలీక్స్‌ను కాపాడుకోవడానికి అందరూ సహకరించాలని కోరుతున్నారు* జూలియన్ అసాంజె**

# నిజం చెప్పినందుకే వికీలీక్స్‌పై దాడులు

(డిసెంబర్ 7, 2010న అసాంజె రాసిన బహిరంగ లేఖ) ఆస్ట్రేలియాలోని అడిలైడ్ నుండి వెలువడే 'ది న్యూస్' పత్రిక యజమాని, సంపాదకుడు రూపర్ట్ మర్డోక్ 1958లో ఇలా రాశారు. 'రహస్యానికి, నిజానికి మధ్య పరుగు పందెంలో సదా తప్పనిసరిగా నిజమే విజయాన్ని సాధిస్తుంది'.

ఈ వాక్యం రాసేటప్పుడు తన తండ్రి కీర్త్ మర్డోక్ నిర్భయంగా నిజాలు వెల్లడించిన వైనం యువ రూపర్ట్‌ను ప్రభావితం చేసి ఉంటుంది. గల్లిపోలీ తీరంలో బ్రిటిష్ సైనికాధికారుల అసమర్థత కారణంగా ఆస్ట్రేలియా సైనికులు అనవసరంగా బలిదానాలు చేయవలసి రావడాన్ని కీర్త్ మర్డోక్ బహిర్గతం చేసారు. ఆయన నోరు నొక్కివేయాలని బ్రిటిష్ ప్రభుత్వం నిష్ఫల ప్రయత్నం చేసింది. కాని ఆయన ప్రయత్నాల ఫలితంగానే దురదృష్టకరమైన గల్లిపోలీ చర్య ఆగిపోయింది.

దాదాపు ఒక శతాబ్దం తరువాత వికీలీక్స్ కూడా బహిరంగం కావలసిన వాస్తవాలను నిర్భయంగా ప్రకటిస్తోంది.

నేను క్వీన్స్‌లాండ్ పట్టణంలో పెరిగాను. అక్కడి ప్రజలు తమ మనోభావాలను నిష్కర్షగా వెల్లడించే వాళ్లు. ప్రజలు జాగరూకతతో గమనించకపోతే శక్తిమంతమైన ప్రభుత్వాలు అవినీతికరంగా తయారవుతాయని వాళ్లు నమ్మే వాళ్లు. ఫిడ్జెర్లాండ్ విచారణకు ముందు క్వీన్స్‌లాండ్ ప్రభుత్వంలో అవినీతి అంధకారపు దినాలు, పత్రికలు నిజాల్ని వెల్లడి చేయకుండా నోళ్లు నొక్కేయడానికి రాజకీయ నాయకులు ప్రయత్నిస్తే ఏం జరుగుతుందో రుజువు చేస్తున్నాయి.

ఈ అంశాలన్నీ నా భావనలో నిండి ఉన్నాయి. ఈ విలువల కేంద్రంగానే వికీలీక్స్ సృష్టి జరిగింది. ఈ ఆలోచనకు శ్రీకారం చుట్టింది ఆస్ట్రేలియాలో. ఇంటర్నెట్ సాంకేతిక పరిజ్ఞానాన్ని కొత్త పద్ధతుల్లో ఉపయోగించి వాస్తవాల్ని వెల్లడిచేయాలన్నదే ఈ ఆలోచన.

వికీలీక్స్ ఒక నూతన తరహా జర్నలిజాన్ని ప్రారంభించింది. అదే శాస్త్రీయ జర్నలిజం. ఇతర ప్రసార మాధ్యమాలతో కలిసి మేం ప్రజలకి వార్తలందిస్తాం. అంతేకాదు, అవి నిజాలని నిరూపిస్తాం కూడా. మేం ప్రకటించే ప్రతివార్తా, కథనానికి సంబంధించిన ఒరిజినల్ డాక్యుమెంట్లను ఇంటర్నెట్‌లో ఎవరికైనా పరిశీలించే అవకాశం ఉంటుంది. అదే శాస్త్రీయ జర్నలిజం. అలా చేయడం ద్వారా ఆ కథనం నిజమా, కాదా, విలేకరి ఉన్నదున్నట్లుగా రిపోర్ట్ చేసాడా లేదా అనేది ఎవరికివారే నిర్ధారించుకునే అవకాశం ఉంటుంది.

ప్రజాస్వామిక సమాజాలకు శక్తిమంతమైన ప్రసార మాధ్యమాలు అవసరం. వికీలీక్స్ అందులో భాగం. ప్రభుత్వాలు నిజాయితీగా పనిచేసేటట్లు చూడడంలో ప్రసార మాధ్యమాలు సహాయ పడతాయి. వికీలీక్స్ ఇరాక్, అఫ్ఘాన్ యుద్ధాలకు సంబంధించిన కొన్ని కఠిన వాస్తవాలను వెల్లడి చేసింది. కార్పొరేట్ రంగంలో అవినీతికి సంబంధించిన కథనాలను బయటపెట్టింది.

నేను యుద్ధ వ్యతిరేకినని ప్రజలు అంటారు. కానీ, నేను అలాంటి వాడిని కాను. కొన్ని సందర్భాలలో దేశాలు తప్పనిసరిగా యుద్ధం చేయాల్సి ఉంటుంది. అవి న్యాయమైన యుద్ధాలు. కాని యుద్ధానికి సంబంధించిన ప్రజలకు ప్రభుత్వం అబద్ధాలు చెప్పి, అటువంటి యుద్ధంలో తమ జీవితాన్ని ఫణంగా పెట్టమని, ఆ యుద్ధాల కోసం పన్నులు కట్టమని అడగడాన్ని మించిన నేరం మరేదీ లేదు. తాను చేస్తున్న యుద్ధం న్యాయమైనదే అని ప్రభుత్వం భావిస్తే నిజాన్ని ప్రజలకు చెప్పాలి. దాన్ని సమర్థించాలో లేదో ప్రజలే నిర్ణయించుకుంటారు.

అఫ్ఘాన్, ఇరాక్ యుద్ధానికి సంబంధించిన నివేదికలు గానీ, అమెరికా రాయబార కథనాలను గానీ, వాటి గురించి వికీలీక్స్ నివేదించిన కథనాలను గానీ మీరు చదివి ఉంటే, ఇలాంటి విషయాలను స్వేచ్ఛగా మాధ్యమాలు ప్రకటించడం ఎంత అవసరమో మీకే తెలుస్తుంది.

అమెరికా రాయబార కార్యాలయాల కేబుల్స్‌ను వికీలీక్స్ మాత్రమే ప్రచురించలేదు. బ్రిటన్‌కు చెందిన 'ది గార్డియన్', అమెరికాకు చెందిన 'ది న్యూయార్క్ టైమ్స్', స్పెయిన్‌లో 'ఎల్-పైస్', జర్మనీలో 'దర్ స్పైగల్' కూడా వీటిని ప్రచురించాయి.

అయితే అమెరికా ప్రభుత్వం నుండి, దాని విధేయులైన తాబేదార్ల నుండి దుర్మార్గమైన దాడులను, ఆరోపణలను ఎదుర్కొంటున్నది మాత్రం ఈ బృందాలన్నింటిని సమన్వయం చేస్తున్న వికీలీక్స్ మాత్రమే. నేను

---

ఇళ్ల పైకప్పులు ఎగిరి పోతున్నాయి. ఇక పెద్దపెద్ద రాళ్లు తీసుకుపోవడం వల్ల రోడ్లు ఎందుకూ పనికి రాకుండా పోతున్నాయి. గుట్టలపై తేనె, సీతాఫలాలు, కట్టెలు మొదలగు వాటిని అమ్ముకొని బతికే కులాలు, గొర్రెలు, మేకలు ఇతర పశువులు కాసే గొల్లలు, గీత కార్మికులు అందరూ జీవనోపాధిని కోల్పోనున్నారు. అతి పురాతనమైన రాతి కట్టడాలు, కోటలు, బురుజులు, బౌద్ధ, జైన చిహ్నాలు కోల్పోనున్నాం. ఇక రాయే కదా అని ఊరుకుంటే, రేపు ఈ ప్రాంతం ఎడారి కాక మానదు.

మన గుట్టలను డబ్బు సంచుల్లాగా చూస్తున్న మాఫియా, రాజకీయ నాయకులు, మౌనంగా చూస్తున్న మనం, జనం... రేపటి ఎడారి తెలంగాణని తలపిస్తున్నాయి! ఉద్యమాల యుగం మనది! ఉద్యమం తప్ప వేరే మార్గం లేదు మనకి!

*(రచయిత శాతవాహన విశ్వవిద్యాలయంలో అధ్యాపకులు, సామాజిక కార్యకర్త)*

అమెరికా పౌరుణ్ణి కాదు. ఆస్ట్రేలియా పౌరుణ్ణి. అయినా అమెరికా నా మీద దేశద్రోహ నేరాన్ని మోపింది. అమెరికాకు చెందిన ప్రత్యేక బలగాలు నా 'అడ్డు తొలగించాలని' డజన్ల సంఖ్యలో ఆ దేశం నుండి పిలుపులు వినబడుతున్నాయి. ఒసామా బిన్ లాడెన్‌లాగా నన్ను వేటాడాలని సారా పాలిన్ అంటున్నారు. నన్ను ఖండాంతర ప్రమాదంగా ప్రకటించి తదనుగుణంగా తుదముట్టించాలనే ఒక రిపబ్లికన్ తీర్మానం అమెరికా సెనెట్ ముందు ఉంది. నన్ను హత్య చేయాలని కెనడా ప్రధానమంత్రి కార్యాలయంలోని ఒక సలహాదారుడు టెలివిజన్‌లో ప్రకటించాడు. నా నోరు నొక్కేయాలంటే ఆస్ట్రేలియాలో నివసిస్తున్న నా ఇరవై ఏళ్ల కుమారుడిని కిడ్నాప్ చేసి హాని కలిగించాలని ఒక అమెరికన్ బ్లాగర్ పిలుపునిచ్చాడు.

ఇలాంటి ప్రకటనల పట్ల జూలియా గిలార్డ్, ఆమె ప్రభుత్వం అనుసరిస్తున్న అవమానకరమైన, నీచాభిరుచులను సంతృప్తిపరిచే వైఖరి పట్ల ఆస్ట్రేలియన్లు సిగ్గుపడాలి. నా ఆస్ట్రేలియన్ పాస్‌పోర్టును రద్దు చేయాలా, వికీలీక్స్ మద్దతుదార్లపై నిఘాపెట్టి, వాళ్లను వేధింపులకు గురిచేయాలా అనే అంశాలపై ఆస్ట్రేలియా ప్రభుత్వం తన అధికారాన్ని అమెరికాకు తాకట్టు పెట్టింది. ఆస్ట్రేలియా పౌరులపై నేరారోపణలను ఎక్కుపెట్టిన అమెరికా పరిశోధనా సంస్థలకు సహాయం చేయడానికి, వాళ్లను అమెరికాకు పంపించి వేయడానికి ఆస్ట్రేలియా అటార్నీ జనరల్ తాను చేయగలిగిందంతా చేస్తున్నాడు.

ప్రధానమంత్రి గిలార్డ్, అమెరికా హోంశాఖ మంత్రి హిల్లరీ క్లింటన్ ఇతర ప్రసార మాధ్యమాలను పల్లెత్తు కూడా విమర్శించడం లేదు. 'ది గార్డియన్', 'ది న్యూయార్క్ టైమ్స్' పత్రికలు పాతవి, పెద్దవి కావడం, వికీలీక్స్ కొత్తదీ, చిన్నదీ కావడమే దీనికి కారణం.

మేం అసహాయులం. తమ దౌత్య, రాజకీయ సంబంధమైన అంశాలతో సహా వాస్తవాలు వెల్లడికావడం ఇష్టం లేక గిలార్డ్ ప్రభుత్వం వార్తాహరుణ్ని హత్య చేయడానికి ప్రయత్నిస్తోంది.

నా మీద, వికీలీక్స్‌తో సంబంధం ఉన్న ఇతరుల మీద దౌర్జన్యం చేస్తామనే బహిరంగ బెదిరింపులు అసంఖ్యాకంగా వస్తుంటే ఆస్ట్రేలియా ప్రభుత్వం నుండి స్పందన ఏమైనా ఉన్నదా? అలాంటి దాడుల నుండి, అసత్య ఆరోపణల నుండి, చట్ట వ్యతిరేక బెదిరింపుల నుండి తన పౌరులను ఆస్ట్రేలియా ప్రధానమంత్రి కాపాడతారని ఎవరైనా అనుకుంటారా. ప్రధానమంత్రి, ముఖ్యంగా అటార్నీ జనరల్ తమ విధులను గౌరవ ప్రదంగానూ, నిజాయితీగానూ నిర్వర్తించాలి. కాని వాళ్లు అలా ప్రవర్తించడం లేదు.

అమెరికా ప్రభుత్వ సంస్థల అధికార దుర్వినియోగాల గురించిన వాస్తవాలను వికీలీక్స్ ప్రకటించిన ప్రతిసారీ ఆస్ట్రేలియా రాజకీయ నాయకులు హోంశాఖతో కలిసి ఒక తప్పుడు పాట పాడుతున్నారు. 'నువ్వు ప్రాణాలను ప్రమాదంలో పెడుతున్నావు! జాతీయ భద్రత! నీ మూలంగా సైనికుల ప్రాణాలకు ప్రమాదం ఏర్పడింది.' అలా అంటూనే వికీలీక్స్ ప్రచురిస్తున్న వాటికి ప్రాధాన్యత ఏమీ లేదని కూడా వాళ్లు అంటున్నారు. ఈ రెండింటిలో ఏది నిజం?

ఏదీ నిజం కాదు. వికీలీక్స్‌కు నాలుగు సంవత్సరాల ప్రచురణ చరిత్ర ఉంది. ఈ సమయంలో మేము మొత్తం ప్రభుత్వాలనే మార్చగలిగాం. కాని ఎన్నడూ ఒక్క వ్యక్తికి కూడా హాని కలిగించలేదని అందరికీ తెలుసు. అమెరికా మాత్రం ఆస్ట్రేలియా ప్రభుత్వం కుమ్మక్కుతో త కొన్ని వేలాది నెలల్లోనే మందిని చంపింది.

అఫ్ఘాన్ యుద్ధానికి సంబంధించిన కథనాలు వెల్లడికావడం మూలంగా కీలకమైన తమ రహస్య వనరులకు గానీ, పద్ధతులకు గానీ భంగం వాటిల్లలేదని అమెరికా రక్షణమంత్రి రాబర్ట్ గేట్స్ అమెరికా కాంగ్రెస్‌కు రాసిన లేఖలో అంగీకరించారు. వికీలీక్స్ రిపోర్టుల కారణంగా అఫ్ఘానిస్తాన్‌లో ఏ ఒక్కరికీ హాని కలిగిందనడానికి సాక్ష్యం లేదని పెంటగాన్ ప్రకటించింది. కాబూల్‌లోని నాటో కూటమి ప్రతినిధి పీయన్‌మన్‌తో మాట్లాడుతూ తాము రక్షణ కల్పించాల్సిన ఒక్క వ్యక్తి కూడా అఫ్ఘానిస్తాన్‌లో లేదని అన్నాడు. ఆస్ట్రేలియా రక్షణశాఖ కూడా అదే అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది. మేం ప్రచురించిన కథనాల కారణంగా ఆస్ట్రేలియా సైన్యానికి ఏ ప్రమాదం కలుగలేదు.

కాని మేం ప్రచురించిన వాస్తవాల ప్రాధాన్యత తక్కువేమీ కాదు. అమెరికా రాయబార కార్యాలయం నుండి వచ్చిన కేబుల్స్ కొన్ని నివ్వెరపరిచే నిజాలను వెల్లడిచేసాయి.

- ఐక్యరాజ్య సమితి అధికారులు, మానవ హక్కుల బృందాల కార్యకర్తలకు సంబంధించిన వ్యక్తిగత సమాచారాన్ని, వాళ్ల శారీరక వివరాలను రహస్యంగా తెలుసుకోవాలని అమెరికా విదేశాలలోని తన రాయబార కార్యాలయాలను ఆదేశించింది. డి.ఎన్.ఎ., చేతి వేళ్ల గుర్తులు, కంటికి సంబంధించిన ఐరిస్ స్కాన్‌లు, క్రెడిట్ కార్డు నెంబర్లు, ఇంటర్నెట్ పాస్‌వర్డ్స్, గుర్తింపు ఫొటోల వంటి వివరాలన్నింటినీ అంతర్జాతీయ ఒడంబడికలకు వ్యతిరేకంగా సేకరించాలని ఆదేశించింది. దీనికి ఐక్యరాజ్య సమితిలోని ఆస్ట్రేలియా దౌత్య ఉద్యోగులు కూడా గురై ఉంటారు.
- ఇరాన్‌పై దాడి చేయాలని సౌదీ అరేబియా రాజు అబ్దుల్లా అమెరికాను కోరాడు.
- ఏ విధంగానైనా సరే ఇరాన్ అణు కార్యక్రమాలను నిలిపి వేసేటట్లు చూడాలని జోర్డాన్, బహ్రెయిన్ అధికారులు కోరారు.
- ఇరాక్ యుద్ధంపై బ్రిటన్‌లో జరుగుతున్న విచారణ 'అమెరికా ప్రయోజనాల'ను రక్షించేదిగా ఉండాలి.
- స్వీడన్ నాటో కూటమిలో రహస్య సభ్యత్వ దేశం. అది అమెరికాతో కొనసాగిస్తున్న రహస్య లావాదేవీలను తమ పార్లమెంట్‌కు వెల్లడి చేయడం లేదు.
- గ్వాంటనామో జైలు నుండి తాను విడుదల చేసిన ఖైదీలను ఇతర దేశాలు రప్పించుకొనేటట్లు చేయడానికి అమెరికా తీవ్రంగా ప్రయత్నిస్తున్నది. స్లొవేనియా ఒక ఖైదీని తీసుకుంటే తప్ప ఆ దేశాధ్యక్షుడికి తనతో కలిసే అవకాశం ఇవ్వనని బారక్ ఒబామా అన్నాడు. ఖైదీలను తీసుకోవడానికి అంగీకరిస్తే పసిఫిక్ మహాసముద్రంలో ఆస్ట్రేలియా పొరుగునే ఉన్న కిరిబాతికి లక్షల కోట్ల రూపాయల సహాయం చేస్తానని అమెరికా ప్రకటించింది.

'ఎటువంటి ఆంక్షలు లేని స్వేచ్ఛాయుత ప్రసార మాధ్యమాలు మాత్రమే ప్రభుత్వ మోసాలను సమర్థవంతంగా బహిర్గతం చేస్తాయని' పెంటగాన్ పేపర్స్ వివాదంలో చారిత్రాత్మక తీర్పును ఇస్తూ అమెరికా సుప్రీంకోర్టు ప్రకటించింది. నిజాన్ని నిర్భయంగా వెల్లడించే తమ హక్కును ప్రసార మాధ్యమాలు కాపాడుకోవలసిన అవసరాన్ని వికీలీక్స్ చుట్టూ ఆవరిస్తున్న తుపాన్ మరొకసారి వెల్లడిస్తున్నది.

*(రచయిత వికీలీక్స్ ప్రధాన సంపాదకుడు)*

తెలుగు అనువాదం : సి.ఎస్.ఆర్. ప్రసాద్

*టి.ఆర్.ఎస్. అవకాశవాద రాజకీయాలు పాలకవర్గాల స్వభావాన్నే చాటుతున్నాయంటూ, పీడిత ప్రజలు ఒక్కటై ఉద్యమించి తెలంగాణను సాధించుకోవాలని అంటున్నారు* **జంజర్ల రమేష్‌బాబు**

# ప్రజల కోసమే ప్రత్యేక తెలంగాణ

ముసుగులు ఒక్కొక్కటి తొలుగుతున్నాయి. కొత్త ముఖాలు బయట పడుతున్నాయి. తెలంగాణ ఉద్యమం ఆఖరి అంకానికి చేరుకున్న సందర్భం ఇది. నాలుగు దశాబ్దాల సుదీర్ఘ పోరాటం, దాదాపుగా వేయి మంది బలిదానాలతో, మహత్తర డిసెంబర్ 2009 ప్రజా ఉద్యమం కేంద్రం మెడలు వంచగలిగింది. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రకటనను చేయించ గలిగింది. సీమాంధ్ర వలసపాలకుల, పెట్టుబడిదారుల కుట్ర కారణంగా కొంత వెనుకపట్టు పట్టినా, జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ తన నివేదికను సమర్పించే సమయం కోసం తెలంగాణ యావత్తు ప్రజానీకం ఎదురు చూస్తోంది. ఒక వంక సీమాంధ్రులే కాకుండా తెలంగాణలోని దళారీ రాజకీయ నాయకులు సైతం సైంధవపాత్రను పోషిస్తున్నారు. ఇటువంటి తరుణంలో తెలంగాణ సాధనే లక్ష్యంగా పుట్టిన టి.ఆర్.ఎస్. పార్టీగానీ, అవసరమైతే తల తెగ్గోసుకుంటాననే కె.సి.ఆర్. గానీ ఎంత బాధ్యతాయుతంగా వ్యవహరించాలి? 'ఇక్కడ పుట్టిన సెటిలర్ల పిల్లలు సైతం స్థానికులేననీ, వారి ఉద్యోగాల కోసం సైతం తాను ఉద్యమిస్తానన్న' మొన్నటి వ్యాఖ్యలే ఇంకా మరపుకు రాలేదు. ఆ తరువాత పరిశ్రమాధిపతులతో సమావేశం ప్రకంపనలు సద్దుమణగలేదు. నిన్నటికి నిన్న (11 నవంబర్ 2010) ఏ కాంగ్రెస్‌ను తెలంగాణ ప్రజలు ప్రథమ శత్రువుగా భావించి పోరాడుతున్నారో ఆ 'కాంగ్రెస్‌నే పటిష్టపరచడం' తన బాధ్యతగా కె.సి.ఆర్. మాట్లాడడం దేనికి పరాకాష్ట?

ఈ నేపథ్యంలో - తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షకు మూలమేమిటి? ఇన్నాళ్ల పోరాటం దేని కోసం? భవిష్యత్ తెలంగాణ స్వరూపం ఎలా ఉండబోతుంది? స్థానికులెవరు? తెల్లవాడి దోపిడీ పాలన పోయి నల్లవాడి దోపిడీ పాలన వచ్చినట్లుగానే, సీమాంధ్ర దోపిడీ పోయి రేపటి తెలంగాణలో పిడికెడు మంది పెట్టుబడిదారుల, దళారీ పాలక వర్గాలే అధికారానికి వచ్చేటట్లయితే - స్వేచ్ఛా, సమానత్వం, ఆత్మగౌరవంతో కూడిన స్వయం పరిపాలన కోసం పోరాడుతున్న ఉద్యమకారుల కర్తవ్యమేమిటి?

స్థానిక వనరులపై, విద్యా ఉపాధి అవకాశాలపై స్థానికులకే హక్కు ఉండాలనే నినాదం, పోరాటం ఈనాటిదేం కాదు. అది సహజ న్యాయ సూత్రం. నేడు తెలంగాణగా పిలవబడుతున్న నాటి హైదరాబాద్ సంస్థానం 1724లో ఏర్పడినప్పటి నుండీ, అసఫ్ జాహీల పాలనలో 'అఫాకీ'లుగా పిలువబడిన స్థానికేతరులు, విద్య, ఉద్యోగ, పాలనా రంగంలో ఆధిపత్యం చలాయించడంలో, దక్కనీలుగా పిలువబడ్డ స్థానికులలో (ముల్కీ) అసంతృప్తి, ఆగ్రహం రగిలింది. ఉద్యమాలకు పురిగొల్పింది. ఆనాటి నుండి 1919లో నాటి నిజాం 'ముల్కీ' నిబంధనలు జారిచేసేంతవరకూ ప్రజలు పోరాడుతూనే ఉన్నారు.

ప్రపంచవ్యాప్తంగా 1929లో ఏర్పడ్డ ఆర్థిక మాంద్యం, పెట్టుబడిదారీ దేశాల ఆర్థిక వ్యవస్థలను ఒకవైపు ఛిన్నాభిన్నం చేస్తుండగా, 1919లో సోషలిస్టు రష్యా ఆవిర్భావంతో చైతన్యమైన పీడిత ప్రజానీకం మరోవైపు ప్రపంచవ్యాప్తంగా కమ్యూనిస్టు ప్రభుత్వాల స్థాపనకై ఉవ్వెత్తున కదులుతున్నారు. అదే సందర్భంలో 1939-45ల మధ్య తమ ఉత్పత్తులకు మార్కెట్లకై, ప్రపంచ వనరుపై ఆధిపత్యం కోసం జరిగిన రెండవ ప్రపంచ యుద్ధం, రవి అస్తమించని సామ్రాజ్యాన్ని నిర్మించిన బ్రిటిష్ పాలకులకు, వలస పాలనా విధానంపై తమ అవగాహనను పునః సమీక్షించుకోవలసి వచ్చింది. ఫలితంగానే భారత స్వాతంత్ర్యానికి మార్గం సుగమం అయింది.

స్వదేశీ సంస్థానాలపై బ్రిటిషర్లు అవలంబించిన విధానంతో - నిజాం రాజు భారత ప్రభుత్వంతో 29 నవంబర్ 1947న 'యథాతథ స్థితి' కుదుర్చుకున్నాడు. అప్పటికే నిజాం సంస్థాన ప్రజలు జాతీయ పోరాటం, ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీల స్ఫూర్తితో ఉద్యమిస్తున్నారు. 4 జూలై 1946న కడివెండి గ్రామంలో దొడ్డి కొమరయ్య అమరత్వం ప్రజలు సాయుధం కాక తప్పనిస్థితి కల్పించింది. భూమి, భుక్తి, విముక్తి పోరాటంగా జరిగిన తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం పది లక్షల ఎకరాలను స్వాధీనం చేసుకుని, మూడు వేల గ్రామరాజ్య కమిటీల నిర్మాణంగా మారింది. భారతదేశ 'యేనేన్'గా తెలంగాణ మారుతుందేమోనన్న భయంతో నెహ్రూ, పటేల్‌లు 13 సెప్టెంబర్ 1948న కుట్రపూరితంగా 'ఆపరేషన్ పోలో' పేరుతో సైనికదాడికి పూనుకున్నారు. రజాకార్లను సాకుగా చూపి యూనియన్‌లో కలుపుకొన్నారు. 17 సెప్టెంబర్ సాయంత్రం కల్లా నిజాం లొంగిపోతే యూనియన్ సైన్యాలు 21 అక్టోబర్ 1951 వరకు కమ్యూనిస్టులను, ముస్లింలను ఊచకోత కోసాయి. అందుకే సెప్టెంబర్ 17 'విద్రోహ దినంగా' పాటించబడుతోంది.

మద్రాసుతో తెగదెంపులు చేసుకుని ఏర్పడిన 'ఆంధ్రరాష్ట్రం', తెలంగాణను కలుపుకునేందుకు 'పెద్దమనుషుల ఒప్పందం' పేరిట జరిపిన కుట్ర కారణంగానే ఆంధ్రప్రదేశ్ సాధ్యమయింది. హద్దుల్లేని దోపిడీకి రాచబాట దొరికింది. 25 జూలై 1954న గోలకొండ పత్రిక

'కృష్ణా, గుంటూరు, రాయలసీమ ప్రాంతాల నుండి వచ్చినవారు, పేద తెలంగాణ రైతుల భూములను ఆక్రమించుకుంటారు... భవిష్యత్‌లో తామెంత నష్టపోయేది తెలంగాణ వారెప్పటికీ ఊహించలేరని' చేసిన వ్యాఖ్యలు అక్షర సత్యాలుగా నిలుస్తాయి. నీళ్లు, నిధులు, నియామకాలలో జరిగిన అన్యాయాలు, తెలంగాణ మేధావులను, ఉపాధ్యాయులను, విద్యార్థులను 1969లో ప్రత్యేక రాష్ట్రం కోసం ఉద్యమించేలా చేసాయి.

శ్రీకాకుళ సాయుధ పోరాటాన్ని పాశవికంగా అణచివేసిన జలగం వెంగళరావే, మళ్లీ విద్యార్థి ఉద్యమాన్ని, 369 మందిని బలితీసుకున్నాడు. మార్చ్ 1971లో జరిగిన ఎన్నికల్లో, నెత్తుటి త్యాగాలను పదకొండు ఎం.పి. స్థానాలుగా మార్చుకొన్న మర్రి చెన్నారెడ్డి సెప్టెంబర్ కల్లా కాంగ్రెస్‌లో కలిసిపోయాడు. చరిత్రలో తెలంగాణ మరోసారి ద్రోహానికి గురి అయింది.

ప్రత్యేక రాష్ట్రం కోసం తెలంగాణ ప్రజలు ఉద్యమించినపుడల్లా కమిటీలు వెల్లువెత్తి తెలంగాణను ముంచివేసాయి. 1955లో ఫజల్ అలీ కమిషన్, 1956లో పెద్ద మనుషుల ఒప్పందం, 1969లో అఖిల పక్ష ఒప్పందం, ఎనిమిది సూత్రాలు, 1973లో ఆరుసూత్రాలు, 1975 రాష్ట్రపతి ఉత్తర్వులు, 1986లో జి.ఒ. 610, 2004 కామన్ మినిమం ప్రోగ్రాం, రాష్ట్రపతి ప్రసంగం, 2004 ప్రణబ్ కమిటీ, 2005 గిర్‌గ్లానీ కమిటీ, 2008 రోశయ్య కమిటీ... ఇంకా పలు పార్టీల తీర్మానాలు, మ్యానిఫెస్టోలు... అంతే కాకుండా 9 డిసెంబర్ 2009 చిదంబరం ప్రకటన, తదనంతర శ్రీకృష్ణ కమిటీ.

ఒక రాష్ట్రం ఏర్పాటుకు ఇంతటి సుదీర్ఘ తంతు అవసరమా? ఇలా ప్రపంచంలో ఏ ప్రజాస్వామ్య దేశంలోనైనా జరిగిందా? తెలంగాణ ఏమైనా ప్రత్యేక దేశం కావాలంటోందా?

ఎన్.డి.ఎ. ప్రభుత్వం 1996లో మూడు రాష్ట్రాల ఏర్పాటు ద్వారా చిన్న రాష్ట్రాల ప్రజానీకం ఆశలు చిగురించాయి. వరంగల్ డిక్లరేషన్ తరువాత జనసభ, ఐక్య వేదికలు, విద్యార్థి, సాంస్కృతిక సంఘాలు తెలంగాణ ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్లాయి. బెల్లి లలిత హత్య, గద్దర్‌పై కాల్పులు, అసెంబ్లీలో యనమల రూలింగ్‌లు తెలంగాణపై సీమాంధ్ర పాలకుల స్వభావాన్ని బయటపెట్టాయి. రైతుల ఆత్మహత్యలు, అభివృద్ధి పేరిట తెలంగాణలో జరుగుతున్న విధ్వంసం, చంద్రబాబు నాయుడి నరహంతక పాలన, ఇత్యాదివన్నీటితో బొందలగడ్డగా మారుతున్న తెలంగాణను బషీర్‌బాగ్ కాల్పులు భగ్గున మండేలా చేసాయి. ఇటువంటి అత్యంత అనుకూల సమయంలో కె. చంద్రశేఖరరావు ప్రత్యేక రాష్ట్ర నినాదంతో తన రాజకీయ 'తెలంగాణ భవన్'ను నిర్మించుకున్నాడు. ఉద్యమ నిర్మాతగా కాకుండా రాత్రికి రాత్రి నాయకుడయ్యాడు. ఉద్యమమంటే ఎన్నికలు, రాజీనామాలు, లాబీయింగ్‌లనే స్థాయికి దిగజారాడు. తెలుగుదేశంకు వ్యతిరేకంగా కాంగ్రెస్‌తో, కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా తెలుగుదేశంతో జతకడుతూ తెలంగాణ పోరాట చరిత్రను నవ్వుల పాల్జేస్తున్నాడు.

గత నవంబర్ 29న 'తెలంగాణ వచ్చుడో, కె.సి.ఆర్. చచ్చుడో' అంటూ మొదలుపెట్టిన ఆమరణ దీక్ష, ఇరవై నాలుగు గంటలు గడవక ముందే అత్యంత నాటకీయంగా ఆసుపత్రిలో పళ్ల రసాలతో ముగించి ద్రోహం చేయడంతో తెలంగాణ విద్యార్థి లోకం ఆగ్రహావేశాలతో రగిలి పోయింది. ద్రోహాల చరిత్రకు ముగింపు పలకాలని, తమ ముందుతరం విద్యార్థి బాటలో స్వతంత్ర విద్యార్థి ఉద్యమ జె.ఎ.సి.గా రాజీలేని పోరాటం చేసింది. గ్రామ గ్రామాన జె.ఎ.సి. నిర్మాణానికి స్ఫూర్తినిచ్చింది. పరిస్థితులు 'చేతు'లు దాటిపోతున్న దశలో కేంద్రం చేసిన డిసెంబర్ 9 'తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభం' ప్రకటన విద్యార్థి, ప్రజా ఉద్యమ ఫలితమేనన్నది వాస్తవం.

దోపిడీ, అణచివేత, వివక్షలకు వ్యతిరేకంగా వీరోచిత పోరాటాలకు, సమరశీల విద్యార్థి ఉద్యమాలకు కేంద్రమైన తెలంగాణ తనకు వ్యతిరేకంగా భవిష్యత్తులో మరో ఉద్యమానికి తప్పక సిద్ధమవుతుందని కె.సి.ఆర్.కు తెలుసు. అందుకే 'సెటిలర్ల పిల్లలు సైతం స్థానికులే' నన్న వ్యాఖ్యలు. ఇది కచ్చితంగా తెలంగాణలోని నాలుగు కోట్ల మంది ఆత్మగౌరవాన్ని, అమరుల త్యాగాలను సీమాంధ్రులకు తాకట్టు పెట్టడమే. అరవై సంవత్సరాలుగా ఇక్కడి ప్రజలు, విద్యార్థులు – నీళ్లూ, నిధులూ, నియామకాలూ కోల్పోతున్నామనీ, ఏ సీమాంధ్రులకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్నారో, సీమాంధ్రుల పిల్లలు ఇక్కడి స్థానికులుగా మారి గద్దల్లా అవకాశాలన్నీ తన్నుకు పోతుంటే ఈ తెలంగాణ ఉద్యమం ఎందుకోసం? చొరబాటుదార్లు ముల్కీలైతే, ఈ నేలపై పుట్టిన వారేమవుతారు? లగడపాటి, రాయపాటి, అంజిరెడ్డి, జి.వి.కె., ఎమ్మార్, చంద్రబాబు, రామోజీరావు, చిరంజీవి, మోహన్‌బాబుల పిల్లలు ఇక్కడి పరిశ్రమలను, మీడియా, సినీ, రాజకీయ రంగాలను శాసిస్తుంటే, ఈ పోరాటం ఎవరికి వ్యతిరేకంగా? వారి కోసం కె.సి.ఆర్. చేయబోయే ఉద్యమం ఎవరిపై? కచ్చితంగా అది తెలంగాణ ప్రజలపైనే గదా? ఇది కె.సి.ఆర్. అసలు స్వరూప, స్వభావాలను బయటపెట్టడం లేదా? రేపటి తెలంగాణలో తన వర్గ ప్రయోజనాలు దెబ్బతినకుండా – సీమాంధ్ర పెట్టుబడిదారులను, దోపిడీదారులను స్థానికులను చేసుకోవడం ద్వారా – ఆర్థికంగా, సామాజికంగా, రాజకీయంగా బలపడాలనే కుట్ర తప్ప మరొకటి కాదు. ఒకవంక బతకడానికొచ్చిన చిన్న ఉద్యోగులపై, పరీక్ష పేపర్లు దిద్దే వారిపై తన తాబేదార్ల దాడులు చేయిస్తూ, మరోవైపు తెలంగాణను పీల్చి పిప్పి చేస్తున్న సీమాంధ్ర పెట్టుబడిదార్లతో, పారిశ్రామికాధిపతులతో విందులు, వినోదాలతో మజా చేస్తున్న కె.సి.ఆర్. ఎవరి ప్రయోజనాల కోసం నిలబడ్డారో అర్థం కావట్లేదు కదా?

తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న విద్యార్థి జె.ఎ.సి. 10 డిసెంబర్ 2009 'అసెంబ్లీ ముట్టడి' పిలుపుకు ఢిల్లీ పునాదులను కదిలించే శక్తుందని గ్రహించిన కేంద్రం, చాకచక్యంగా 'డిసెంబర్ 9' ప్రకటన చేసింది. తదనంతరం సీమాంధ్ర పాలకుల, పెట్టుబడిదారుల ఒత్తిడికి తలొగ్గి, శ్రీకృష్ణ కమిటీ వేయడం ద్వారా ద్రోహం చేసింది. ఉద్యమ తీవ్రతను తగ్గించే కుట్ర చేసింది. నివేదిక గడువు 31 డిసెంబర్ 2010 సమీపిస్తున్న కొద్దీ ఇరు ప్రాంతాలలో ఉద్రిక్తలు పెరుగుతున్నాయి. తెలంగాణ ప్రజలు మరో మహోద్యమానికి సిద్ధమవుతున్నారు. పార్లమెంట్‌ను దిగ్బంధించైనా రాష్ట్రాన్ని సాధించాలని అనుకుంటున్నారు. ఈ సమయంలో డిసెంబర్ 31 తరువాత భూకంపం సృష్టిస్తానని, మహా యుద్ధమేనని మాట్లాడిన కె.సి.ఆర్., కాంగ్రెస్‌ను బలోపేతం చేయడమే తన ఎజెండా అని, కాంగ్రెస్ టి.ఆర్.ఎస్.ల ఉమ్మడి శత్రువు టి.డి.పి. అనడం దేనికి సంకేతం? 125 ఏళ్ల కాంగ్రెస్

ద్రోహపు చరిత్ర కె.సి.ఆర్.కు తెలిసినా తెలియకపోయినా వేలాది మంది ఉద్యమకారులను బలితీసుకున్న కాంగ్రెస్ అసలు రంగు తెలంగాణ ప్రజలకు తెలుసు. ఉద్యమాలు ఉవ్వెత్తున ఎగిసి పడుతున్నప్పుడు కమిటీలతో చల్లార్చడం, తర్వాత నాయకత్వాన్ని కొనుగోలు చేసి తనలో కలుపుకొని ప్రజలకు 'మొండిచెయ్యి' చూపడం కాంగ్రెస్‌కు కరతాళమలకమే. టి.డి.పి.ని భూస్థాపితం చేస్తానని గతంలో కె.సి.ఆర్. చేసిన వ్యాఖ్యలు, నేటి సందర్భం కలుపుకుంటే టి.ఆర్.ఎస్. కాంగ్రెస్ అనుబంధ సంస్థగా, కె.సి.ఆర్. ఏజెంట్‌గా మారిపోతున్నట్లు స్పష్టంగా కనబడుతోంది. కె.సి.ఆర్. మర్రిచెన్నారెడ్డి బాటలోనే ఉన్నాడు.

తెలంగాణ రాష్ట్ర డిమాండ్ ఒక ప్రజాస్వామిక డిమాండ్. అందుకు సీమాంధ్ర ప్రజలదే కాకుండా భారతదేశ వ్యాప్తంగా ప్రజాస్వామిక వాదులందరి మద్దతు కూడగట్టవలసి ఉంది. అటువంటి కార్యాచరణ చేయకుండా, నోటికి వచ్చినట్లు మాట్లాడడం ద్వారా రెచ్చగొట్టడం, చంచల నిర్ణయాలు చేసి కాంగ్రెస్, టి.డి.పి.లతో పొత్తులు కూడడం ఉద్యమ పార్టీగా చెప్పుకొంటున్న టి.ఆర్.ఎస్.కు గానీ, కె.సి.ఆర్.కు గానీ తగదు. మొదట్లో తెలంగాణ తప్ప తనకు ఏమీ అక్కరలేదన్న కె.సి.ఆర్. కుటుంబ సభ్యులు ప్రధాన పాత్రధారులుగా తెలంగాణ రాజకీయాలలో ఆడిందే ఆటగా వ్యవహరిస్తుండడం చూస్తే, మహారాష్ట్ర రాజకీయాలను భ్రష్టు పట్టించిన థాకరేల కుటుంబం గుర్తుకు రాక మానదు. తెలంగాణ థాకరేలను సహించదు. 'సెటిలర్ల పిల్లలు స్థానికులేననడం, పెట్టుబడి దారులతో సమావేశం, ఫ్యూడల్ లక్షణాలున్న కాంగ్రెస్‌ను బలోపేతం చేయబూనడం' దొరతనపు గడీలను తిరిగి తెరిపించే కుటిల పన్నాగాలే. ఆ ప్రయత్నాలను ప్రజలు ఎలా వమ్ము చేస్తారో తెలుసుకోవడానికి 'చల్‌గల్ గడీ'ని చూస్తే తెలుస్తుంది.

నేడు తెలంగాణ గత అనుభవాల నుండి గుణపాఠాలు నేర్చుకుంది. ఉద్యమం ఆవేశమే కాదు ఆలోచననూ, అవగాహననూ, విశాల మనస్తత్వాన్నీ అలవర్చుకుంది. మాటల వెనుక మర్మాలను పసిగట్టగలుగుతుంది. కాళోజీ అన్నట్లు 'ప్రాంతేతర దోపిడీదారులను, ప్రాంతంలోని దొంగలను' వేరు చేసి చూడగలుగుతుంది. సీమాంధ్ర దోపిడీదారులతో, పాలకవర్గాలతోనే పోరాటం కానీ అక్కడి సామాన్య ప్రజానీకం తమలాగానే పీడించబడున్నట్లు గుర్తించింది. అందుకే అన్నదమ్ముల్లా వేరు పడదామని అంటుంది. తమ ఆధిపత్యం, దోపిడీలకు ఎదురుదెబ్బలు తగులుతున్నప్పుడు పాలకవర్గాలు, పెట్టుబడిదారులు ఏ విధంగా ఒకరినొకరు హత్తుకుంటూ, ముద్దులాడుకుంటున్నారో గమనించమంటోంది. మరి బతుకు పోరాటం చేసే మనమెందుకు కత్తులు దూసుకోవాలో ఆలోచించవలసి ఉంది. గోసిగాళ్లు, గొంగడిగాళ్లు, ఫుట్‌పాత్‌గాళ్లు అందరొక్కటై మంది సొమ్ము తిని తెగబలిసిన వారిని తన్ని తరుముదామని పిలుపునిస్తోంది. నిజమైన ఐక్యత పీడిత ప్రజానీకం మధ్యనుండాలి అంటోంది. తెలంగాణ ప్రజల న్యాయమైన డిమాండ్‌కు మద్దతునియవలసిందిగా – ప్రాంతాలకతీతంగా, దోపిడీ ఆధిపత్యాలకు వ్యతిరేకంగా – మేధావులకు, ప్రజాస్వామిక వాదులకు విజ్ఞప్తి చేస్తోంది.

చివరగా – తెలంగాణ డిమాండ్ ప్రజాస్వామిక డిమాండ్. ఈ ప్రాంత ప్రజలు నాలుగు దశాబ్దాలుగా తమ ఆకాంక్షలను గౌరవించమని ప్రభుత్వాలను, పాలకులను అడుగుతున్నారు. ఎన్నో కష్టాలను, నష్టాలను భరించారు. వేలాది మంది ఉద్యమకారులను లాఠీలకు, తూటాలకు, జైళ్లకు అర్పించారు. పార్లమెంట్‌లో బిల్లు ఆమోదించి ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పాటు చేయమని డిమాండ్ చేస్తున్నారు. ఉస్మానియా కేంద్రంగా ప్రజలు, విద్యార్థులు ఉద్యమిస్తేనే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తలకిందులైతే, 31 డిసెంబర్ 2010 తరువాత ప్రతి ఊరూ ఒక ఉస్మానియాగా ఉద్యమిస్తే ఏం జరుగుతుందో ఆలోచించమని హెచ్చరిస్తున్నారు. ప్రజల ఆకాంక్షలు మన్నించని ప్రభుత్వాలెలా కూలిపోయాయో గత చరిత్రలోని దృష్టాంతాలను గమనించమంటోంది. ప్రపంచంలోనే అతిపెద్ద లిఖిత ప్రజాస్వామ్య రాజ్యాంగాన్ని కలిగిన భారత ప్రభుత్వం ఆ స్ఫూర్తిని ప్రదర్శించవలసిన సందర్భం నేడు ఆసన్నమైంది. లేదంటే 1969 ఉద్యమం విఫలమైన తరువాత పరిణామాలనే చవిచూడవలసి వస్తుంది. పాలకులు తెలంగాణ ప్రజలకు ఏ మార్గం నిర్దేశించబోతున్నారన్నది వేచి చూడవలసిందే.

*(రచయిత తెలంగాణ విద్యార్థి ఉద్యమ నాయకులు)* వీ

**పిట్రోడా కమిటీ సిఫార్సులతో ఏ క్షణంలోనైనా బి.ఎస్.ఎన్.ఎల్.ను ప్రైవేట్ శక్తులకు పూర్తిస్థాయిలో అప్పగించే కుట్రలు జరుగుతున్నాయని అంటున్నారు ఆర్.ఎస్. చౌహాన్**

# వాటాల మార్కెట్టులో బి.ఎస్.ఎన్.ఎల్.

'రోమ్ మహానగరం ఒక్క రోజులో నిర్మాణం కాలేదన్న' తీరులో మన దేశంలోని టెలికాం వ్యవస్థ కూడా ఒక్క రోజులో నిర్మాణం కాలేదు. వంద సంవత్సరాలకు పూర్వం మన దేశంలో టెలికాం వ్యవస్థకు అంకురార్పణ జరిగింది. ముందుగా కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో పోస్టల్, టెలిగ్రాఫ్ డిపార్ట్‌మెంట్‌గా ఆవిర్భవించింది. పరిపాలన క్రమంలో డిపార్ట్‌మెంట్ ఆఫ్ టెలికాం (డి.ఒ.టి.)గా పోస్టల్ విభాగం నుండి విడిపోయి చాలా సంవత్సరాలు పనిచేసింది. అక్టోబర్ 2000 నుండి కార్పొరేషన్‌గా బి.ఎస్.ఎన్.ఎల్. టెలికాం కార్యకలాపాలను నిర్వహిస్తోంది.

ప్రారంభ దశలో టెలికాం సంస్థకు అతి పురాతన టెక్నాలజీ ఎక్విప్‌మెంట్స్, ఓవర్ హెడ్‌లైన్ నెట్‌వర్క్ ఉండేవి. ఉద్యోగులు రాత్రింబగళ్లు అవస్థలు పడి పనులు చేస్తూ వినియోగదార్లకు సేవలందించేవారు. దూర ప్రదేశాలకు ఎస్.టి.డి. లాంటి సౌకర్యాలు ఉండేవి కావు. బిల్డప్ సర్క్యూట్లపైన ఆధారపడి ఉద్యోగులు పనిచేసేవారు. యుద్ధాలు, తుపానులు వంటి విపత్కర పరిస్థితులు దేశంలో తలెత్తిన సందర్భాలలో టెలికం ఉద్యోగులు శ్లాఘనీయమైన సేవలను దేశానికి అందించారు.

కాలగమనంలో టెలికం ఉద్యోగుల ఉత్పత్తి, శ్రమ శక్తి ఫలితంగా ఈ రోజు వినియోగదార్లకు మెరుగైన సేవలనందించే విధంగా ఎస్.టి.డి., ఐ.ఎస్.టి.డి., ఆప్టికల్ ఫైబర్, మైక్రోవేవ్, సెల్‌ఫోన్‌లు తదితర సౌకర్యాలు అందుబాటులోకి వచ్చాయి. ప్రస్తుతం సంస్థకు దేశ వ్యాప్తంగా దాదాపు ఏడు కోట్లకు పైగా టెలికం వినియోగదార్లు ఉన్నారు.

సంస్థలో వేలాది కోట్ల రూపాయలు విలువచేసే స్టాండింగ్ ఎక్విప్‌మెంట్స్, ఆప్టికల్ ఫైబర్ నెట్‌వర్క్, సెల్‌టవర్లతో సహా, పట్టణం, పల్లెల ప్రాంతాల్లో నిర్మించబడిన స్వంత భవనాలు, లక్షల హెక్టార్ల భూములు స్థిర, చరాస్తులుగా ఉన్నాయి. ఇవి కాకుండా దాదాపు డెబ్బై వేల కోట్ల రూపాయల రిజర్వ్ కూడా సంస్థకు అదనంగా ఉంది.

అందుకే ప్రైవేట్‌రంగం పెట్టుబడిదార్ల కన్ను బి.ఎస్.ఎన్.ఎల్. మీద పడింది. వాటాల కొరకు ప్రయత్నాలను ప్రారంభించారు. కేంద్ర ప్రభుత్వంలోని కొందరు వీరి ప్రయత్నాలకు సహకరించారు. సంస్థను ఎదగనీయలేదు. నష్టాలు వచ్చే పరిస్థితులను సృష్టించారు. అక్టోబర్ 2000 నుండి మార్చ్ 2005 వరకు లాభాలతో నడిచిన సంస్థ, ఏప్రిల్ 2005 నుండి మార్చ్ 2009 మధ్య కాలంలో నష్టాలలో పడిపోయింది.

ఇదే పరిస్థితి కొనసాగితే 2009-2010లో సంస్థ ఇంకా నష్టాల్లో కూరుకుపోవచ్చని, కేంద్ర ప్రభుత్వం సంస్థ పునరుద్ధరణకు తగు చర్యలను సూచించవలసిందిగా ప్రధాని సలహాదారు శ్యాం పిట్రోడా సారథ్యంలో ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీ చేసిన సిఫారసులు మార్చ్ 2010లో వెలువడినాయి. కానీ కమిటీ సూచించిన సిఫారసులు ఎప్పటి నుండి అమలు చేసేది చెప్పలేదు.

పిట్రోడా కమిటీ చేసిన సిఫారసులు ఎవరికి లాభదాయకం, లేక అనుకూలం అని ఆలోచన చేసేముందు కింది కొన్ని సిఫారసుల ముఖ్యాంశాలను గమనించాలి :

1. లోకల్ లూప్‌ని ప్రైవేట్ కంపెనీలకు బ్రాడ్ బ్యాండ్ సర్వీసులు అందించేందుకు వీలుగా అద్దెకు ఇవ్వాలి.
2. 30 శాతం సంస్థ వాటాలను అమ్మాలి. సిగ్నల్ టవర్ల వంటి సదుపాయాల అమ్మకం ద్వారానూ, రియల్ ఎస్టేట్ ద్వారానూ సంస్థ నిధులను సమకూర్చుకోవాలి.
3. బి.ఎస్.ఎన్.ఎల్. కు చెందిన ఖాళీ భూముల్ని వాణిజ్య పరంగా వాడుకోవాలి. ఆ పని నిర్వహించడానికి సంస్థలో ఒక రియల్ ఎస్టేట్ విభాగాన్ని ఏర్పరచాలి.
4. ఎక్విప్‌మెంట్ ఎవరి దగ్గర కొంటారో వాళ్లే దాన్ని నిర్మించి, నిర్వహించే మేనేజ్డ్ సర్వీస్ సిస్టం పద్ధతిని సంస్థలో అమలు పర్చాలి.
5. బి.ఎస్.ఎన్.ఎల్. లో కోట్లాది లైన్లతో జి.ఎస్.ఎం. మొబైల్ నెట్‌వర్క్‌ని వేల కోట్ల ఖర్చుతో విస్తరించాలనే ప్రతిపాదనకు స్వస్తి చెప్పాలి. పరికరాల ఆర్డర్లను ఆపి వెయ్యాలి. నెట్‌వర్క్‌ని ఔట్ సోర్సింగ్ చేసుకోవాలి.
6. సంస్థలో పనిచేస్తున్న మూడు లక్షల మంది ఉద్యోగుల్లో ఒక లక్ష మందిని స్వచ్ఛంద పదవీ విరమణ (వి.ఆర్.ఎస్.) లాంటి పథకాలు పెట్టి రిటైర్ చేయించాలి.
7. ముప్ఫై శాతం వాటాల అమ్మకం ద్వారా వచ్చిన డబ్బులో పది శాతం ప్రభుత్వానికి జమ చెయ్యాలి. మిగిలిన ఇరవై శాతం డబ్బును లక్ష మంది ఉద్యోగుల వి.ఆర్.ఎస్.కు ఖర్చు చేయగా మిగిలిన డబ్బును సంస్థ అభివృద్ధికి ఖర్చు పెట్టాలి.
8. ఇవి కాకుండా సంస్థకు నిధుల కోసం ముప్ఫై శాతం డిజిన్వెస్ట్‌మెంట్‌ను అమలు చేయాలి.

పై సిఫారసులను పరిశీలించగా, సిఫారసులు నెం. 1,2,3,4,5 కేవలం ప్రైవేట్ పెట్టుబడిదార్ల పక్షంలో, వారికి అనుకూలంగా, లాభాల పంట పండించే విధంగా ఉన్నాయి. సిఫారసులు 6,7 లక్ష మంది ఉద్యోగుల భవిష్యత్తును ప్రశ్నించేవిగా ఉన్నాయి. సిఫారసు 8 వాస్తవానికి సంస్థకు దాదాపు డెబ్బై వేల కోట్ల రూపాయల రిజర్వు అదనంగా ఉన్న పరిస్థితులలో నిధుల కోసం ముప్ఫై శాతం డిజిన్వెస్ట్‌మెంట్ చేయవలసిన అవసరం కనబడడం లేదు.

ఈ నేపథ్యంలో 'అందరం కలిసి చేసిన ఈ అందమైన వస్తు సముదాయం అంతా ఎక్కడో, ఒక్కడే వచ్చి ఎత్తుకు పోతూ ఉంటే చూసి అన్యాయం అని మేమంటే అనుభవించాలి మీ కర్మ' అని అంటూ, 'ఎద్దులా పనిచేసే మమ్మల్ని మొద్దుల్నీ, మొరటుల్నీ చేసి ముద్దకి కూడా దూరం చేస్తారు' అని వర్గ దృక్పథంతో మహాకవి శ్రీశ్రీ రాసిన కవిత గుర్తుకొస్తున్నది.

**వాస్తవాలు**

ఎ. కేంద్ర ప్రభుత్వం సంస్థలో తలెత్తిన నష్టాల పునరుద్ధరణకు తగు చర్యలను సూచించాలని పిట్రోడా కమిటీని నియమించిందే కానీ, నష్టాలకు కారణాలేమిటి, బాధ్యులెవరని కోరలేదు.

బి. పిట్రోడా కమిటీకి 'కాగ్' లా రాజ్యాంగ గుర్తింపు లేదు. 'కాగ్' లాంటి రాజ్యాంగ విభాగంతో సంస్థలో తలెత్తిన నష్టాలకు కారణాలేమిటి, బాధ్యులెవరని కేంద్ర ప్రభుత్వం పరిశీలన చేయించి ఉంటే, నిజా నిజాలు నిగ్గుతేలేవి.

సి. బి.ఎస్.ఎన్.ఎల్.లో విలీనమైన డి.ఒ.టి. ఉద్యోగులకు ఇతర కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులతో సమానంగా సెంట్రల్ సివిల్ కాండక్ట్ సర్వీస్, అడ్మినిస్ట్రేషన్ రూల్స్ వర్తిస్తాయి.

ఈ రూల్స్ ప్రకారం :

1) ఉద్యోగులు అరవై సంవత్సరాల వయసు వచ్చే వరకు ఉద్యోగంలో కొనసాగుతారు. తరువాతనే పదవీ విరమణ పొందుతారు.

2) ఉద్యోగులు కేవలం రెండు సందర్భాలలో మాత్రమే స్వచ్ఛంద పదవీ విరమణ (వి.ఆర్.ఎస్.) పొందగలరు. ఉద్యోగులు తమంతట తామే వి.ఆర్.ఎస్. కావాలని కోరినప్పుడు, రెండవది ఉద్యోగులలో ఎవరిపైనన్న మోపబడిన నేరం రుజువైన సందర్భంలో నేరం తీవ్రతను బట్టి వి.ఆర్.ఎస్.ను శిక్షగా అమలు చేయవచ్చు.

3) అందువలన వి.ఆర్.ఎస్. లాంటి పథకాలతో లక్షమంది ఉద్యోగులను రిటైర్ చేయడం సరికాదు.

డి. పిట్రోడా కమిటీ సంస్థలోని ఉద్యోగుల సేవాతత్పరత, సంక్షేమం, ఉద్యోగ భద్రతలను పరిగణలోకి తీసుకోలేదు.

ఇ. పిట్రోడా కమిటీలో ఉద్యోగ సంఘాలకు (యూనియన్‌లకు) భాగస్వామ్యం కల్పించలేదు.

ఎఫ్. సంస్థలోని వాటాదార్లు సంస్థకు చెందిన స్థిర, చరాస్తులకు సంరక్షకులు (కస్టోడియన్స్) మాత్రమే. స్వంతదార్లు (ఓనర్సు) కాదు. స్థిర, చరాస్తులను రియల్ ఎస్టేట్ ద్వారా అమ్మకాలు చేయడం సరికాదు.

జి. అక్టోబర్ 2000 నుండి ఈ రోజు వరకు ఉద్యోగులందరూ సమర్థవంతమైన విధులను నిర్వహిస్తున్నారు. మొదటి ఐదు సంవత్సరాల కాలంలో లాభాలలో నడచిన సంస్థ, రెండవ ఐదు సంవత్సరాలలో నష్టాలలో నడవడానికి ఉద్యోగులు ఏ మాత్రం బాధ్యులు కారు.

ఎచ్. శ్యాం పిట్రోడా కమిటీ చేసిన సిఫారసులు, బి.ఎస్.ఎన్.ఎల్. ఉద్యోగులకు ఉద్యమించవలసిన పరిస్థితులను కల్పించాయి.

2010లో ఉద్యోగులు మార్చి 26న ఆఫీసుల ముందు ధర్నా నిర్వహించారు. ఏప్రిల్ 20న ఎగ్జిక్యూటివ్‌తో సహా మూడు లక్షల మంది నిరవధిక సమ్మె చేపట్టారు. వెంటనే ప్రభుత్వం చర్చలకు దిగి వచ్చింది. పిట్రోడా కమిటీ సిఫారసులు అమలు చేసే ముందు యూనియన్లని విశ్వాసంలోకి తీసుకుంటామని ఆనాటి కేంద్రమంత్రి హామీ ఇవ్వడం జరిగింది. దాంతో సమ్మె ముగిసింది.

అయితే పిట్రోడా కమిటీ సిఫారసులు అమలు అగినట్లేనా అంటే పరిస్థితులు ఆ విధంగా లేవు. ప్రైవేట్ పెట్టుబడిదార్ల ఆకాంక్ష రోజు రోజుకీ బలపడుతోంది. ఏ రోజైనా పిట్రోడా కమిటీ సిఫారసులను ఉన్నపళంగా అమలు చేసే పరిస్థితి నెలకొని ఉంది.

బి.ఎస్.ఎన్.ఎల్. లోని మూడు లక్షల మంది ఉద్యోగులందరూ ఐకమత్యంగా పోరాడవలసి ఉంది. బి.ఎస్.ఎన్.ఎల్. సంస్థ స్థిర, చరాస్తులు వాటాల మార్కెట్‌లో ప్రైవేట్ పెట్టుబడిదార్ల హస్తగతం కాకుండా పరిరక్షించుకోవలసి ఉంది. లక్ష మంది ఉద్యోగులపై వి.ఆర్.ఎస్. వేటు పడకుండా కాపాడుకోవలసి ఉంది. బి.ఎస్.ఎన్.ఎల్. ఉద్యోగులందరికీ న్యాయం జరగాలని ఆశిద్దాం.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకులు)* వీ

తెలుగు నేల రాజకీయార్థిక, సామాజిక మూలాలతో పాటు నడిచి వచ్చిన చరిత్రనూ, అభివృద్ధి వెలుగు నీడలనూ, ప్రజల ఆకాంక్షలనూ వివరిస్తున్నారు **ఎన్. వేణుగోపాల్**

# వనరులు, ప్రజలు, సమస్యలు, పోరాటాలు

**ఉపోద్ఘాతం**

ఒక సమాజాన్ని అర్థం చేసుకోవడానికి, అధ్యయనం చేయడానికి, మార్చడానికి, మార్పుకు దోహదం చేయడానికి ఆ సమాజానికి సంబంధించిన నాలుగు ప్రధానాంశాలను వివరంగా తెలుసుకోవడం అవసరం. అవి ఒకటి, ఆ సమాజానికి అందుబాటులో ఉన్న వనరులు; రెండు, ఆ సమాజంలోని ప్రజలు; మూడు, ఆ ప్రజలు నిత్యజీవితంలో ఎదుర్కొంటున్న సమస్యలు; నాలుగు, ఆ సమస్యలను పరిష్కరించుకోవడానికి వాళ్లు చేస్తున్న ప్రయత్నాలు, పోరాటాలు. ఒక సమాజాన్ని నిర్వచించే, నడిపించే, మార్చే, అభివృద్ధిచేసే, ధ్వంసం చేసే అంశాలన్నిటినీ కూడ ఈ నాలుగు ప్రధాన విభాగాల కిందనే అధ్యయనం చేయవచ్చు. వీటిలో ఏ ఒక్కదాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకోకపోయినా, ఏ ఒక్కదాని గురించి పొరపాటు నిర్ధారణలకు వచ్చినా ఆమేరకు ఆ సమాజం గురించిన మౌలిక అవగాహన అసమగ్రమవుతుంది. ఆ మేరకు ఆ సమాజంతో వ్యవహరించడంలో లోపాలు తలెత్తుతాయి.

మళ్లీ ఈ నాలుగు అంశాలలో కూడ వనరులు, ప్రజలు అనే రెండు అంశాలు ప్రాథమికమైనవి. వనరులు లేకుండా ప్రజలు మనుగడ సాగించలేరు. వనరులలో భూమి, అడవి, నీరు, ఖనిజాలు వంటివి ప్రకృతి సహజమైనవి. అవి మనుషుల మనుగడకు ముందునుంచీ ఉన్నవి. అవి ఏర్పడిన కొన్ని కోట్ల ఏళ్ల తర్వాత పరిణామ క్రమంలో మనుషులు వచ్చారు. అలా రూపొందిన మానవ సమాజం ప్రకృతి వనరులతో ఎలా వ్యవహరించాలో వేల సంవత్సరాల ప్రయాణంలో తెలుసుకుంటూ, నేర్చుకుంటూ, ప్రయోగాలు చేస్తూ ముందుకు సాగుతోంది. మొత్తం మీద వనరుల వినియోగం మీదనే మనుషుల మనుగడ ఆధారపడి ఉంది. వనరుల వినియోగంతోనే మనుషులు తమ జీవితాలను మార్చుకుంటారు, సుఖవంతం చేసుకుంటారు, అభివృద్ధి చెందుతారు. ఆ వనరులకు విభిన్న ఉపయోగాలను కనిపెట్టి ఏ ప్రయోజనానికి ఉపయోగించడం ఎక్కువ సార్థకమో తేల్చుకుంటారు. ఏ వనరును ఎప్పుడు ఎలా ఎంత ఉపయోగించాలో తేల్చుకుంటారు. వేల సంవత్సరాలుగా ఉనికిలో ఉన్న ప్రకృతి వనరులకు కొత్త ఉపయోగాలు కూడ ఈ అన్వేషణా క్రమంలోనే వెలికివస్తుంటాయి. కొన్ని వనరులకు పునరుత్పత్తి అయ్యే స్వభావమూ, కొన్ని వనరులకు వినియోగంతోపాటు రద్దయిపోయే స్వభావమూ ఉంటాయి. అందువల్ల వనరుల కొరత ఉన్న సమాజంలోనైనా, వనరులు పుష్కలంగా ఉన్న సమాజంలోనైనా ప్రతి వనరుకూ ప్రత్యామ్నాయ ఉపయోగాలు ఏమిటో, వాటిలో ఏది ఎక్కువ ప్రయోజనకరమో తేల్చుకోవలసి ఉంటుంది. ఈ ప్రత్యామ్నాయాల అన్వేషణనే సాధారణంగా సాంకేతిక పరిజ్ఞానంగా పరిగణిస్తుంటాం.

అయితే మనిషికీ ప్రకృతికీ మధ్య ఉన్న ఈ సంబంధం, వైరుధ్యం సమన్వయపూరితంగా పరిష్కారం కాకముందే మనుషుల మధ్య విభజన జరిగింది. ప్రకృతి వనరులను ఉపయోగించి మనుషులు సాగించిన ఉత్పత్తిలో మిగులు ఎవరి అధీనంలో ఉండాలనే విషయంలో మనుషుల్లో వైరుధ్యం తలెత్తింది. మనిషికీ ప్రకృతికీ వైరుధ్యం అలా ఉండగానే, మనిషికీ మనిషికీ మధ్య వైరుధ్యం ప్రధానం అయింది. మానవజీవితానికి అవసరమైన ఉత్పత్తి సాధనాల యాజమాన్యం ప్రాతిపదికగా ఈ వైరుధ్యాన్ని గుర్తించడం జరుగుతుంది. మరొకమాటల్లో చెప్పాలంటే దీన్ని వనరుల మీద యాజమాన్యంగా కూడ చూడవచ్చు. ఏ సమాజంలోనైనా మౌలికమైన ఆ వైరుధ్యాన్ని స్థూలంగా వర్గ వైరుధ్యం అంటారు. అది వేరు వేరు సమాజాలలో, వేరు వేరు కాలాలలో ఇతర వైరుధ్యాలుగా కూడ వ్యక్తీకరణ పొందవచ్చు. ప్రజల గురించి అర్థం చేసుకోవాలంటే వర్గ వైరుధ్యం పరిణమించిన చరిత్రనూ, అది పొందిన వేరువేరు రూపాలనూ తెలుసుకోవలసి ఉంటుంది. మొత్తం మీద వర్గ వైరుధ్య క్రమంలో, వనరుల వినియోగాన్నీ, వనరులపై యాజమాన్యాన్నీ, వనరుల వినియోగ నిర్ణయాధికారాన్నీ ఒక చిన్న వర్గం తన గుప్పెట్లో పెట్టుకుని బలప్రయోగం ద్వారా కొనసాగించుకుంటోంది. ఆ వర్గ వైరుధ్యం వల్ల ప్రకృతి వనరుల వినియోగమూ, సాంకేతిక పరిజ్ఞానమూ, అసలు మొత్తం సామాజిక జీవనమే ప్రత్యక్ష, పరోక్ష సమస్యల నిలయమైపోయింది.

అందువల్ల సమాజంలో వనరులు, ప్రజలు అనే అంశాలతో పాటే తప్పనిసరిగా అధ్యయనం చేయవలసిన అంశంగా ప్రజాసమస్యలు వచ్చి చేరుతాయి. ఆ సమస్యలు వేరువేరు ప్రజా సమూహాలకు, వేరువేరు సమయాల్లో వేరువేరుగా ఉండవచ్చు. ఆ సమస్యల తీవ్రత వేరువేరుగా ఉండవచ్చు. ఆయా ప్రజాసమూహాలు తమ సమస్యల పరిష్కారాన్ని అన్వేషించే క్రమంలో వేరువేరు పద్ధతులు అనుసరించవచ్చు. వేరు వేరు ప్రయత్నాలు చేయవచ్చు. వాటి రూపాలు ఏమయినప్పటికీ, వాటిలో ప్రజల భాగస్వామ్యం, వాటి విస్తృతి ఏమయినప్పటికీ, వాటి లక్ష్యాలు ఏమయినప్పటికీ స్థూలంగా ఆ పరిష్కార ప్రయత్నాలన్నిటినీ ప్రజా పోరాటాలు అనవచ్చు. అందువల్ల సమాజ అధ్యయనంలో మరొక తప్పనిసరి అంశంగా ప్రజా పోరాటాలు వచ్చి చేరుతాయి.

కనుక ఒక సమాజం గురించి సమగ్రంగా అర్థం చేసుకోవాలని ప్రయత్నించేవారెవరయినా ఆ సమాజానికి ఉన్న వనరులు, ఆ సమాజంలో ఉన్న ప్రజలు, ఆ ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు, ఆ సమస్యలు పరిష్కరించుకోవడానికి వారు చేస్తున్న ప్రయత్నాలు, సాగిస్తున్న పోరాటాలు అనే నాలుగు అంశాలను తప్పనిసరిగా అధ్యయనం చేయవలసి ఉంటుంది.

ఈ నేపథ్యంలో ఆంధ్రప్రదేశ్ అనే పాలనాపరమైన ప్రాంతంలోని సమాజం గురించి అధ్యయనం చేద్దాం.

### ఆంధ్రప్రదేశ్ చారిత్రక నేపథ్యం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని వనరుల గురించీ, ప్రజల గురించీ, ప్రజల సమస్యల గురించీ, ప్రజాపోరాటాల గురించీ మాట్లాడుకునేటప్పుడు ఈ రాష్ట్రం ఏర్పడిన పూర్వరంగాన్ని గమనంలో ఉంచుకోవడం అవసరం. ఆంధ్రప్రదేశ్ అనే పేరుతో 1956 నవంబర్ 1న మనుగడలోకి వచ్చిన రాష్ట్రం అంతకు రెండు శతాబ్దాలకు పైగా వేరువేరు వనరులతో, వేరువేరు ఉత్పత్తి విధానాల కింద, విభిన్న పాలనల కింద, భిన్నమైన సంస్కృతులతో కొనసాగుతూ వచ్చిన ప్రాంతాల కలయిక. అటు బ్రిటిష్ పాలనలోని మద్రాసు రాష్ట్రంలోని తెలుగు జిల్లాలను విడదీసి 1953 అక్టోబర్ 1న ఆంధ్ర రాష్ట్రంగా ఏర్పాటు చేయడం జరిగింది. అంతకు ముందే మద్రాసు రాష్ట్రంలోని తెలుగు జిల్లాలలోనే ఇటు రైత్వారీ విధానమూ, అటు విజయనగరం, బొబ్బిలి, మందసా, పిఠాపురం, చల్లపల్లి, వెంకటగిరి వంటి చోట్ల జమీందారీ విధానమూ కూడ కొనసాగుతూ ఉండింది. 1948 మద్రాస్ జమీందారీ, ఎస్టేట్స్ (రద్దు) చట్టం ద్వారా జమీందారీలు, ఎస్టేట్లు రద్దయిపోయాయి. ఇటు హైదరాబాదు సంస్థానంలో జాగీర్దారీ విధానమూ, రైత్వారీ విధానమూ కూడ కొనసాగుతుండేవి. హైదరాబాదు మీద భారత ప్రభుత్వం 'పోలీసుచర్య' జరిపి విలీనం చేసుకున్న తర్వాత, 1949లో ప్రవేశపెట్టిన హైదరాబాద్ జాగీర్ రద్దు నిబంధనలు, 1950లో ప్రవేశపెట్టిన కౌల్దారీ రక్షణ చట్టం హైదరాబాదు రాష్ట్రంలో కూడ మొత్తంగా రైత్వారీ విధానం మొదలయింది. ఆ తర్వాత హైదరాబాదు రాష్ట్రాన్ని మూడు భాషా ప్రాంతాల కింద విడదీసి, తెలుగు మాట్లాడే తెలంగాణ జిల్లాలను ఆంధ్ర రాష్ట్రంతో కలిపి ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు చేశారు. ప్రధానమైన జీవన వనరు అయిన భూమితో ప్రజల సంబంధం చరిత్ర ఇది. కాగా, బ్రిటిష్ ఇండియాలోని మద్రాసు రాష్ట్రంలో 1850లలోనే కృష్ణా, గోదావరి నదుల మీద ఆనకట్టల వల్ల ఆధునిక నీటి పారుదల సౌకర్యాలు ఏర్పడ్డాయి. ఆధునిక వ్యవసాయ పద్ధతులు, వాణిజ్య పంటలు మొదలయ్యాయి. వ్యవసాయాదాయంలో మిగులు ఇతర రంగాలలోకి ప్రవేశించడం మొదలై పారిశ్రామిక, సేవా రంగాల విస్తరణ, పట్టణీకరణ మొదలయ్యాయి. హైదరాబాదు రాజ్యంలో 1920లలో మొదటి ఆధునిక నీటి పారుదల పథకంగా మంజీరా నది మీద నిజాం సాగర్ ఏర్పడింది గాని అత్యధిక భాగం వర్షాధార వ్యవసాయం కిందనే ఉండిపోయింది. ఎంతో కొంత వ్యవసాయ మిగులు ఉన్నప్పటికీ అసమ భూసంబంధాల వల్ల ఆ మిగులు భూస్వాములకు, జాగీర్దార్లకు, రాజకుటుంబానికి మాత్రమే దక్కింది. పారిశ్రామిక, సేవా రంగాలు కొంత అభివృద్ధి చెందినప్పటికీ అవి రాజ వంశీకులకు, ఆశ్రితులకు మాత్రమే చెంది ఉండేవి.

అంటే 1956 నాటికి ఈ సమాజంలోని వనరులలో ప్రధానమైన భూమి భిన్నమైన వ్యవస్థలలో ఉంది. నీటిని వినియోగించుకునే పద్ధతులు భిన్నంగా ఉన్నాయి. ఖనిజాల వినియోగం, పారిశ్రామికీకరణ, సేవారంగ అభివృద్ధి, పట్టణీకరణ వేరువేరు స్థాయిలలో, భిన్నమైన ఏర్పాట్లతో ఉన్నాయి. పాలనలు భిన్నంగా ఉన్నాయి. ప్రజా సమూహాల జీవన స్థితిగతులూ, అవకాశాలూ, ఆకాంక్షలూ భిన్నంగా ఉన్నాయి. ప్రజల సమస్యలు ఒకచోట వలస పాలన, వలసానంతర స్థితి వల్ల తలెత్తినవి కాగా, మరొకచోట నిరంకుశ రాచరికం, రాచరిక అనంతర స్థితి వల్ల ఏర్పడినవి. ప్రజా పోరాటాలు ఒకచోట వలస వ్యతిరేక జాతీయ పోరాటం గానూ, జమీందారీ వ్యతిరేక పోరాటాలుగానూ ఉండగా, మరొకచోట రాచరిక వ్యతిరేక ప్రజాస్వామిక ఆకాంక్ష గానూ, భూమి-భుక్తి-విముక్తి పోరాటంగానూ ఉన్నాయి.

యాభై సంవత్సరాలు గడిచిన తర్వాత ఆంధ్రప్రదేశ్ సమాజాన్ని చూస్తే, ఈ చారిత్రక పూర్వరంగం విధించిన పరిమితులూ, కల్పించిన అవకాశాలూ అన్నీ కూడ ఏదో ఒక స్థాయిలో వనరుల మీద, ప్రజల మీద, ప్రజల సమస్యల మీద, ప్రజా పోరాటాల మీద ప్రభావం చూపడం కనిపిస్తుంది.

### ఆంధ్రప్రదేశ్ - ఇవాళ్టి స్థితి

ఆరు కోట్ల ఎనభై లక్షల ఎకరాల భూమి, అందులో రెండుకోట్ల ఎనభై లక్షల ఎకరాల వ్యవసాయం సాగుతున్న భూమి, ఒక కోటీ యాభై లక్షల ఎకరాల అడవులు, సాలీనా మూడువేల శతకోటి ఘనపుటడుగులకన్న ఎక్కువగా నీరు ప్రవహించే నదులూ, ఉప నదులూ, వాగులూ, సాలీనా పోగయ్యే మరొక వెయ్యి శతకోటి ఘనపుటడుగుల భూగర్భ జలాలు, వెయ్యి కిలోమీటర్ల సముద్రతీరం, లక్షల టన్నుల, అన్ని రకాల ఖనిజాలు ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ఉన్న వనరులలో ముఖ్యమైనవి. ఈ వనరుల మీద ఆధారపడి రాష్ట్రంలో వ్యవసాయం, పరిశ్రమలు, సేవారంగం అభివృద్ధి చెందాయి, సాగుతున్నాయి. వ్యవసాయ, పారిశ్రామిక, సేవా రంగాలకు అవసరమైన నీటి పారుదల సౌకర్యాలు, విద్యుదుత్పత్తి, రహదారుల నిర్మాణం, గృహవసతి కల్పన, ఉపాధి కల్పన అంతా కూడ ఈ వనరుల ఆధారంగానే జరుగుతున్నాయి. ఈ వనరులతో వచ్చిన ఆదాయంతోనే రాష్ట్రంలో పాలన సాగుతున్నది. రాష్ట్ర ప్రజలకు అవసరమైన విద్యా, వైద్య, ఆరోగ్య, రవాణా, వినోద, విజ్ఞాన సేవలు ఎలా అందాలనేది ఆ పాలనా విధానాల వల్లనే నిర్ణయమవుతున్నది.

నిజానికి ఈ వనరులను సక్రమంగా, హేతుబద్ధంగా, సామాజిక అవసరాల కోసమే వినియోగిస్తే, రాష్ట్రంలో ప్రస్తుతం ఉన్న జనాభా (2001 జనగణన ప్రకారం ఏడు కోట్ల అరవై లక్షలు, 2011 జనగణన జరగవలసి ఉండగా, 2010 అంచనాల ప్రకారం ఈ జనాభా ఎనిమిది కోట్ల నలభై లక్షలు) అంతా కూడ ఇప్పుడు ఉన్న స్థితి కన్న మెరుగైన జీవితం గడపవచ్చు. కాని కొనసాగుతున్న రాజకీయార్థిక, సామాజిక వ్యవస్థ ఈ వనరుల మీద సమాజం మొత్తానికీ సమాన అధికారాన్ని ఇవ్వడం లేదు. వనరుల పంపిణీ సక్రమంగా లేదు. ఆ వనరులను హేతుబద్ధంగా, సామాజిక శ్రేయోదాయకంగా వినియోగించడం లేదు. ఈ వనరులలో అత్యధిక భాగం సమాజంలోని కొద్దిమంది గుప్పెట్లో

ఉన్నాయి. ఆ వనరులను ఎలా వినియోగించాలో నిర్ణయించే అధికారం కూడ ఆ కొద్దిమంది చేతుల్లోనే ఉంది. వనరుల యాజమాన్యంలోని అసమానత వల్ల, వనరుల వినియోగ నిర్ణయాధికారంలోని అప్రజాస్వామికత వల్ల సమాజంలో అంతరాలు మరింతగా పెరుగుతున్నాయి. చారిత్రకంగా ఉన్న అంతరాలు, సామాజిక అంతరాలు, పాలనావిధానాల వల్ల తలెత్తిన సమస్యలు, వనరుల వినియోగంలో అసమానత వల్ల తలెత్తిన సమస్యలు, కొత్తగా పెరుగుతున్న అంతరాలు కలగలసి ఆంధ్రప్రదేశ్ ప్రజలు అన్ని రంగాలలోనూ అసంఖ్యాక సమస్యలు ఎదుర్కొంటున్నారు.

ఆంధ్రప్రదేశ్ ప్రజలు అన్నప్పుడు వారిలో ఉత్తరాంధ్ర, గోదావరి లోయ, నల్లమల అడవులలో నివసిస్తున్న ఆదివాసుల నుంచి రాష్ట్రమంతా వ్యాపించిన దళితుల దాకా, బంగాళాఖాతం సముద్రతీరం పొడవునా ఉన్న మత్స్యకారుల నుంచి రాష్ట్రవ్యాప్తంగా వివిధ జీవనవృత్తులలో ఉన్న వెనుకబడిన కులాల దాకా అనేక సామాజిక వర్గాల ప్రజలు ఉన్నారు. మహిళలు, పురుషులు, పిల్లలు, హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు, ఇతర మతాలను పాటించేవారు, కార్మికులు, రైతుకూలీలు, భూమిలేని నిరుపేదలు, చిరుద్యోగులు, ఏ పూటకు ఆ పూట తిండి కోసం వెతుక్కునే అభాగ్యులు, మధ్యతరగతి వంటి ఇతర విభజనల కింద కూడ ఈ ప్రజాసమూహాలను చూడవచ్చు. ఈ అన్ని సమూహాలకూ సమానంగా ఉన్న రాష్ట్రవ్యాపిత సమస్యలూ ఉన్నాయి. ఆయా సమూహాలకో, బృందాలకో, ప్రాంతాలకో ప్రత్యేకమైన సమస్యలూ ఉన్నాయి. వీటిలో దీర్ఘకాలికమైన, లోతైన పరిష్కారం కోరుతున్న సమస్యలూ ఉన్నాయి. తాత్కాలికమైన, అప్పటికప్పుడు ఉపశమనం కోరుతున్న సమస్యలూ ఉన్నాయి.

ఈ అంశాలను మరికొంచెం వివరంగా పరిశీలిద్దాం.

## ఆంధ్రప్రదేశ్ వనరులు – భూమి

ఆంధ్రప్రదేశ్ మొత్తం విస్తీర్ణం 2,75,04,500 హెక్టార్లు (6,79,65,000 ఎకరాలు) కాగా అడవులు 62,10,369 హెక్టార్లు (1,53,46,156 ఎకరాలు), సాగుయోగ్యం కాని భూమి 20,55,568 హెక్టార్లు (50,79,419 ఎకరాలు), వ్యవసాయేతర వినియోగంలో ఉన్న భూమి 26,51,817 హెక్టార్లు (65,52,782 ఎకరాలు), సాగుకు యోగ్యమైన బంజరు, పచ్చిక బయళ్లు, తోటలు, బీడు భూములు వగైరాలన్నీ కలిసి 56,28,474 హెక్టార్లు (1,39,08,262 ఎకరాలు), ఇవన్నీ పోగా నికర సాగుభూమిగా ప్రభుత్వం ప్రకటిస్తున్న భూమి 1,09,58,272 (2,70,78,479 ఎకరాలు). ఒకసారి కన్న ఎక్కువ పంటలు తీసే డెబ్బై లక్షల ఎకరాలను కూడ కలుపుకుంటే మొత్తం సాగుభూమిగా ప్రభుత్వం గుర్తిస్తున్నది మూడున్నరకోట్ల ఎకరాలు.

ఈ గణాంకాలను విప్పి చూసి కొంచెం వివరంగా అర్థం చేసుకుంటే గుర్తించవలసిన అంశాలు కొన్ని ఉన్నాయి. మొత్తం రాష్ట్ర విస్తీర్ణం ఆరుకోట్ల ఎనభై లక్షల ఎకరాలు కాగా అందులో కేవలం రెండు కోట్ల డెబ్బైలక్షల ఎకరాలలో (39 శాతం) మాత్రమే వ్యవసాయం సాగుతున్నది. సాగుకు యోగ్యమై కూడ సాగులోకి రాకుండా ఉండి పోయిన భూమి కనీసం మరొక యాభై లక్షల ఎకరాలు ఉంటుంది. ప్రతి సంవత్సరంలోనూ బీడుగా నమోదవుతున్న భూమి ముప్పై లక్షల ఎకరాల దాకా ఉంటున్నది.

ఆశ్చర్యకరంగా నికర సాగుభూమి విస్తీర్ణం 1956–57లో ఎంత ఉందో (2,81,06,325 ఎకరాలు) 2008–09లో దాదాపు అంతే, కాస్త తక్కువ కూడ ఉంది. ఈ సాగులోకి వచ్చిన భూమి కూడ ఎవరి చేతుల్లో ఎంత ఉన్నదనే విషయం తర్వాత చర్చిద్దాం గాని, అసలు సామాజిక అవసరాలు పెరుగుతుండగా, నికర సాగుభూమిగాని, మొత్తం సాగుభూమిగాని పెరగకపోవడం ఎందుకు జరిగిందో చూడవలసి ఉంది. నిజంగా సాగుకు యోగ్యమైన భూమి అందుబాటులో లేకపోతే, ఉన్న భూమి నుంచే మరింత ఫలసాయం తీసి సమాజపు ఆహార అవసరాలను తీర్చడం జరగవచ్చు. కాని ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణంలో అదనంగా వ్యవసాయం కిందికి తేదగిన భూమి కనీసం యాభై లక్షల ఎకరాలు ఉంటుంది. దాన్ని వ్యవసాయ యోగ్యం చేయడానికి, అంటే నీటిపారుదల సౌకర్యాలు కల్పించడానికి, ఆ భూములలో సాగుచేయగల ప్రత్యేక పంటలను అభివృద్ధి చేయడానికి ఎటువంటి ప్రయత్నమూ జరగలేదు.

ఒకవేళ కొత్తగా భూమి అందుబాటులోకి రాని పరిస్థితి ఉంటే, ఉన్న భూమికే రక్షిత నీటిపారుదల సౌకర్యాలు కల్పించి, రెండవ, మూడవ పంటలకు అవకాశం ఇచ్చి, ఇతోధిక సాగు ద్వారా మొత్తం సాగుభూమి పెంచే ప్రయత్నాలు చేయవచ్చు. (ఒక ఎకరంలో ఒక పంట మాత్రమే పండుతుంటే అది ఒక ఎకరం సాగుభూమిగా, రెండు పంటలు పండుతుంటే అదే భూమి రెండు ఎకరాలుగా, మూడు పంటలు పండుతుంటే మూడు ఎకరాలుగా గణాంకాలకు ఎక్కుతుంది). ఇప్పటికీ కేవలం ముప్పై లక్షల ఎకరాలలో మాత్రమే ఒకటి కన్న ఎక్కువ పంటలు పండుతున్నాయి.

ఇలా భూమి పెరగకపోవడం ఒక ఎత్తయితే, సాగుతున్న వ్యవసాయంలో కూడ పంటల నిష్పత్తి మారడం మరొక ఎత్తు. ఒకప్పుడు ఆహారధాన్యాలకే అత్యధిక ప్రాధాన్యత ఇచ్చిన రాష్ట్ర వ్యవసాయ రంగంలో మార్కెట్ కు అవసరమైన పంటల వ్యవసాయం పెరుగుతూ వచ్చింది. ఆ మేరకు ఆహార భద్రతలో కొరత ఏర్పడుతూ వచ్చింది. గణాంకాలలో చెప్పాలంటే 1956–57లో సాగుభూమిలోని 76.4 శాతంలో ఆహారపంటలు పండించగా, 2008–09 నాటికి అది 65.9 శాతానికి పడిపోయింది. దీన్ని మరికొంచెం వివరంగా చూస్తే, వరి సాగు 1956–57లో 72 లక్షల ఎకరాల్లో ఉన్నదల్లా, 2008–09 నాటికి ఒక కోటీ ఎనిమిది లక్షల ఎకరాలకు పెరిగింది. అంటే వరి సాగులో 36 లక్షల ఎకరాల పెరుగుదల కనబడుతుంది. కాని ఇతర తిండిగింజల విస్తీర్ణం అంతకన్న ఎక్కువగానే తగ్గిపోయింది. ఉదాహరణకు 1956–57లో 62 లక్షల ఎకరాల్లో ఉండిన జొన్న 2008–09 నాటికి ఎనిమిది లక్షల ఎకరాలకు పడిపోయింది. మిగిలిన తిండిగింజల విస్తీర్ణం లెక్కలు అలా ఉంచినా, పెరిగిన వరి విస్తీర్ణం, తగ్గిన జొన్న విస్తీర్ణం కన్న తక్కువ. మరొకవైపు అప్పటికీ ఇప్పటికీ జనాభా రెండున్నర రెట్లు పెరిగిందంటే, వరి ఉత్పాదకత ఆ స్థాయిలో పెరగలేదంటే, మొత్తంగా తెలుగు సమాజానికి 1956లో ఉన్నంత ఆహారభద్రత 2008లో లేదన్నమాట. ఇక వ్యవసాయాన్ని మార్కెట్ తో ముడివేసి, వ్యవసాయదారుల జీవితాలను అంతర్జాతీయ దళారీవ్యాపారుల లాభనష్టాల క్రీడకు బలి చేసే వాణిజ్యపంటల విస్తీర్ణం ఈ యాభై సంవత్సరాలలో విపరీతంగా పెరిగిపోయింది. ఒక్క ఉదాహరణ చూడాలంటే 1956–57లో పత్తి పంట విస్తీర్ణం ఏడు లక్షల ఎకరాలు ఉన్నదల్లా 2008–09 నాటికి 35 లక్షల ఎకరాలకు పెరిగింది.

ఈ గణాంకాలన్నీ కూడ రాష్ట్రంలో భూమి అనే ప్రధాన వనరు వినియోగంలో ఉన్న సక్రమంగా వినియోగంలోకి తేకపోవడం, ఎక్కువ భూమిని సాగు యోగ్యం చేయకపోవడం, సాగుభూమిలో కూడ సమాజానికి అవసరమైన ఆహారపంటల స్థానంలో మార్కెట్ ఆదేశాలకు ప్రాధాన్యత ఇవ్వడం వంటి అవకతవకలను చూపుతున్నాయి.

### ఆంధ్రప్రదేశ్ వనరులు - అడవి

జాతీయ అటవీ విధానం ప్రకారం మూడో వంతు (33 శాతం) అడవులు ఉండవలసి ఉండగా రాష్ట్రంలో కేవలం 22.5 శాతం మాత్రమే అడవులున్నాయి. అడవుల విస్తీర్ణం తగ్గిపోతున్నదని ప్రతిఒక్కరికీ తెలిసిన వాస్తవం ప్రభుత్వ గణాంకాలకు మాత్రం తెలియదు. రాష్ట్రం ఏర్పడిన నాటికీ ప్రస్తుతానికీ అడవుల విస్తీర్ణం పదిహేను లక్షల ఎకరాలకు పైగా పెరిగిందని ప్రభుత్వ గణాంకాలు చెపుతున్నాయి. అడవి అంటే ఏమిటి అనే నిర్వచనాన్ని ఎప్పటికప్పుడు మారుస్తూ వచ్చి, తుప్పలను, పొదలను, చెట్ల గుబుర్లను కూడ అడవులుగా గుర్తిస్తూ ప్రభుత్వం ఈ అంకెల గారడీని సాధించినప్పటికీ, ఉండవలసినంత, పర్యావరణ పరిరక్షణకు, వర్షపాతం సక్రమంగా ఉండడానికి అవసరమైనంత అడవి లేదు. అటవీ వనరులను రక్షించి, పెంపొందించవలసిన ప్రభుత్వాలు ఆ పని చేయలేదు సరిగదా, అటవీ వనరులను పారిశ్రామిక వేత్తలకు, గనుల తవ్వకాలకు, పట్టణీకరణకు అప్పగిస్తూ ఇష్టారాజ్యంగా దోపిడీ చేయనిచ్చాయి. పైగా అడవి తగ్గిపోవడానికి బాధ్యతను ఆదివాసుల మీదికి, అడవి అంచు గ్రామాల ప్రజల మీదికి నెడుతున్నాయి. నిజానికి ఆ ప్రజలు అడవిని, కలపను వాడుకున్నారనుకున్నా అందువల్ల జరిగే అటవీ విధ్వంసం, పరిశ్రమల విధ్వంసంతో పోలిస్తే చాల తక్కువ. ప్రభుత్వాలు అంతర్జాతీయ పర్యావరణ సంస్థల ఒత్తిడికో, పర్యావరణ ఉద్యమ ఒత్తిడికో లొంగి అర్భాటంగా అడవుల పెంపకం కార్యక్రమాలు చేపట్టినా, ఈ కొత్త అడవులు, మొక్కల సముదాయాలు ఈ నేలకు తగినవి కాకపోవడమో, పర్యావరణాన్ని విధ్వంసం చేసేవి కావడమో, బహుళజాతి సంస్థల పారిశ్రామిక అవసరాలను తీర్చేవి కావడమో ఆనవాయితీ అయింది. మొత్తంగా అటవీ వనరులు ఏ ప్రజలవో ఆ ప్రజలకు మాత్రం అందుబాటులో లేకుండా పోయాయి.

### ఆంధ్రప్రదేశ్ వనరులు - నీరు

ఇక నీరు అనే మరొక ప్రధాన వనరు వినియోగం గురించి చూస్తే, వ్యవసాయం సాగుతున్న భూమిలో నీటిపారుదల సౌకర్యాలు అందిన భూమి వివరాలు చూస్తే ఆంధ్ర ప్రదేశ్ సమాజం అరవై సంవత్సరాలలో ఏమి సాధించిందో, ఏమి సాధించలేదో తేటతెల్లమవుతుంది.

మొత్తంగా రాష్ట్రానికి అందుబాటులో ఉన్న నదీజలాలన్నిటినీ వాడుకుంటే కనీసం మూడు కోట్ల ఎకరాలకు రక్షిత నీటి పారుదల సౌకర్యాలు కల్పించవచ్చు. కాని రాష్ట్రం ఏర్పడిన 1956-57లో మొత్తం సాగుభూమిలో 70 లక్షల ఎకరాలు (23.8 శాతం) మాత్రమే నీటి పారుదల సౌకర్యం ఉన్న భూమిగా నమోదయింది. అది 2008-09 నాటికి ఒక కోటీ పందొమ్మిది లక్షల ఎకరాలకు (34.8 శాతం) పెరిగినట్టు ప్రభుత్వ గణాంకాలు తెలుపుతున్నాయి. అంటే స్థూలంగా చూస్తే యాభై సంవత్సరాలలో నీటి పారుదల సౌకర్యాలు పెరిగినది అదనంగా యాభై లక్షల ఎకరాలకు మాత్రమేనన్న మాట.

కాని ఈ గణాంకాలను కూడ విప్పి చూడవలసి ఉంది. 1956-57 నాటి డెబ్బై లక్షల ఎకరాలలో ప్రభుత్వ కాలువల ద్వారా 31 లక్షల ఎకరాలు, ప్రైవేటు కాలువల ద్వారా 34 వేల ఎకరాలు, చెరువుల ద్వారా 29 లక్షల ఎకరాలు, బావుల ద్వారా ఎనిమిది లక్షల ఎకరాలు, ఇతర వనరుల ద్వారా రెండు లక్షల ఎకరాలకు సాగునీరు అందేది. 2008-09 నాటి ఒక కోటీ పందొమ్మిది లక్షల ఎకరాలలో కాలువల ద్వారా నలభై ఒక్క లక్షల ఎకరాలు, చెరువుల ద్వారా పదహారు లక్షల ఎకరాలు, బావుల ద్వారా యాభై ఏడు లక్షల ఎకరాలు, ఇతర వనరుల ద్వారా నాలుగు లక్షల నలభైనాలుగు వేల ఎకరాలకు సాగునీరు అందుతున్నది. అంటే ప్రభుత్వం ఏర్పాటు చేసిన భారీ, మధ్యతరహా, చిన్న తరహా నీటి పారుదల సౌకర్యాల కాలువలన్నీ కలిసి గత యాభై సంవత్సరాలలో అదనంగా నీరు కల్పించినది కేవలం పది లక్షల ఎకరాలకు మాత్రమేనన్నమాట. పైగా అది కూడ చెరువులను నిర్లక్ష్యం చేసి, వాటికింద సాగయ్యే భూమిని పదమూడు లక్షల ఎకరాలు తగ్గించడం ద్వారా జరిగిందన్నమాట. ఇక నీటి పారుదల పెరిగిందని చూపిన అంకెల గారడీ అంతా కూడ రైతులు స్వయంగా తాము పెట్టుబడులు పెట్టి బావులు తవ్వుకుని, వాటికి అవసరమైన విద్యుత్తు కోసం అనేక తంటాలు పడి అదనంగా సృష్టించిన యాభై లక్షల ఎకరాల ద్వారా మాత్రమే.

### ఆంధ్రప్రదేశ్ వనరులు - సముద్రతీరం

సముద్రతీరం అనే వనరుకు అనేక ఉపయోగాలున్నాయి. అనాదిగా ఆ తీరప్రాంతాలలో జీవిస్తున్న మత్స్యకారులు సముద్రం మీద జలచరాల వేటతో సమాజపు ఆహార అవసరాలలో గణనీయమైన భాగాన్ని తీరుస్తూ, తమ జీవనోపాధి సాధించుకుంటున్నారు. ఆ సముద్రతీరం విదేశీ వాణిజ్యానికి, పర్యటనకు ఒక వనరుగా ఆదాయాన్ని సమకూరుస్తుంది. ఆ సముద్ర తీర ఇసుకలో ఎన్నో విలువైన ఖనిజాలు ఉన్నాయని వాటిని వినియోగించుకోవచ్చునని తెలుస్తోంది. కాని ప్రస్తుతం ఈ వనరును కొత్తగా ప్రజోపయోగానికి తేవడం అలా ఉంచి, అక్కడి మత్స్యకారులను వెళ్లగొడుతున్నారు. అంతకంతకూ ఎక్కువగా ఓడరేవులను నిర్మించడానికి బహుళజాతి సంస్థలకు సముద్రతీరాన్ని అప్పగిస్తున్నారు. సముద్రపు ఆటుపోట్ల నుంచి సహజ రక్షణగా ఉండే మడ అడవులను ధ్వంసం చేసి, ఆ సముద్ర తీరాన్ని కార్పొరేట్ సంస్థలకు విలాసకేంద్రాలు ఏర్పాటు చేయడానికి అప్పగిస్తున్నారు. సముద్రతీరాన్నీ, సముద్ర జలాల్లో చేపల వేటనూ కార్పొరేట్ వ్యాపార సంస్థల చేతుల్లో పెట్టిన ప్రభుత్వాలు ఈ వనరును, ఈ వనరు వినియోగాన్ని ప్రజల నుంచి దూరం చేస్తున్నాయి.

### ఆంధ్రప్రదేశ్ వనరులు - ఖనిజాలు

ఇక ఖనిజాల కథ చాల పెద్దది. ఈ రాష్ట్రంలో దాదాపు 50 పారిశ్రామిక ఖనిజాలు ఉన్నాయని అంచనా. వాటి వెలికితీత, ఉత్పత్తి, వినియోగం జరుగుతున్నాయి. బొగ్గు, సహజవాయువు, సున్నపురాయి, అభ్రకం, బరైటిస్, బాక్సైట్, సముద్రతీరపు ఇసుక, స్టియటైట్, క్వార్ట్జ్, ఫెల్డ్ స్పార్, మాంగనీస్, డోలమైట్, గ్రానైట్ వంటి ఖనిజాలెన్నో రాష్ట్రంలో ఉన్నాయి. ఇంకా వెలికితీయని, అన్వేషించవలసిన ఖనిజ

నిలువలు కూడ ఉన్నాయి. ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం జిల్లాలలోని గోదావరి – ప్రాణహిత పరీవాహక ప్రాంతంలో కొన్ని లక్షల ఎకరాలలో విస్తరించిన సింగరేణి బొగ్గుగనులు కాక రాష్ట్రవ్యాప్తంగా మరొక ఐదు లక్షల ఎకరాలలో వివిధ గనుల తవ్వకాలు ప్రైవేటు వ్యక్తుల, వ్యాపారసంస్థల చేతుల్లో ఉన్నాయి.

ఈ ఖనిజాలన్నిటినీ ప్రజల ఉమ్మడి వారసత్వ సంపదగా గుర్తించి, వాటిని ప్రజల అవసరాల కోసం, అభివృద్ధికోసం ప్రణాళికాబద్ధంగా వినియోగించాలి. దొరికే ఖనిజ సంపదనంతా సమీక్షించి, పద్ధతి ప్రకారం వెలికితీస్తూ, రాష్ట్రంలోనే ఆ ఖనిజాల ఆధారిత పరిశ్రమలు ఏర్పాటు చేసి, ఒకవైపు ప్రజల పారిశ్రామిక ఉత్పత్తుల అవసరాలు తీర్చడంతో పాటు వేలాది మందికి ఉపాధి కల్పించ వచ్చు. అ పారిశ్రామిక ఉత్పత్తుల వ్యాపారం ద్వారా ఆదాయం సంపాదించవచ్చు. దొరికే ఖనిజాలను ఉపయోగించి విద్యుదుత్పత్తి, సిమెంట్, ఎరువులు, సెరామిక్స్, గ్లాస్, ఉక్కు, గృహ నిర్మాణ పరికరాలు, వినియోగవస్తువులు తయారుచేసే పరిశ్రమలు ఎన్నో స్థాపించవచ్చు. గనుల తవ్వకాన్ని ప్రభుత్వరంగంలోనే నిర్వహిస్తూ ఖనిజాల విలువనంతా రాష్ట్ర ఖజానాకే చేర్చవచ్చు. ఎక్కడైనా సాంకేతిక కారణాల కొద్దీ ప్రైవేటు వ్యక్తులకు, సంస్థలకు లీజు ఇవ్వవలసి వచ్చినా ప్రజాధనం ప్రైవేటు వ్యక్తుల, సంస్థల కైంకర్యం కాకుండా రాయల్టీలు, పన్నులు శాస్త్రీయంగా విధించి ప్రభుత్వాదాయం పెంచవచ్చు. కాని ఈ విలువైన వనరును ప్రజల కోసం ఉపయోగించడం కాకుండా బడా వ్యాపారవేత్తలకు, రాజకీయ నాయకుల ఆశ్రితులకు, బహుళజాతి సంస్థలకు అప్పగించడం జరుగుతోంది.

## ఎవరివీ వనరులు?

ఒక్క ఖనిజాలు మాత్రమే కాదు, వనరులన్నీ కూడ ఈ రాష్ట్ర ప్రజలవి. శ్రమజీవులవి. భూమి పుత్రులవి. అవి ఎవరికీ సొంత ఆస్తిగా మారిపోవడానికి వీలు లేదు. భూమి పుత్రులకైనా వాటిని వినియోగించుకునే హక్కు మాత్రమే ఉంటుంది. వారికి కూడ వాటిని దుర్వినియోగం చేసే, పనికి రాకుండా చేసే, ధ్వంసం చేసే హక్కు లేదు. వారు తమ జీవనానికి అవసరమైనంతవరకు వాటిని వాడుకుని, వాటిలో పునరుత్పత్తి చేయగలిగినవాటిని పునరుత్పత్తి చేసి భవిష్యత్ తరాలకు అందజేయవలసి ఉంటుంది. శ్రమజీవులకే అటువంటి హక్కు లేదన్నప్పుడు, ఇక శ్రమలో భాగం పంచుకోని వారికి, పాలకులకు, సంపన్నులకు వాటిమీద హక్కు ఉండే అవకాశం ఎంత మాత్రం లేదు. కాని చరిత్ర పొడుగునా పిడికెడు మంది సంపన్నులు, పాలకులు, మిగులు ఉత్పత్తిని తమ సొంతం చేసుకున్న వారు ఈ వనరులన్నిటి మీద తమ గుత్తాధిపత్యాన్ని స్థాపించుకున్నారు. పాలన ద్వారా, తామే రూపొందించిన చట్టాల ద్వారా, సాంఘిక వ్యవస్థలో తామే నిర్ణయించిన అంతరాల ద్వారా, మతాచారాల ద్వారా, బలప్రయోగం ద్వారా ఈ వనరుల మీద అధికారాన్ని నిలుపుకుంటున్నారు. ఆ అధికారాన్ని నిలిపి ఉంచుకోవడానికి దౌర్జన్యం సాగిస్తున్నారు. మరొకవైపు వనరుల వినియోగంలో గాని, నిర్ణయాధికారంలోగాని తమ వాటా తమకు దక్కాలని, ఆ వనరుల వినియోగం ద్వారా తమ జీవనం మెరుగుపడాలని కోరుకునే శ్రమజీవులు ఆ కోరికను అనేక రూపాల్లో ప్రకటిస్తున్నారు. మనకు కనబడినా కనబడకపోయినా ఇలా ఎదురెదురుగా మోహరించిన రెండు వర్గాల మధ్య సామాజిక వనరుల వినియోగం మీద హక్కు కోసం, ఆ వినియోగం ఎలా ఉండాలనే నిర్ణయాధికారం కోసం ఘర్షణ ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ సాగుతోంది. 'ఇంతవరకూ నడిచిన చరిత్ర అంతా వర్గ పోరాటాల చరిత్రే' అని మార్క్స్, ఎంగెల్స్ లు 'కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక'లో రాసిన ప్రారంభ వాక్యానికి అర్థం ఇదే.

## ఆంధ్రప్రదేశ్ – ప్రజలు

ఆంధ్రప్రదేశ్ సమాజంలో కూడ ప్రజల చరిత్రలో ఈ ఘర్షణ స్పష్టంగా కనబడుతుంది. ఈ సమాజానికి అందివచ్చిన వనరులలో తమ వాటా తమకు దక్కాలని శ్రమజీవుల ఆకాంక్ష ఎన్నో దశాబ్దాలుగా వ్యక్తమవుతోంది. అసలు వారి వాటా వారికి దక్కడం మాత్రమే కాదు, సామాజిక వనరుల వినియోగం, నిర్ణయాధికారం మొత్తంగా వ్యక్తిగతంగా జరగగూడదని, సామాజికంగానే జరగాలనే సైద్ధాంతిక ఆకాంక్ష తెలుగు సమాజంలో ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడడానికి కనీసం నాలుగైదు దశాబ్దాల ముందునుంచే ఉంది.

ఆర్థికంగానూ, సామాజికంగానూ, సాంస్కృతికంగానూ అంతరాల దొంతరగా ఉన్న ఆంధ్ర ప్రదేశ్ సమాజంలో ఒక కొసన ఎటువంటి ఆధునిక సౌకర్యాలూ అందని నిరుపేద ఆదివాసులు ఉండగా మరొక కొసన సకల సౌకర్యాలూ అనుభవిస్తూ, అధికారం చలాయిస్తూ, అంతర్జాతీయ సమాజం అనబడేదానిలో చేరడానికి ఉవ్విళ్లూరుతున్న శతకోటీశ్వరులయిన పిడికెడు మంది ఉన్నారు. ఆదిలాబాదు నుంచి శ్రీకాకుళం దాకా విస్తరించిన గోదావరీ తీర అరణ్యం, దాని కొనసాగింపుగా తూర్పు కనుమల దాకా సాగిన అరణ్యంలో గోండు, కోలాం, పరధాను, కోయ, గొత్తికోయ, కొండరెడ్డి, గదబ, వాల్మీకి, ఖోండ్, సవర, జాతాపు వంటి అనేక ఆదివాసి సమూహాలు ఉన్నాయి. రాష్ట్రం మధ్య భాగంలో కృష్ణాతీరంలో నల్లగొండ, మహబూబ్ నగర్, కర్నూలు, ప్రకాశం, గుంటూరు జిల్లాలలో విస్తరించిన నల్లమల అడవులలో చెంచులు ఉన్నారు. మైదాన ప్రాంతాలలో, చిట్టడవులలో ఎరుకల, లంబాడా, సుగాలీ, యానాది వంటి ఆదివాసి తెగలు ఉన్నాయి. ఈ ఆదివాసులు మొత్తం రాష్ట్ర జనాభాలో 6.6 శాతం ఆక్రమిస్తున్నారు. రాష్ట్రంలోని వనరుల మీద ఈ ఆదివాసులకు వారి జనాభా నిష్పత్తిలో కాదు గదా, కనీసం మనుగడకు సరిపోయే స్థాయిలో కూడ అధికారం లేదు. అంటే వారికి నిత్యజీవితంలో బతుకే ఒక సమస్య. అక్కడినుంచి విద్య, వైద్యం, ఆరోగ్యం, రవాణా, సమాచార సంబంధాలు, వ్యవసాయం, ఉపాధి, రాజకీయాధికారం అన్నీ సమస్యలే. ఈ సమస్యలు ఇలా ఉండగా ఈ ఆదివాసుల భూములను, అడవులను, అక్కడ ఉన్న జల, ఖనిజ వనరులను ఆక్రమించుకోవడానికి మైదాన ప్రాంతాల నుంచి ప్రభుత్వం, పెత్తందార్లు, బహుళజాతి సంస్థలు సాగిస్తున్న దురాక్రమణ కూడ వీరికి ఇటీవలి కాలంలో పెద్ద సమస్యగా మారింది. వీటిలో కొన్ని సమస్యలమీద ఆయా ఆదివాసి తెగలు విడివిడిగానో, ఉమ్మడిగానో ఆందోళనలు జరపడం, తమ ఆకాంక్షలు వ్యక్తీకరించడం సాగుతోంది. ఆ సమస్యల మీద మాత్రమే కాదు, బయటి సమాజపు సమస్యల పరిష్కారం కోసం కూడ పోరాటాలు ప్రారంభించిన, నడిపిన, నడుపుతున్న ఉజ్వల పోరాట చరిత్ర ఈ ఆదివాసులది.

ఆ తర్వాత చెప్పవలసిన శ్రమజీవులు దళితులు. మాల, మాదిగ అనే రెండు ప్రధాన కులాలలో, యాభై తొమ్మిది ఉపకులాలలో ఉన్న దళితులు రాష్ట్ర జనాభాలో 16.2 శాతంగా ఉన్నారు. కాని రాష్ట్రంలోని ఏ ఒక్క వనరు మీద వాళ్ల అధికారం అందులో సగం కూడ లేదు. వనరుల వినియోగం ఎలా జరగాలనే నిర్ణయాధికారమైతే వాళ్ల చేతిలో లేనేలేదు. విద్యలోనూ, ఉద్యోగాలలోనూ రాజ్యాంగ బద్ధంగా వారికి 15 శాతం వాటా ఉన్నప్పటికీ, దళితులలోని కొన్ని ఉపకులాలు వాళ్ళ జనాభాకు మించి ఆ అవకాశం పొందాయని, మిగిలిన ఉపకులాలకు జనాభా నిష్పత్తి ప్రకారం వాటా దక్కలేదని, అందువల్ల షెడ్యూల్డ్ కులాలు అనే గుర్తింపులో కూడ వర్గీకరణ జరపాలని గత రెండు దశాబ్దాలుగా ఉద్యమం నడుస్తోంది. అది అలా ఉంచి, ఎంతో కొంత వనరుల మీద హక్కు, నిర్ణయాధికారం సంపాదించి, అధికారవర్గంలోకి ప్రవేశించగలిగిన దళితులు కూడ ఈ ప్రజాస్వామిక, జనాభా-నిష్పత్తి ఆధారిత పంపిణీకి దోహదం చేసే బదులు, పాలకవర్గ అనుకూల వైఖరులు తీసుకుంటున్నారు. చరిత్రవల్ల, పాలకులవల్ల, సొంత సమూహంలో పైకి ఎదిగివచ్చిన నాయకులవల్ల కూడ భంగపడుతున్న కోట్లాది మంది దళిత ప్రజలకు జీవితమంతా సమస్యల మయంగా, ఆ సమస్యల పరిష్కారానికి పోరాడడం తప్ప గత్యంతరం లేని స్థితిగా ఉంది.

ఇక వివిధ వృత్తికులాలుగా, శూద్రకులాలుగా, శ్రామిక కులాలుగా, వెనుకబడిన కులాలుగా వేరువేరుగా గుర్తింపు పొందిన సామాజిక వర్గాలు ఉన్నాయి. 1931 జనగణన తర్వాత వీరి జనాభా లెక్కించడం జరగలేదు గనుక ఈ కులాల జనసంఖ్య ఎంతో కచ్చితంగా చెప్పలేం గాని, మొత్తంగా జనాభాలో వీరు 46 శాతం నుంచి 60 శాతం దాకా ఉండవచ్చునని అంచనా. వనరుల మీద అధికారంలో గాని, నిర్ణయాధికారంలో గాని వీరికి మొత్తంగా ఎంతో కొంత వాటా అందుతున్నదని చెప్పవచ్చు గాని, జనాభా నిష్పత్తికి సమానంగా న్యాయం జరుగుతున్నదని మాత్రం చెప్పలేం.

అంతేకాదు, వృత్తికులాలు అనే చారిత్రక వాస్తవాన్నో, వెనుకబడిన కులాలు అనే రాజ్యాంగ నిర్వచనాన్నో ప్రాతిపదికగా తీసుకుని వీరినందరినీ స్థూలంగా ఒకే ముద్దగా చూసినా, సూక్ష్మ పరిశీలనలోకి వెళితే ఈ ముద్దలో కొన్ని కులాలు సాపేక్షికంగా ఎక్కువ అవకాశాలను అనుభవిస్తూ, మెరుగైన స్థితిలో ఉండగా, మరికొన్ని కులాలు ఇప్పటికీ ఎటువంటి అవకాశాలు అందకుండా, దుర్భరమైన ఆర్థిక, సామాజిక స్థితిలో ఉన్నాయి. వ్యవసాయ అనుబంధ వృత్తుల మీద ఆధారపడిన వడ్రంగి, కమ్మరి వంటి కులాలు వ్యవసాయంలోకి యాంత్రీకరణ ప్రవేశించడం వల్ల జీవనోపాధి కోల్పోయాయి. చెరువులు, గ్రామ ఉమ్మడి అడవులు, తోటలు ధ్వంసం కావడం వల్ల మత్స్యకారులు, బోయ, తెనుగు వంటి కులాల జీవనోపాధి రద్దయింది. వస్త్ర పరిశ్రమ పెరుగుదల వల్ల, పారిశ్రామిక వస్త్రాలు చౌకగా రావడం వల్ల, నేత కార్మికుల సహకార ప్రయత్నాలు సరిగా సాగకపోవడం వల్ల, చేనేత కట్టడం నామోషీ అనే సామాజిక విలువల వల్ల సాలెల వృత్తి ధ్వంసమయింది. జీవనోపాధి కోల్పోయిన స్థితిలో ఈ వృత్తిపనివారు ఆత్మహత్యలు చేసుకోవడం కూడ సర్వసాధారణమయింది. మద్యం వ్యాపారంలో భీకరమైన పోటీ వల్ల, ప్రభుత్వమే పారిశ్రామిక, విదేశీ మద్యాన్ని ప్రోత్సహించే కార్యక్రమాలు చేపట్టినందువల్ల కల్లుగీత పనివారి జీవితాలు ధ్వంసమయ్యాయి. గ్రామీణ ఆర్థిక సామాజిక జీవనంలో వచ్చిన అనేక మార్పుల వల్ల గొల్ల, కుమ్మరి, కంసాలి, మేర వంటి వృత్తులకు కనీస ప్రాధాన్యత కూడ లేకుండా పోయింది. వ్యవసాయ అనుబంధంగా కాకుండా కేవలం సేవావృత్తి కులాలుగా ఉన్న చాకలి, మంగలి వంటి కులాలు ఎంతో కొంత గ్రామంలో ఉండే పరిస్థితి ఉంది గాని అది కూడ చాల తక్కువ స్థాయిలోనే. మొత్తంగానే గ్రామీణ జీవితంలో ఈ వృత్తుల, కులాల ప్రజలకు ప్రాధాన్యత తగ్గిపోవడంతో వారు గ్రామంలో ఉంటే నిరుద్యోగంలో మగ్గిపోవడమో, లేదా పొట్ట చేత పట్టుకుని పట్టణాలకు వలస వెళ్లడమో చేయవలసి వస్తోంది.

మొత్తంగా చూస్తే, అటు సాపేక్షికంగా ఎక్కువ అవకాశాలు అనుభవిస్తున్న కులాలవారయినా, ఇటు ఇంకా దుర్భర స్థితిలో ఉన్నవారయినా సమస్యల వలయంలోనే ఉన్నారు. ప్రధానంగా వ్యవసాయం మీద ఆధారపడిన వృత్తి కులాలవారు, వ్యవసాయం చితికిపోవడం వల్ల, యాంత్రీకరణ వల్ల జీవనోపాధి కోల్పోగా, ఇతర వృత్తులలోకి, ఉద్యోగాలలోకి, ఉపాధి అవకాశాలలోకి ప్రవేశించడానికి తగిన విద్యావకాశాలు కూడ వారికి అందడం లేదు. ఈ సమస్యలను పరిష్కరించుకోవడానికి పోరాట రూపాలు ఎన్నుకోవడం, ఏదో ఒకస్థాయిలో పోరాటాలు నిర్వహించడం కూడ ఈ సామాజిక వర్గాలు చాలకాలంగా సాగిస్తున్నాయి.

ఇక అగ్రవర్ణాలుగానో, అతిశూద్రులుగానో గుర్తింపు పొందుతూ ఉన్న కులాలలో చాలమంది వనరుల మీద, ముఖ్యంగా భూమి మీద ఆధిపత్యాన్ని, నిర్ణయాధికారాన్ని కలిగి ఉన్నప్పటికీ, మొత్తం జనాభాతో పోలిస్తే వాళ్ల సంఖ్య స్వల్పమే. ఈ సామాజిక వర్గాలలో కూడ ఉద్యోగాలలోనో, వృత్తులలోనో ఉండి సమస్యల భరితమైన జీవనాన్ని గడుపుతున్న వారి సంఖ్య ఎక్కువే.

మొత్తం మీద అతిచిన్న పాలకవర్గ సమూహం తప్ప ఆంధ్రప్రదేశ్ సమాజమంతా సమస్యలను అనుభవిస్తూనే ఉంది. వనరుల వినియోగం మీద ప్రజాస్వామిక అధికారం లేకపోవడం, సామాజిక వనరులను ఎలా వినియోగించాలనే నిర్ణయాధికారంలో సమాజానికి మొత్తంగా భాగస్వామ్యం లేకపోవడం ఈ సమస్యలకు మూలకారణాలు.

## ప్రజాసమస్యలు

వనరుల వినియోగం ప్రజోపయోగకరంగా జరగాలంటే ఆ వనరులను యథాతథంగా ఉంచితే సాధ్యం కాదు. ఆ వనరులను ఉపయోగించి చేయగల వేరువేరు శ్రమలను, కృషిని, వృత్తులను, ఉపాధి అవకాశాలను మానవజాతి వేల ఏళ్ల పరిణామంలో అభివృద్ధి చేసింది. వాటిని ఇవాళ సామాజిక శాస్త్రవేత్తలు ప్రధానంగా వ్యవసాయం, పరిశ్రమ, సేవారంగం అనే మూడు విభాగాల కింద గుర్తిస్తున్నారు. ఈ మూడు విభాగాల శ్రమలలో, కార్యక్రమాలలో ఏ ఒక్కటి కూడ మౌలిక ప్రకృతి వనరులు లేకుండా జరగవు. అంటే మౌలిక ప్రకృతి వనరులకు వర్తించే సామాజిక ప్రయోజనం అనే సూత్రమే ఈ మూడు విభాగాలకు కూడ వర్తించాలి. కాని కొనసాగుతున్న వర్గ వ్యవస్థ వల్ల, సొంత ఆస్తి పద్ధతి వల్ల ఈ మూడు విభాగాలలో కూడ కోట్లాది మంది శ్రామికులు శ్రమ చేసినప్పటికీ, ఫలితంలో అత్యధిక భాగాన్ని 'యజమానులు' వ్యక్తిగతంగా పోగు వేసుకోవడం అనే పద్ధతే అమలవుతున్నది.

### భూసంబంధాలు

భూమి మీద యాజమాన్యం విషయం చూస్తే ఇది స్పష్టమవుతుంది. రెండు, మూడు సార్లు పంటలు తీసేదానితో సహా మొత్తం సాగుభూమిగా ప్రభుత్వం చెపుతున్న మూడున్నర కోట్ల ఎకరాలు ఒక కోటీ ఇరవై లక్షల కమతాల (సులభంగా అర్థం కావడం కోసం కుటుంబాలు అనుకోవచ్చు) చేతుల్లో ఉన్నది. ఆ లెక్క ప్రకారం సగటున ఒక్కో కుటుంబం చేతిలో మూడు ఎకరాల భూమి ఉన్నదని అనుకోవచ్చు. ఆమేరకు ఒక కుటుంబ జీవనానికి అది సరిపోతుందని కూడ అనుకోవచ్చు. ఈ ఒక కోటీ ఇరవై లక్షల కుటుంబాలలో పూర్తిగా వ్యవసాయం మీదనే ఆధారపడిన శ్రమజీవులు ఎంత మంది, వ్యవసాయ భూమి సొంతదారులుగా, యజమానులుగా, పట్టాదారులుగా లెక్కలోకి వచ్చి, వ్యవసాయంతో ఏమీ సంబంధం లేకుండా వృత్తో, ఉద్యోగమో, వ్యాపారమో చేసుకుంటూ, భూమిని కౌలుకు ఇచ్చి, కేవలం సొంతదారు అనే పేరుతో కౌలు ఆదాయం పొందుతున్న వారెందరు అనే చర్చను కాసేపు పక్కన పెడదాం. నిజానికి రాష్ట్రంలో మొత్తం ఒక కోటీ డెబ్బై లక్షల కుటుంబాలు ఉండగా, గ్రామీణ కుటుంబాల సంఖ్య ఒక కోటీ ఇరవై ఆరు లక్షలు అని ప్రభుత్వం చెపుతోంది. మరి వ్యవసాయ కమతాలు కూడ గ్రామీణ కుటుంబాల సంఖ్యతో సమానంగా ఉన్నాయంటే గ్రామీణ ప్రాంతాలలో ప్రతిఒక్క కుటుంబానికీ భూమి ఉందని ఒప్పుకోవలసి వస్తుంది! అది ఎంత అబద్ధమో అందరికీ తెలుసు.

ఈ లెక్కను మరొకవైపు నుంచి కూడ చూడాలి. ఒక చివరన ఏడు వేల కుటుంబాల చేతిలో ఆరు లక్షల ఎకరాలు ఉండగా మరొక చివరన నలభై ఆరు లక్షల కుటుంబాల చేతిలో ముప్పై లక్షల ఎకరాలు ఉన్నాయని ప్రభుత్వ గణాంకాలే చెపుతున్నాయి. అంటే అతికొద్ది కుటుంబాలకేమో ఒక్కో కుటుంబానికి సగటున 85 ఎకరాలు ఉండగా అత్యధిక సంఖ్యాక కుటుంబాలకు సగటున ఒక్కో కుటుంబానికి ముప్పావు ఎకరం కూడ లేదు. ఆ మాత్రం భూమిలో సాగుచేసుకుని, జీవనం గడపడం అసాధ్యం.

ఇప్పటికీ రాష్ట్రంలో భూమి లేని నిరుపేదల సంఖ్య గణనీయంగానే ఉంది. గ్రామీణ జనాభాలో కనీసం ముప్పై శాతం ఈ వర్గీకరణ కిందికి రావచ్చు. దారిద్ర్యరేఖ కింద ఉన్న జనాభా అంచనాలు వేరువేరుగా జరిగాయి. అవి కనిష్టంగా 26 శాతం నుంచి గరిష్టంగా 40 శాతం వరకు ఉన్నాయి. ఈ దారిద్ర్యరేఖ కింద ఉన్న జనాభాలో పట్టణ ప్రాంతపు నిరుద్యోగులు, చిరుద్యోగులు, మురికివాడల వాసులు కూడ ఉంటారు గాని అత్యధికులు గ్రామీణులే అయి ఉంటారు. వారు భూమి మీద, అడవి మీద, నీటి మీద అధికారం లేనివారే అయి ఉంటారు.

వ్యవసాయరంగంలోని ఈ అసమానత మొత్తంగా రాష్ట్ర వ్యవసాయ రంగపు అస్తవ్యస్త స్థితికి ఒకానొక సూచన మాత్రమే. పారిశ్రామిక, సేవా రంగాలలో ఈ అవ్యవస్థ ఇంకా పెద్ద ఎత్తున ఉన్నది. రాష్ట్ర ప్రజల అవసరాలను తీర్చగల పరిశ్రమలు, సేవా రంగాలు ఏమిటి, రాష్ట్రంలో ఉన్న వనరులను సక్రమంగా ఉపయోగించాలంటే ఏర్పరచవలసిన పారిశ్రామిక, సేవా రంగాలు ఏమిటి అనే ఆలోచన ఎంతమాత్రం లేకుండా రాష్ట్ర పారిశ్రామిక, సేవా రంగాల అభివృద్ధి జరిగింది. ప్రజల అవసరాలతో, లభ్యమయ్యే వనరులతో ఏమీ సంబంధం లేకుండా కేవలం సంపన్నుల, పారిశ్రామికవేత్తల, పాలకుల, వారి ఆశ్రితుల బొక్కసాలు నింపడంకోసం మాత్రమే పారిశ్రామిక, ఆర్థిక, వాణిజ్య విధానాలు అమలయ్యాయి. వనరులను తమ వారికి దోచిపెట్టడమే ఈ ఐదు దశాబ్దాల పాలకులందరూ ఉమ్మడిగా సాగించిన కార్యక్రమం. ఆ ప్రధాన కార్యక్రమపు కొసరుగానో, ఐదేళ్లకోసారి ఎన్నికల అవసరాల కోసమో సాధారణ ప్రజలకు తాత్కాలిక, స్వల్పస్థాయి ప్రయోజనాలు ఏవైనా అందినా అవి వ్యవస్థ స్థితిని మార్చగలిగినవి కావు.

### పారిశ్రామిక రంగం

ఎప్పుడైనా పారిశ్రామిక రంగ అభివృద్ధికి మూడు ప్రాతిపదికలు ఉండాలి. ఒకటి, వ్యవసాయ రంగ అభివృద్ధి జరిగి అక్కడ పరిశ్రమలకు అవసరమైన ముడిసరుకులు, ఆ సరుకులను కొనగల మిగులు ఆదాయం ఏర్పడాలి. వాటితో పారిశ్రామిక సరుకులకు తగిన మార్కెట్ రూపొందాలి. రెండు, వ్యవసాయరంగం ఉత్పాదకత వల్ల గాని, సాంకేతిక విధానం వల్లగాని తన దగ్గర మిగిలిపోయిన మనుషులను సృష్టించి వారిని పరిశ్రమలో పనిచేయడానికి తగిన కార్మిక జనాభాగా తయారు చేయాలి. మూడు, ఆ పరిశ్రమలకు అవసరమైన ముడిసరుకుల సరఫరా ఆ ప్రాంతంలోనే ఉండాలి. ఈ మూడు ప్రాతిపదికలు సక్రమంగా ఉన్నప్పుడు వ్యవసాయం, పరిశ్రమ రెండు కాళ్లమీద నడక లాగ సక్రమంగా సాగుతాయి. మొదట వ్యవసాయాధార పరిశ్రమలతో ప్రారంభించి, ఇతర పరిశ్రమలకు విస్తరించడానికి అవకాశం వస్తుంది.

నిజానికి అటు మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతంలోనూ, ఇటు హైదరాబాద్ రాజ్యంలోని తెలంగాణలోనూ 1950 ల వరకూ ప్రధానంగా ఏర్పాటయినవి వ్యవసాయాధార పరిశ్రమలే. కాని 1950ల తర్వాత ముడిసరుకులు ఉన్నాయా లేవా, తగిన కార్మికులు ఉన్నారా లేరా, స్థానిక మార్కెట్ ఉందా లేదా అనే ప్రశ్నలతో సంబంధం లేకుండా కేవలం బహుళజాతి సంస్థల, బడావ్యాపారవేత్తల, రాజకీయవేత్తల ప్రయోజనాల కోసం, ఇష్టాయిష్టాల ప్రకారం పారిశ్రామికీకరణ జరుగుతూ వచ్చింది. ఒక ఉదాహరణ చెప్పాలంటే పత్తి పంటలో ఏడురెట్ల విస్తీర్ణం పెరిగినా, నేత పనిలో నైపుణ్యం ఉన్న లక్షలాది కార్మికులు సిద్ధంగా ఉన్నా, రాష్ట్రంలో వస్త్ర పరిశ్రమ కొత్తగా పెరగలేదు సరిగదా, 1920 లనుంచి రాష్ట్రంలో ఏర్పడుతూ వచ్చిన వస్త్ర పరిశ్రమలన్నిటినీ మూసివేయడం మొదలయింది. క్రమక్రమంగా వ్యవసాయాధార పరిశ్రమలను ధ్వంసం చేస్తూ, దిగుమతి చేసుకున్న రసాయనిక ముడిసరుకులను వాడే పరిశ్రమలను పెంచారు. స్థానిక ప్రజల అవసరాలను తీర్చే సరుకులను తయారుచేసే పరిశ్రమల స్థానంలో అంతర్జాతీయ మార్కెట్ కు చౌక ఉత్పత్తులను తయారు చేసే పరిశ్రమలను పెంచారు. ఇటువంటి పారిశ్రామికీకరణ వల్ల స్థానిక వ్యవసాయోత్పత్తులను వినియోగించుకునే పరిశ్రమలు రాలేదు. వ్యవసాయం నుంచి బయటికి తోయబడిన జనాభాకు పరిశ్రమలలో ఉపాధి దొరకలేదు. స్థానిక ముడిసరుకుల వినియోగం జరిగినా స్థానిక మార్కెట్ పెరగలేదు.

తెలుగు సమాజంలో పారిశ్రామికీకరణకు మరొక ముఖం తీవ్రమైన కేంద్రీకరణ. పరిశ్రమల ఏర్పాటును వికేంద్రీకరిస్తే, వనరులు

ఉన్న అన్ని చోట్లా పారిశ్రామిక కేంద్రాలను ఏర్పాటు చేస్తే స్థానిక ప్రజలకు అవకాశాలు పెరిగేవి. స్థానిక అవసరాలు తెలిసేవి. స్థానిక మార్కెట్ల అభివృద్ధి జరిగేది. నిజానికి 1960లలో ప్రతి జిల్లా కేంద్రంలోనూ పారిశ్రామిక వాడలను ఏర్పాటు చేసి స్థానిక, చిన్న తరహా, మధ్యంతర, అనుబంధ పరిశ్రమలను నెలకొల్పాలనే ప్రయత్నం జరిగింది. కాని, మాతృ పరిశ్రమకు సామీప్యత, రవాణా సౌకర్యాలు, విమానాశ్రయం, ఓడరేవు, నిపుణులయిన కార్మికుల లభ్యత, అంతర్జాతీయ సలహాదారుల, మార్కెటింగ్ నిపుణుల లభ్యత, భూమి, బ్యాంకుల, అధికారుల సౌకర్యం వంటి అనేక కారణాలు, సాకులు చూపి పరిశ్రమలన్నీ కూడ హైదరాబాదు, విశాఖపట్నం చుట్టూ కేంద్రీకృతమయ్యాయి. అందువల్ల పారిశ్రామిక ఉద్యోగ అవకాశాలు కోరుకునే వారందరూ ఈ నగరాలకే వలస రావలసి వచ్చింది.

## సేవారంగం

వ్యవసాయ, పారిశ్రామిక రంగాలు అభివృద్ధి చెందిన కొద్దీ ఆయా రంగాలలో పనిచేసే జనాభాకు అవసరమైన సేవలను అందించే సేవారంగం పెరుగుతుంది. విద్యా, వైద్య, రవాణా, ద్రవ్య, సమాచార, వినోద, పాలనా తదితర రంగాలుగా ఈ రంగం అభివృద్ధి చెందుతుంది. అంటే వ్యవసాయ, పారిశ్రామిక, సేవా రంగాల మధ్య ఒక సమతుల్యత అవసరమవుతుంది. కాని ఆంధ్రప్రదేశ్ సమాజంలో ఈ సమతుల్యత లోపించి, సేవారంగం ఇబ్బడిముబ్బడిగా పెరిగిపోయింది. నిజంగా ప్రజలకు అవసరం లేని సేవలు కూడ సేవలుగా గుర్తింపు పొంది సమాజపు వనరులను, సమయాన్ని, శక్తిని దుర్వినియోగం చేయడం ప్రారంభించాయి. లేదా, అంతర్జాతీయ మార్కెట్ లో సేవలకు చాల గిరాకీ ఉంది గనుక, ఆంధ్రప్రదేశ్ లో ఆ సేవల ఖరీదు చాల చౌక గనుక ఇక్కడి సేవారంగాన్ని బహుళజాతి సంస్థలు వాడుకోవడం మొదలుపెట్టాయి. అలా సేవారంగంలో కనబడిన వాపును నిజమైన ఆర్థిక వ్యవస్థ బలంగా పాలకులు ప్రచారం చేయడం మొదలుపెట్టారు. కాని ఈ రకంగా పెరిగిన సేవారంగం వల్ల ఆంధ్రప్రదేశ్ సమాజానికి, ముఖ్యంగా ఇప్పటికీ ప్రధానంగా గ్రామీణ సమాజంగా, వ్యవసాయ సమాజంగా, నిరక్షరాస్య సమాజంగా, నిరుపేద సమాజంగా ఉన్న ఆంధ్రప్రదేశ్ సమాజానికి ఒరిగిందేమీ లేదు.

ఈ విషయాన్ని మరొక వైపు నుంచి చూడాలంటే రాష్ట్ర స్థూల ఉత్పత్తిలో వివిధ రంగాల వాటాను చూడాలి. రాష్ట్ర స్థూల ఉత్పత్తి 2008-09 నాటికి రు. 3,71,229 కోట్లు ఉండగా ప్రాథమిక (వ్యవసాయ, తదితర) రంగం వాటా రు. 91,433 కోట్లు (24.6 శాతం), పారిశ్రామిక రంగం వాటా రు. 95,900 కోట్లు (25.8 శాతం), సేవారంగం వాటా రు. 1,83,896 కోట్లు (49.5 శాతం) గా ఉన్నాయి. ఇక్కడ రెండు విషయాలు నిశితంగా చూడాలి.

ఒకటి, రాష్ట్రంలో గ్రామీణ జనాభా 73 శాతం ఉండగా, అందులో కనీసం 60 శాతం అయినా వ్యవసాయ రంగంలో ఉన్నారని అనుకోవచ్చు. అంటే రాష్ట్ర జనాభాలో 60 శాతం శ్రమ ఫలితం రాష్ట్ర సంపదలో 25 శాతంగా మాత్రమే ఉందన్నమాట. ఇందుకు రెండు కారణాలు ఉండవచ్చు. ఒకటి, వ్యవసాయ రంగంలో సాగుతున్న ఉత్పత్తికి న్యాయంగా కట్టవలసిన విలువ కట్టకుండా ఉండవచ్చు. రెండు, వ్యవసాయ రంగం మీద ఆధారపడవలసిన జనాభా కన్న ఎక్కువ ఆధారపడుతూ ఉండవచ్చు. వారికి బయట ప్రత్యామ్నాయ ఉపాధి అవకాశాలు లేనందువల్ల తగిన పని ఉన్నా లేకపోయినా వ్యవసాయ రంగాన్నే అంటి పెట్టుకుని ఉండవచ్చు. కాదని బయటికి వస్తే నిరుద్యోగం అనుభవించవలసి రావచ్చు. రెండు, ఈ రాష్ట్రం ఏర్పడిన నాటి నుంచి ఇవాళ్టికి జరిగిన మార్పును తులనాత్మకంగా చూడాలి. రాష్ట్ర స్థూల ఉత్పత్తి 1956-57 నాటి లెక్కలలో ఈ మూడు రంగాల మధ్య విభజన నిర్దుష్టంగా లేదు. అందువల్ల ఆ లెక్కలు దొరుకుతున్న 1960-61లో చూస్తే రాష్ట్ర స్థూల ఉత్పత్తి మొత్తం రు. 1319 కోట్లు ఉండగా, ప్రాథమిక రంగం వాటా రు. 659 కోట్లు (49.9 శాతం), పారిశ్రామిక రంగం వాటా రు. 186 కోట్లు (14.1 శాతం), సేవారంగం వాటా రు. 474 కోట్లు (35.9 శాతం) ఉంది. ఈ వాటాలో తారతమ్యాలు అలా ఉండగా, మొత్తం అంకెలను చూస్తే స్థూల ఉత్పత్తి 281 రెట్లు పెరగగా, వ్యవసాయం వాటా 138 రెట్లు, పారిశ్రామిక రంగం వాటా 515 రెట్లు, సేవారంగం వాటా 387 రెట్లు పెరిగాయి.

ఈ అంకెలన్నీ తెలిపే విషయమేమంటే ఆంధ్రప్రదేశ్ వనరుల వినియోగం ప్రజానుకూలంగా గాని, హేతుబద్ధంగా గాని, సక్రమంగా గాని, సమతుల్యంగా గాని జరగలేదు. అలాజరగకపోవడానికి సంపూర్ణ బాధ్యత పాలకవర్గాలదే. రాష్ట్రంలోని వనరుల వినియోగం, వనరుల వాడకపు నిర్ణయాధికారం ఇలా ప్రజా వ్యతిరేకంగా, పిడికెడు మంది ప్రయోజనాల కోసం సాగుతూ ఆర్థిక అంతరాలను పెంచి పోషిస్తుండగా, చారిత్రికంగా కొనసాగుతున్న సామాజిక వ్యవస్థలోని అంతరాలు వాటిని బలోపేతం చేశాయి. ఆర్థిక, సామాజిక అంతరాలు జమిలిగా సాగుతూ వచ్చాయి. ఈ అంతరాలను తగ్గించడానికి, సామాజిక జీవనాన్ని సౌకర్యవంతం చేయడానికి, పాఠ్య పుస్తకాల ప్రకారం తటస్థంగా ప్రయత్నించవలసిన పాలన ఆ ప్రయత్నం చేయలేదు సరిగదా, ప్రజలకు అదనపు సమస్యలను సృష్టించింది. ఈ ఐదు దశాబ్దాల ఆంధ్రప్రదేశ్ సామాజిక చరిత్ర నిండా ఈ సమస్యలు కనబడతాయి.

పాలన వల్ల, పాలనావిధానాల వల్ల ఏర్పడిన సమస్యలు అనేకం ఉన్నాయి. వనరుల వినియోగంలో అసమానతను పాలనా విధానాలే ఎలా పెంచి పోషించాయో పైన చూశాం. వనరుల వినియోగానికి అవసరమైన ఏర్పాట్లలో ముఖ్యమైనవి రహదారులను, రైలు మార్గాలను ఏర్పాటు చేయడం, విద్యుత్తు సరఫరా చేయడం, గృహ వసతి కల్పించడం, వనరుల వినియోగాన్ని సులభతరం చేయగల ప్రయాణ సౌకర్యాలను కల్పించడం, వనరుల గురించి అవగాహన పెంచడానికి తగిన విద్యావకాశాలు కల్పించడం, ప్రజల ఆరోగ్య సంరక్షణకు అవసరమైన పనులు చేపట్టడం, ప్రజల వినోద అవసరాలు తీర్చడం వంటివి పాలకుల బాధ్యతలు. కాని ఈ ఐదు దశాబ్దాల పాలనలో ఈ పనులన్నీ ఎంత గందరగోళంగా, హేతురహితంగా, ప్రజావ్యతిరేకంగా సాగుతూ వచ్చాయో, ఏ ఒక్క రంగం తీసుకుని చూసినా వందలకొద్దీ ఉదాహరణలు కనబడతాయి. అవన్నీ సహజంగానే ప్రజల సమస్యలకు దారితీశాయి.

ఒక్కొక్క రంగం గురించీ వివరంగా కూడ చర్చించవచ్చు గాని స్థూలంగానైనా ప్రస్తావించాలంటే రహదారుల నిర్మాణం ప్రజోపయోగం కోసం, ఉత్పత్తి శక్తుల అభివృద్ధిలో భాగంగా జరగలేదు. పాలకులు రహదారులను ప్రధానంగా ముడి సరుకుల రవాణా మార్గాలుగా, సరుకులను మారుమూల మార్కెట్లకు చేర్చేవిగానే చూశారుగాని ప్రజల ప్రయాణ సౌకర్యానికో, బయటి ప్రపంచానికి కిటికీ గానో చూడలేదు.

రాష్ట్రం ఏర్పడేనాటికి రహదారులు అన్నీ కలిపి 17,000 కి మీ ఉన్నవల్లా 2008-09 నాటికి 1,98,365 కి.మీ. అయ్యాయి. కాని ఇందులో సగం మొరం రోడ్లు (75,711 కి.మీ.), కంకర రోడ్లు (29,537). అంటే వర్షాకాలంలో పనికిరాని రోడ్లు. ఈ అంకెలను జిల్లాలవారీగానూ, ముడిసరుకులు ఉన్న ప్రాంతాలు, పట్టణాలు, గ్రామాలు అనే విభజనవారీగానూ పరిశీలిస్తే ఇంకా ఆశ్చర్యకరమైన సంగతులు బయటపడతాయి. ఇక రైలుమార్గాలయితే 1956 నాటికి 4,544 కి.మీ. ఉన్నవల్లా, 2009 నాటికి 4,998కి చేరాయి. అంటే రాష్ట్రం ఏర్పడ్డాక యాభై సంవత్సరాలలో కొత్తగా వచ్చిన రైలు మార్గం కేవలం 454 కి.మీ. మాత్రమేనన్నమాట.

విద్యారంగాన్ని ప్రాధాన్యతా రంగంగా చూసి, ప్రజలందరికీ విద్యావకాశాలు కల్పిస్తే, వారి సృజనాత్మకత, చొరవ పెరిగి, నూతన సాంకేతిక పరిజ్ఞానం అంది, ఉత్పత్తి శక్తులుగా వారు మెరుగైన స్థానానికి చేరుతారని ఆధునిక ఆలోచనాపరులు భావిస్తారు. (చదువు లేనివారికి ఉత్పత్తి శక్తిసామర్థ్యాలు లేవని కాదు, చదువు వల్ల అవి మెరుగు పడతాయని మాత్రమే). కాని విద్య అనే కొత్త వనరును ప్రజల చేతుల్లో పెట్టడానికి ఆంధ్ర ప్రదేశ్ పాలకులు కనీస ప్రయత్నాలు కూడ చేయలేదు. ప్రభుత్వ గణాంకాల ప్రకారమే ఇవాళ్టికీ అక్షరాస్యత 60 శాతం దాటలేదు. ఈ అంకె కూడ వాస్తవికమైనది కాదు.

విద్యుత్తు, గృహ వసతి, ప్రయాణ సౌకర్యాలు, వైద్య ఆరోగ్య సౌకర్యాలు, వినోద విజ్ఞాన సాంస్కృతిక అవసరాలు తీర్చడం వంటి ఏ రంగం తీసుకుని చూసినా ఈ సమస్యలు, అంతరాలు, అవకతవకలు కనబడతాయి.

మరొకవైపు, తరతరాలుగా ఎప్పటినుంచో సాగి వస్తున్న సమస్యలు - పేదరికం, భూసంబంధాల అసమానత, సామాజిక అణచివేత, నిరక్షరాస్యత, నిరుద్యోగం వంటివి ఉండనే ఉన్నాయి. నీటిపారుదల సౌకర్యాల కొరత, సొంత నీటివసతి కల్పించుకున్నా అవసరమైన విద్యుత్తు కొరత, విత్తనాల కొరత, పశుసంపద కొరత, ఎరువుల కొరత, పండిన పంటకు గిట్టుబాటు ధర లేకపోవడం, మార్కెట్ దళారీ వ్యవస్థ సృష్టిస్తున్న సమస్యలు వంటి వ్యవసాయాభివృద్ధి సమస్యలు అనేకం ఉన్నాయి. అవసరమైన చోట, అవసరమైన పరిశ్రమలు లేకపోవడం, ఉన్న పరిశ్రమలలో కూడ ఉద్యోగ కల్పన సరిగా లేకపోవడం, పరిశ్రమలలో ఉపాధి దొరికినచోట కార్మిక సంక్షేమ చర్యలు అమలు కాకపోవడం, పారిశ్రామిక కాలుష్యం, పట్టణీకరణ, పారిశ్రామిక ప్రమాదాలు, వంటి పారిశ్రామికాభివృద్ధి సమస్యలు ఎన్నో ఉన్నాయి.

నిజానికి యాభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ చరిత్రలో అన్ని వర్గాల, అన్ని ప్రాంతాల ప్రజలు ఎదుర్కొన్న సామాజిక సమస్యల జాబితా తయారు చేస్తే కొన్ని వేల సమస్యలను నమోదు చేయవలసి ఉంటుంది.

### సహజమైన ప్రజాపోరాటాలు

ఇన్ని సమస్యలతో సతమతమయ్యే ప్రజలు తప్పనిసరిగా ఆ సమస్యల నుంచి బయటపడేందుకు తమంత తామే ప్రయత్నాలు చేయకతప్పదు. ఇన్ని సమస్యలు ఉన్న సమాజంలో ఆయా సమస్యల పరిష్కార ప్రయత్నాలు జరగకపోతే ఆశ్చర్యపోవాలి గాని జరిగితే కాదు. ప్రజలు తమంత తాముగానే తమ సమస్యల పరిష్కారం కోసం అనేక అన్వేషణలు చేశారు. కొన్ని సార్లు ఈ అన్వేషణలు సంఘటితంగా, ప్రజాసంస్థల నాయకత్వంలో, రాజకీయ పక్షాల నాయకత్వంలో సాగాయి. కాని చాల సార్లు రాజకీయ పక్షాలు తమ తాత్కాలిక, స్వార్థ ప్రయోజనాలకోసం ఈ ప్రయత్నాలను మధ్యలో దారి తప్పించాయి. అలా ఎన్నోసార్లు విద్రోహాలను, వంచనను ఎదుర్కొన్న ప్రజలు కోలుకుని మళ్లీ ఆ అన్వేషణను కొనసాగించారు. ఈ ప్రయత్నాలు పాలకవర్గాలకు విజ్ఞప్తులు చేయడం, మహజర్లు పెట్టుకోవడం, పాలకవర్గ రాజకీయ నాయకులను, అధికార వర్గాలను ఒప్పించి పరిష్కరించుకోవడానికి ప్రయత్నించడం దగ్గరినుంచి ప్రదర్శన, సభ, చర్చ, రాస్తా రోకో, రైల్ రోకో, ధర్నా, ఘెరావ్, బంద్, సమ్మె, విధ్వంసకాండ దాకా అన్ని రూపాలనూ సంతరించుకున్నాయి. స్థానిక, తాత్కాలిక, చిన్న సమూహాల సమస్యలు అప్పుడప్పుడూ ఎంతో కొంత పరిష్కారం కావడానికి కూడ అవకాశం వచ్చింది గాని, రాష్ట్రవ్యాపిత, దీర్ఘకాలిక, సామాజిక సమస్యలు సమగ్ర పరిష్కారం కోసం ఇంకా వేచి చూస్తూనే ఉన్నాయి.

మొత్తంగా ఆంధ్రప్రదేశ్ సమాజం ముందు ఉన్న సమస్యలను, ఆ సమస్యలకు వ్యతిరేకంగా ప్రజలు సాగిస్తున్న పోరాటాలను ఐదు రకాలుగా గుర్తించవచ్చు. అవి 1. స్థానిక సమస్యలపై పోరాటాలు. 2. సామాజిక అణచివేతకు వ్యతిరేక పోరాటాలు. 3. పాలకవర్గ విధానాలకు వ్యతిరేక పోరాటాలు. 4. అభివృద్ధి కొరకు, అభివృద్ధి ఫలాలలో వాటా కొరకు పోరాటాలు. 5. సామాజిక మార్పు కొరకు పోరాటాలు.

### స్థానిక సమస్యలపై పోరాటాలు

స్థానిక సమస్యలపై పోరాటాలలో ఒక పట్టణంలోనో, గ్రామంలోనో పారిశుధ్య సౌకర్యాలు, తాగునీటి సౌకర్యాలు, రవాణా సౌకర్యాలు కల్పించాలనే దగ్గరినుంచి, స్థానిక అధికారుల, పెత్తందారుల ప్రవర్తన ప్రజానుకూలంగా లేదనే ఆందోళనల నుంచి, ఆ ప్రాంతానికి అదనపు గుర్తింపు కావాలనే, అదనపు నిధులు కేటాయించాలనే వరకు అనేకం ఉన్నాయి. తమ ప్రాంతంలో అడవినుంచి ఏనుగులు బయటికి వచ్చి తమ పంటలను పాడు చేస్తున్నాయని, ప్రభుత్వం, అటవీ అధికారులు తగిన చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేసిన చిత్తూరు రైతులు ఒక ఉదాహరణ అయితే, తమ ప్రాంతానికి నీటి పారుదల సౌకర్యాలు కల్పించాలని, చెరువు గండి పూడ్చాలని ఎక్కడికక్కడ రైతులు చేస్తున్న ఆందోళనలు ఎన్నో ఉన్నాయి. సుదూరంగా ఉన్న జిల్లా కేంద్రానికి వెళ్లడం ఇబ్బందిగా ఉందని అందువల్ల జిల్లాను తూర్పు, పశ్చిమ జిల్లాలుగా విభజించాలని విశాలమైన ఆదిలాబాద్ లో ఆందోళన సాగుతుంటే, విశాఖపట్నం రైల్వే విభాగాన్ని భువనేశ్వర్ అధికారం నుంచి స్వతంత్రం చేయాలని ఆందోళన సాగుతోంది. ఉత్తరాదికీ దక్షిణాదికీ ప్రధాన లంకె గా ఉన్న కాజీపేటలో వాగన్ వర్క్ షాప్ ఏర్పాటు చేసి స్థానిక నిరుద్యోగ సమస్య తీర్చాలని దశాబ్దాలుగా ఆందోళన సాగుతోంది. బహుశా ఇటువంటి స్థానిక ప్రజా ఆకాంక్షలు, పోరాటాలు ప్రతి ప్రాంతంలోనూ, ప్రతి మండలంలోనూ ఉంటాయి.

### అణచివేతకు వ్యతిరేక పోరాటాలు

పైన వివరించినట్టు తెలుగు సమాజం అంతరాల మీద ఆధారపడి ఉన్నది గనుక, ఆ అంతరాలలో వివక్షకూ అన్యాయానికీ

గురయిన సమూహాలు ఎప్పటికప్పుడు పోరాడుతూనే ఉన్నాయి. భూస్వామ్య, పెత్తందారీ అణచివేతకు వ్యతిరేకంగా, దళితులు అనుభవిస్తున్న అస్పృశ్యతకూ అవమానానికీ వ్యతిరేకంగా, వెనుకబడిన కులాలన్నీ అనుభవిస్తున్న కుల అణచివేతకు వ్యతిరేకంగా, స్త్రీ పురుష అసమానతకు వ్యతిరేకంగా, మత పునాదిపై సాగే వివక్షకు వ్యతిరేకంగా, తెలంగాణ, ఉత్తరాంధ్ర, రాయలసీమ, పల్నాడు ప్రాంతాలు అనుభవిస్తున్న ప్రాంతీయ వివక్షకూ, అణచివేతకూ వ్యతిరేకంగా – ఒక్క మాటలో చెప్పాలంటే రాష్ట్రంలోని ఎన్నో సమూహాలు తమ ఆత్మగౌరవం కోసం పోరాడుతున్నాయి. వీటిలో దీర్ఘకాలంగా సాగుతున్న పోరాటాలూ ఉన్నాయి, అప్పటికప్పుడు తలెత్తిన సమస్యలపై నడుస్తున్న పోరాటాలూ ఉన్నాయి. పాత అణచివేత రూపాలు మార్చుకుంటూ కొత్త అణచివేతగా తలెత్తినకొద్దీ పోరాటాలు కూడ కొత్త వ్యక్తీకరణలు పొందుతున్నాయి.

## పాలకవర్గ విధానాలకు వ్యతిరేక పోరాటాలు

సమస్యలలో పుట్టి, సమస్యలలో పెరుగుతూ ఆ సమస్యల పరిష్కారం కోసం తమకు తోచిన మార్గాలలో ప్రయత్నిస్తున్న ప్రజలకు పాలక విధానాలు అదనపు సమస్యలను కల్పిస్తున్నాయి. ఏదో ఒక రాజకీయార్థిక విధానమో, ఏదో ఒక పాలక ఉత్తర్వో, చర్యో తప్పనిసరిగా ఏదో ఒక సమూహానికి ఇబ్బందికరంగా, ప్రాణాంతకంగా కూడ ఉంటోంది. చాలసార్లు మొత్తం సమాజానికే హానికరమైన పాలకవిధానాలు అమలవుతున్నాయి. మరీ ముఖ్యంగా గత రెండు దశాబ్దాలుగా సాగుతున్న నూతన ఆర్థిక విధానాల వరుసలో అనేక పాలక చర్యలు ప్రజలను తీవ్రంగా ఇబ్బందులపాలు చేస్తున్నాయి. ఆయా సమస్యలపట్ల ప్రజల చైతన్యం కూడ విస్తరిస్తోంది గనుక వాటికి వ్యతిరేకంగా పోరాటాలు కూడ పెద్దఎత్తునే పెల్లుబుకుతున్నాయి. ఒకప్పుడు ప్రజలు మౌనంగా ఆమోదించిన ప్రభుత్వ ఉత్తర్వులను కూడ ఇప్పుడు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు, నిలువరించడానికి ప్రయత్నిస్తున్నారు.

## అభివృద్ధి ఫలాలలో వాటా కొరకు పోరాటాలు

తమ విధానాలకు, చర్యలకూ ప్రజలలో సమ్మతిని తయారు చేసుకునేందుకు పాలకులు అభివృద్ధి భావజాలాన్ని ఉపయోగించడం ఎప్పటినుంచో ఉన్నదే. ఈ భావజాలం సాధారణంగా మధ్యతరగతిని నమ్మిస్తుంది. ఆకర్షిస్తుంది. ఈ అభివృద్ధి మంత్రజపానికి లోబడిన మధ్యతరగతి దానికి అనుకూల వాదనలు చేస్తూ, అశేష ప్రజానీకానికి నష్టదాయకమైన విధానాలు నల్లేరుమీద బండినడకలా సాగడానికి వీలు కల్పిస్తుంది. పాలకులు చెప్పేది నిజమైన అభివృద్ధి కాకపోయినా, అది ఉద్దేశపూర్వకమైన అబద్ధమైనా, ఆ వాదననే వాడుకుని, 'ఆ అభివృద్ధిలో మా వాటా ఏది' అని ప్రశ్నిస్తూ కొన్ని ప్రజాసమూహాలు పోరాటాలు ప్రారంభించాయి. ప్రాంతీయ ఉద్యమాలు, చాల కుల ఉద్యమాలు ఈ ఆకాంక్షతోనే పోరాడుతున్నాయి. వర్గ వ్యవస్థ కొనసాగినంతకాలం నిజమైన ప్రజల అభివృద్ధి సాధ్యం కాదని తెలిసినా, కళ్ళముందర పిడికెడు మందయినా పాలకులు, సంపన్నులు, వారి ఆశ్రితులు, కొంతవరకు మధ్యతరగతి అభివృద్ధి చెందినట్టు కనబడుతున్నది గనుక, ఈ అభివృద్ధి ఫలాల వాటా కొరకు పోరాటాలకు కూడ విస్తృత మద్దతు దొరుకుతున్నది. ఈ వాటా పోరాటాలు సామాజిక అణచివేత అంశాన్ని కూడ చాల వరకు తమలో కలుపుకుంటున్నాయి గనుక వీటి విస్తృతి పెరుగుతున్నది.

## సామాజిక మార్పు కొరకు పోరాటాలు

దాదాపుగా పై నాలుగు రకాల పోరాటాలు సమాజాన్ని, వ్యవస్థను, రాజకీయార్థిక విధానాలను యథాతథంగా ఉంచుతూనే, తమ సమస్యల పరిష్కారం సాధ్యమవుతుందని అనుకుంటాయి. కాని, అసలు ఈ వ్యవస్థ, ఈ రాజకీయార్థిక విధానాలు సాగినంతకాలం సమస్యలు ఉంటాయని, పెరుగుతుంటాయని, వ్యవస్థ మార్పు మాత్రమే నిజమైన పరిష్కారమని భావించే పోరాట దృక్పథం కూడ ఉంది. తెలుగునేల మీద ఈ దృక్పథం 1930ల చివరినుంచే ఉంటూ, పోరాటాలు నిర్వహిస్తూ ఉంది. అంతిమ పరిశీలనలో అన్ని సమస్యలకూ వర్గవ్యవస్థే కారణమనీ, వర్గపోరాటం ద్వారా అధికారవర్గాన్ని కూలదోసి, ప్రజల రాజ్యాధికారం స్థాపించిననాడే సమస్యల పరిష్కారానికి మార్గం దొరుకుతుందనీ ఈ దృక్పథం భావిస్తుంది. ఆ ఆలోచనతో వర్గపోరాట నిర్మాణం, అభివృద్ధి కూడ తెలుగు సమాజంలో సాగుతూ ఉంది. దేశం మొత్తానికీ ఇటువంటి పోరాట మార్గం చూపిన తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం ఈ నేల మీదనే జరిగింది. అధికారమార్పిడి తర్వాత రెండు దశాబ్దాలకు కూడ సమస్యల పరిష్కారం కాలేదనీ, అసలు వ్యవస్థ మారితే తప్ప సమస్యలు పరిష్కారం కావనీ మళ్లీ శ్రీకాకుళం గిరిజన రైతాంగం మరొకసారి ఈ పోరాట మార్గాన్ని ముందుకు తీసుకు వచ్చింది. ఈ మార్గంలో సాగుతున్న పోరాటాలు కూడ ఆంధ్రప్రదేశ్ సమాజంలో అత్యంత ప్రధానమైనవి.

## ముగింపు

ప్రజాసమస్యల చరిత్ర, వ్యాప్తి, స్వభావం భిన్నంగా ఉన్నాయి గనుక ఆయా సమస్యల పరిష్కార ప్రయత్నాలు, పోరాటాలు కూడ భిన్నంగా ఉండక తప్పదు. బహుశా అందువల్లనే ప్రజాపోరాటాలలో తీవ్రమైన వైరుధ్యం కనబడుతున్నది. కాని ఎంత వైరుధ్యం ఉన్నప్పటికీ, ఆయా ప్రజా సమూహాలు ఒకదానితో ఒకటి చాల తీవ్రమైన, పరుషమైన భాషలో మాట్లాడుకుంటున్నప్పటికీ, వేరువేరు భాషలు మాట్లాడుతున్నప్పటికీ ఈ అన్ని రకాల ప్రజా పోరాటాలకూ ఒకదానితో మరొకదానికి సన్నిహిత సంబంధం ఉంది. వీటి మధ్య సమన్వయం అవసరం ఉంది. ఇవన్నీ మౌలికంగా ప్రజలకు చెందినవి, ప్రజల భాగస్వామ్యంతో నడుస్తున్నవి, ప్రజల అభ్యున్నతిని కోరుకుంటున్నవి. ఇవన్నీ ఒక చారిత్రిక నియమం ప్రకారం సాగుతున్నవి. ఆ చరిత్ర పక్షాన ఇవన్నీ ఏకం కావలసి ఉన్నది. ఈ అన్ని ఉద్యమాల మౌలిక స్వభావం ఉన్న స్థితి మారాలనే ఆకాంక్ష. ఈ అన్ని ఉద్యమాల ప్రత్యర్థి స్వభావం ఉన్న స్థితి, తన దోపిడీ పీడనలు యథాతథంగా కొనసాగడం. అంటే ఈ పోరాటాల మధ్య ఉన్నది వైవిధ్యం మాత్రమే గాని వైరుధ్యం కాదు. వీటి మధ్య ఘర్షణ ఉండనవసరం లేదు. తమ తమ ప్రత్యేకతలు వదులుకోకుండానే ఉమ్మడి ప్రత్యర్థిని గుర్తించి ఆ ఉమ్మడి ప్రత్యర్థికి వ్యతిరేకంగా ఈ ప్రజాపోరాటాలన్నీ ఏకం కావలసి ఉన్నది.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

*జి-20 సదస్సు మార్కెట్‌పై తమ పట్టును పెంచుకోవడానికి, విస్తరించుకోవడానికే తప్ప మాంద్యంతో దారిద్ర్యంలోకి నెట్టబడ్డ కోట్లాది మంది కోసం కాదని అంటున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

# జి-20 సదస్సు - కుదరని ఏకాభిప్రాయం

అమెరికా, యూరప్ దేశాలలో రెండేళ్ల కిందట ఆర్థిక సంక్షోభం ఏర్పడిన వెంటనే జి – 20 దేశాల మొదటి సమావేశం లండన్‌లో జరిగింది. ఆనాటి సమావేశంలో అందులోని నాయకుల మధ్య సన్నిహిత సంబంధాలు, వారి అభిప్రాయాల్లో సారూప్యత కనిపించాయి. ఆ సమావేశంలో ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో సంస్కరణలు, అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థల గురించి చర్చించాయి. అన్ని దేశాలు ఉద్దీపన ప్యాకేజీల ఏర్పాటు, అమలు తదితరాల్లో దాదాపుగా ఏకాభిప్రాయాన్ని వెలిబుచ్చాయి. గత రెండేళ్లలో ఐదు సమావేశాలు జరిగాయి. జి–20 దేశాల కూటమి ఐదవ శిఖరాగ్ర సదస్సు 2010 నవంబర్ 11, 12 తేదీల్లో దక్షిణ కొరియా రాజధాని సియోల్‌లో జరిగింది. అభివృద్ధి చెందిన, చెందుతున్న 20 దేశాల అధినేతలు పాల్గొన్న ఈ సదస్సులో ప్రపంచ దేశాలు ఎదుర్కొంటున్న 'ఆర్థిక సంక్షోభం – అభివృద్ధి' ప్రధాన అజెండాగా చర్చ జరిగింది. దీనికి సంబంధించిన అనేక అంశాలపై రెండు రోజులపాటు జరిగిన చర్చల్లో ఎలాంటి స్పష్టమైన నిర్ణయాలు వెలువడలేదు.

స్వీయ ప్రయోజక అపసవ్య ఆర్థిక విధానాలను విడనాడుకొని అంతర్జాతీయ సంబంధాలలో సమన్యాయాన్ని నెలకొల్పుకునే సంకల్పమైతే సదస్సు ప్రకటించుకుంది, కాని కీలక సభ్య దేశాల మధ్య, ముఖ్యంగా అమెరికా – చైనాల మధ్య గల మౌలిక విభేదాల పరిష్కారం దిశగా ఆశాజనకమైన అవగాహన ఏమీ కుదరలేదు. అందువలన ప్రపంచ ఆర్థిక సంక్షోభం నుండి బయటపడే మార్గాన్ని అన్వేషించాలన్న సమావేశం అసలు లక్ష్యం మాత్రం నెరవేరలేదు. అమెరికా చైనాల మధ్య వివాదం తేలకపోవడం ప్రధాన కారణం అయినప్పటికీ, జర్మనీ బ్రిటన్, జపాన్ లాంటి ఇతర సంపన్న దేశాలు, భారత్ బ్రెజిల్ లాంటి నూతనంగా ఎదుగుతున్న దేశాలు ఈ సంక్షోభానికి పరిష్కారాన్ని కనుగొనేలా ఒత్తిడి చేయడంలో సఫలం కాలేదు. చివరికి సమస్యను వాయిదా వేయక తప్పలేదు. సంక్షోభం తీవ్రత అంతగాలేని చైనా, జర్మనీ వంటి దేశాల నేతలకు, సంక్షోభం తీవ్రత తగ్గని అమెరికా యూరప్ దేశాల నేతల మధ్య. ఏకాభిప్రాయం ఐక్యమత్యం ఏ మాత్రం కన్పించలేదు. ఆర్థిక వ్యవస్థల్లో ఏర్పడిన అసమతుల్యతలు కూడా భిన్నాభిప్రాయాలకు దారి తీశాయి.

సామ్రాజ్యవాద దేశాలలో కొత్తగా తలెతుత్తున్న ఆర్థిక వ్యవస్థల ఆర్థిక బలబలాలలో మార్పు వస్తోంది. ప్రత్యేకించి అమెరికా ఆర్థిక వ్యవస్థలోని బలహీనతలు వెల్లడవుతున్నాయి. ప్రపంచ ఆర్థిక వ్యవహారాలను సమస్తం అమెరికా నాయకత్వాన గల సామ్రాజ్యవాద దేశాలే వారి ఇష్టానుసారంగా, ఏకపక్షంగా గతంలో నిర్వహించేవి. వారిలో వారికి పరస్పర సహకారం, సమన్వయం కోసం జి–7 దేశాలుగా ఏర్పడి వ్యవహరించేవి. సామ్రాజ్యవాద దేశాల మధ్య మార్కెట్లను పంచుకోవడానికి, దోపిడీ సొత్తును పంచుకోవడానికి వారిలో వారికి ఎన్ని వైరుధ్యాలున్నా పేద దేశాలను కొల్లగొట్టడంలో అందరూ ఐక్యంగానే వ్యవహరించేవారు. ప్రత్యేకించి సంక్షోభం, మాంద్యం సమయాలలో ఉత్పన్నమైన భారాలన్నింటినీ జి–7 దేశాలు వెనుకబడిన దేశాలపై మోపి గండం గట్టెక్కించుకున్నాయి. ప్రపంచ వాణిజ్యంలోను, పెట్టుబడుల ప్రవాహంలోను, వాటికి వడ్డీ రేట్లు నిర్ణయించడంలోను, షరతులు విధించడంలోను పేదదేశాలకు వ్యతిరేకంగాను, ధనిక దేశాలకు సానుకూలంగానూ ఉండే నియమాలను, పద్ధతులను రూపొందించి అమలు చేసేవి. ఇందుకుగాను ప్రపంచబ్యాంక్, ఇంటర్‌నేషనల్ మానిటరీ ఫండ్, ప్రపంచ వాణిజ్య సంస్థలు సాధనాలుగా తోడ్పడుతూ వస్తున్నాయి.

సోవియట్ యూనియన్ 1990లో విచ్ఛిన్నమయిన తర్వాత పెద్ద రిపబ్లిక్‌గా మిగిలిన రష్యాను కలుపుకొని జి – 8 దేశాలుగా ఏర్పడ్డాయి. 2008లో ఏర్పడిన ఆర్థిక సంక్షోభంతో ఇప్పటివరకు ప్రపంచ ఆర్థిక వ్యవస్థను నియంత్రిస్తున్న సంపన్న దేశాల నేతగా, ప్రపంచ ఆర్థిక వ్యవస్థపై అగ్రగామిగా ఉన్న అమెరికా ఆర్థిక మాంద్యంలో కూరుకు పోయింది. అమెరికాతో పాటు సంక్షోభ ప్రభావానికి గురైన పశ్చిమ యూరప్ దేశాలు కూడా ఆర్థికాభివృద్ధిలో వెనుకబడ్డాయి. ఈ నేపథ్యంలో ప్రపంచ ఆర్థిక వ్యవహారాలలో ఆర్థికాభివృద్ధి చెందుతున్న మరికొన్ని దేశాలను తమతో కలుపుకోవాలని జి–7 దేశాలు భావించాయి. వేగంగా అభివృద్ధి రేటు సాధిస్తున్న బ్రెజిల్, దక్షిణాఫ్రికా, ఇండియా, చైనా లాంటి మరికొన్ని దేశాలను కలుపుకొని 1999లో జి–20 కూటమిగా ఏర్పరిచాయి. జి–20కి ముందు ఇలాంటి కూటములు చాలానే ఏర్పడ్డాయి. అవి జి–15, జి–77, జి–22, జి–33లు.

జి–20 దేశాల కూటమిని ఏర్పరచడంలో సామ్రాజ్యవాద దేశాలకు స్పష్టమైన లక్ష్యం ఉంది. సామ్రాజ్యవాద దేశాల దోపిడీ కొల్లగొట్టే విధానాలకు, పెత్తందారీ బెదిరింపు విధానాలకు అడ్డులేకుండా చేసుకోవడం, వర్ధమాన దేశాలలో శీఘ్రగతిన ఆర్థికాభివృద్ధి చెందుతున్న దేశాలను ఇతర పేద దేశాలనుండి వేరుపరచడం, తద్వారా ఆయాదేశాల ఐక్యతకు విఘాతం కలిగించి వాటి ప్రతిఘటించే శక్తిని బలహీనపరచడం ద్వారా సంపన్న దేశాల ప్రయోజనాలు కాపాడుకునే లక్ష్యం ఉంది.

సామ్రాజ్యవాద దేశాల మధ్య గతంలో కూడా వాణిజ్యం, పెట్టుబడులు, మార్కెట్ తదితర విషయాలపై వైరుధ్యాలు ఉండేవి. వాటి పరిష్కారం కోసం నిరంతరం సమావేశాలు, చర్చలు, అంగీకారాలకు వస్తుండేవి. తిరిగి వాటిని ఎవరో ఒకరు ఉల్లంఘించడం, ఘర్షణ పడడం జరుగుతూ వచ్చేది. అట్టి ఘర్షణలు చివరికి యుద్ధం వరకూ వెళ్లేవి. రెండు ప్రపంచ యుద్ధాలు ఈ కారణాల వలననే జరిగాయి. ప్రస్తుతం

యుద్ధాలకు దిగేంతగా ఈ వైరుధ్యాలు లేవుగానీ సమస్యలైతే తీవ్రంగానే ఉన్నాయి. అందువలన ఈ దేశాల మధ్య అంగీకారం కుదిరిన మేరకు ఎవరు పాటిస్తారు? ఎవరు పాటించరనేది వేచి చూడాల్సిందే. ఆర్థిక సమస్యలు మాత్రం పెరిగే దిశలోనే ఉన్నాయి.

అమెరికాలో నిరుద్యోగం ఊహించని రీతిలో పెరుగుతోంది. తక్షణం ఉద్యోగాలు కల్పించే కర్తవ్యం అమెరికా అధ్యక్షుడు ఒబామా ముందు ఉంది. అందుకోసం పెట్టుబడుల అవసరం ఉంది. అమెరికా తన ఖర్చులను తగ్గించుకోవాలి లేదా ఆదాయాన్ని పెంచుకోవాలి. అంటే పన్ను రాయితీలు తగ్గించి ఎక్కువ పన్నులు వసూలు చేయాలి. దీనికి అమెరికా అధ్యక్షుడికి కాంగ్రెస్‌లో తగిన మెజారిటి లేదు. రిపబ్లిక్ పార్టీతో రాజీపడితే తప్ప ఏ బిల్లు అయినా కాంగ్రెస్‌లో పాస్ కాదు. ఇక యూరపియన్ దేశాలలో తమ లోటును భర్తీ చేసుకోవడానికి అక్కడి ప్రభుత్వాలు ప్రజలపై రకరకాలుగా భారాలు వేసే విధానాలను అనుసరిస్తున్నాయి. ఈ విధానాలను ఆయా దేశ ప్రజలు ప్రతిఘటిస్తున్నారు. ఉద్యోగులు, కార్మికులు, విద్యార్థులు పోరాట బాట పట్టారు. అక్కడి ఆర్థిక సమస్యలు అంత సులభంగా పరిష్కార మయ్యేటట్టుగా లేవు. ఇక పేదదేశాలు నిరంతరం దారిద్ర్యం, నిరుద్యోగం, కరువు కాటకాలతో సతమవుతున్నాయి. ఈ పరిస్థితి సామ్రాజ్యవాద దేశాల దోపిడీకి, కొల్లగొట్టడానికి సానుకూలమైనదేమీ కాదు. తమ పెట్టుబడులకు, సరుకులకు మార్కెట్ కావాలన్నా, సహజ వనరులు కొల్లగొట్టాలన్నా పేదదేశాల ఆర్థిక వ్యవహారాలను ఎంతో కొంత పట్టించుకోవాల్సిన అవసరం ఉంటుంది. ఈ దేశాలపై ఆధారపడే సామ్రాజ్యవాద దేశాల ఆర్థిక వ్యవస్థలు మనగలుగుతున్నాయి.

చైనా, జర్మనీ వంటి దేశాల ఎగుమతులు ఎక్కువ కావడంవల్ల వాటి వాణిజ్య ఖాతాల్లో మిగులు భారీగా ఉంటుండడం, సంక్షోభంలో బాగా దెబ్బతిన్న అమెరికా కొన్ని యూరప్ దేశాల్లో దిగుమతులు పెరిగి లోటు భారీగా ఉండడం - తదితరాల వల్ల ఆర్థిక అసమతుల్యం పెరిగిపోయింది. ఏ దేశానికాదేశం స్వీయ రక్షణ విధానాలు పాటించడం వల్ల, వాణిజ్య ఆంక్షలు విధించడం వల్ల ప్రపంచ ఆర్థిక వ్యవస్థ తిరిగి మాంద్యంలోకే జారుకునే అవకాశాలున్నాయి. దీన్ని సర్దుబాటు చేసే ప్రయత్నాలు జరగకపోవడంతో ఈ దేశాల మధ్య కరెన్సీ యుద్ధాలు మొదలయ్యాయి. ఈ సదస్సుకు ఒక నెల ముందు జి-20 దేశాల ఆర్థిక మంత్రులు దక్షిణ కొరియాలోని గుయాంగ్జుల్‌లో సమావేశం జరిపారు. ఈ సమావేశంలో జి-20 దేశాలన్నీ తమ కరెన్సీల విలువలను పోటాపోటీగా తగ్గించరాదనీ, సమతుల్యం గల వృద్ధిని ప్రోత్సహించాలనీ ఒక నిర్ణయానికి రావడం జరిగింది. కాని ఆ ప్రాతిపదికన సియోల్ సమావేశంలో జి - 20 దేశాల నేతలు ఒక నిర్ణయానికి రాలేకపోయారు. ప్రపంచ వాణిజ్యం, కరెన్సీలు తదితరాలకు సంబంధించిన పలు అంశాలపై దేశాధినేతలు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేయడంతో ఎలాంటి ఒప్పందాలూ కుదరలేదు.

సియోల్ జి-20 శిఖరాగ్ర సదస్సులో తమ ఆర్థిక రంగాన్ని చక్కబరుచుకోవాలన్న ప్రయత్నాల్లో ఉన్న అమెరికా అజెండాకు సదస్సులో మద్దతు లభించలేదు. ముఖ్యంగా చైనా తన కరెన్సీ యువాన్ విలువను పెంచాలనీ, కరెంట్ ఎకౌంట్‌లో తరుగు, మిగులు ఉన్న దేశాల మధ్య వాణిజ్య సమతుల్యం కోసం గట్టి చర్యల్ని ప్రతిపాదించాలనీ సదస్సులో అమెరికా కోరింది. కానీ ఈ రెండింటినీ అది సాధించలేక పోయింది. ప్రపంచ వాణిజ్యంలో అమెరికా డాలర్ కన్నా చైనా కరెన్సీ యువాన్‌కు ఎక్కువ ప్రాధాన్యత లభించకుండా ఉండడానికే చైనా యువాన్‌పై నియంత్రణల్ని అమెరికా కోరుతోంది. కానీ చైనా ఒక్క అంగుళం కూడా వెనక్కి తగ్గడం లేదు. కేవలం కరెన్సీ మార్పిడి రేట్లను నిర్ణయించే విధానాన్ని మార్పు చేయడంపై పరిశీలిస్తామని మాత్రం చైనా అస్పష్టమైన హామీ ఇచ్చింది. ప్రస్తుతం చైనా తన కరెన్సీ విలువను బలవంతంగా తగ్గించి మిగిలిన దేశాల కరెన్సీలను దెబ్బతీస్తోందంటూ ఆరోపిస్తున్న అమెరికా సైతం గతంలో ఇలాంటి చర్యలకే పాల్పడింది. ఇప్పుడు కూడా అలాగే చేయాలని ప్రయత్నాలు చేస్తోంది. అమెరికా ఫెడరల్ రిజర్వ్ బ్యాంక్ ఆర్థిక వ్యవస్థలోకి వదిలే 500 బిలియన్ డాలర్లు (27 లక్షల కోట్ల రూపాయలు) యూరప్ దేశాలతో పాటు చైనా, ఇండియా, బ్రెజిల్, రష్యా, దక్షిణ కొరియా, ఆస్ట్రేలియా లాంటి ఎమర్జింగ్ మార్కెట్ ఎకానమిల్లోని (ఇ.ఎం.ఇలు) షేర్ మార్కెట్‌లలోకి పెట్టుబడుల రూపంలో వస్తాయి. డాలరు పెట్టుబడులు పెరిగితే ఆయా దేశాల కరెన్సీల విలువలు డాలరుతో పోలిస్తే పెరుగుతాయి. దాంతో వాటి ఎగుమతులు అంతర్జాతీయ మార్కెట్‌లో ప్రియంగా మారుతాయి. ఫలితంగా ఆయా దేశాల ఎగుమతుల పోటీ ప్రయోజనం తగ్గి ఎగుమతులు తగ్గిపోతాయి. దాంతో అంతర్జాతీయ వాణిజ్యం అమెరికాకు అనుకూలంగా మారి, ఇతర దేశాలకు ప్రతికూలంగా మారుతుంది. ఈ విధంగా ఇతర దేశాల కరెన్సీలను, వాణిజ్యాలను దెబ్బతీసి అమెరికా తన ఆర్థిక సంక్షోభం నుండి బయట పడాలని నానా తంటాలు పడుతోంది. ఉత్పత్తులకు స్థానికంగా డిమాండ్ పెంచడం ద్వారా పారిశ్రామిక స్వస్థతను చేకూర్చుకుని ఉద్యోగాలు సృష్టించుకోవడానికి బదులు ఇలా కరెన్సీ చలామణీ పెంచడం ద్వారా సంక్షోభ నివారణకు ప్రయత్నించడం అమెరికాకు ఇది రెండోసారి.

ప్రపంచ దేశాలు అన్నీ తమ మార్కెట్లు తెరవాలని అమెరికా పట్టుబడుతూ, ప్రయత్నాలు చేస్తోంది. అమెరికా, చైనాల మధ్య అసాధరణమైన వాణిజ్య అంతరం ఉన్నమాట నిజమే. డాలర్ మారక రేటుతో చైనా కరెన్సీ విలువ పెంచితే, అమెరికాలో చైనా ఎగుమతులు ఖరీదవుతాయి. చైనాలో అమెరికా వస్తువులు చవక అవుతాయి. దీని వల్ల చైనాతో అమెరికా వాణిజ్య లోటు తగ్గుతుంది. కానీ చైనా అలా అంగీకరించడం లేదు. అమెరికా తమ ఆర్థిక వ్యవస్థ మెరుగు కోసం రెండో ఉద్దీపన ప్యాకేజీ పేరుతో ప్రస్తుతం 60,000 కోట్ల డాలర్లు ముద్రణ చేసి వాటితో వర్ధమాన దేశాల్ని ముంచెత్తాలని ప్రయత్నిస్తుండడంతో జి-20 లోని మిగిలిన దేశాలు సదస్సులో దాన్ని సమర్థించలేదు. ఏమైనా సదస్సులో ఈ అంశం మీద అన్ని దేశాలు కలిసి పనిచేయాలని నిర్ణయించాయేగానీ అందుకు ఎలాంటి ప్రత్యేక చర్యల్ని గానీ, కాలపరిమితిని గానీ నిర్ణయించలేదు. అయితే ఆర్థిక అసమతుల్యతలను ముందుగా గుర్తించి చర్యలు తీసుకునేందుకు గాను ఒక వ్యవస్థను ఏర్పాటు చేయాలని జి-20 సదస్సు నిర్ణయించింది. ఏ దేశంలోనైనా భారీగా మిగులు లేదా లోటు ఏర్పడే అవకాశాన్ని ముందుగా పసిగట్టేందుకు గాను ఐ.ఎం.ఎఫ్. ఆధ్వర్యంలో కొన్ని మార్గదర్శక సూత్రాలతో కూడిన సూచీలను ఏర్పాటు చేస్తున్నారు. అలా పసిగట్టిన తర్వాత నిరోధక, నియంత్రణా చర్యలు తీసుకుంటారు. ప్రతి దేశం ఇలాంటి జాతీయ స్థాయి అంచనా విధానాల్ని ఏర్పాటు చేయాలనే సూచనను భారత ప్రధాని మన్మోహన్‌సింగ్ చేయడం గమనార్హం. ఈ సూచికలను పరస్పర అంచనా వ్యవస్థ (మ్యూచువల్ అసెస్‌మెంట్ ప్రాసెస్)గా పిలుస్తున్నారు. వీటి ద్వారా ఒక దేశం వృద్ధి రేటును మరో దేశం ప్రభావితం చెయ్యకుండా చూడాలని ఆశిస్తున్నారు.

ప్రపంచంలో ఇలాంటి ఆర్థిక అసమతుల్యతలు కొత్తగా ఈరోజే పుట్టుకురాలేదు. ఇవెప్పుడూ ఉంటూనే వస్తున్నా ప్రస్తుతం ఈ అంశానికి ఇంత ప్రాధాన్యత లభించడానికి కారణమేమిటంటే - గతంలో అత్యంత శక్తివంతంగా ఉన్న పాశ్చాత్య దేశాలు ప్రస్తుతం సంక్షోభంలో కూరుకున్నాయి. ఇవి మరో మూడు నాలుగు ఏళ్ల వరకు మాంద్యం నుంచి తేరుకోకపోవచ్చుననే భయమే ఈ ఆందోళనకు దారితీస్తోంది. ప్రపంచంలో అభివృద్ధి చెందిన, అభివృద్ధి చెందని దేశాల మధ్య అసమతుల్యతలు వలస

కాలం నుండే కొనసాగుతున్నాయి. ప్రతి దేశం తన ఆర్థిక వ్యవస్థను బాగు చేసుకోవడానికి ప్రయత్నిస్తుంది. అయితే ప్రపంచీకరణ నేపథ్యంలో అభివృద్ధి చెందిన దేశాల విధానాలవల్ల వర్ధమాన దేశాల ఆర్థిక వ్యవస్థలు దెబ్బతింటున్నాయి. ఇది ముఖ్యంగా ఎగుమతులు, కరెన్సీ విలువలపై నియంత్రణ వల్ల జరుగుతోంది. ప్రస్తుతం ప్రపంచంలో ఎగుమతిదార్లైన చైనా, జర్మనీలు ఎగుమతుల్ని మరింత చౌకగా అందించి పోటీలో మొదట నిలబడేందుకు తమ కరెన్సీ విలువల్ని తగ్గించే ఉంచుతున్నాయి. అమెరికా దీనిపై ఎప్పటి నుంచో ఈ దేశాలపై విరుచుకుపడుతోంది. ఈ దేశాలపై మన ప్రధాని మన్మోహన్‌సింగ్ అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థలో డిమాండ్‌ను సృష్టించడానికి మిగులు ఉన్న దేశాలు తమ ధనాన్ని వర్ధమాన దేశాలలో మౌలిక సదుపాయాల కల్పన ప్రాజెక్టుల కింద పెట్టాలని కోరారు.

ఇటు అమెరికా డాలర్ల ముద్రణ విధానాన్ని, అటు చైనా కృత్రిమ మారకపు విలువవలన వర్ధమాన దేశాలకు నష్టమని ఆయన హెచ్చరించాడు. స్వేచ్ఛా వాణిజ్యం, పెట్టుబడులు అంతర్జాతీయంగా ఆర్థిక రికవరీకి అత్యవసరం. అందుకే వాణిజ్యంలో స్వీయ రక్షణ విధానాల్ని పాటించకూడదని, స్వల్ప కాలిక ప్రయోజనాల కోసం ఇలాంటి చర్యలకు పాల్పడితే ప్రపంచ ఆర్థిక వ్యవస్థ అస్తవ్యస్తమవుతుందనీ, మళ్లీ ఆర్థిక సంక్షోభం వైపుకు వెడుతుందని అన్నారు.

జి–20 సదస్సు సామాజికాభివృద్ధికి సంబంధించి పది పేజీల బహు వార్షిక కార్యాచరణ ప్రణాళికను ప్రకటించింది. అందులో చాలా అంశాలు చోటు చేసుకున్నాయి. ప్రధానంగా సమ్మిళిత సుస్థిర వెసులుబాట్లు గల వృద్ధిని వర్ధమాన, చిన్న దేశాల్లో కొనసాగించేందుకు – మౌలిక వసతులు, వాణిజ్యం, మానవ వనరులు, ఉపాధి కల్పన, ప్రైవేట్ పెట్టుబడులు, ఆహార భద్రత, స్థానిక నిధుల సమీకరణ, జ్ఞాన బదలాయింపు తదితర రంగాల ప్రోత్సాహానికి కృషి కొనసాగించాలని సదస్సు కార్యాచరణ ప్రణాళిక పేర్కొంది. సంపన్న దేశాలు ఆయా దేశాల జాతీయ విధానాలకు అనుగుణంగా స్పష్టమైన, సక్రమమైన, వృద్ధి ప్రోత్సాహక ఆర్థిక విధానాల్ని అమలు చేయాలని, జాతీయ అంతర్జాతీయ స్థాయిల్లో ప్రమాణాల పెంపుకు, మార్కెట్లు విచ్ఛిన్నం కాకుండా, స్వీయ రక్షణ నియంత్రణలు లేకుండా చూడడానికి కృషి, బ్యాంకుల్లో మూల ధనం, లిక్విడిటీల్లో కొత్త ప్రమాణాల్ని అమలు చేయాలని సదస్సు భావించింది. అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థల సంస్కరణలకు కృషి చెయ్యాలనీ, ఐ.ఎం.ఎఫ్. సంస్కరణలపై వేగంగా ముందుకు సాగాలని సదస్సు నిర్ణయించింది. ఈ పరిస్థితి కారణంగానే ఐ.ఎం.ఎఫ్.లో ఆయా దేశాల వాటాలలో మార్పులను, వాటి హక్కులలో మార్పులను అంగీకరించవలసి వచ్చింది. చైనా, ఇండియా హోదాను తమ తమ ఆర్థిక లాభాలను బట్టి పెంచాల్సి వచ్చింది. గతంలో ఐ.ఎం.ఎఫ్.లో అమెరికా ఏది చెబితే అదే అమలు చేసే పద్ధతి కొనసాగింది. ఈ సమావేశంలో ఐ.యం.ఎఫ్. సంస్కరణలు చేయడానికి అందరూ అంగీకరించారు. అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (ఐ.ఎం.ఎఫ్) లో ఎన్నడో దశాబ్దాల క్రితం నిర్ణయించిన ఓటింగ్ వాటాలను ప్రస్తుత ప్రపంచ దేశాల స్థితిగతులకు అనుగుణంగా మార్చాలన్నదానికి జి–20 ప్రకటన మద్దతు పలికింది.

2001లో ప్రారంభమయి ఇప్పటికీ ఒక కొలిక్కి చేరని డబ్ల్యూ.టి.ఒ. దోహా దఫా సంప్రదింపులను 2011 ముగిసే నాటికయినా పూర్తి చేయాలని పిలుపునిచ్చింది. దీనితో పాటు సంపన్న దేశాల మధ్య కూడా సబ్సిడీలకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన సమస్యలు అపరిష్కృతంగా మిగిలిపోయాయి. సంపన్న దేశాలు విపరీతమైన సబ్సిడీలతో తమ వ్యవసాయ ఉత్పత్తులను చౌకగా వర్ధమాన దేశాలకు ఒకవైపున తరలిస్తూ ఆ సబ్సిడీలను ఉపసంహరించుకోవడానికి ససేమిరా అంటున్నాయి. మరోవైపున తమ వ్యవసాయేతర సరుకులను, వర్ధమాన దేశాల మార్కెట్లను ఎలాంటి ఆంక్షలూ లేకుండా తెరవాలని ఒత్తిడి చేస్తున్నాయి. వీటన్నిటి ఫలితంగా దోహా సంప్రదింపులకు బ్రేకు పడింది. ఈ ప్రతిబంధకాలను తొలగించుకొని ముందుకు సాగాలని జి–20 దేశాలు నిర్ణయించుకున్నాయి. చైనా, అమెరికాలు తమ కరెన్సీల మారకం రేట్ల పట్ల ఎవరికి ఇష్టం వచ్చినట్లు వారు వ్యవహరించరాదని కోరిన ఈ సమావేశం మారకం రేట్ల విషయంలో మార్కెట్ నిర్ధారిత రేట్ల వైపు పయనం సాగించాలని అభిప్రాయడింది అయితే. అమెరికా చెప్పినట్లు ఆయా దేశాలు తమ విదేశీ చెల్లింపుల కరెంట్ ఖాతా లోటును జి.డి.పి.లో నిర్దేశిత నాలుగు శాతానికి పరిమితం చేసుకోవాలన్నది ఎవరూ అంగీకరించలేదు. రెండు సంవత్సరాల క్రితం ఆరంభమైన ప్రపంచ ఆర్థిక సంక్షోభం ఇంకా సమిసి పోలేదు. ఇప్పటి వరకు ఆర్థికంగా ప్రపంచ నాయకత్వం వహిస్తున్నా, ఆధిపత్యం చెలాయిస్తున్నా అమెరికా నేడు నాయకత్వ పాత్ర వహించలేని స్థితి దానికి ఏర్పడింది. ఈ సమావేశంలో ప్రపంచ ఆర్థిక వ్యవహారాలలో అందరం కలిసి వ్యవహరించాలని, ప్రత్యేకించి కొత్తగా తలెత్తుతున్న ఆర్థిక వ్యవస్థలు గల దేశాలు ఎక్కువ పాత్ర వహించాలని స్వయంగా అమెరికాయే మాట్లాడాల్సి వచ్చింది. అమెరికా నాయకత్వ పాత్ర బలహీనం కావడం వలన యూరప్ దేశాలు సహితం భిన్నమైన వైఖరిని చేపట్టాయి. కొత్తగా శక్తివంతమవుతున్న ఆర్థిక వ్యవస్థలు గల దేశాల పాత్ర జి–20 దేశాల మొదటి సమావేశం కంటే ఈ సమావేశంలో పెరిగింది. బ్రెజిల్, దక్షిణాఫ్రికా, ఇండియాలాంటి దేశాలకు ఒకరిని అనుసరించే విధానం కంటే తమ ప్రయోజనాల గురించి మాట్లాడే శక్తి పెరిగింది. జి–20 దేశాల మొదటి సమావేశంలో ఈ దేశాలు వ్యవహరించిన తీరు కంటే నేటి సమావేశంలో భిన్నంగా వ్యవహరించాయి. కొత్తగా తలెత్తిన ఆర్థిక వ్యవస్థలు గల దేశాలు సంక్షోభం నుండి త్వరగా బయట పడ్డాయి. అభివృద్ధి రేటు తిరిగి పుంజుకొంటుంది. అమెరికా, తదితర దేశాలు ఇంకా కోలుకొనే దశలో ఉన్నాయి. ఈ మేరకు వాటి ఆర్థిక బలబలాలను బట్టి వేరు వేరుగా వ్యవహరించాయి.

దీర్ఘ చర్చల అనంతరం రాజీగా ప్రస్తుత ప్రపంచ ఆర్థిక, వాణిజ్య మిగులు, లోటు వలన ఏర్పడిన అసమతుల్యతలను తొలగించే సమస్యను వచ్చే సంవత్సరానికి వాయిదా వేయాలని నిర్ణయించారు. ఈ సమస్యను అన్ని కోణాలలో పరిశీలించి పరిష్కార మార్గాలను సూచించడానికి ఒక కమిటీని వేయాలని నిర్ణయించారు. ఈ కమిటీ 2011 జూన్ నాటికి తన నివేదికను అందించాలని నిర్ణయించారు. అదే సమయంలో ఏ దేశమూ అమెరికాకి ఎక్కువగా ఎగుమతులు చేసి తాము అభివృద్ధి చెందాలనుకోవడం సరికాదనీ ఒబామా హెచ్చరించారు. ఒక్క వాణిజ్యంలో అసమానతలనే గాక, ఆర్థిక, ద్రవ్య, ఇతర సమస్యలను సహితం పరిశీలించాలని జర్మనీ డిమాండ్ చేసింది. చైనా ఆర్థిక వ్యవస్థను ఎగుమతులపై ఆధారపడే విధంగా కాకుండా స్వదేశీ మార్కెట్‌పై ఆధారపడి అభివృద్ధి చెందేవిధంగా తమ విధానలను మార్చుకొంటామని చైనా అధ్యక్షుడు హామీ ఇచ్చాడు. అయితే ఈ మార్పు చిటికలో అయ్యేది కాదని నెమ్మదిగా చేస్తామని పేర్కొనడం గమనార్హం.

జి–20 దేశాలు సమావేశం చివరలో విడుదల చేసిన సంయుక్త ప్రకటనలో అన్ని దేశాలు ఉద్దీపనా ప్యాకేజీల అమలు వల్ల రికవరీ బాట పట్టాయని, అంతర్జాతీయ సహకారం వల్ల ప్రపంచ ఆర్థిక వ్యవస్థ మరింత సమర్థంగా పనిచేస్తుందని భావించింది. అందుకే బలమైన ఆర్థిక వ్యవస్థ కోసం మరింతగా కృషి చేయాలని భావించింది. పరస్పర అంచనా

విధానాల ద్వారా రికవరీ వేగవంతమై ఉపాధి కల్పన పెరుగుతుందని ఆశించింది. ఆర్థిక వ్యవస్థల సుస్థిరతకు అంతర్జాతీయ ఆర్థిక సంస్థల సామర్థ్యం పెంపునకు చర్యలు తీసుకోవాలని అభిప్రాయ పడింది. ఆర్థిక సహకారం కొనసాగింపు, ప్రతి దేశం వీలైన ప్రణాళికలు, విధానాలకు కట్టుబడి, బలమైన సుస్థిర, సమతుల్య వృద్ధికి కృషి చేయాలన్న కార్యాచరణను సియోల్ ప్రణాళికగా ప్రకటించింది. ద్రవ్య, మారక రేట్ల విధానాలలో కార్యాచరణకు కట్టుబడి ఉండాలి. మార్కెట్ ఆధారిత మారకం రేట్ల వ్యవస్థను ఎక్కువగా అనుసరించాలి. మారక రేట్లలో వెసులుబాట్లు ఉండాలి. పోటాపోటీగా కరెన్సీల విలువ తగ్గింపుకు పాల్పడకుండా సంయమనం పాటించాలి. ప్రపంచ ద్రవ్య వ్యవస్థలో భద్రత కోసం మరింత కఠినమైన నిబంధనలు పాటించాలి. పై చర్యలన్నీ వర్ధమాన మార్కెట్లలోకి పెట్టుబడులు ప్రవాహంగా వెళ్లి వాటి ఆర్థిక వ్యవస్థల్ని దెబ్బతీయకుండా ఉంటాయని సంయుక్త ప్రకటన ఆశాభావం వ్యక్తం చేసింది.

నిజానికి జి–20 దేశాల శిఖరాగ్ర సభ ఎజెండా అంతా ప్రపంచ ఆర్థిక సంక్షోభం నుండి బయట పడటం ఎలా అన్నదే అయినప్పటికీ, దాని ఆలోచనలన్నీ ద్రవ్య మారకం విలువలను ఎలా నిర్ధారించుకోవాలి, ఎలా అదుపు చేయాలి అనే విషయాల చుట్టూనే తిరిగాయి. అయితే ఏ దేశానికాదేశం నేరుగా ఉత్పత్తిని పెంచుకొని, ఉపాధిని పెంచుకోవడం, దేశీయ మార్కెట్‌ను విస్తరించుకోవడం ద్వారా ఆర్థిక సంక్షోభం నుండి బయటపడవచ్చుననే వైపుగా ఈ దేశాధినేతల ఆలోచనలు సాగలేదు. జి–20 దేశాలు ప్రపంచ జి.డి.పి.లో 90 శాతానికి, ప్రపంచ వాణిజ్యంలో 80 శాతానికి ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. మూడింట రెండు వంతుల ప్రపంచ జనాభా ఈ దేశాలలో ఉంది. అయినా ఉపాధి అవకాశాలు, పేదరిక నిర్మూలన, ఆహార భద్రత, ఆరోగ్యం లాంటి సమస్యల ఊసే ఈ సదస్సులో రాలేదు.

ప్రపంచ ఆర్థిక సంక్షోభం ఫలితంగా గత రెండేళ్ల కాలంలోనే అదనంగా 6.4 కోట్ల మంది ప్రజలు దుర్భర దారిద్ర్యంలోకి నెట్టబడ్డారని ప్రపంచ బ్యాంక్ అంచనా. ఇలాంటి స్థితిలో ఆర్థిక సంక్షోభంనుంచి గట్టెక్కడం అంటే ఈ పేదల స్థితిగతులు మెరుగుపడడమే. అదేమీ ఈ జి–20 దేశాల పాలకులకు పట్టినట్టుగా లేదు. మౌలిక సదుపాయాలలో పెట్టుబడులను అధికం చేయాలని వారు చెబుతున్నప్పటికీ, ఆ సదుపాయాలు ఎయిర్‌పోర్టులు, ఎక్స్‌ప్రెస్ హైవేలు లాంటివి తప్ప సాధారణ పేద ప్రజానీకం జీవన స్థితిగతులను మెరుగుపరిచే విద్య, ఆరోగ్యం లాంటి రంగాలలో మౌలిక సదుపాయాలను పెంపొందించడం మాత్రం కాదు. ఆర్థికాభివృద్ధి రేటు అధికమవుతుంటే దాని ఫలితాలు చుక్క చుక్కగా పేదలకు ఇంకుతాయన్న నయా ఉదారవాద సిద్ధాంతాల మత్తులోనే వారు ఇంకా మునిగి ఉన్నట్లు స్పష్టమవుతుంది. ఈ విధానాల ఫలితంగానే పేద ధనిక తారతమ్యాలు మరింత తీవ్రమయ్యాయి. జి–20 దేశాల శిఖరాగ్ర సభ అంతా సంపన్న దేశాలు, వాటిని అనుసరించి అదేబాటలో ముందుకు వెళుతున్నామని భావించే భారత్, బ్రెజిల్, దక్షిణాఫ్రికా లాంటి ఎదుగుతున్న దేశాల వ్యవహారంగానే నడిచింది. ప్రపంచంలో మరీ వెనుకబడిన పేద దేశాల గోడు మాత్రం ఈ దేశాలకు పట్టినట్టు కనిపించలేదు. ప్రపంచ ఆర్థిక సంక్షోభం ప్రభావానికి అన్నింటికన్నా తీవ్రంగా దెబ్బతిన్నది ఈ దేశాలే. ఆర్థిక సంక్షోభం ప్రభావం పేదలను మరింత కృంగదీసిందన్న విషయాన్ని జి–20 సదస్సు ఏమాత్రం ఆలోచించకపోవడం శోచనీయం.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

*దేశంలోకెల్లా బడా సంపన్నులలో ఒకరి దాతృత్వం వెనక దాగిన అసలు వ్యాపార లక్ష్యాలు, విలువల గురించి వివరిస్తున్నారు* **కె. వేణుగోపాల్**

# విప్రో ప్రేమ్‌జీ దాతృత్వం విద్య కోసమేనా?

విప్రో అధినేత అజీమ్ ప్రేమ్‌జీ ఫోర్బ్స్ జాబితా ప్రకారం ప్రపంచ సంపన్నుల్లో 28వ స్థానం గల భారతీయుడు. మన దేశంలోని ధనవంతుల్లో మూడవ స్థానం. ఆయన మొత్తం ఆస్తుల విలువ రు.80,670 కోట్లు. 'సుస్థిరమైన సమ సమాజ స్థాపనకు విద్యే పునాది' అంటూ తన కంపెనీలోని 8.7 శాతం వాటాను తన పేరిట నెలకొల్పిన 'అజీమ్ ప్రేమ్‌జీ ఫౌండేషన్'కు ఇటీవల విరాళంగా ప్రకటించారు. ఈ ప్రకటనతో 'భారత దేశంలో ఇంత గొప్పపని చేసిన పెట్టుబడిదారు లెవ్వరూ లేరని' పత్రికలు ఆకాశానికెత్తేశాయి. విప్రో సంస్థలో ప్రేమ్‌జీకి 79.5 శాతం వాటాలున్నాయి. వీటిలో విరాళంగా ప్రకటించిన 8.7 శాతం వాటాలను (21.30 కోట్ల షేర్లను) ప్రేమ్‌జీ ఫౌండేషన్‌కు బదలాయించారు. పోగా 70.8 శాతం ఆయన వాటాలు విప్రో సంస్థలో ఉంటాయి. ఈ 21.30 కోట్ల షేర్లను మార్కెట్ విలువతో లెక్కిస్తే 8,846 కోట్ల రుపాయలు అవుతోంది. ఈ 8,846 కోట్ల రూపాయలన్నీ ప్రేమ్‌జీ ఫౌండేషన్ ఖాతాలో పడనున్నాయని భావించి, దాతృత్వంతో ప్రేమ్‌జీని ఆకాశానికెత్తేసిన పత్రికలు వాస్తవాలను గమనించలేదు. ఫౌండేషన్‌కు బదలాయించిన షేర్ల మీద ఓటింగ్ హక్కులను మాత్రం ప్రేమ్‌జీ తనవద్దనే అట్టిపెట్టుకున్నారు. అంటే షేరు ముఖ విలువ అయిన రు. 2 పైన ఈ మధ్య ప్రకటించిన 300 శాతం డివిడెండ్ మాత్రమే ఫౌండేషన్‌కు దక్కుతుంది. కాని మార్కెట్ విలువననుసరించి లాభాలు ప్రేమ్‌జీకే దక్కుతాయి. అంటే ఒక్కొక్క షేరు మీద ఆరు రూపాయలు చొప్పున ఫౌండేషన్‌కు దక్కేది కేవలం రు. 170.40 కోట్లు మాత్రమే. మిగిలిన రు. 8675.60 కోట్ల విలువ గల షేర్లపై అదుపు ప్రేమ్‌జీకే ఉంటుంది.

అంతర్జాతీయ అపర కుబేరులు వారన్ బఫెట్, బిల్‌గేట్స్ తమ సంపదను సేవా కార్యక్రమాలకు ఇస్తున్నట్లు ప్రకటించారు. మన దేశంలో కూడా టాటాలు, బిర్లాలు, ఇన్ఫోసిస్ నారాయణమూర్తి, విజయ్ మాల్యా వేదాంత అనేక సేవా కార్యక్రమాలు, వితరణలు చేస్తూ ఉన్నారు. వీరి దాతృత్వం నిజంగా దేశ ప్రజల మీద ప్రేమతోనా? అసలు ఉద్దేశ్యం ఏమిటి? 'సామాజిక బాధ్యతలు నిర్వహించడం కూడా మంచి వ్యాపారాంశమే' అని ఎం.ఎస్.స్వామినాథన్ అంటున్నారు. ఈ కోణంలో ఆలోచించినపుడు ప్రేమ్‌జీ వితరణ వెనుక ఉద్దేశ్యాన్ని పరిశీలిద్దాం.

ప్రపంచ ఆర్థిక సంక్షోభం నేపథ్యంలో భారతీయ స్టాక్ మార్కెట్లను లాభదాయకంగా మార్చాలంటూ కేంద్ర ప్రభుత్వం పైన కార్పొరేట్ శక్తులు, ద్రవ్య సంస్థలు ఒత్తిడి తెచ్చాయి. ఈ నేపథ్యంలో స్టాక్ మార్కెట్‌లో నమోదయిన ప్రతి కంపెనీలోను 25 శాతం పబ్లిక్ షేర్ హోల్డింగ్ ఉండాలనే నిబంధనను తెస్తున్నట్లు ఆర్థికమంత్రి ప్రణబ్ ముఖర్జీ 2009లో పార్లమెంట్‌లో ప్రకటించారు. ఆమేరకు 2010 జూన్ 4వ తేదీన సెక్యూరిటీస్ కాంట్రాక్టుల (రెగ్యులేషన్) రూల్స్ – 1957కు సవరణను తెస్తున్నారు. దీని ప్రకారం స్టాక్ మార్కెట్‌లో లిస్టయిన అన్ని కంపెనీలు ప్రమోటర్ల వాటాల పరిమితిని 75 శాతానికి తగ్గించుకోవాలి. ఈ నేపథ్యంలో ముందుగానే జాగ్రత్త పడిన ప్రేమ్‌జీ విప్రో కంపెనీలో తన వాటాలు 79.5 శాతం ఉన్నందున 75 శాతానికి తగ్గించుకునే ఆలోచన చేశారు. ఒక్క దెబ్బకు రెండు పిట్టల లాగ తన 8.7 శాతం వాటాలను ప్రేమ్‌జీ ఫౌండేషన్‌కు బదలాయించడం ద్వారా ఈ నిబంధన అమలు చేసినట్లవుతుంది. దేశంలోనే గొప్ప దానకర్ణుడు అన్న పేరు తెచ్చుకున్నట్లవుతుంది. ఈ రకంగా సవరించిన చట్టం ప్రకారం తన వాటాలను తగ్గించుకొని నిబంధనల ప్రకారం వ్యవహరించినట్లు అవుతుందనే ప్రేమ్‌జీ ఈ అవకాశాన్ని వినియోగించుకోవడంతో పాటు తన వ్యాపార ప్రయోజనాలను కాపాడుకున్న వారవుతారు. త్వరలోనే అనిల్ అంబానీకి చెందిన కంపెనీలు కూడా ఈ దారిలో నడుస్తూ తమ దాతృత్వాన్ని చాటుకోనున్నాయి.

అట్లాగే ప్రభుత్వరంగ కంపెనీలు కూడా తమ వాటాలను ప్రజలకు ఇవ్వడం పేరిట పెట్టుబడులు ఉపసంహరించుకోనున్నాయి. లిస్టయిన ప్రభుత్వ రంగ సంస్థలు ప్రభుత్వ వాటాలను 75 శాతానికి తగ్గించుకుంటే 1.08 లక్షల కోట్లు వచ్చే అవకాశం ఉంది. ఈ డబ్బును కార్పొరేట్ కంపెనీల లాగా ప్రజలకు ఉపయోగించకుండా ప్రభుత్వం నేరుగా ఖజానాకు తరలిస్తోంది. అంటే పెట్టుబడుల ఉపసంహరణ ద్వారా వచ్చిన డబ్బు ప్రజా సంక్షేమ కార్యక్రమాలకు ఉపయోగపడడం లేదు. పైగా ప్రభుత్వరంగంలో ఉన్న వాటాలు ప్రైవేట్ వ్యక్తుల చేతుల్లోకి పోతున్నాయి. ప్రేమ్‌జీ రు. 80,670 కోట్ల ఆస్తులు కాని, టాటా, బిర్లా, అంబానీల వేల కోట్ల ఆస్తులు కాని, వారి జీవిత కాలంలో కోట్లాది శ్రమ జీవులు శ్రమ దోపిడి చేసి కూడబెట్టిన ఆస్తులు కాని వారు మాత్రమే శ్రమించి, చెమటోడ్చి సంపాదించింది కాదు. ఇదంతా ప్రభుత్వాధినేతలను, రాజకీయ నాయకులను మభ్యపెట్టి పొందిన పన్ను రాయితీలు, సబ్సిడీలతో కూడబెట్టిన సంపద అందరు పెట్టుబడిదారులలాగా సంస్థలలో పనిచేసే శ్రామికులకు తక్కువ వేతనాలిచ్చి, వారి వస్తువులను అధిక ధరలకు అమ్మి సంపాదించిన డబ్బు కాదా! నిజానికి ఈ

సంపదంతా దేశ ప్రజల సొత్తు. ప్రజల శ్రమశక్తిని కొల్లగొట్టిన సంపద ఆ ప్రజలకే చెందాలి. ఈ నేపథ్యంలో ప్రేమ్‌జీ రు. 8,846 కోట్ల ఆస్తులు ప్రజలపరం కావల్సి ఉంది. అట్లే సంపన్నులని చెప్పే వారి ఆస్తులన్నీ ప్రజలవే. అవి దానంగా ప్రజలకు చెందడం కాదు. హక్కుగా ప్రజలకు చెందాల్సి ఉంది. ఇదేదో మానవీయ సమాజం కోసం చేసిన దాతృత్వంగా కీర్తించాల్సిన అవసరం లేదు. దాతృత్వం పేరుతో ప్రైవేట్ విద్యాలయాల స్థాపనద్వారా మరో వ్యాపార సామ్రాజ్యాన్ని సృష్టించుకోవడాన్ని అందరూ ఖండించాలి. అందుకు అవకాశాన్నిచ్చే విధంగా చట్టాలు చేయడం, అనుమతిలివ్వడం మన దౌర్భాగ్యం.

ప్రేమ్‌జీ తన విరాళాన్ని 'అజీం ప్రేమ్‌జీ యూనివర్శిటీ' ఏర్పాటుకు ఉపయోగించనున్నారు. విప్రోలో ఉన్న తన వాటాలను ప్రేమ్‌జీ ఫౌండేషన్‌కు బదలాయించడం ద్వారా యూనివర్శిటీకి నిధుల కొరత తీరుతుంది. భూరి విరాళ దాతగా యూనివర్శిటీపై అదుపు ఉంటుంది. ప్రేమ్‌జీ ట్రస్టు నిబంధనల ప్రకారం తాను చేసే పనుల ద్వారా వచ్చే ఆదాయాన్ని తిరిగి సామాజిక కార్యకలాపాలపై ఖర్చు చేయాల్సి ఉంటుంది. అంటే ట్రస్టుల వితరణ ద్వారా ఒకవైపు సామాజిక బాధ్యత నిర్వహించినట్లు కనిపిస్తుంది. తన ప్రతిష్ట పెంచుతుంది. అనేక పన్నుల మినహాయింపు లభిస్తుంది. ఇంకోవైపు విద్యా వ్యాపారంలోనికి ప్రవేశించి ప్రేమ్‌జీ తన వాణిజ్యాన్ని ఇంకో కోణంలో విస్తరించుకోవచ్చు.

కర్నాటక శాసనసభ, శాసనమండలి 'అజీమ్ ప్రేమ్‌జీ యూనివర్శిటీ' ప్రారంభించడానికి అనుమతిస్తూ ఇప్పటికే బిల్లును ఆమోదించింది. ఈ యూనివర్శిటీ 2011 నుంచి పని ప్రారంభిస్తుంది. ప్రధానంగా దేశంలోని ఉపాధ్యాయులు, అధ్యాపకులను అత్యుత్తమంగా తీర్చిదిద్దడానికి శిక్షణ ఇచ్చే బాధ్యతను ఇది నిర్వహిస్తుంది. మొదట 200 మందితో ప్రారంభించి, అయిదేళ్ల కాలంలో 3400 మందికి శిక్షణ ఇస్తుందని, వీరంతా తర్వాత డైట్ కళాశాలల్లో విశ్వ విద్యాలయాల్లో, స్వచ్ఛంద సంస్థలలో శిక్షకులుగా సేవలు అందిస్తారని చెపుతున్నారు. అంతే కాకుండా ప్రేమ్‌జీ యూనివర్శిటీ వెనుకబడిన ప్రాంతాల్లో విద్యావకాశాలు మెరుగు పరచడానికి, విద్యా విధానాల రూపకల్పన పైన, ఉపాధ్యాయులు నాణ్యమైన శిక్షణ ఇవ్వడంపైన ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటుంది.

వాస్తవానికి ఉపాధ్యాయుల శిక్షణ, విద్యా విధానాల రూపకల్పన, సిలబస్ అభివృద్ధి ప్రభుత్వాలు చేయాలి. కాని ప్రభుత్వాలు ఆ బాధ్యత నిర్వహించడం లేదు. నిధుల కొరత సాకుతో ఈ పనిచేయడం లేదు. సరిగ్గా ఈరకంగా ఏర్పడిన ఖాళీ లోనికి ప్రేమ్‌జీ యూనివర్శిటీ ప్రవేశిస్తోంది. ఒకవైపు కార్పొరేట్ సంస్థ దాతృత్వం కనిపిస్తుంది. పేరు వస్తుంది. గౌరవం దక్కుతుంది. రెండోవైపు వ్యాపారం విస్తరిస్తుంది. అజీం ప్రేమ్‌జీ ఫౌండేషన్ మన రాష్ట్రంలో సర్వశిక్ష అభియాన్ సహకారంతో ఉపాధ్యాయ అర్హతలు లేని వారితో రాష్ట్రంలోని అనేక మండలాల్లో ప్రాథమిక విద్యను పర్యవేక్షించడం అనుభవమే. అనేక శిక్షణలు, మూల్యాంకనాలు జరిపింది. అప్పుడు నాణ్యత గుర్తుకు రాలేదు. సమాజ భాగస్వామ్యం పేరుతో ఉపాధ్యాయుల బోధనను అర్హతలు లేనివారితో మూల్యాంకనం చేయించింది. ఇప్పుడేమో అజీం ప్రేమ్‌జీ ఫౌండేషన్ దేశ వ్యాప్తంగా ఉపాధ్యాయులను ఉత్తమంగా తీర్చిదిద్దుతానంటూ విశ్వ విద్యాలయం స్థాపిస్తుంది. ఏ వితరణ అయినా పాఠశాలల, విద్యాసంస్థల మౌలిక సదుపాయాల మెరుగుదలకు చేస్తే ఆహ్వానించవచ్చు గానీ దానం పేరుతో ప్రభుత్వం చేయాల్సిన బోధనా విధాన మెరుగుదల, టీచర్ల శిక్షణ విద్యార్థుల్లో విమర్శనాత్మక అధ్యయనం సాగించడం ద్వారా మొత్తం విద్యా వ్యవస్థనే తన హస్తాల్లోకి తీసుకోవడం సరికాదు.

ఆచార్య అనిల్ సద్గోపాల్ చెప్తున్నట్లు '45 వేల కోట్లు కార్పొరేట్ రుణాలను వసూలు చేస్తే' కార్పొరేట్ రంగానికి కోట్లాది రూపాయలు సబ్సిడీలు, పన్నుల మాఫీలు చేయకుంటే, ప్రైవేట్ విద్యా సంస్థలకు సబ్సిడీలతో భూములను ఇవ్వకుండా, పన్నుల మాఫీ చేయకుండా పబ్లిక్ ప్రైవేట్ యాజమాన్యం పేరుతో నిధులు బదలాయించకుండా ఉంటే, ఇటీవల జరిగిన 'కామన్‌వెల్త్ గేమ్స్'కు ఖర్చు చేసిన 80 వేల కోట్లు విద్యా రంగానికి కేటాయిస్తే నిధుల కొరత ఉండదు. రాజ్యాంగం ప్రవచించిన 'నిర్బంధోచిత ప్రాథమిక విద్య' ఈసురోమనడానికి పాలకులకు నిబద్ధత, చిత్తశుద్ధి లోపించడమే కారణం తప్ప నిధుల కొరత కాదు. పది లక్షలకు పైగా ఉన్న ప్రాథమిక పాఠశాలలు, 55 లక్షల మంది ఉపాధ్యాయులు, 20 కోట్ల మంది విద్యార్థులున్న విద్యా రంగాన్ని బాగు చేయడానికి గాని 'ప్రాథమిక హక్కుగా విద్య'ను రాజ్యాంగంలో చేర్చుకున్నప్పటికీ దాన్ని అమలు చేయలేకపోవడం గాని నిధుల కొరత సాకు తప్ప మరొకటి కాదు. టెలికాం కుంభకోణంలో లక్షా డెబ్బై ఆరువేల కోట్ల రూపాయలు కేంద్ర బడ్జెట్‌లోనికి తెస్తే రానున్న అయిదేళ్ల కాలానికి విద్యా హక్కు అమలు చేయడానికి తపస్ మజుందార్ కమిటీ అంచనా వేసిన నిధులకు కొరత ఉండదు.

ప్రైవేటీకరణ తారక మంత్రాన్ని జపిస్తున్న పాలకులకు ఈ హిత బోధలు చెవికెక్కవు. ప్రభుత్వ మౌనాన్ని కార్పొరేట్ రంగాలు సామాజిక బాధ్యత పేరుతో దుర్వినియోగం చేస్తూ ఇటువంటి వితరణలతో ప్రజలను మోసం చేస్తూనే ఉంటాయి. మన మీడియా ఇటువంటి వ్యక్తుల దానశీలతను ఆకాశానికెత్తేస్తూనే ఉంటుంది. ఇటువంటి వితరణలను మానవీయ సమాజం కోసం చేసిన దాతృత్వంగా కీర్తించాల్సిన అవసరం లేదు. దాతృత్వం ముసుగులో ప్రైవేట్ విద్యాలయాల స్థాపన ద్వారా మరో వ్యాపార సామ్రాజ్యాన్ని సృష్టించుకోవడాన్ని అందరూ ఖండించాలి. అందుకు అవకాశాన్నిచ్చే విధంగా చట్టాలు చేయడం, అనుమతులివ్వడం మన దౌర్భాగ్యం.

ప్రభుత్వాలు దేశంలోని మానవ వనరులను ఎట్లా రూపొందించుకోవాలి, ఏ పాఠ్య ప్రణాళిక, సిలబస్ ద్వారా విద్యార్థులను తీర్చిదిద్దాలో, ఏ సమాజ అభివృద్ధికి భావిభారత పౌరులను తయారు చేయాలో ఆ దార్శనికతతో తాను విద్యా విధానం, విద్యాలయాల స్థాపన చేపట్టాలి. అట్లా కాకుండా ప్రతి కార్పొరేట్ సంస్థ ఒక విద్యాలయాన్ని స్థాపించి, తాననుకున్న విధానాన్ని, సిలబస్‌ను బోధిస్తూ ఉంటే, ఆ కార్పొరేట్ భావజాలంతో, మార్కెట్ ప్రయోజనాల కోసం యువత తయారవుతే సమాజ అభివృద్ధి, దేశాభివృద్ధి ఎవరికి కావాలి? ఇప్పటికే కార్పొరేట్, బహుళజాతి సంస్థలు ప్రభుత్వ పథకాలను తమకనుకూలంగా మార్చుకుంటూ, ప్రభుత్వాలను తమ కనుసన్నల్లో ఉంచుకొని చట్టాలను తమ చుట్టాలుగా చేసుకుంటూ దేశ వనరులను దోచుకొంటున్నాయి. భవిష్యత్ యువతరం ఆలోచనలను కూడా హైజాక్ చేసే పెట్టుబడిదారుల నుండి మన విద్యార్థులను రక్షించుకునే ప్రయత్నం జరగాలి.

*(రచయిత ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ అధ్యక్షులు)* వీ

*విదేశీ విశ్వవిద్యాలయాలు స్థానిక విశ్వవిద్యాలయాలను, విద్యార్థుల అవకాశాలను దెబ్బతీయడమే కాకుండా, వచ్చే ఆదాయాన్ని కూడా దెబ్బతీస్తాయనీ, అన్నివిధాల నష్టదాయకమనీ అంటున్నారు* **కె. లక్ష్మీనారాయణ**

# విద్యారంగంలో ప్రత్యేక ఆర్థిక మండలాలు

విద్య అనేది ఉపరితల అంశం మాత్రమేనని, అది ఆర్థిక పునాదిని ప్రోత్సహించి, బలోపేతం చేసే సాధనం మాత్రమేనని, సాంప్రదాయ మార్క్సిస్టు అవగాహన ఇపుడు సరిపోదనేది గత రెండు దశాబ్దాలలో విద్యారంగంలో వస్తున్న పరిణామాలు తెలియజేస్తున్నాయి. పెచ్చు మీరుతున్న విద్యావ్యాపారం ఇక విద్య అనేది ఉపరితల అంశం మాత్రమే కాదని, అది ఆర్థిక పునాదిలో కూడా భాగమైందని తెలియజేస్తున్నాయి. పారిశ్రామిక రంగంలో లేదా వ్యవసాయ రంగంలో ఎలాగైతే పెట్టుబడి పెట్టి శ్రామికుల శ్రమను దోపిడీ చేసి లాభాలు చేసుకోవడం జరుగుతోందో, విద్యారంగంలో కూడా పెట్టుబడి పెట్టి (మేధో) శ్రమను దోచుకుని కోట్లాది రూపాయల లాభాలు గడిస్తున్నారు. ఈ కారణంగా విద్యారంగ ఉద్యమాలు ఇంతకు ముందు కన్నా సంఘటితంగా, ఐక్యంగా, మిలిటెంట్‌గా నిర్మించవలసిన అవసరం ఏర్పడింది.

మనదేశ విద్యారంగంలో ఈ దోపిడీ ప్రక్రియకు నాంది పలికింది 1980లో. రాజీవ్‌గాంధీ తీసుకొచ్చిన జాతీయ విద్యా విధానం అంతకుముందే ప్రపంచ పెట్టుబడిదారీ విధాన సంక్షోభం నుండి పుట్టుకొచ్చిన నయా ఉదారవాద విధానాలను 1991లో అప్పటి పి.వి. నర్సింహారావు ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఫలితంగా విద్యారంగంపై దాడులు ఉధృతమయ్యాయి. ఒకపుడు ప్రముఖ విద్యావేత్తలైన కొఠారీ, రాధాకృష్ణన్ లాంటి వాళ్లతో నడుపబడ్డ విద్యా కమిషన్‌లు బి.జె.పి. - ఎన్.డి.ఎ. ప్రభుత్వ కాలంలో ఏకంగా పారిశ్రామికవేత్తలైన ముఖేష్ అంబానీ, కుమార మంగళం బిర్లాలతో 2000లో ఒక విద్యా రిపోర్ట్‌ను తయారు చేయించారు. మొత్తం ఉన్నత విద్యా లక్ష్యాన్ని వక్రీకరించి పారిశ్రామికవేత్తలకు కావలసిన పనివాళ్లను తయారు చేయడం మాత్రమే విద్యా లక్ష్యమని ఈ రిపోర్ట్ వాదించింది. ప్రైవేట్ విశ్వవిద్యాలయాలను స్థాపించాలని సూచించింది. అందుకే ఒక్క ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రంలోనే 2002లోనే వంద ప్రైవేట్ విశ్వవిద్యాలయాలకు అనుమతులిచ్చారు. గత పది సంవత్సరాల కాలంలో డీమ్డ్ యూనివర్సిటీ ప్రొవిజన్‌ను దుర్వినియోగం చేస్తూ అనేక ప్రైవేట్ యూనివర్సిటీలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చాయి. ఇంతేకాకుండా విద్యను అంతర్జాతీయ విఫణిలో అంగడి సరుకుగా మార్చడానికై మన పాలకులు డబ్ల్యు.టి.ఒ.-జి.ఎ.టి.ఎస్.లో విద్యను చేరుస్తున్నారు. ప్రపంచ వాణిజ్య సంస్థ 2005లో జరిగిన హాంకాంగ్ సమావేశాల తర్వాత భారత ప్రభుత్వం ఉన్నత విద్యలో తలుపులు బార్లా తెరవడానికి ప్రారంభ సంసిద్ధతని తెలియజేసింది. ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ 2005లో ఏర్పాటు చేసిన శ్యాం పిట్రోడా జాతీయ విజ్ఞాన సంఘం నివేదికలు, 2009లో వచ్చిన యశ్‌పాల్ కమిటీ రిపోర్ట్ ప్రైవేట్ విశ్వవిద్యాలయాలకు, విదేశీ విశ్వవిద్యాలయాలకు, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు వత్తాసు పలికాయి. కొత్తగా ఏర్పాటు చేస్తున్న ఐ.టి.ఐ.లు, ఐ.ఐ.ఎం.లు గానీ, కేంద్రీయ విశ్వవిద్యాలయాలు, వరల్డ్ క్లాస్ విశ్వవిద్యాలయాలు గానీ, ఎం.ఎన్.సి.లు, టి.ఎన్.సి.లకు కావలసిన ప్రపంచ ప్రమాణాలకు సరిపడే నైపుణ్యంగల కార్మికులనూ ఈ దోపిడీ వ్యవస్థను కాపాడే మేధావులను తయారు చేస్తాయి. ఈ వరుస క్రమంలో తీసుకొచ్చినదే విదేశీ విశ్వవిద్యాలయాల బిల్లు. ఈ బిల్లుతోపాటు యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ (యు.జి.సి.) అఖిల భారత సాంకేతిక విద్యామండలి (ఎ.ఐ.సి.టి.ఇ.), భారత వైద్య మండలి (ఎం.సి.ఐ.) వంటి అనేక అఖిల భారత నియంత్రణ సంస్థలను రద్దు చేసి వాటి స్థానంలో ఒకే ఒక ఉన్నత విద్యా పరిశోధనల జాతీయ మండలి (ఎన్.సి.ఎచ్.ఇ.ఆర్.) అనే సంస్థను స్థాపించి ఏకగవాక్ష విధానాన్ని ఏర్పాటు చేయబోతున్నారు. ఇంకా విద్యా ట్రిబ్యునల్ బిల్లు, అక్రిడిటేషన్, సాంకేతిక వైద్య, విద్యా సంస్థల్లో అక్రమాల బిల్లులను ఇప్పటికే పార్లమెంట్‌లో ప్రవేశపెట్టారు. ఈ మొత్తం ప్రతిపాదిత బిల్లులు ఉన్నత విద్యారంగంలో సమూల మార్పులకు దారితీస్తాయనడంలో సందేహం లేదు. అయితే ఈ మార్పులు ఇప్పటికే సంక్షోభంలో ఉన్న ప్రస్తుత విద్యారంగాన్ని అభివృద్ధి వైపు నడిపిస్తాయా, లేక ఉన్నత విద్యారంగంలో మిగిలి ఉన్న కొద్దిపాటి విద్యావకాశాలు, ప్రజాస్వామిక విలువలను కూడా నాశనం చేస్తాయా అన్నదే సమస్య. విదేశీ విద్యా సంస్థల బిల్లులో 4 అధ్యాయాలూ, 17 సెక్షన్‌లూ ఉన్నాయి. చివరలో లక్ష్యాలు, కారణాలతో గల ఒక స్టేట్‌మెంట్ ఉంది.

విదేశీ విద్యా సంస్థలను ఈ బిల్లు రెండు రకాలుగా గుర్తించింది. మొదటిది విదేశీ విద్యాసంస్థలుగా, రెండవది విదేశీ విద్యను ప్రొవైడ్ చేసేదిగా రెండవ అధ్యాయంలోని 3, 4 సెక్షన్‌లలో పేర్కొన్నారు. మొదటి రకం సంస్థలు గుర్తింపు పొందనవసరం లేదు. ఎందుకంటే అవి డిగ్రీలు గానీ, డిప్లొమాలు గానీ కాకుండా సర్టిఫికెట్లు మాత్రమే ఇస్తాయి. ఇటువంటి గుర్తింపులేని సంస్థలు విద్యా వ్యాపారాన్ని ఇష్టారాజ్యంగా కొనసాగించవచ్చు. డిగ్రీలు, డిప్లొమాలు ఇచ్చే విదేశీ విద్యాసంస్థలు మాత్రమే గుర్తింపు కోసం యు.జి.సి.కి దరఖాస్తు చేసుకోవచ్చు. యు.జి.సి. గుర్తింపు పొందడానికి ఆ సంస్థలు తమ దేశంలో విద్యారంగంలో కనీసం ఇరవై సంవత్సరాల అనుభవం కలిగి ఉండాలనీ, యాభై కోట్ల రూపాయలు కార్పస్ ఫండ్‌గా డిపాజిట్ చేయాలనీ, కోర్సులను నడిపించడానికి కావలసిన ఆర్థిక, ఆర్థికేతర వనరులు ఉండాలనీ ఈ బిల్లు ప్రతిపాదించింది. ఈ విధంగా అందిన దరఖాస్తుపై

యు.జి.సి. ఏడు నెలలలోనే తన సిఫారసును కేంద్ర ప్రభుత్వానికి అందజేయాలి. ఈ సిఫారసుపై ఆధారపడి కేంద్ర ప్రభుత్వం ముప్పై రోజులలోనే ఈ యూనివర్సిటీకి లేదా విద్యా సంస్థకు గుర్తింపునివ్వాలి. విదేశీ విద్యా సంస్థలు పెట్టుకున్న దరఖాస్తును ఎవరెవరు ఎన్ని రోజులలో సిఫారసులు చేయాలి, కేంద్ర ప్రభుత్వం కూడా ఎన్ని రోజులలో గుర్తింపు ఇవ్వాలి అనేది 2వ అధ్యాయం 4వ సెక్షన్‌లోని 4 నుండి 8 వరకున్న నిబంధనలలో స్పష్టంగా రాశారు. దీన్ని బట్టి, విదేశీ విశ్వవిద్యాలయాలకు ఊడిగం చేయడానికి పాలకులు ఎంతగా సిద్ధంగా ఉన్నారో తెలుస్తుంది.

గుర్తింపు పొందిన విదేశీ విద్యాసంస్థలపై భారత ప్రభుత్వానికి గానీ, యు.జి.సి.కి గానీ ఎటువంటి నియంత్రణాధికారాలు ఉండబోవన్న విషయం ఈ బిల్లు వివరాలు పరిశీలిస్తే తెలుస్తుంది. ఈ విదేశీ విశ్వవిద్యాలయాలలో లేదా విద్యా సంస్థలలో పరిపాలనా వ్యవహారాలలో, విద్యార్థులు చేర్చుకొనే విషయాలలో, అధ్యాపకుల నియామకం విషయంలో ఈ దేశ ప్రభుత్వానికి ఎటువంటి నియంత్రణాధికారాలు ఉండవు. ఈ విదేశీ విద్యాసంస్థల నాణ్యతా ప్రమాణాలను పర్యవేక్షించడానికి ఎటువంటి నియంత్రణ వ్యవస్థ లేదు. అయితే ఈ విశ్వవిద్యాలయాలలో నాణ్యతా ప్రమాణాల విషయంలో ఏదేని ఫిర్యాదు వచ్చినపుడు దానిని యు.జి.సి. పరిశీలించదలచుకుంటే స్వయంగా కాకుండా ప్రైవేట్ అక్రిడిటేషన్ ఏజెన్సీలపై ఆధారపడాలి. మెరిట్‌తో సంబంధం లేకుండా, రిజర్వేషన్‌లతో సంబంధం లేకుండా, భారత రాజ్యాంగంలో పొందుపరిచిన సమానత్వపు హక్కు, సామాజిక న్యాయ హక్కులను నిరాకరిస్తూ ఈ విద్యాసంస్థలు తమ కార్యకలాపాలను కొనసాగించవచ్చు. రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకంగా ఈ విదేశీ విద్యా సంస్థలు కొనసాగించే కార్యకలాపాల వలన అనేక వివాదాలు తలెత్తుతాయనే విషయాన్ని గ్రహించిన పాలకులు ఈ బిల్లుతోపాటు విద్యా ట్రిబ్యునల్ బిల్లును కూడా తీసుకొస్తున్నారు. విద్యారంగంలో వివాదాలకు నాంది పలికే విదేశీ వాణిజ్యాన్ని నిషేధించడానికి బదులు, దానిని అనుమానిస్తూ కోకొల్లలుగా తలెత్తుతున్న వివాదాలను కోర్టుల పరిధి నుండి తప్పించి ఈ ట్రిబ్యునల్‌కు అప్పచెప్పబోతున్నారు. ఈ ట్రిబ్యునల్‌ల ద్వారా విద్యారంగంపై కోర్టులకున్న తీర్పు చెప్పే అధికారాన్ని కుదించి వేసి ప్రభుత్వం చేతుల్లో పూర్తిగా కీలుబొమ్మలుగా ఉండే ట్రిబ్యునల్ ద్వారా విదేశీ విశ్వవిద్యాలయాలకు అనుకూలమైన తీర్పులు ఇచ్చే ఏర్పాట్లు చేస్తున్నారు. ఈ విధంగా విదేశీ విశ్వవిద్యాలయాల బిల్లు, విద్యా ట్రిబ్యునల్ బిల్లు, ఇతర బిల్లులను సమగ్రంగా పరిశీలిస్తే విదేశీ విశ్వవిద్యాలయాలకు విద్యార్థులనూ, వారి తల్లిదండ్రులనూ, అధ్యాపకులనూ నిలువు దోపిడీ చేయడానికి, రాజ్యాంగ నిబంధనలను ఉల్లంఘించడానికి విశృంఖలమైన అవకాశాలను కల్పించబోతున్నారని గ్రహించవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ విదేశీ విద్యాలయాలు భారత విద్యారంగంలో చొరబడుతున్న ప్రత్యేక ఆర్థిక మండలాలే.

వివిధ ఉత్పత్తి సేవా రంగాలలో ప్రభుత్వం అనుమతిస్తున్న ప్రత్యేక ఆర్థిక మండలాలకు ఈ విదేశీ ప్రైవేట్ విశ్వవిద్యాలయాలకు చాలా పోలికలున్నాయి. ప్రత్యేక ఆర్థిక మండలాలలో కార్మికుల హక్కులకు సంబంధించి, పని పరిస్థితులకు సంబంధించి యాజమాన్యాలపై ఎటువంటి నిబంధనలు లేవు. ఈ యాజమాన్యాలు నియామకాలలో సామాజిక న్యాయానికి విఘాతం కలిగిస్తున్నాయి. అయితే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మాత్రం ఈ ప్రత్యేక ఆర్థిక మండలాలకు పన్ను రాయితీలు విస్తృతంగా కల్పిస్తూ వాటి కొరకు పర్యావరణ నిబంధనలను కూడా సరళీకరిస్తున్నారు. ఈ మండలాలకు ప్రభుత్వం తన వద్ద ఉన్న భూమిని అతి తక్కువ ధరలకు కేటాయించడం గానీ, రైతాంగం నుండి బల ప్రయోగం ద్వారా భూములను సమీకరించి కేటాయించడం గానీ చేస్తున్నట్లే ఈ విదేశీ విద్యా సంస్థలకు భూమిని కేటాయిస్తారని జార్జియాటెక్ విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భూములు కేటాయించిన విషయాన్ని బట్టి రూఢీ అవుతుంది. ప్రత్యేక ఆర్థిక మండలాలకు కావలసిన విద్యుత్ లైన్లు, నీరు, రోడ్లు మొదలైన మౌలిక సౌకర్యాలను ప్రభుత్వాలు ఉచితంగా లేదా ఉదారంగా కల్పిస్తున్నట్లే ఈ విదేశీ విశ్వవిద్యాలయాలకు అన్ని వసతులు ఉచితంగా కల్పించే అవకాశం ఉంది. అయితే విదేశీ విశ్వవిద్యాలయాల బిల్లులో అవి పాటించవలసిన నిబంధనల ప్రస్తావన లేకపోలేదు. ఏదేని విదేశీ విద్యా సంస్థ ఈ చట్టంలోని నిబంధనలు గానీ, యు.జి.సి. 1956 చట్టాన్ని గానీ లేదా అమలులో ఉన్న మరే ఇతర చట్టాన్ని గానీ ఉల్లంఘిస్తే యు.జి.సి. ఆ విద్యా సంస్థలకిచ్చిన అనుమతిని రద్దు చేయవచ్చు. ఇటువంటి నిబంధనలు చూపించి ఈ బిల్లు చట్టమైతే విదేశీ విశ్వవిద్యాలయాలను నియంత్రించవచ్చని కొందరు వాదిస్తున్నారు. కాని ఈ విదేశీ విశ్వవిద్యాలయాలను పర్యవేక్షించే అధికారం ఈ చట్టం ద్వారా గానీ లేదా మరే ఇతర చట్టాల ద్వారా గానీ యు.జి.సి.కి ఇవ్వనపుడు ఈ విశ్వవిద్యాలయాలకు ఇచ్చిన అనుమతిని ఎలా రద్దు చేస్తుందని నిపుణుల వాదన. అందుకే ఈ విదేశీ విశ్వవిద్యాలయాలు భారత గడ్డపై వెలుస్తున్న నయా వలస రాజ్యాలేనన్నది తేటతెల్లమవుతుంది.

ఏటా 1.6 లక్షల మంది విదేశాలకు వెళ్లి చదువుకుంటున్నారు. ఆ దేశాలకు వెళ్లే ముందు మన బ్యాంకుల నుండి నలభై కోట్ల డాలర్ల విదేశీ మారక ద్రవ్యాన్ని తీసుకొని అక్కడ ఖర్చులకు ఉపయోగించు కుంటున్నారు. ఇపుడు ఈ విదేశీ విశ్వవిద్యాలయాల బిల్లు చట్టమై విదేశీ విద్యాసంస్థలు మనదేశంలోకి అనుమతిస్తే భారతదేశం ఆ నాలుగు వందల కోట్ల డాలర్ల విదేశీ మారక ద్రవ్యాన్ని ఆదా చేసుకోవచ్చని ఒక వాదన.

అయితే ఇలా వాదించేవాళ్లు బయటికి వెళ్లి ఉద్యోగం చేస్తూ, ఫెలోషిప్ తీసుకుంటూ చదువుకునే విద్యార్థుల నుండి గానీ, చదువుకుంటూ గానీ, చదువు అయిన తర్వాత గానీ ఉద్యోగాలు చేస్తూ మన దేశానికి రెమిటెన్‌సెస్ రూపంలో పంపించే విదేశీ మారకద్రవ్యం గురించి మరిచిపోతున్నారు. మన దేశానికి సంవత్సరానికి పంపించే రెమిటెన్‌సెస్ మొత్తం నాలుగు వేల మూడు వందల యాభై కోట్ల డాలర్లు ఉండవచ్చని ఒక అంచనా. అంటే విదేశాలకు వెళ్లే విద్యార్థులు తమ తల్లిదండ్రులకు పంపించే డబ్బులూ, వారు తీసుకున్న అప్పులను తీర్చే మొత్తమూ, ఆ అప్పులపై చెల్లించే వడ్డీ మొత్తం కలిపి సంవత్సరానికి నాలుగు వేల మూడు వందల యాభై కోట్ల డాలర్లు. అంటే విదేశీ విశ్వవిద్యాలయాలు రాకముందు మన విదేశీ విద్యకోసం వెళ్లే విద్యార్థుల కోసం ఖర్చు పెట్టే విదేశీ మారకద్రవ్యం నాలుగు వందల కోట్ల డాలర్లైతే మన దేశానికి రెమిటెన్స్ రూపంలో వచ్చే మొత్తం సంవత్సరానికి నాలుగు వేల మూడు వందల యాభై కోట్ల డాలర్లు. ఖర్చుపెట్టిన దానికంటే పది రెట్లకు పైగా విదేశీ మారక ద్రవ్యం మనకు తిరిగి వస్తుందన్నమాట. కనుక విదేశీ విశ్వవిద్యాలయాలు వస్తే, విదేశీ మారక ద్రవ్యం ఆదా అవుతుందనడం వాస్తవాలను వక్రీకరిస్తుంది. పైగా రెమిటెన్‌సెస్

రూపంలో వచ్చే దాదాపు మూడు వేల తొమ్మిది వందల కోట్ల డాలర్ల విదేశీ మారక ద్రవ్యం రాకుండా పోవచ్చు.

అయినా విదేశీ మారకద్రవ్య నిలువలకూ, విద్యారంగానికీ ఏమి సంబంధం? విదేశీ మారక ద్రవ్య నిలువలు పెరిగితే, విద్యారంగానికి కేటాయింపులు పెరుగుతాయా? 1991లో విదేశీ మారకద్రవ్య నిలువలు ఐదు వందల ఎనభై కోట్ల డాలర్లు మాత్రమే. అయితే 2010లో అవి మూడు లక్షల కోట్ల డాలర్లకు చేరుకున్నాయి. ప్రజల నుండి, ఉద్యోగస్తుల నుండి మూడు శాతం విద్యాపన్ను వసూలు చేసిన తర్వాత కూడా విద్యా రంగానికి ఖర్చు జి.డి.పి.లో 4 శాతం నుండి 3.5 శాతానికి తగ్గిపోయింది. కనుక విదేశీ మారక ద్రవ్య నిలువలకూ, విద్యారంగానికీ సంబంధం లేదు. అసలు విదేశీ మారక ద్రవ్య నిలువల ఆదా అనేది వాదనే కాదు. ఇపుడా నిలువలు మూడు లక్షల కోట్ల డాలర్లు దాటి జి.డి.పి.లో 20-25 శాతం ఉంది. దిగుమతులు చేసుకోవడానికి పది శాతం ఉంటే సరిపోతుందని నిపుణుల అంచనా. కుప్పలు తెప్పలుగా పెరుగుతున్న ఈ విదేశీ మారక ద్రవ్య నిలువలకు విద్యారంగానికి, ప్రజా సంక్షేమానికి సంబంధమే లేదు. 'లోభికి మూట నష్టి' అన్నట్లుగా పెరుగుతున్న ఈ నిలువల మారక విలువ ఎపుడైనా పడిపోయి ఒకసారే కుప్పకూలవచ్చు.

విద్యా వ్యాపారాన్ని నిస్సిగ్గుగా ప్రోత్సహించిన ఈ విదేశీ విశ్వవిద్యాలయాల బిల్లు, యూనివర్సిటీ ప్రాస్పెక్టస్‌లను అమ్మడంలో లాభాపేక్ష ఉండకూడదనే హాస్యాస్పద వ్యాఖ్యాలు చేసింది. రెండవ అధ్యాయం 5వ సెక్షన్‌లోని 3వ నిబంధనలో చెప్పినట్లుగా వచ్చిన లాభాలను వెనక్కు తీసుకునే వీలులేదు కాబట్టి, ఇక్కడే విద్యావ్యాప్తికి ఖర్చు పెట్టాలి కాబట్టి ఇది చాలా మంచిదని బూర్జువా ఆర్థికవేత్తలు బుకాయించవచ్చు. కార్పొరేట్ విద్యారంగానికి కాపలాదారునిగా పనిచేస్తున్న కపిల్ సిబాల్, ఈ బిల్లు విద్యారంగంలో అవకాశాలను, పోటీని పెంచి, మంచి నాణ్యతకు అవకాశం కల్పిస్తుందని వాదించవచ్చు. కాని వాస్తవాలు ఇంకో రకంగా ఉన్నాయి.

ఈ పోటీ ఎవరి మధ్య పెరుగుతుంది? విదేశీ వర్సిటీల మధ్యనా? ప్రఖ్యాతిగాంచిన విదేశీ విశ్వవిద్యాలయాలు ఇక్కడ నాణ్యమైన విద్య అందిస్తాయనుకోవడానికి ఆధారం లేదు. ఎందుకంటే ప్రపంచంలో పేరెన్నికగల విశ్వవిద్యాలయాలు ఏవీ భారతదేశానికి రావడానికి సిద్ధంగా లేవు. ఈ విషయాన్ని ఈ మధ్య మన దగ్గర జరిగిన సదస్సులో ఆయా యూనివర్సిటీల ప్రతినిధులే స్వయంగా వెల్లడించారు. అయితే విదేశీయతపై మోజున్న ఎగువ మధ్యతరగతికి చెందిన విద్యా మార్కెట్‌ను సొంతం చేసుకోవడానికి చౌకబారు విశ్వవిద్యాలయాలు వచ్చి నాసిరకం విద్యను అందించే అవకాశాలే అధికం. ఈ నాసిరకం విశ్వవిద్యాలయాల మధ్య పోటీ అంటే, 'సన్నాసులు సన్నాసులు రాసుకుంటే రాలేది బూడిదే' అన్నట్లు, ఈ పోటీ వలన నాణ్యత పెరగదు. డబ్బే మెరిట్‌గా చెలామణీ అయ్యే ఈ విదేశీ వర్సిటీలలో ఇటు తరతరాలుగా విద్యకు దూరంగా ఉంచబడ్డ వర్గాలు గానీ, అటు కష్టపడి చదువుకునే పేదలకు గానీ ప్రవేశం దక్కే అవకాశం లేదు. ఈ ప్రక్రియ ఇంకొక దుష్పరిణామానికి కూడా దారితీయవచ్చు. ఒకవైపు నాసిరకం విద్యతో విదేశీ విశ్వవిద్యాలయాల నుండి సర్టిఫికెట్లు పొందిన ధనిక విద్యార్థులు, ఇంకొక వైపు కష్టపడి చదువుకొని సర్టిఫికెట్లు పొందిన మన విశ్వవిద్యాలయాల విద్యార్థులు దరఖాస్తు చేసుకున్నారనుకుందాం. ఉద్యోగులను ఎంపిక చేసే సెలక్షన్ కమిటీ సభ్యులు విదేశీ భావదాస్యానికి గురైపోయిన ప్రస్తుత పరిస్థితులలో వీరు విదేశీ యూనివర్సిటీ సర్టిఫికెట్లకు ప్రాధాన్యతనిచ్చి మిగతా విద్యార్థులకు అన్యాయం తలపెట్టే ప్రమాదం ఉంది.

ఇక విదేశీ వర్సిటీలు మన దేశ వర్సిటీల మధ్య పోటీ పెరుగు తుందనడం అర్థరహితం. ఎందుకంటే మనదేశంలోని యూనివర్సిటీల పరిస్థితి హృదయ విదారకంగా ఉంది. మన రాష్ట్రాన్నే తీసుకుంటే ఒకప్పుడు జాతీయస్థాయిలో అత్యంత ప్రతిష్ట కలిగిన నాలుగు విశ్వ విద్యాలయాలలో ఉస్మానియా యూనిర్సిటీ ఒకటి. సైన్స్‌లో, అర్థశాస్త్రంలో ఆంధ్ర యూనివర్సిటీకి దేశంలోనే మంచి గుర్తింపు ఉండేది. ఇపుడు ఈ రెండు విశ్వవిద్యాలయాల పరిస్థితి అధ్వాన్నంగా తయారైంది. రాష్ట్ర ప్రభుత్వం అధ్యాపక పోస్టులను నింపకపోవడం వలన రాష్ట్ర వ్యాప్తంగా 2044 అధ్యాపక పోస్టులు ఖాళీగా ఉంటే ఒక్క ఉస్మానియా యూనివర్సిటీ లోనే 522 పోస్టులు ఖాళీగా ఉన్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నిధులు తగ్గించడం వలన ఖరీదైన పుస్తకాలు కొనలేక, అంతర్జాతీయ జర్నల్స్‌కి చందాలు కట్టలేక, సైన్స్ లాబొరేటరీలకు ఆధునిక పరికరాలు కొనలేక దీనస్థితిలో ఉన్నాయి. ఉస్మానియా, ఆంధ్రా విశ్వవిద్యాలయాల పరిస్థితి ఇలా ఉంటే కొత్తగా ఏర్పాటైన తెలంగాణ యూనివర్సిటీ, పాలమూరు యూనివర్సిటీ, కృష్ణా యూనివర్సిటీల పరిస్థితులను ఊహించుకోవచ్చు. ఇటువంటి పరిస్థితులలో మన యూనివర్సిటీలు విదేశీ వర్సిటీలతో పోటీపడి నాణ్యత పెంచుకుంటాయనడం అర్థంలేని విషయం. పోటీ అనేది సమానుల మధ్య ఉండాలి. కాని కపిల్ సిబాల్ మాత్రం తెలిసో తెలియకో అసమానుల మధ్య పోటీ అనే అప్రజాస్వామిక, అనాగరిక విలువని నమ్ముతున్నాడు.

విదేశీ సంస్థలు ఇక్కడ సంపాదించిన లాభాలను ఆయా దేశాలు వెనక్కు తీసుకొనే వీలులేదు అనే నిబంధన 2వ అధ్యాయం, 5వ సెక్షన్‌లోని 3వ పాయింట్‌లో ఉంది కాబట్టి మనకే మేలు జరుగుతుందనేది మరొక వాదన. భారత్‌లోని విశాలమైన విద్యా మార్కెట్‌ను సొంతం చేసుకోవడానికి ఏళ్ల తరబడి ఎదురుచూస్తున్న విదేశీ వర్సిటీలు ఇంత తొందరగా వెనక్కి వెళ్లడం జరగదు. ఏటా 1.6 లక్షల మంది విద్యార్థులు ఉన్నత విద్యకోసం విదేశాలకు వెళ్తున్నారు. ఇంత విస్తృత అవకాశాలు, భారీ మార్కెట్‌ను సంపూర్ణంగా కొల్లగొట్టడానికే ఈ నిబంధన చేర్చారన్నది స్పష్టం. రెండవ విషయం ఏమిటంటే విదేశీ వర్సిటీలు స్థాపించిన విదేశీ గుత్తపెట్టుబడిదార్లు ఇక్కడి వర్సిటీల ఆస్తులను చూపించి వేల కోట్ల డాలర్ల రుణాలు అంతర్జాతీయ బ్యాంకుల నుండి తీసుకొని ప్రపంచవ్యాప్తంగా తమ ద్రవ్య పెట్టుబడులు పెంచుకోవచ్చు. గత పాతిక సంవత్సరాలుగా ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ గమనం చూస్తే ఇది లాభసాటి నిబంధన అని వేరే చెప్పనక్కర లేదు. మూడవ విషయమేమిటంటే, ఈ లక్షలాది మంది విద్యార్థులు పీల్చి పిప్పి చేసిన తర్వాత ఈ నిబంధనను ఎత్తివేయమని ఈ వర్సిటీలు ఒత్తిడి తేవచ్చు. విదేశీ, స్వదేశీ కార్పొరేట్ సంస్థల చెప్పుచేతుల్లో నడుస్తున్న కేంద్ర ప్రభుత్వం ఈ నిబంధనను ఎత్తివేయవచ్చు.

గత అరవై మూడు సంవత్సరాలలో ఇంత ప్రమాదకరమైన బిల్లు రాలేదని గుర్తు చేసుకుంటే విదేశీ విశ్వవిద్యాలయాల బిల్లు వెనుక దాగిన ప్రమాద తీవ్రత అర్థమౌతుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రజాస్వామ్య భావాలు కలిగిన విద్యార్థులకూ, అధ్యాపకులకూ, ఉపాధ్యాయులకూ, మేధావులకూ ఈ విదేశీ విద్యాసంస్థల బిల్లు ఒక సవాల్. ఈ సవాల్‌కు అన్ని రకాలుగా ధీటైన జవాబు చెపుతారని ఆశిద్దాం.

*(రచయిత సెక్రటరీ, ఆంధ్రప్రదేశ్ విద్యాపరిరక్షణ కమిటీ)* ఈ

*రాజకీయ విప్లవ సిద్ధాంతాల అభివృద్ధికి భూమికగా ఉన్న ఫ్రాన్స్‌లోని తాజా కార్మికవర్గ వెల్లువ ప్రపంచ కార్మికులకు కొత్తదారులు చూపుతుందేమో వేచి చూడాలని అంటున్నారు* **పి. ప్రసాద్**

# ఫ్రాన్స్ కార్మికవర్గపు వెలుగురేఖలు

**రా**జకీయ తిరుగుబాట్లకూ, విప్లవ వెల్లువలకూ ఫ్రెంచ్ కార్మికవర్గం పెట్టింది పేరు! పెట్టుబడిదారీ దేశాలన్నింటికంటె భిన్నంగా ఫ్రెంచ్ కార్మికవర్గం చరిత్రలో విశిష్టమైన రాజకీయ పాత్రను పోషించింది. అన్ని ఆధునిక శాస్త్రాలకూ యూరప్ ఖండం పురిటిగడ్డగా పేరొందింది. ముఖ్యమైన మూడు శాస్త్రాలు ముఖ్యమైన మూడు యూరప్ దేశాలలో చారిత్రకంగా అభివృద్ధి చెందాయి. తత్వశాస్త్రం జర్మనీలో అభివృద్ధి చెందితే, అర్థశాస్త్రం బ్రిటన్‌లో అభివృద్ధి చెందింది. ఈ రెండింటికి భిన్నంగా ఫ్రాన్స్‌లో రాజకీయ విప్లవ సిద్ధాంతాలు అభివృద్ధి చెందాయి. అందుకే 'ఫ్రాన్స్‌కు తుమ్ములొస్తే, యూరప్‌కి జలుబు చేస్తుందన్న' సామెత పుట్టింది. అలాంటి ఫ్రాన్స్ దేశ కార్మికవర్గం నేడు నయా ఉదారవాద విధానాల మీద సంఘటిత, సమరశీల పోరాటాలకు సన్నద్ధమౌతున్నది. అది మొత్తం యూరప్ కార్మిక వర్గానికే మార్గదర్శక పాత్రను పోషిస్తున్నది.

ఆధునిక చరిత్రలో ఫ్రాన్స్ ఐదుసార్లు ప్రపంచ చరిత్ర పుటల కెక్కింది. ఈ ఐదుసార్లు కూడా ప్రపంచ చరిత్ర గమనానికి ఫ్రాన్స్ ఒక చోదక శక్తిగా నిలిచింది. ఒక్కొక్కసారి ఒక్కొక్క రకం అగ్రగామి పాత్రను పోషించింది. అయితే మొదటిసారి పెట్టుబడిదారీ వర్గమే చారిత్రకంగా విప్లవకర పాత్రను పోషించింది. మిగిలిన నాలుగు సార్లూ కార్మికవర్గమే అట్టి చారిత్రక బాధ్యతను నిర్వర్తించింది. ఇప్పుడు ఐదవసారికి మళ్ళీ ఫ్రాన్స్ రంగస్థలిగా మారుతున్నదా? ఈ ఊహాగానాలు నేడు ప్రపంచ మేధోవర్గాల నుంచి ఉత్పన్నమౌతున్నాయి.

బూర్జువా ప్రజాతంత్ర విప్లవంగా పిలవబడుతున్న పారిశ్రామిక విప్లవం ఫ్రాన్స్‌లో బలప్రయోగంతో సాగింది. అది 1789లో విజయవంతమైనది. 1793 వరకూ జాకొబిన్ల పాలనలో కొనసాగింది. ఆధునిక ప్రపంచ చరిత్రలో దానికొక సముచిత ప్రత్యేక స్థానం వుంది. రాజవంశీయులైన ప్రభు వర్గాన్ని లక్షలాది ప్రజల సమక్షంలో ఉరితీసిన విప్లవ చరిత్రను ఫ్రాన్స్ స్వంతం చేసుకున్నది. ప్రపంచ చరిత్ర గతినే అది మార్చివేసింది. దానితో పాటే పుట్టిన ఆధునిక పారిశ్రామిక కార్మికవర్గం మరో కొత్త చరిత్ర రచనకు పూనుకున్నది. ఫ్రెంచ్ కార్మిక వర్గాన్ని సృష్టించిన పెట్టుబడిదారీ వర్గం బలప్రయోగాన్ని ఆయుధంగా ధరించింది. అదే వారసత్వ చారిత్రక నీతిని ఫ్రాన్స్ కార్మికవర్గం పుట్టుకతోనే నేర్చుకుంది. ఫ్యూడలిజం మీద తన కొత్త యజమానులు ధరించిన ఆయుధాన్నే ఫ్రెంచ్ కార్మికవర్గం జన్మతః ఆదర్శంగా స్వీకరించింది. అందుకే సాపేక్షికంగా మిగిలిన యూరప్ దేశాల కార్మికవర్గం కంటె ఫ్రాన్స్ కార్మికవర్గం చరిత్రలో ఒకింత ఎక్కువ విప్లవకర పాత్రను పోషిస్తూ వచ్చింది. ఫ్రెంచ్ కార్మికవర్గ ప్రత్యేక వారసత్వ చారిత్రక పాత్ర ఇదే!

పారిశ్రామిక విప్లవానంతరం సరిగ్గా అరవై ఏండ్లకి ఫ్రాన్స్ ఒక నూతనమైన తొలి విప్లవ చరిత్రను రచించింది. 1848లో ఫ్రెంచ్ కార్మికవర్గం ఒక పెద్ద తిరుగుబాటు చేసింది. చరిత్రలో జూలై విప్లవంగా పిలవబడ్డ ఆనాటి ఫ్రెంచ్ కార్మికవర్గ తిరుగుబాటు యూరప్‌ను కుదిపి వేసింది. దానికి సంధ్యాకాంతులీనుతున్న వేకువవేళ రచించిందే 'కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక'. మార్క్స్-ఎంగెల్స్‌లను ఎంతో గొప్పగా ప్రభావితం చేసిన విప్లవమది. వారు దాని గూర్చి అనేక వ్యాసాలనూ, గ్రంథాలనూ, సమీక్షలనూ రచించారు. అంతకు పదేండ్ల ముందు వరకూ కొనసాగిన బ్రిటిష్ చార్టిస్టు కార్మికోద్యమానికీ, లుడైట్ల యంత్ర విధ్వంస ఉద్యమానికీ భిన్నమైన విప్లవమది. అది అత్యంత హింసాయుతంగా, విషాదకరంగా అణిచివేయబడింది. అయినా అది ప్రపంచ కార్మికవర్గానికి ఒక చారిత్రక రాజకీయ పాఠాన్ని నేర్పింది. ముఖ్యంగా మార్క్సిస్టు సిద్ధాంతాభివృద్ధికి ఎంతో సహకరించింది. ఇది ఫ్రెంచ్ కార్మికవర్గం సాగించిన ప్రథమ విప్లవ తిరుగుబాటుగా పేరొందింది.

జూలై తిరుగుబాటు రక్తసిక్తంగా అణిచివేయబడిన ఫ్రెంచ్ నేల మీద కేవలం 23 ఏండ్లకే మరో కార్మికవర్గ విప్లవ తిరుగుబాటు తలెత్తింది. 1871లో తలెత్తిన ఈ విప్లవ తిరుగుబాటు ఏకంగా తొలి కార్మికవర్గ రాజ్యాన్ని స్థాపించింది. అది 71 రోజులపాటు మనుగడ సాగించింది. భూమండలం మీద ఏర్పడ్డ తొలి కార్మికవర్గ రాజ్యమిదే! ఇదే చరిత్రలో 'పారిస్ కమ్యూన్'గా పేరొందింది. ఫ్రాంకో-జర్మన్ యుద్ధంలో థేర్స్ చక్రవర్తి చేసిన దేశ ద్రోహంపై ఆగ్రహం చెందిన నాలుగు లక్షల మంది పారిస్ కార్మికుల తిరుగుబాటు ఫలితమది. అది కూడా హింసాయుతంగా అణచబడింది. విషాదాంతమైనది. కానీ అది మార్క్సిజాన్ని ఉన్నతీకరించింది. ప్రపంచ కార్మిక వర్గానికి సరైన సైద్ధాంతిక మార్గదర్శకత్వాన్ని అందించడానికి ఒక పాఠంగా సహకరించింది. సోషలిజం స్వప్న సీమ కాదని ప్రపంచానికి ఆచరణాత్మకంగా నిరూపించింది. ఇది ఫ్రెంచ్ కార్మికవర్గం సాగించిన రెండవ విప్లవ తిరుగుబాటుగా చరిత్రలో పేరొందింది.

పారిస్ కమ్యూన్ అనంతరం సుమారు ఆరున్నర దశాబ్దాల తర్వాత ప్రపంచ కార్మికవర్గ చరిత్రలో ఫ్రాన్స్‌కు మరోసారి చోదక స్థానం దక్కింది. మొదటి ప్రపంచ యుద్ధంలో ఫ్రాన్స్ కార్మికవర్గం తన చారిత్రక వారసత్వ పాత్రను పోషించలేక పోవడం ఒక విషాదకర పరిణామమే! 1911లో బాస్లే ప్రణాళిక నాటికి సముచిత పాత్రనే అది పోషించింది. కానీ యుద్ధారంభంలో బెర్న్‌స్టెయిన్, కారల్‌కాట్స్కీల జాతీయ దురహంకార పంథాలోకి అది మొగ్గింది. ఒకవేళ రెండవ ఇంటర్నేషనల్‌లో లెనిన్ చేపట్టిన విప్లవ పంథా వైపుకే ఫ్రెంచ్ కార్మికవర్గం మొగ్గివుంటే, యుద్ధ

ఫలితాలు మరో రకంగా ఉండేవేమో! అయితే మహామాంద్యం (1929) తర్వాత ఫ్రాన్స్‌లో విప్లవ ట్రేడ్ యూనియన్ల నిర్మాణం, విస్తరణలు వేగంగా పెరిగాయి. 1935 నాటికే అవి దేశ రాజకీయ వ్యవస్థను శాసించే స్థాయికి ఎదిగాయి. 1936లో చరిత్రాత్మక పాపులర్ ప్రభుత్వ స్థాపనలో ఫ్రెంచ్ కార్మికవర్గం కీలకపాత్రను పోషించింది. ఫాసిస్టు ఫ్రాంకో దాడులకు బలౌతున్న స్పానిష్ ప్రజా ప్రభుత్వానికి ఫ్రాన్స్‌లోని లియోబమ్ ప్రభుత్వం అండగా నిలబడని ద్రోహాన్ని అది ఎదిరించింది. హిట్లర్-ముస్సోలినీల ఎదుట తలవంచిన ఫ్రెంచ్ పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వం మీద ఫ్రెంచ్ కార్మికవర్గం తిరగబడింది. చరిత్రలో అది కూడా ఓటమి పొందింది. అయినప్పటికీ, ఆ తర్వాత రెండవ ప్రపంచ యుద్ధకాలపు పురోగమన పోరాటాలకు రాజకీయ పునాది వేసింది. ఇది ఫ్రెంచ్ కార్మికవర్గం సృష్టించిన మూడవ విప్లవ చోదక చరిత్రగా పేరొందింది.

సుమారు మరో మూడున్నర దశాబ్దాల తర్వాత 1968లో ఫ్రాన్స్‌లో మరో కార్మికవర్గ పోరాటం తలెత్తింది. ఈసారి విద్యార్థులతో ఆరంభమైంది. దానిని కార్మికవర్గం ముందుకు తీసుకెళ్ళింది. ఇదే చరిత్రలో 'రెక్కవిప్పిన రెవల్యూషన్'గా పేరొందింది. వియత్నాం విప్లవ పోరాటానికి సంఘీభావంగా పారిస్ విశ్వవిద్యాలయ విద్యార్థి లోకంతో తొలుత ఇది ప్రారంభమైనది. దీనిని వెనువెంటనే అమెరికన్ దురాక్రమణ వ్యతిరేక పోరాటంగా కార్మికవర్గం మార్చివేసింది. ఆనాటి డీగాల్ ప్రభుత్వాన్ని కూల్చివేసే స్థాయికి ఎదిగింది. యూరప్ ఖండాన్నే వణికించింది. వియత్నాం, కంపూచియాలలో అణుబాంబు ప్రయోగానికి తెరవెనక పెంటగాన్ సన్నాహాలు చేస్తున్న కాలమది. కానీ ఫ్రెంచ్ కార్మిక తిరుగుబాటు అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని భీతిల్లజేసింది. ఆఖరి అస్త్రంగా అణుబాంబు ప్రయోగానికి సిద్ధమౌతున్న అమెరికాను, అది ఇరకాటంలోకి నెట్టింది. దానికి బదులుగా, క్రమేణా ఇండో-చైనా నుంచి అది తోక ముడుచుకోవాల్సి వచ్చింది. అలాంటి పరిస్థితిని అమెరికాకి ఫ్రాన్స్ కార్మికవర్గం, విద్యార్థిలోకం సృష్టించింది. ఇది అంతకు ముందు జరిగిన మూడు విప్లవాల వంటి లోతైన విప్లవ పోరాటం కాకపోవచ్చు. ఇది అంతకు ముందు మూడింటి వలె అణిచివేతతో విషాదాంతం కాక పోవచ్చు! కానీ తమ స్వంత సమస్యలపై కాకుండా, సంఘీభావంగా తలెత్తిన ఒక పోరాటం ప్రపంచ దురాక్రమణదార్ల గమనాన్ని ఒకింత దారి మళ్లించగలిగింది. చరిత్రలో దానికి కూడా చాలా రాజకీయ, చారిత్రక ప్రాధాన్యత ఉంది. ప్రపంచ కార్మికవర్గ చరిత్రలో ఫ్రాన్స్ కార్మికవర్గం పోషించిన నాల్గవ చోదక చరిత్ర!

చరిత్రలో మరో నలభై ఏండ్ల కాలం గడిచి పోయింది. ఇందులో చివరి ఇరవై ఏండ్లు, ప్రపంచ చరిత్ర గమనం అత్యంత విషాదకరంగా సాగింది. ప్రచ్ఛన్నయుద్ధానంతరం, గతించిన ఈ ఇరవై ఏండ్ల కాలంలో ఏకధ్రువ ప్రపంచ స్థితి రాజ్యమేలింది. ఇరాక్ ఓ సుదీర్ఘ విషాద విధ్వంస కాండలకి ప్రతీకగా నిలుస్తుంది. గతంలో వియత్నాంకి అండగా గర్జించిన ఫ్రెంచ్ కార్మికవర్గం గొంతు కూడా మూగబోయింది. గ్లోబలైజేషన్ బలుపుతో కొవ్వెక్కిన అమెరికన్, యూరప్, ఇతర బూర్జువా రాజ్యాలు తమ దేశాలలోని కార్మికవర్గాలకు ఒకింత అదనపు రాయితీలను కల్పించాయి. లెనిన్ చెప్పినట్లు బ్యూరాక్రటిక్ ట్రేడ్ యూనియన్ల నిర్మాణాన్ని అవి చేపట్టగలిగాయి. కానీ చరిత్ర ఎల్లప్పుడూ ఒకే రకంగా సాగదు. అది నిత్యచలన శీలమైనది. తొలి ఇరవై ఏండ్లు ప్రపంచీకరణ విధానాలు మూడో ప్రపంచ దేశాల ప్రజల జీవితాలకు చిచ్చు పెట్టాయి. ఇప్పుడవి తమ స్వంత దేశాల కార్మికవర్గ హక్కులకే ఎసరు పెడుతున్నాయి. ఈ నేపథ్యంలో నేడు యూరప్ దేశాల కార్మికవర్గం కూడా ఉవ్వెత్తున ఉద్యమిస్తున్నది. ముఖ్యంగా ఫ్రెంచ్ కార్మికవర్గం ఇందులో మరింత ముందున్నది.

ఫ్రాన్స్ దేశాధ్యక్షుడైన సర్కోజీ సర్కారు ప్రవేశపెట్టిన సంస్కరణల వల్ల కార్మికవర్గ హక్కులకు భంగం కలుగుతున్నది. అది తన పెన్షన్ సౌకర్యాలను కోల్పోతున్నది. జీత భత్యాలలో కోతలను ఎదుర్కొంటున్నది. ఉపాధి అవకాశాలను కోల్పోతున్నది. పనిభారం పెరుగుతున్నది. అందుకే గత 3 నెలలుగా నిరంతర పోరాటాలను సాగిస్తున్నది. ఐదారుసార్లు దేశ వ్యాపిత సార్వత్రిక సమ్మెలు జరిగాయి. అక్టోబరు 12న దేశంలో ముప్పై ఐదు లక్షల మంది కార్మికులు ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలు చేశారు. ఒక్క పారిస్ నగరంలోనే మూడున్నర లక్షల మందితో మహా కార్మిక ప్రదర్శన జరిగింది. ప్రచ్ఛన్నయుద్ధానంతరం జడాత్మకతను ప్రదర్శించిన ఫ్రెంచి కార్మికవర్గం నేడు వెల్లువెత్తింది. ఇది రాజకీయ వర్గాలను విస్మయానికి గురి చేస్తున్నది.

ప్రచ్ఛన్న యుద్ధానంతరం ఏర్పడిన ప్రత్యేక ప్రపంచంలో తాజా ఫ్రాన్స్ కార్మిక వర్గ వెల్లువ ఓ కొత్త చరిత్రను సృష్టిస్తుందా? ప్రపంచ చారిత్రక గమనంలో అది ఏ పాత్ర పోషిస్తుంది? భారత్ వంటి మూడో ప్రపంచ దేశాల కార్మికవర్గానికి ఏ మేరకు దిశా నిర్దేశం చేస్తుంది?

యూరో ప్రాంతంలో ఏ మార్పులను తెస్తుంది? డాలరు-యూరోల మధ్య సంబంధాలను అది ఎలా ప్రభావితం చేస్తుంది? యూరో సభ్యదేశాల వార్షిక ద్రవ్యలోటును విధిగా మూడు శాతం లోపు నియంత్రించాలన్న యూరో కూటమి ఒప్పందం అమలవుతుందా? నేటి ఫ్రెంచ్ కార్మికవర్గ వెల్లువ ఇలాంటి అనేక సందేహాలను కలిగిస్తున్నది. రానున్న కాలమే తేల్చి చెప్పాలి. ఒకటి మాత్రం నిజం! సుదీర్ఘ గాఢ నిద్ర నుంచి మేలుకుంటున్న ఫ్రెంచ్ కార్మికవర్గం ప్రపంచ కార్మిక వర్గానికీ, ముఖ్యంగా భారత కార్మిక వర్గానికి కచ్చితంగా స్ఫూర్తి దాతగా నిలుస్తుందని ఆశించుదాం.

*(రచయిత ఐ.ఎఫ్.టి.యు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)* వీ

*చేనేతకు ఉద్దేశించిన రిజర్వేషన్‌లను తుంగలోకి తొక్కి, పవర్‌లూంలను ప్రోత్సహించడమే మన పాలకుల విధానంగా ఉందని అంటున్నారు* **అందె నరసింహారావు**

# చితికిపోతున్న చేనేతల బతుకులు

*'అందాలు చిందించి కళాత్మక వస్త్రాలను సృష్టించడం యంత్రాల వల్ల కాదు. అది చేనేత కళాకారునికి మాత్రమే సాధ్యమైన పని. తగిన వనరులు ఉపకరణాలు సమకూరిస్తే చేనేత కార్మికుడు తన మగ్గం నుంచి మిల్లులను మించిన ధీటైన వస్త్రాలను సృష్టించగలడు.'*

– ఎఫ్.బి. హెవల్.

భారత సాంప్రదాయానికి, లక్షలాది మంది చేనేత కార్మికుల జీవనోపాధికి ఆధారమైన చేనేత గురించి లోతు తెలిసి, ఘనత చాటే ఎంతోమంది ఇంకా ఉండబట్టే, ఎన్ని అవాంతరాలు వచ్చినా, పవర్‌లూంల నుంచి ఎన్ని దాడులు జరిగినా ప్రభుత్వాలు ఎంత నిర్లక్ష్యం ప్రదర్శించినా చేనేత చావకుండా బతికే ఉంది. తన సజీవతను చాటి చెపుతుంది. ఒకసారి వెనక్కి వెళ్లి చూస్తే, 1882 నాడే పి.ఎన్. మౌల్ 'మన ద్రవ్య విధానం' అనే గ్రంథంలో చేనేత ఒక ప్రాచీన అవశేషంగా మిగిలిపోతుందని, అసలిప్పటికీ చేనేత బతికి ఉందంటేనే ఆశ్చర్యం కలిగిస్తుందని రాసుకున్నాడు. మన పాలకులైతే ఇంకొద్ది గంటల్లోనే చేనేతను మ్యూజియంలోనే చూడగలమని, అది పూర్తిగా అంతరించి పోతుందని పగటి కలలు కన్నారు. ఆ కలలను నిజం చేసుకోవడానికి, కంటి ముందు దర్శించడానికి వారు పట్టు వదలక గట్టిగా ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు.

లేకపోతే నాడు బ్రిటిష్ వలస పాలకులు చేనేత పరిశ్రమ ఉనికి లేకుండా చేయడానికి చేయని దురాగతాలు లేవు. అనుసరించని కుయుక్తులు లేవు. చేనేతకు మౌలికంగా అవసరమైన చిలపనూలు అందకుండా చేయడం దగ్గర నుండి వస్త్ర వర్తకులకు అనుమతి ఇవ్వకుండా ఇబ్బందుల పాల్జేయడం, చేనేత కార్మికులు తమ పనితనం చూపకుండా, నేతే నేయకుండా 'చేతి' వేళ్లను నిర్దాక్షణ్యంగా నరికి తమ కక్షను తీర్చుకున్నారు. అద్భుత కళాఖండాల ముందు, చేతి నైపుణ్యంతో రూపుదిద్దుకున్న వస్త్రాల ముందు తమ యంత్ర వస్త్ర పరిశ్రమ తట్టుకోలేక పోతుందనీ, నిట్ట నిలువునా కుప్పకూలిపోతుందనీ భీతితో ఆ పని చేశారు. ప్రజల ప్రాణాలకంటే తమ యంత్ర పరిశ్రమ రక్షణే ముఖ్యమనుకున్న పర ప్రభుత్వం ఆ దాష్టికానికి పాల్పడితే అర్థం చేసుకోవచ్చు. మహోద్యమాలు నడిపి తరిమి కొట్టవచ్చు. మరి మన నల్లదొరలను ఏం చేయగలం? మన స్వంత ప్రభుత్వాలు విధానాల పరంగా ఇబ్బందుల పాల్జేస్తున్నారు. మిల్లుల వారికి, పవర్‌లూంల వారికి రాయితీలిచ్చి ప్రోత్సహిస్తున్నారు. స్వల్ప అండతో స్వయం పోషకంగా, ప్రభుత్వాలకు భారం కాకుండా ఉపాధిని పోదిచేసుకున్న చేనేత చావు కోరుకుంటున్న పాలకులను, ప్రభుత్వాలను ఏమనాలి?

2003లో పెరిగిన ముడి సరుకుల ధరలు, చేనేతకు బెడదగా మారిన నకిలీ వస్త్రాలు తదితర జటిల సమస్యలపై పాలకులను కలిసిన చేనేత బృందం తమ అంతరంగాన్ని ఆవిష్కరించారు. 'ఇంకా ఎందుకు ఆ టిక్కు టిక్కుమనే గుంటమగ్గం. గుంట మగ్గాలకు కాలం చెల్లింది. ప్రపంచం చూడండి, ముందుకు పోతోంది. టెక్నాలజీ పెరిగింది. స్విచ్ నొక్కితే నేసుకునే మగ్గాలు వచ్చాయి. గుంట మగ్గాల్లో ఇంకా ఎన్నాళ్లుంటారు. ఈ సమస్యలెందుకు మీరు మారిపోండి' అని తియ్యగా సెలవిచ్చారు. 1 జనవరి 2005 నుండి ప్రపంచ వాణిజ్య ఒప్పందం అమలవుతుందని, ఆ స్వేచ్ఛా వాణిజ్య తాకిడికి చేనేత నిలవలేక కొట్టుకు పోతుందని వారి అంచనా అయి ఉంటుంది.

స్వేచ్ఛా భారతంలో చేనేత కార్మికుడు స్వేచ్ఛగా రోధిస్తున్నాడు. స్వాతంత్ర్యోద్యమ రోజులలో మన జాతీయ నాయకులు మనకు నూరిపోసిన ఆశయాలకు, ఆకాంక్షలకు ఇన్ని దశాబ్దాల తరువాత మన కళ్ల ముందు పరుస్తున్న విషాదాలకు, విఘాతాలకు పొంతన కుదరక, జరుగుతున్న విపరిణామాలకు ఎవర్ని నిందించాలో తెలియకుండా పోతున్నాడు.

పరప్రభుత్వంపై మహాత్మాగాంధీ తదితర నాయకులు పెద్ద ఉద్యమం నడిపారు. చరఖాపై నూలు వడికారు, జాతినంతా ఒక్క తాటిపై నడిపారు. విదేశీ మిల్లుల వస్త్రాలు బహిష్కరించి, చేనేత వస్త్రాలను ధరించమని పిలుపిచ్చారు. అంతటితో సరిపెట్టుకోక 1905లో బెంగాల్‌లో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభలో 'చేనేత వస్త్రాలే ధరించాల'ని తీర్మానం చేశారు. విదేశీ వస్త్రాలను వీధుల్లో కుప్పలు పోసి నిప్పంటించారు. వలస పాలకులకు బుద్ధి చెప్పారు. చేనేతను రక్షించారు. రాట్నంతోనే స్వరాజ్యం వస్తుందని నమ్మి కాంగ్రెస్ జెండాలో రాట్నం గుర్తుగా పెట్టుకున్నారు. చేనేతకు పూర్వ వైభవం వస్తుందని, చేనేత అభివృద్ధికి కృషి చేసి, కార్మికులలో నిండుగా ఆత్మవిశ్వాసం నింపి, నైతికంగా బలమిచ్చి నిలబెట్టారు.

చరిత్రలో చరిత్రగా ఉన్న చేనేత పరిశ్రమ, చేనేత కార్మికుడు నేడు బతకలేక, నమ్ముకున్న వృత్తి కూడు పెట్టక, చేసిన అప్పులు తీరక, సంసారాలు గడవక, అనారోగ్యం వదలక ఆకలి చావులు, ఆత్మహత్యలకు పాల్పడుతున్నాడు. ఎందుకని?

నిశితంగా, నిష్పక్షపాతంగా పరిశీలించకపోతే చరిత్ర క్షమించదు. కాలం తలకిందులుగా మారిపోయింది. టెక్నాలజీ పెరిగింది. శాస్త్ర సాంకేతిక రంగాలలో అనూహ్య మార్పులు చోటు సంపాదించుకున్నాయి. ఈ సైన్స్ సునామిలో ఒక పురాతన చేనేత పరిశ్రమ, పూర్తిగా మానవ శ్రమమీద ఆధారపడిన సాంప్రదాయక వస్త్ర పరిశ్రమ బతికి బట్టకట్టడం కష్టమేనని చాలా మంది అభిప్రాయం. చేనేతేతరులలో కూడా 'నిత్యం చచ్చే కంటే ఆ వృత్తి మారకూడదా? ఇంకా ఆ గుంట మగ్గాలలోనే ఉంటామంటారే? వీళ్లకేమన్నా పిచ్చా?' అనుకుంటారు. ఇటు ప్రభుత్వం కూడా 'ఎంత సాయం చేసినా బతకదు కదా? పవర్‌లూం, మిల్లుల ధాటికి నిలబడదు కదా?' అన్నది ఏలినవారి ధృడమైన నమ్మిక. అయితే వాస్తవం ఏమిటి?

బహుళజాతి సంస్థల వాణిజ్య వ్యాపారులకు తలవొగ్గి, అప్పుల కోసం ప్రపంచ బ్యాంక్ వద్ద మోకరిల్లి, వారి ఆదేశానుసారం నడుచుకునే భారత ఆర్థిక వ్యవస్థలో, సమతూకంలేని, సమన్యాయం తెలియని, లాభాలే

పరమావధిగా, సంక్షేమం చెబుతూ సంక్షోభాలను సృష్టించే పాలకుల విధానాలతో, యంత్రాలే భూతాలై, చేతి వృత్తులను, చేనేతను పొట్టన పెట్టుకుంటుంటే, పట్టనట్టు ఊరుకొంటున్న పాలకులను ప్రశ్నించ వద్దా? పరిష్కారం చూపమనడం తప్పా! అయితే ఇక్కడ ఒక విషయం స్పష్టం చేయడం మంచిది. చేనేత కార్మికుడు ఆధునికతను ఆహ్వానించలేని వాడుకాదు. నూతనత్వానికి వ్యతిరేకం అంతకన్నా కాదు. అంతమాత్రాన అది తన బతుకును బలపెట్టికాదు. యాంత్రీకరణ మోజులో మోస పుచ్చుతుంటే భరించడానికి సిద్ధంగానూ లేదు.

నాడు స్వదేశీ నినాదంతో అధికారానికొచ్చిన (ఎన్.డి.ఎ.– బి.జె.పి.) ప్రభుత్వం ప్రొఫెసర్ ఎస్. ఆర్. సత్యం కమిటీ వేస్తే, చేనేతను సొంతం భూస్థాపితం చేసే సిఫార్సులు చేశారు. చేనేత కార్మికులందరు మగ్గం గుంటలు ఒదిలి, పవర్‌లూంలకు మారితే ప్రపంచస్థాయికి ఎదుగుతారని బోధించాడు. చేనేతకు ప్రాణప్రదమైన చిలపనూలు అవసరం లేదన్నాడు. చేనేతకు ప్రత్యేకమైన రిజర్వేషన్‌లు అక్కర లేదన్నాడు. ఈ సిఫార్సులను చేనేత వర్గీయులు సహజంగానే వ్యతిరేకించారు, ఉద్యమించారు. స్వయంగా ఆనాటి ప్రధాని అటల్ బిహారీ వాజ్‌పాయ్‌ని కలిసి చేనేత బృందాలు నిరసన తెలియజేశాయి. తాకిన నిరసన సెగలు మన్నించి పార్లమెంట్‌లో పెట్టకుండా అమలు జరుపుతున్నారు. అదే ప్రభుత్వం చిలపనూలు పై తొమ్మిది రూపాయల ఎక్సైజ్ డ్యూటీ విధించి సత్యం కమిటీ రుణం తీర్చుకుంది. ప్రభుత్వాలేవయినా, జెండా లేమయినా విధానాలు మాత్రం ఒక్కటే. చేనేత వ్యతిరేక విధానాలే అమలు జరిపారు. కార్మికులు మాత్రం పిట్టల్లా రాలిపోతున్నారు.

ఇదే సందర్భంలో మన రాష్ట్రంలో వై.ఎస్. రాజశేఖరరెడ్డి నాయకత్వాన కాంగ్రెస్ పార్టీ 2004లో జరిగిన ఎన్నికలలో అధికారానికి వచ్చింది. రాజశేఖరరెడ్డి రాష్ట్రంలో విస్తృత పాదయాత్రలు చేసి, ప్రజల కష్టాలు పరిశీలించి పరిష్కరిస్తానని హామీలు గుప్పించి అధికారం చేజిక్కించుకొన్నారు. చేనేత కార్మికుల కడగండ్లను తీర్చడానికి చేనేత వృత్తి బాధల నుండి గట్టెక్కించడానికి సీనియర్ మంత్రి రోశయ్య నాయకత్వాన 17 జూలై 2004న నిపుణుల కమిటీ వేశారు. 22 ఆగస్ట్ 2005న కమిటీ తన నివేదికను ప్రభుత్వం వద్దకు తెచ్చింది. కమిటీ వేసిన రాజశేఖరరెడ్డికి ఏమనిపించిందో మనకు తెలియదు కాని, రోశయ్య నిపుణుల కమిటీ మీద ఎన్నో ఆశలు పెట్టుకున్న చేనేత ప్రజల ఆశల మీద నీళ్లు పోసింది. మనవాడు రోశయ్య, మన చీరాల నుండి ఎన్నికై, మన సమస్యలు తెలిసిన రోశయ్య, ఆయన కమిటీ, ఆయన బృందం కచ్చితంగా తమకు న్యాయం చేస్తారని ఆశించిన చేనేత పారిశ్రామికులకు ఎంతో నిరాశే మిగిలింది. రోశయ్య కమిటీ ముప్పై నాలుగు అంశాల సిఫార్సులు చేసినా, అసలు మౌలిక సమస్యల జోలికే వెళ్లలేదు. తనను నమ్మి, ఎన్నికలలో గెలిపించి నిలబెట్టిన ప్రజలకు న్యాయం చేసే అవకాశం లభించిన ఏకైక సందర్భం వచ్చినా ఎందుకు విస్మరించవలసి వచ్చిందో రోశయ్య అంతరంగాన్ని విప్పనే లేదు.

ఏ పరిస్థితుల్లో ఎవరినుద్దేశించి ఆ కమిటీ వేశారో ఆ వర్గం మాత్రం తీవ్రంగా నిరసించింది. తమకు, తమ వృత్తికి ప్రమాదంగా పరిగణిస్తున్న నకిలీ వస్త్రాలు తయారు చేస్తున్న పవర్‌లూంల మార్కెట్‌కు ఇరవై కోట్ల రూపాయలు కేటాయించాలనే సిఫార్సు ఒక్కటి చాలు ఏ కొంచెం మంచి ఉన్నా కొట్టుకుపోవడానికి. ఈ మధ్య ఏ కమిటీ వేసినా, ఏవరితో వేసినా, 'చేనేత పేరు పెట్టి' వేస్తే అది చివరికి పవర్‌లూంల సంక్షేమానికే చేరుతుంది. చేనేత రాతే అలా ఉంది. చేనేతకు ద్రోహమే జరుగుతోంది. గుంట మగ్గాలతో, కొయ్య ముక్కలతో మీరు ఈ పోటీని తట్టుకోలేరు, తప్పుకోండని చెప్పినవే. చేనేత కార్మికులలో భయాందోళనలు కలిగించి, బతుకుపై ఆశలేకుండా నాశనం చేయడానికే చూశారు. ఎన్నో ఒడిదుడుకులనెదుర్కొని, ఉనికి కాపాడుకుంటున్న చేనేత కార్మికులను పాలకులు అసత్య ప్రచారంతో సగం గుంట నుంచి పూర్తి గుంట పాలు చేస్తున్నారు.

ఏ కమిటీ అయినా చేయవలసింది పత్తి నుండి నూలు వరకు. నూలుకు రంగులు అద్ది, పడుగులు చేసి, మొదలు కట్టి మగ్గాల మీద అందమైన చీర వరకు పూర్తిగా శాస్త్రీయంగా చేనేత స్వరూప స్వభావాలు క్షుణంగా తెలుసుకోవాలి. ముడిసరుకు లక్ష్యత ఏ విధంగా ఉంది? మార్కెట్ ఏ విధంగా జరుగుతుంది? మజూరీలు సరిపోతున్నాయా లేవా? కనీసం అవగాహన చేసుకోకుండా, నాలుగు గోడల మధ్య కూర్చొని నివేదికలు రూపొందించి, దురభిప్రాయాలు కలిగించి చేనేతకు తీరని ద్రోహం చేయడం ఎంత వరకు సబబు? చేనేత మీద పరిశోధనలు చేసి, చేనేతలతో పనిచేసే సంస్థలను, నాయకులను కమిటీలలో స్థానం కల్పించకుండా, కమిటీలో ఉన్న వారు చిత్తాన్ని తాకట్టు పెట్టి చిత్తు కాగితాల నివేదికలు తయారు చేసి, చేనేతలలో జరుగుతున్న ఆకలి చావులు, ఆత్మహత్యలు – సంక్షోభాలు పెరిగి, చేనేతకు అటు కార్మికులను, ఇటు ప్రజలను దూరం చేసి, ఆఖరుగా అంతిమంగా వారనుకున్నట్టు చేతిమగ్గాన్ని మ్యూజియంలో చూడాలన్న చిరకాల కోరిక తీర్చుకోవడానికి ఈ నిపుణుల కమిటీని బాగా ఉపయోగించుకున్నారు అన్న అభిప్రాయం రావడం తప్పుకాదు.

నిజంగా మనం నిష్పక్షపాతంగా ఆలోచిస్తే, ఈనాడు చేనేత పరిశ్రమ ముందు కొన్ని సవాళ్లున్నాయి. అవి, ముడి సరుకుల, నూలు పట్టు ధరలు రోజుకో విధంగా పెరిగి, కలవర పెడుతున్నాయి. ధర్మవరం ప్రాంతంలో పట్టు చీరలకు పట్టుకొనలేక వేలాది మగ్గాలు మూతపడ్డాయి. నూలు ధరలు విపరీతంగా నలభై శాతం పైన పెరిగి, భరించలేని దశకు చేరింది. ఇక కార్మికులకు అప్పులు, అనారోగ్యం వంటి సమస్యలే కాకుండా నకిలీ వస్త్రాల బెడద ఉండనే ఉంది. మార్కెట్ దెబ్బ తింటోంది. మరొకపక్క ప్రభుత్వం టెక్స్‌టైల్ పార్కుల మీద అమిత ప్రేమ కురిపిస్తోంది. చేనేత పార్కులు కావాలన్న చేనేత డిమాండ్‌ను పెడచెవిన పెడుతోంది.

కొన్ని రంగాలకు సొంత విధానాలున్నట్లు, చేనేతకు సంబంధించి సొంత విధానం ఉంది. అది, చేనేత రిజర్వేషన్‌లు అమలు జరపాలని. మొదటగా చేనేతకు 22 రకాల రిజర్వేషన్‌లు కేటాయించినట్టు కేటాయించాలి. వాటిని 11 రకాలుగా తగ్గించారు. ఈ 11 రకాల రిజర్వేషన్ చట్టం కచ్చితంగా అమలు జరిగితే చేనేతకు ఈ దుస్థితి రాదు. చేనేత వర్గీయులు ఏ మూల ఉన్నా, ఏ సమావేశం వేసినా ఈ నినాదం కచ్చితంగా ఉండాల్సిందే. ఇదే నినాదం నిపుణుల కమిటీలో కూడా ప్రస్తావించారు. చిత్తశుద్ధితో అమలు జరపాల్సిన కాగితం మీద రాసివదిలే శాస్త్రమంట. పదకొండు రకాల రిజర్వేషన్ అమలు జరపాలన్న మాటతో ఒక నిజం బయట పడింది. చేనేతకు సహజమైన, స్థిరమైన మార్కెట్ ఉంది. దాన్ని పవర్‌లూంల వారు రిజర్వేషన్ చట్టాన్ని ఉల్లంఘించి, చేనేత రకాలు తయారు చేస్తున్నారన్నది ఆ నిజం. రాసిన ఉద్దేశమేదయినా కనీసం ఆ పదకొండు రకాల రిజర్వేషన్ చట్టం కచ్చితంగా అమలు చేసి చేనేతను, చేనేత పరిశ్రమను కాపాడండి. కార్మికులను బతికించాలని కోరుకోవడం తప్పు కానే కాదు. అది తమ హక్కు కూడా. భారతదేశ ఆర్థిక వ్యవస్థలో ప్రధాన భాగమైన చేనేత పేదల జీవనోపాధి. ప్రపంచంలో ఏ దేశంలో లేనంతగా పెద్ద ఎత్తున మన దేశంలోనే ఉంది. ఇంత పెద్ద పరిశ్రమ పైన వ్యాఖ్య నిలవాలంటే బలమైన ఆధారాలుండాలి. విశాల దృష్టితో, మానవతా దృక్పథంతో పరిశీలించాలి. వర్తమాన, భవిష్యత్తులపై విస్తృతమైన అధ్యయనాలు జరపాలి. చిత్తం వచ్చినట్టు వ్యాఖ్యానించడం, మాట్లాడడం సమంజసం కాదు.

*(రచయిత ఆంధ్రప్రదేశ్ చేనేత కార్మిక సంఘం రాష్ట్ర అధ్యక్షులు)* వీ

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన

మానవజాతి చరిత్ర, ఆవిర్భావం నుంచి కూడా భూమితో మనుషులకు ఉన్న సంబంధంతోనే ముడిపడి ఉంది. శతాబ్దాల కిందటి నుంచే భూమిపై హక్కు అధికారం ఉన్న వారి చేతుల్లో, అంటే పాలకుల చేతుల్లో ఉంది. ఇందుకు భారతదేశమే కాదు ప్రపంచంలో ఏ దేశానికీ మినహాయింపు లేదు. ఎక్కడైనా కాని భూమిపై వచ్చే వనరులను కొల్లగొట్టో, వాటిపై పన్ను రూపంలో శిస్తు వసూలు చేసో పాలకులు కానీ, వారి దళారులు కానీ తమ అధికారాన్ని నిలబెట్టుకున్నారు. ఈ ఆదాయంతోనే తమ రాజ్యాలను విస్తరించుకున్నారు.

భూమిపై సహజ సిద్ధంగా ఉన్న వనరులను ఉపయోగించుకోవడానికీ, వ్యవసాయ యోగ్యంగా చేసుకొని పంటలు పండించుకోవడానికీ, నివాస యోగ్యంగా ఉపయోగించుకోవడానికీ ప్రజలకు తాత్కాలికంగానైనా, శాశ్వతంగానైనా హక్కులను కల్పించే యంత్రాంగాన్నే రెవెన్యూ యంత్రాంగం అంటారు. ఇదే యంత్రాంగం పాలకులకు భూ వినియోగంపై వచ్చే ఆదాయాన్ని కూడా పన్నుల రూపంలో వసూలు చేసి పెడుతుంది.

సామాజిక, రాజకీయ అంశాలను తడమకుండా రెవెన్యూ పరిపాలన గురించి చెప్పలేం. శతాబ్దాల నుంచి కూడా మన దేశంలో స్వయం పోషక గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ఉంది. దేశంలో, రాష్ట్రంలో కులవ్యవస్థ మూలం కాబట్టి, వృత్తులు మార్చడానికి వీలులేని పరిస్థితి ఉండడం వలన ఏ గ్రామంలోనైనా మూడు వర్గాల ప్రజలు ఉండేవారు. వీళ్లు – వ్యవసాయదారులు, చేతివృత్తుల (చేనేత, వడ్రంగి, కుమ్మరి, కమ్మరి) వాళ్లు, గ్రామం మీద ఆధారపడిన పోషితులు (చాకలి, మంగలి, బేగరి, మాదిగ మొదలగు కులాలు). భూమిపై వచ్చే వనరులే గ్రామానికి ముఖ్య జీవనాధారం, అంటే వ్యవసాయమే ముఖ్య జీవనాధారంగా ఉంది.

భూమి ఇతర పశ్చిమ దేశాలలో లాగ మన దేశంలో వ్యక్తిగత ఆస్తికాదు. అది పాలకుల ఆస్తి. దానిని వినియోగించుకునే వారికి దానిని అమ్మడానికి కానీ, తాకట్టు పెట్టుకోవడానికి కానీ హక్కులేదు. అనుభవించడానికి మాత్రమే హక్కు ఉంటుంది. (కొన్నిసార్లు అనువంశికంగా అనుభవించడానికి కూడా హక్కు ఉంటుంది.) ముందుగానే చెప్పినట్లుగా భూమిపై సార్వభౌమాధికార హక్కు పాలకునికి లేదా చక్రవర్తికి మాత్రమే ఉండి, దానిపై వచ్చే ఆదాయమే పాలకుల ఆస్తిగా ఉంది. చక్రవర్తి ద్వారా నియమితులైన వారు ప్రజల నుండి వసూలు చేస్తే శిస్తుకు గ్రహీతలుగా ఉండేవారు. ఇందులో నుంచి చక్రవర్తికి ఒప్పందం చేసుకున్న విధంగా కప్పం చెల్లించే బాధ్యత వీరిపై ఉంటుంది.

భూమిపై రకరకాల శిస్తులను వసూలు చేసే ఈ దళారులు ముఖ్యంగా నాలుగు రకాలుగా ఉండేవారు:

**1) జమీందార్లు** – వీరు ఇంతకు ముందు రాజులుగా ఉండి ఇప్పుడు పాలించే రాజుకు ప్రతి సంవత్సరం కప్పం రూపంలో నగదు చెల్లించే షరతు మీద విస్తారమైన ప్రాంతాలు పొందిన వారు.

**2) నియమితులు** – ప్రభుత్వ ఉద్యోగులు. వీళ్లకు జీతం ఇచ్చే బదులు నిర్దిష్ట ప్రాంతాలలో శిస్తు వసూలు చేసుకొనే హక్కు కలిగినవారు.

**3) ఇనాందార్లు** – కులం వలన (బ్రాహ్మణులు, ఇతరులు) సాధారణంగా వారు చేసిన ప్రశంసనీయమైన కృషికి గానీ, వాళ్ల పాండిత్యానికి గానీ బహుమతిగా శిస్తు వసూలు చేసుకొనే హక్కును పొందినవారు.

**4) శిస్తు గ్రహీతలు** – పాలకులకు ఏటా నిర్దిష్టమైన మొత్తం డబ్బు లేదా పంట రూపంలో చెల్లించే షరతు మీద నిర్దిష్ట ప్రాంతంలో కేవలం భూమిశిస్తు వసూలు చేసుకొనే హక్కు పొందినవారు.

ఈ దళారులకు బదలాయింపబడేది శిస్తు వసూలు చేసుకొనే హక్కు మాత్రమే కాని, భూమిపై స్వామ్యం కాదు. భూమి ఈ విధంగా గ్రామ సమాజం అనుభవంలోనే ఉంటుంది. యుద్ధం చేసినా, ఆక్రమించుకున్నా రాజులు / పాలకులు పోరాడింది రైతునుండి శిస్తు వసూలు చేసుకొనే హక్కు కోసమే కాని, అనుభవంలోనున్న భూమిని లాక్కోవడానికి మాత్రం కాదు. అందుకే రెవెన్యూ యంత్రాంగం ప్రజలకు ప్రభుత్వాలకు మధ్య వారధిగా శతాబ్దాల తరబడి నుంచీ పనిచేయడం వలన, చాల బలమైన ప్రభుత్వ యంత్రాంగంగా ఇప్పటికీ ఉంది.

హిందూ రాజుల కాలంలో శతాబ్దాల నుంచీ గ్రామాన్ని ప్రామాణికంగా తీసుకొని, శిస్తు వసూలు చేయడం మొత్తం గ్రామం ఉమ్మడి బాధ్యతగా ఉండేది. గ్రామంలో పూర్వకాలం నుంచీ రెవెన్యూ యంత్రాంగం పని శిస్తు వసూలు చేయడమే కాకుండా ఇతర పన్నెండు రకాల సేవలను ప్రజలకు, ప్రభుత్వానికి అందించేటట్లుగా చూసేది

ఇందులో మొదటివారు గ్రామాధికారులు. గ్రామాధికారులుగా రెండు రకాల వ్యక్తులు ఉండేవారు.

**గ్రామిక / రెడ్డి / పటేల్ / మునసబు** – వీరికి పన్ను వసూలు చేసే అధికారంతో పాటు చిన్న చిన్న వివాదాలను, కొట్లాటలను, చిన్న తగాదాలను పరిష్కరించే అధికారం ఉండేది. గ్రామ భూమి వినియోగానికి సంబంధించిన లెక్కలు లేదా పట్టీలను నిర్వహించే పని కాకుండా ఇతర గ్రామ వ్యవహారాలన్నీ వీరి అధీనంలో ఉంటాయి.

**రికార్డుల సంరక్షకుడు / కరణం** – భూమిని వినియోగార్థం నిర్ణయించిన విస్తీర్ణం మేరకు అప్పగించడం, పన్ను నిర్ణయించడం, భూమి సాగు విషయంలో వచ్చే తగాదాలు పరిష్కరించడం, భూమి అధీనం తెలిపే లెక్కలను తయారు చేయడం వీరిపని. గ్రామంలో గ్రామ రెవెన్యూ అధికార యంత్రాంగంలో వీరు ఉండేవారు.

**గ్రామ సేవకులు, కట్టుబడులు లేదా రెవెన్యూ ప్యూనులు** – పంటలు పండించే విస్తీర్ణం, పండించే పంటల రకాలు, భూమిపై ఇతర వనరుల వినియోగం (అంటే, నీటి పారుదల, ఇతర అటవీ ఉత్పత్తులు, ఖనిజాలు మొదలైనవి) గ్రామ సమాజానికి చెందిన భూవినియోగంపై నిఘా మొదలగు పనులు వీరు చేస్తూ, గ్రామాధికారులకు వీటి వివరాలు అందిస్తారు.

**తలారి లేదా గ్రామ పోలీసు వాచ్‌మన్** – గ్రామంలో కొత్తగా జరిగే విషయాలు, ప్రజలు ఏదైనా అరాచక కార్యక్రమాలకు పాల్పడుతున్నారేమోనని వారిని గమనించడం. కొత్తగా గ్రామంలోకి వచ్చే వ్యక్తుల పై నిఘా ఉంచడం, ఈ వివరాలను వీరు గ్రామాధికారులకు అందిస్తారు.

**షరాఫ్** – భూమిపై శిస్తు, ఇతర వనరులపై వచ్చిన, రాబోతున్న ఆదాయాన్ని నమోదు చేసే పనిలో గ్రామాధికారికి సహాయకుడిగా ఉంటాడు.

**కమ్మరి, వడ్రంగి, మంగలి, చాకలి, కుమ్మరి, తోటి లేదా గ్రామాన్ని శుభ్రం చేసేవారు, బేగారి లేదా చక్కర్** – వీరు గ్రామంపై ఆధారపడిన పోషితులుగా ఉండి గ్రామానికి కావలసిన సేవలు అందిస్తూ, రెవెన్యూ యంత్రాంగం అజమాయిషీ కింద పనిచేసేవారు. గ్రామ రెవెన్యూ యంత్రాంగం ఈ విధంగా పటిష్టమైన వ్యవస్థగా పూర్వకాలం నుండీ ఉండి, ప్రజలకు ఈ సేవలను వీరు వంశపారంపర్యంగా అందిస్తూ ఉండేవారు. ఈ గ్రామసేవకులు సేకరించిన సమాచారం గ్రామాధికారుల నుండి దళారులకు, వారి పాలకులకు అంచెలంచెలుగా అందడానికి ఏర్పాట్లు శతాబ్దాల కిందటి నుంచే రాష్ట్రంలో పటిష్టంగా ఉన్నాయి.

కౌటిల్యుడు అర్థశాస్త్రంలో చెప్పినట్లుగా, ఆ కాలంలో అంటే క్రీస్తు పూర్వం గ్రామ స్థాయినుంచి చక్రవర్తి స్థాయివరకు పటిష్టమైన రెవెన్యూ యంత్రాంగం ఉండేది. రాజులు తమ ఆధీనంలోనున్న భూమిని రకరకాల ఉపయోగార్థం రెవెన్యూ యంత్రాంగం ద్వారా ఈ కింది విధంగా అప్పట్లో రిజర్వ్ చేయించేవారు.

సాగుచేసే భూములు – రాజు ఆధీనంలోని భూమి, ప్రజల వ్యక్తిగత భూమి, పచ్చిక బయళ్ళు.

అడవులు – అటవీ సంపద కోసం ఉంచినవి. సన్యాసులు, రుషుల ఆశ్రమాలకు వారి ఉపయోగార్థం ఉంచేవి. క్రూర మృగాలకు వదిలి వేసిన భూమి.

నీటిపారుదల భూమి – రాజుల ఆధీనంలో ఉన్న భూమి. ప్రజల వ్యక్తిగత భూమి.

గనులు – భూమి మొత్తం రాజుల ఆధీనంలోనే ఉండి, రెండు పద్ధతుల ద్వారా వినియోగమయ్యేది. రాజులు స్వయంగా నిర్వహించే గనులు. ప్రజలకు కౌలుగా ఇచ్చే గనులు.

ఇతర భూములు – భవిష్యత్తులో సాగుకు, నివాస యోగ్యానికి పనికి వచ్చే భూమి. బంజరు భూమి.

శతాబ్దాలు గడిచినా భూమి యాజమాన్య హక్కులలో కొన్ని మార్పులు వచ్చినా, భూ వర్గీకరణలో మాత్రం ఇంచుమించు అప్పటికీ ఇప్పటికీ ఎలాంటి మార్పులు లేవు. ఈ భూముల వినియోగాన్ని బట్టి ప్రజల దగ్గర నుంచి రకరకాల పన్నులు రెవెన్యూ యంత్రాంగం వసూలు చేసి, చక్రవర్తి, రాజుల ఖజానాకు జమచేసేది.

1) ప్రజల వ్యక్తిగత వ్యవసాయ భూములపై పన్ను – 1/6 వంతు పంట (ఈ మొత్తం ధాన్యం రూపంలో లేదా కొంత ధాన్యం, కొంత ధనం రూపంలో కానీ, లేదా కొంత ధాన్యం, కొంత కూలీ లేకుండా పనిచేసి కాని శిస్తు కట్టేవారు.) ఇవి కాకుండా రాజు కొన్ని అత్యవసర పరిస్థితులలో అంటే, యుద్ధం సమయంలో, ఆర్థిక స్థితి బాగా లేనప్పుడు పన్నును పంటలో 1/4 వంతు నుంచి 1/3 వంతు వరకూ వసూలు చేసేవారు. రాజులే గ్రామ రెవెన్యూ యంత్రాంగం ద్వారా ప్రజలకు విత్తనాలు సరఫరా చేసి ప్రజలు పండించిన పంటనంతా పొలాలలో నుంచి గ్రామ ఉద్యోగుల ద్వారా సేకరించుకొని తమ ధాన్యాగారాలకు తరలించుకునేవారు.

2) రాజు వ్యక్తిగత భూములపై పన్ను – ప్రజలు కేవలం భూమిలో విత్తనాలు విత్తడానికి పదును చేసే దగ్గర నుంచి పంట పండేవరకు పని చేస్తే వారికి పండిన పంటలో 1/4 వంతు నుండి 1/5 వంతు ఇచ్చేవారు. అదే ప్రజలు పెట్టుబడి పెట్టి సాగుచేస్తే సగం పంట సాగుదారుకు ఇచ్చే పద్ధతి ఉండేది.

3) నీటిపారుదల భూములపై పన్ను – రాజుకు సంబంధించిన భూములలో యంత్రాల ద్వారా నీటిని పంటకు సరఫరా చేసుకుంటే 1/3 వంతు పంట, ఎద్దుల ద్వారా నీటి సరఫరాకు 1/4 వంతు పంట, రైతు స్వయంగా నీరు మోసుకొని పంటలకు ఉపయోగించుకొంటే 1/5 వంతు పంట శిస్తుగా వసూలు చేసేవారు. ప్రకృతి సహజ వనరుల ద్వారా నీటిని పారించుకుంటే 1/4 వంతు పంటను పన్నుగా చెల్లించాలి.

4) గనులపై పన్ను – రాజు స్వయంగా చేయించే ఖనిజాల వెలికితీతలో ఖర్చు, కూలీ మినహాయించి మిగిలిన ఆదాయాన్నంతా ఖజానాకు జమ చేసేవారు. ప్రైవేట్ వ్యక్తులకు లీజుకిచ్చిన సందర్భంలో వెలికితీసే ఖనిజాల మొత్తాన్ని ముందుగా అంచనా వేసి, ముందుగానే రాయల్టీ రూపంలో ఆ పన్నును వసూలు చేసేవారు.

ఈ నాలుగు రకాల పన్నులూ రాజు ఖజానాకు జమ అయ్యేవి. ఇవి కాకుండా ప్రభుత్వం ప్రజలకందించే సేవలకు అంటే ప్రయాణ అనుమతి పత్రాలు జారీచేయడం, రేవులలో దాటడానికి సౌకర్యం కల్పించడం, వ్యాపారులకు దారులలో రక్షణ కల్పించడం, కచ్చితమైన తూనికలు కొలతలు ప్రభుత్వమే ప్రజల సరుకులకు అందించడం వగైరా వసూలు చేసే సేవా పన్ను మొత్తం కూడా రోజు ఖజానాకు జమచేసేవారు.

గ్రామానికి మాత్రం పచ్చిక బయళ్లలో పశువులు మేపుకున్నందుకు వసూలు చేసే పన్ను, పశువులు, పంట ఇతరత్రా ధ్వంసం చేసిన సందర్భాలలో యజమానులకు విధించే అపరాధ రుసుం మాత్రమే పన్ను ఆదాయం (రెవెన్యూ)గా ఉండేది.

పన్నులు సక్రమంగా వసూలు చేయడానికి క్రీస్తుపూర్వం నుంచే ఉపయోగించుకొనే ప్రతి భూమికీ ఒక నంబరును ఇచ్చి నమోదు చేసేవారు. ఇందులో పన్ను మినహాయింపులు ఇచ్చిన భూములు (బ్రాహ్మణులకు, సన్యాసులకు, రుషులకు, కొన్ని రంగాలలో ప్రావీణ్యతలు కలిగిన విశిష్ట వ్యక్తులకు ఇచ్చిన భూములను), ప్రజోపయోగార్థం ఉన్న నీటి చెరువులు, కాలువల భూముల వివరాలు, దానాలు ఇచ్చిన భూములు, కుటుంబ పరంగానూ వ్యక్తిగతంగానూ ఎవరి వినియోగంలో ఎంత భూమి ఉందో ఆ వివరాలతో పాటు నమోదు చేసేవారు.

భూ వినియోగ వివరాలతో పాటు గ్రామంలోని ప్రతి కుటుంబానికి సంబంధించి కూడా కుటుంబంలోని వ్యక్తుల సంఖ్య (పురుషులు, స్త్రీ, పిల్లలు, వృద్ధులు), కులం, వృత్తి, వీరి సంవత్సర ఆదాయం, ఖర్చు, వీరికున్న కోళ్లు, ఇతర పశు సంపద పూర్వకాలం నుంచీ వారి వంశ చరిత్ర (ఇందులో వారి తరతరాల ప్రవర్తన, విధేయత, అవిధేయత, నేరాలు మొదలగునవి), ప్రస్తుతం కట్టాల్సిన పన్నుల వివరాలు, ఇంతకు ముందు బాకీ ఉన్న పన్నుల వివరాలను గ్రామ రెవెన్యూ యంత్రాంగం తయారు చేసేది. ఈ విధంగా గ్రామ ప్రజల సమగ్ర సమాచారం వలన భవిష్యత్తులో వారి అవసరాలకు కావలసినవి తెలుసుకోవడమే కాకుండా, పరిపాలనకు, భూమి వినియోగం పెంచడం ద్వారా ఇతర ఆదాయ మార్గాలు పెంపొందించుకోవడానికి కూడా ఉపయోగకరంగా ఉండేది. ఇప్పటికీ గ్రామ రెవెన్యూ యంత్రాంగం పూర్తి సహకారంతోనే ఈ వివరాలు నమోదు చేస్తుంది.

గ్రామ రెవెన్యూ యంత్రాంగం పనిలో ముఖ్యమైంది ప్రజల జీవనోపాధికి కావలసిన భూమిని వారికి పంచడం. ఇందుకోసం రెవెన్యూ యంత్రాంగం ప్రజల కుటుంబ అవసరాలు, వారికున్న పశుసంపద, నేల సారవంతాన్ని బట్టి వ్యవసాయ యోగ్యమైన భూమిని గ్రామంలో ఉండే మూడు రకాల ప్రజలకు పంచేది. గ్రామ సామాజిక అవసరాలైన పశుపోషణ, వంటచెరుకు లాంటి ప్రయోజనాలకు సమిష్టిగా, గ్రామ సమాజం ఉపయోగించుకోవడానికి కావలసిన భూమిని ప్రత్యేకంగా రెవెన్యూ యంత్రాంగం రిజర్వ్ చేసేది. ప్రజలు తమకు కేటాయించిన భూ వినియోగానికే పరిమితమవడం, భూ వినియోగంలో తలెత్తిన తగాదాలను పరిష్కరించడం, పండించే పంటపై, ఇతర వనరులపై వారి వారి వినియోగాల్ని బట్టి పన్ను విధించడం గ్రామ రెవెన్యూ యంత్రాంగం ముఖ్యమైన పనిగా ఉంది.

భూ వినియోగంలో తలెత్తిన తగాదాలను కౌటిల్యుని కాలం నుంచే గ్రామ రెవెన్యూ యంత్రాంగం చుట్టుపక్కల రైతుల, గ్రామ పెద్దల సాక్ష్యాలతో సమర్థవంతంగా పరిష్కరించేది. గ్రామ సరిహద్దులను చెరిపేస్తే శిక్షగా వెయ్యి వెండి నాణేలను, వేరేవాళ్ల భూమిలోకి దురాక్రమణ చేస్తే ఇరవై నాలుగు వెండి నాణేలను, నీటిని పొలాలకు అందనివ్వకుండా పారుదల వ్యవస్థను పాడుచేస్తే రైతుకు కలిగిన నష్టానికి రెండింతలు నష్టపరిహారం అపరాధ రుసుముగా విధించేవారు. పన్ను కట్టకపోయినా, అపరాధ రుసుములు చెల్లించకపోయినా అవయవాలు ఖండించడం దగ్గర నుంచి చంపడం వరకు శిక్షలను కఠినంగా అమలు చేసేవారు.

**గుడికట్టు** – పదకొండవ శతాబ్దంలోని చోళుల (కంచిరాజులు) పరిపాలనా కాలంలో 'గుడికట్టు' అనే పేరుతో పిలిచే అన్ని వివరాలతో కూడిన పుస్తకం రూపంలో గ్రామసమగ్ర సమాచారాన్ని గ్రామ రెవెన్యూ యంత్రాంగం తయారు చేసేది. ఈ గుడికట్టులో గ్రామ సరిహద్దులతో పాటు మజరా గ్రామాలు (శివారు) (ఇవి గ్రామ విస్తీర్ణంలోనే భాగంగా ఉండి గ్రామ ప్రజలు నివసించే నివాసాలకు దూరంగా, రైతులు సాగు చేసుకొనే పొలాలకు దగ్గరగాఉండే నివాస గృహాల సముదాయాలు), ఇతర కొండ గుర్తులైన కాలువలు, చెరువులు, కొండలు, గుట్టలు, తోపులు, స్మశానాలు, బావులు, దేవాలయాలు మొదలగువాటిని వాటి దూరాన్ని బట్టి విడివిడిగా విస్తీర్ణంతో గుర్తింపునిచ్చేవారు. ప్రజలకు వ్యవసాయం కోసం ఇచ్చిన భూముల కొలతలను వాటికి దగ్గరగానున్న కొండ గుర్తుల ద్వారా నమోదు చేసేవారు. ఇవే కాకుండా మత సంబంధ కార్యాలకు, ప్రజోపయోగ కార్యాలకు వినియోగించే భూములను కూడా వేరు వేరుగా వాటి విస్తీర్ణం ప్రకారం గుడికట్టులో నమోదు చేసేవారు. గ్రామంలోని రైతులకు, ఇతర వర్గాల వారికి సాగు చేసుకోవడానికి ఇచ్చే భూములను అప్పగించడానికి గానీ, సరిహద్దు తగాదాలు వ్యక్తిగతంగా గానీ, గ్రామాల మధ్య గానీ, శిస్తు వసూలు చేసేటప్పుడు గానీ ఈ గుడికట్టులో ఉన్న వివరాలతోనే గ్రామాధికారులు పరిష్కరించే వారు. ఆ కాలంలో భూమిని గడలేదా, పోల్ ద్వారా కొలిచేవారు.

ఒక గడ – 16 గజాలు చతురస్రంగా ఉండే కొలత.

ఒక గజం – రెండు మూరలభూమి.

ఈ దళారులు, పాలకులు గ్రామం మొత్తం బాధ్యత మీద ఉమ్మడి శిస్తు విధించే వారు. శతాబ్దాల నుంచీ సాధారణంగా వసూలు చేసే శిస్తు 1/6 నుంచి 1/4 వంతు ఉంటే చోళుల పాలనా కాలంలో ఈ శిస్తు పండే పంటలో 1/3 వంతు నుంచి 3/4వ వంతు వరకూ పెరిగింది. భూమి శిస్తు ఎక్కువగా వస్తు రూపంలోనే కాని నగదు రూపంలో ఉండేది కాదు. భూమిపై శిస్తును 'జాతి సిద్ధయం' లేదా కులపెద్ద ద్వారా వసూలు చేసేవారు. వివిధ కులాలైన చాకలి, బేగరి, మాదిగ, సాలె, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి పెద్దలు గ్రామ ఉమ్మడి పన్నులో తమ వంతు భూమికి గ్రామాధికారి నిర్ణయించిన మేరకు పన్నును కట్టాల్సి వచ్చేది. ఇవే కాకుండా రెవెన్యూ యంత్రాంగం గ్రామంలోని నూనె గానుగల మీద, మద్యం మీద, బట్టలకద్దే రంగుల మీద సుంకాలు వసూలు చేసేది. పాలకులకూ, వారి ప్రతినిధులకూ భూ వనరులపై నిర్ణయించిన పన్నులు చెల్లిస్తూ ఉంటే, గ్రామ వ్యవహారాలలో వారికి తలదూర్చవలసిన అవసరమే ఉండేది కాదు. అదే సమయంలో గ్రామం చెల్లించవలసిన మొత్తం శిస్తు న్యాయమైనదిగా ఉండేటట్లు పాలకుల ప్రతినిధులతో గ్రామ రెవెన్యూ యంత్రాంగమే చర్చించి నిర్ణయించడంలో కీలక పాత్ర పోషించేది.

పదమూడవ శతాబ్దం నుంచి రాష్ట్రంలో వ్యవసాయం బాగా వృద్ధి చెందింది. ఇందుకు కారణం పాలకులైన కాకతీయులు, చోళులే కాకుండా వడయార్లు, జాగీర్దార్లు, జమీందార్లు, వైశ్యులు కూడా పెద్ద పెద్ద చెరువులు తవ్వించారు. చోళుల కాలం వరకు గ్రామాధికార బాధ్యతలలో అన్ని

కులాల వారూ నియమింపబడేవారు. కానీ పదమూడవ శతాబ్దంలో ఓరుగల్లు ప్రభువు గణపతిదేవ మహారాజు చోళులనోడించి నెల్లూరు వరకు ఆక్రమించుకొన్నాడు. అతడు గ్రామ లెక్కలు చూసే గ్రామ పరిపాలన బాధ్యతలను అప్పటి వరకు ఆ ప్రాంతంలో నిర్వహిస్తున్న కావేరీల (తమిళ బలిజ కులం వారు) స్థానంలో తను గెల్చిన రాయలసీమ, కోస్తా జిల్లాలలో నియోగి బ్రాహ్మణులకు (కరణం) అప్పగించాడు. అతని వంశస్థుడైన ప్రతాపరుద్రుని పాలన క్రీ.శ. 1310 వరకూ కొనసాగింది. ఆ సమయంలో చెరువులు తవ్వడం, కొత్త గ్రామాలను నిర్మించడం కోసం ఉత్తరాది నుంచి ప్రజల వలసలను ప్రోత్సహించారు. వాళ్లు సాగు చేయడానికి అనువుగా, అడవులను నరికి బాగు చేసిన సందర్భాలలో పండే పంటపై మూడు లేక నాలుగు సంవత్సరాల వరకు రెవెన్యూ యంత్రాంగం ద్వారా శిస్తు విధింపును మాఫీ చేయించాడు.

విజయనగర రాజులు, గజపతుల కాలంలో నాయన్‌కార్లు (జాగీర్దార్లు) దళారులుగా ఉండేవారు. వీరికాలంలో భూమిపై ఆధారపడి వ్యవసాయం చేసుకొనే వారికన్నా కూడా చోళుల పాలనలో మాదిరి కాకుండా బ్రాహ్మణులకు, మత సంబంధమైన పనులకు భూ కేటాయింపులు ఎక్కువగా జరిగాయి. చెరువులు తవ్వించడం, కొత్త కాలువలు తీయడం, ఉన్న కాలువలను బాగు చేయడంతో పాటు నీటిపారుదల వ్యవస్థ బాగా వృద్ధి చెంది వ్యవసాయం ఉచ్ఛ స్థితిలో ఉండేది. వీరు తమ సామ్రాజ్యాన్ని మండలాలుగా, నాడులుగా, సీమలుగా విభజించి ప్రతి గ్రామానికి కూడా రెవెన్యూ యంత్రాంగాన్ని నియమించి పటిష్టం చేశారు. ముఖ్యంగా ఈ రాజుల కాలంలో రైతుల వద్ద నుంచి శిస్తును పండిన పంటలో 3/4 వంతు వరకూ పాలెగాళ్లతో కఠినంగా వసూలు చేసిన సందర్భాలు ఉన్నాయి. ఇందుకు ఒక ఉదాహరణ క్రీ.శ. 1361 నుంచి 1460 మధ్యకాలంలో ఒరిస్సాలోని కటక్ నుంచి వచ్చిన గజపతిరాజులు కోస్తా ప్రాంతం మొత్తాన్ని తమ ఆధీనంలోకి తెచ్చుకున్నారు. వీరిచే నియమింపబడిన గోపన్న ఉదయార్ అనే అధికారి ప్రకాశం జిల్లా కంభం చెరువు ద్వారా సాగులో ఉన్న భూమిపై శిస్తును వసూలు చేసి రాజుకు చెల్లించలేదు. నరేంద్ర అనే సైన్యాధికారిని గోపన్నపై దాడి చేసి, అతన్ని చంపి పన్ను వసూలు చేసుకొని రమ్మని గజపతిరాజులు పంపారు. గోపన్న సైన్యాన్ని ఎదిరించకుండా కంభం చెరువు మధ్యలో ఉన్న కొండపైకి పారిపోతే, అతన్ని పట్టుకోవడం కోసం కంభం చెరువు కట్టను తెగ్గొట్టి, నీళ్లన్నీ వృథాగా పోయేట్లు చేసి భూమి శిస్తును వసూలు చేసుకున్నారు. రాజులు తమకు రావలసిన పన్ను కోసం గ్రామ రెవెన్యూ యంత్రాంగంతో సంబంధం లేకుండా ఎంత దారుణానికైనా సిద్ధపడతారనడానికి ఇదొక ఉదాహరణ మాత్రమే.

*(ఇంకావుంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*
saralareddy007@gmail.com

***ఆయుధాలూ, మాదకద్రవ్యాలూ, ఆధ్యాత్మికతలూ ఇవాళ్టి ప్రపంచంలోని అతి పెద్ద వ్యాపార వస్తువులంటూ, మనిషి లోపలి మంచితనాన్ని మతం వంటి అనుత్పాదక విషయాలకు ఖర్చు చేయవద్దని అంటున్నారు* జావేద్ అఖ్తర్**

# ఆధ్యాత్మిక గురువుల బూటకత్వం

మహానుభావులు ఎందరో ఉన్న ఈ సభలో నేను ఉన్న స్థానంలోకి రావాలని ఎవరూ కోరుకోరనుకుంటాను. ఎందుకంటే శ్రీశ్రీ రవిశంకర్ లాంటి జనాకర్షణగల శక్తిమంతులైన ఆధ్యాత్మిక గురువు మాట్లాడిన తర్వాత మాట్లాడబోవడం, సచిన్ టెండూల్కర్ అద్భుతంగా సెంచరీ చేసిన తర్వాత ఆడడానికి నాలాంటి వాడు రావడం లాంటిది. కానీ, ఏదో ఒక బలహీన క్షణంలో నేనిక్కడ మాట్లాడడానికి ఒప్పుకున్నాను.

మొట్టమొదటనే నేను స్పష్టం చేయవలసిన కొన్ని విషయాలు ఉన్నాయి. జావేద్ అఖ్తర్ అనే నా పేరుతో మైమరచిపోకండి. నేనిక్కడ ఏ రహస్యం విప్పబోవడం లేదు. రచనలోనో, టెలివిజన్ మీదనో బహిరంగంగా నేను అనేకసార్లు చెప్పిన విషయమే మళ్లీ చెపుతున్నాను. నేను నాస్తికుడిని. నాకు ఏ మతంలోనూ విశ్వాసం లేదు. అందువల్ల నాకు ఎటువంటిరకం ఆధ్యాత్మికతలోనూ నమ్మకం లేదు. ఎటువంటిదైనా సరే.

ఇంకో విషయం కూడా చెప్పాలి. నేనిక్కడ కూచున్న పెద్ద మనిషిని విమర్శించడానికో, విశ్లేషించడానికో, విరుచుకుపడడానికో కూడా నిలబడలేదు. ఆయనకు, నాకు మధ్య ఆహ్లాదకరమైన, మర్యాద పూర్వకమైన సంబంధం ఉంది. ఆయన ఇతరులతో ఎంత సాదరంగా ఉంటారో చాలా సార్లు నేను గమనించాను.

కానీ, ఇక్కడ నేను మాట్లాడదల్చుకున్నది ఒక భావం గురించి. ఒక వైఖరి గురించి. ఒక మానసిక స్థితి గురించి మాత్రమే. ఒక మనిషి గురించి కాదు.

ఈ సమావేశం ప్రారంభమైనప్పుడు నేనేమన్నా పొరపాటు స్థలానికి వచ్చానా అని నాకు ఒక క్షణం అనుమానం వచ్చింది. ఎందుకంటే, మనం కృష్ణుడో, గౌతముడో, కబీరో, వివేకానందుడో చెప్పిన తత్వశాస్త్రం గురించి చర్చించడానికి ఇక్కడికి వచ్చినట్టయితే, నాకు మాట్లాడవలసింది ఏమీలేదు. నేనిప్పటికిప్పుడు కూచోవచ్చు. భారతీయులలో ప్రతి ఒక్కరూ గర్వంగా భావించే ఉజ్వల గతం గురించి చర్చించడానికి నేనిక్కడికి రాలేదు. నేనిక్కడికి మన మోసపూరితమైన వర్తమానం గురించి మాట్లాడడానికి వచ్చాను.

నన్నిక్కడ ఆధ్యాత్మికత గురించి మాట్లాడడానికి ఆహ్వానించారు. అయితే ఈ ఆధ్యాత్మికత అనే మాటతో మనం గందరగోళానికి గురికావద్దు. ఎందుకంటే, ఒకే పేరు గల ఇద్దరు మనుషులూ ఉండవచ్చు, ఆ ఇద్దరూ పూర్తిగా భిన్నమైన మనుషులూ కావచ్చు. రామచరిత మానస్ అనే గ్రంథాన్ని తులసీదాస్ రాశాడు. రామాయణం ఆధారంగా రామానంద్ సాగర్ ఒక టెలివిజన్ చిత్రం తయారు చేశాడు. రెండిటికీ రామాయణమే మూలం. కానీ, తులసీదాస్‌నూ, రామానంద్ సాగర్‌నూ సమానంగా చూడడం అంత ఉచితమని నేను అనుకోను. రామచరిత మానస్ రాసినపుడు తులసీదాస్‌పై సాంఘిక బహిష్కరణ విధించారు. అంత పవిత్రమైన గ్రంథాన్ని అవధీ లాంటి మామూలు ప్రజల భాషలో రాసి అవమానిస్తాడా అని ఆయన మీద విరుచుకుపడ్డారు. మతఛాందస వాదులు ఏ మాటలు మాట్లాడినా, ఏ రంగులో ఉన్నా, ఏ మతానికి చెందినా, ఏ సమూహానికి చెందినా అంతా ఒక్కలాగే ఉండడం చూసి నాకు ఆశ్చర్యం కలుగుతుంది. 1789లో షా అబ్దుల్ ఖాదర్ అనే ఒక పెద్దమనిషి ఈ నగరంలోనే మొట్టమొదటిసారి ఖురాన్‌ను ఉర్దూలోకి అనువాదం చేశాడు. ఆ కాలంలో అధికారం చెలాయిస్తున్న ఉలేమాలందరూ ఆయన మీద ఫత్వా విడుదల చేశారు. పవిత్ర గ్రంథాన్ని అలగా జనం భాషలోకి అనువాదం చేయడం దైవ ద్రోహం అన్నారు.

రామచరిత మానస్ రాసి బహిష్కరణకు గురైన తర్వాత తులసీదాస్ నాలుగు పాదాల పద్యం ఒకటి రాశాడు.

*ధుత్ కహో అవధుత్ కహో రాజ్‌పుత్ కహో కి జులావా కహు*
*కోహూకి బేటీ సే బేటా నా బియాహబ్ కోహూకి జాత్ బిగాడ్ నా చాహు*
*మాంగ్‌కే ఖైబో మహజిద్ మే రైబో లేబేకో ఏక్‌నా దేబే కా దోహు*

మరొకవైపు రామాయణం టెలివిజన్ సీరియల్ తయారు చేసి రామానంద్ సాగర్ కోట్ల రూపాయలు ఆర్జించాడు. నేనేమీ ఆయనను చిన్నబుచ్చడం లేదు. కానీ, ఈ మొత్తంలో ఆయన అట్టడుగు స్థాయిలో ఉన్నాడని మాత్రం చెప్పక తప్పదు.

మరొక ఉదాహరణ ఇస్తాను. బహుశా అది మరింత ప్రత్యక్షమైనదీ, మరింత ఉచితమైనదీ కావచ్చు. గౌతముడు రాజాంతపురాన్ని వదిలి అడవిలోకి వెళ్లింది సత్యాన్ని అన్వేషించడానికి. కానీ, ఇవాళ్టి రోజుల్లో మీరు చూస్తే ఈ ఆధునిక కాలపు గురువులు అడవుల్లో నుంచి బయటికి వచ్చి రాజప్రాసాదలలో చేరిపోతున్నారు. వాళ్లు పూర్తిగా ప్రతికూల దిశలో నడుస్తున్నారు. కనుక గౌతముడి గురించీ, వీళ్ల గురించీ ఒకేలాగా మాట్లాడలేం. అందువల్ల భారతీయులందరికీ ప్రియమైన, గౌరవనీయమైన పేర్ల వెనుక దాక్కొని విషయాలు మాట్లాడాలి.

నన్నిక్కడ మాట్లాడమని ఆహ్వానించినపుడు నేను నాస్తికున్ని కదా, ఎటువంటి పరిస్థితుల్లోనైనా హేతుబద్ధంగా ఉండడానికి ప్రయత్నిస్తాను కదా, అందుకే నన్నిక్కడకు పిలిచారా అనుకున్నాను. కానీ, హఠాత్తుగా నాకు ఇంకో విషయం తట్టింది. ఆధునిక కాలపు గురువులకూ, నాకూ ఒక సమాన గుణం ఉంది. నేను సినిమాల్లో పనిచేస్తాను. వాళ్లకూ నాకూ ఉమ్మడి అంశం ఏమంటే, మేమిద్దరమూ కూడా కలలు

అమ్ముతాము. ఇద్దరమూ కూడా భ్రమలను సృష్టిస్తాం. ఇద్దరమూ విగ్రహాలను తయారు చేస్తాం. ఒక్క చిన్న తేడా మాత్రం ఉంది. మూడు గంటలు గడవగానే మా కలల అమ్మకం ఆపేసి శుభం అని కార్డు వేసి వాస్తవికతలోకి వెళ్లిపోండి అని జనాన్ని పంపించేస్తాం. ఈ గురువులు మాత్రం అలా ఎప్పటికీ పంపరు.

కనుక ఇక్కడ ఇవాళ ప్రపంచపు సూపర్ మార్కెట్‌లో ఒక అమ్మకపు వస్తువుగా మారిపోయిన ఆధ్యాత్మికత గురించి మాట్లాడడానికే నేనిక్కడ నిలబడ్డానని స్పష్టం చేయదలిచాను. ఇవాళ ప్రపంచంలో మూడు పెద్ద భారీ వ్యాపార వస్తువులు ఉన్నాయి. అవి – ఆయుధాలు, మాదక ద్రవ్యాలు, ఆధ్యాత్మికత. అయితే, ఆయుధాలలోనూ, మాదక ద్రవ్యాలలోనూ మీరు ఎంతో కొంత చేయాలి. ఏదో ఒకటి ఇవ్వాలి. తేడా ఏమంటే ఆధ్యాత్మికతలో మాత్రం మీరేమీ ఇవ్వనక్కరలేదు.

ఈ సూపర్ మార్కెట్‌లో మీకు అడిగిన వెంటనే నిర్వాణం దొరుకుతుంది. మెయిల్‌లో మీకు మోక్షం చేరుతుంది. ఆత్మ సాక్షాత్కారంలో క్రాష్ కోర్స్ ఉంటుంది. నాలుగు సులభ పాఠాలలో విశ్వ చైతన్యం అందుతుంది. ఈ సూపర్ మార్కెట్‌కు ప్రపంచ వ్యాప్తంగా గొలుసు దుకాణాలు ఉన్నాయి. ఆ దుకాణాలలో అశాంతి నిండిన ఉన్నత వర్గాలు ఆధ్యాత్మిక ఫాస్ట్ ఫుడ్ కొనుక్కుని తింటూనే ఉంటాయి. నేనిప్పుడు ఈ ఆధ్యాత్మికత గురించి మాట్లాడదలిచాను.

ప్లేటో సంభాషణల్లో ఆయన చాలా విలువైన విషయాలు ఎన్నో చెప్పాడు. వాటిలో ఒకటి ఏమంటే, 'మీరు ఏదైనా చర్చ ప్రారంభించే ముందు మీరు వాడుతున్న పదాల అర్థం ఏమిటో నిర్ణయించుకోండి' అని. మరి మనం కూడా ఇప్పుడు ఈ ఆధ్యాత్మికత అనే పదం అర్థం ఏమిటో నిర్ణయించుకుందాం. ఆ పదానికి అన్ని మతాలనూ, కులాలనూ, మతాలనూ, జాతులనూ అధిగమించి సంపూర్ణంగా మానవజాతి పట్ల ప్రేమ అనే అర్థం ఉంటుందా? అలా ఉంటే నాకేమీ సమస్య లేదు. కాకపోతే, దాన్ని నేను ఆధ్యాత్మికతా అనే బదులు మానవత అంటాను. లేదా, దానికి అర్థం మొక్కలనూ, చెట్లనూ, కొండలనూ, సముద్రాలనూ, నదులనూ, జంతువులనూ ప్రేమగా చూడడం అనా? అంటే, మానవేతర ప్రపంచం పట్ల దయ కలిగి ఉండడమనా? ఒకవేళ అదయినా నాకేమీ సమస్య లేదు. కాకపోతే, దాన్ని నేను ఆధ్యాత్మికత అనను. పర్యావరణ స్పృహ అంటాను. లేదా, వివాహం, మాతృత్వం, పితృత్వం, లలిత కళలు, న్యాయవ్యవస్థ, భావ ప్రకటనా స్వేచ్ఛ వంటి సామాజిక సంస్థలను హృదయపూర్వకంగా గౌరవించడమే ఆధ్యాత్మికత అనే మాటకు అర్థమా? అయ్యా, అప్పుడు కూడా నాకేమీ సమస్య లేదు. అసలు నాకు అనంగీకారం తెలిపే అవకాశమే లేదు. కానీ, నేను దాన్ని పౌర బాధ్యత అంటాను. లేదూ, ఆధ్యాత్మికత అంటే మీ లోకంలోకి మీరు వెళ్లిపోయి, మీ సొంత జీవితపు అర్థం ఏమిటో అన్వేషించే ప్రయత్నం చేయడమా? దానికి ఎవరు అడ్డు చెపుతారు? కానీ, దాన్ని నేను ఆత్మపరిశీలన, ఆత్మ పరీక్ష అనుకుంటాను. లేదూ, ఆధ్యాత్మికత అంటే యోగం అని అర్థం చెపుతున్నారా? గౌరవనీయుడైన పతంజలి యోగ శాస్త్రానికి మనం కృతజ్ఞతలు చెప్పాలి. ఆయన యోగం, యమ, యతమ, ఆసన, ప్రాణాయామ వంటి వివరాలు ఎన్నో మనకందించాడు. వాటికి మనం ఇవ్వాళ ఏ పేరైన పెట్టుకోవచ్చు. కానీ, ప్రాణాయామం చేస్తే చాలా బాగుంటుంది. దాన్ని నేను ఆరోగ్య పరిరక్షణ, శారీరక దృఢత్వం అంటాను.

ఇదంతా పదాల గారడీగా కనిపిస్తుందా? ఒకవేళ ఇదే ఆధ్యాత్మికత అయితే ఇక చర్చకు అవకాశమేముంది? నేను వాడిన పదాలూ, అర్థాలూ అన్నీ కూడా సంపూర్ణంగా గౌరవించదగినవి. ఆమోదించదగినవి. వాటిలో అమూర్తమైనదేదీ లేదు. మన చూపులకు అందనిదేదీ లేదు. మరి, ఆధ్యాత్మికత అనే మాట పట్టుకుని ఎందుకంతగా వేళ్లాడుతున్నారు? నేను చెప్పిన మాటలలో వ్యక్తం కాని ఏ భావాన్ని ఈ ఆధ్యాత్మికత అనే మాట సూచిస్తోంది? నేను చెప్పినవి కాకుండా ఇంకా ఏమైనా ఉందా? ఉన్నట్టయితే అది ఏమిటి?

ఆ మాట వాడినంత మాత్రాన నీకు వచ్చిన సమస్య ఏమిటి అని ఎవరైనా నన్ను ఎదురు ప్రశ్నించవచ్చు. ఆ మాటను మార్చమనీ, ఒదిలేయమనీ, పారెయ్యమనీ, దానికి కాలం చెల్లిందనీ అంటున్నాను. ఎందుకు? నా అభ్యంతరం ఏమిటో చెపుతాను. ఆధ్యాత్మికత అంటే అర్థాలు నేను చెప్పినవే అయితే చర్చకు అవకాశమే లేదు. కానీ, నన్ను ఇబ్బంది పెట్టే అంశం మరొకటి ఉంది. ఏ నిఘంటువు అయినా తెరిచి చూడండి. ఆధ్యాత్మికత అనే మాట ఆత్మ అనే మాట నుంచి పుట్టింది. మానవజాతికి ఈ భూగోళం గుండ్రంగా ఉందా, బల్లపరుపుగా ఉందా తెలియనప్పుడు మనుషులు తమను తాము రెండు అంశాల సమ్మేళనంగా ఊహించుకున్నారు. ఒకటి శరీరం మరొకటి ఆత్మ. శరీరం అనేది తాత్కాలికమనీ, అది మరణిస్తుందనీ, కాని, ఆత్మ అనేది ఎన్నటికీ నాశనం లేనిదనీ ఊహించుకున్నారు. మీ శరీరం లోపల మీకొక కాలేయం ఉంది. ఒక గుండె ఉంది. పేగుల చుట్ట ఉంది. ఒక మెదడు ఉంది. ఈ మెదడు అనేది శరీరంలో భాగం కనుక, మనస్సు అనేది మెదడు వల్ల తయారవుతున్నది కనుక, ఇవన్నీ తక్కువ జాతివే అని వాళ్లనుకున్నారు. శరీరంతో పాటు చివరికి మెదడు కూడా చచ్చిపోతుందని వాళ్లు తెలుసుకున్నారు. కానీ, భయంలేదు. మీరు ఎప్పటికీ చచ్చిపోరు. ఎందుకంటే, మీరంటే మీ ఆత్మ. ఆ ఆత్మ ఒక అత్యున్నత చైతన్యంతో ఎల్లకాలానికి నిలిచి ఉంటుంది. మీకు వచ్చే సమస్యలన్నీ మీ మనస్సు చెప్పే మాటలు వినడం వల్ల వస్తున్నాయి. మనసు చెప్పే మాటలను వినడం మానెయ్యండి. ఆత్మ చెప్పే మాటలు వినండి. ఆ అత్యున్నత చైతన్యానికి విశ్వ సత్యం అవగాహనలో ఉంటుంది. ఇదీ కథ. సరే, పూనాలో ఒక ఆశ్రమం ఉంది. నేను అక్కడికి వెళుతూ ఉండేవాణ్ని. ఎందుకంటే, అక్కడ మాట్లాడేవాళ్లు మంచి వక్తలు. ఆ సమావేశ మందిరం ద్వారం దగ్గర ఒక హెచ్చరిక రాసి ఉండేది. 'మీ చెప్పులూ, మనస్సూ ఇక్కడ వదిలేసి వెళ్లండి'. అయితే ఇటీవల కొందరు గురువులు మీరు చెప్పులతో వచ్చినా అంగీకరిస్తున్నారు. కానీ, మనస్సులతో రావడానికి మాత్రం ఎంతమాత్రం వీల్లేదు.

మరి, మీరు మనస్సును వదిలేస్తే ఏం చేస్తారన్నమాట? అప్పుడిక చైతన్యంలో మరొక అడుగు ముందుకు వేయడానికి మీకొక గురువు అవసరం అవుతాడు. ఆ చైతన్యపు మరొక మెట్టు ఆత్మలో దాగి ఉంటుంది. ఈ గురువుగారు ఉన్నత చైతన్యాన్ని సాధించారు. ఆయనకు అత్యున్నత సత్యం తెలుసును. కానీ, మీకాయన ఊరికే ఇచ్చేస్తారా? లేదండి. ఆయన అది మీకు వెంటనే చెప్పలేరు. పోనీ, మీ అంతట మీరు ఆ మెట్టు ఎక్కి అది అందుకోగలరా? లేదండి. ఆ పని చేయడానికి మీకు గురువు సహాయం అవసరం అవుతుంది. మీకు ఆయన కావలసిందే. అయినా మీరు అంతిమ సత్యాన్ని అందుకోగలరని ఆయన హామీ ఇవ్వలేదు... సరే, ఇంతకీ ఆ అంతిమ సత్యం అనేది ఏమిటి? విశ్వ సత్యం అనేది ఏమిటి? అది విశ్వం గురించిన సత్యమా? నాకు అదేమీ అంతుపట్టదు. సౌర మండలం నుంచి మనం ఒక అడుగు బయట పెడితే మొట్టమొదట మనకు కనబడే నక్షత్రం పేరు ఆల్ఫా సెంచూరి. అది మనకు నాలుగు కాంతి సంవత్సరాల దూరంలో ఉంది. దానికీ నాకూ సంబంధం ఏలా ఏర్పడుతుంది? ఏర్పడకపోతే నేను ఏం చేయను?

అసలు విషయం ఏమంటే, ఈ చక్రవర్తి గారు పెద్ద మనుషులకు మాత్రమే కనబడే దుస్తులు ధరించారు. అంతేకాదు, చక్రవర్తిగారు రోజు రోజుకూ బలిసిపోతున్నారు. ఆయన వంటిమీద లేని దుస్తులను ఉన్నట్టుగా పొగిడే పెద్ద మనుషుల సంఖ్య రోజురోజుకూ పెరిగిపోతోంది.

మతాధిపతులకు రెండో రక్షణ కవచంగానే ఈ ఆధ్యాత్మికత అనేది పనికొస్తుందని నేను అనుకుంటూ ఉండేవాణ్ని. సాంప్రదాయిక మతంలో విషయాలను వివరించలేక వాళ్లు నిరాశపడుతున్నప్పుడు, ఆ మతానికి పెద్ద ఆకర్షణ లేనప్పుడు వాళ్లకు ఈ విశ్వం, అధిచైతన్యం లాంటి పొగల తెరల వెనుక దాగవలసిన అవసరం వస్తుందని అనుకునే వాణ్ని. కానీ, అది పూర్తిగా సత్యం కాదు. ఎందుకంటే, సాంప్రదాయిక మతాన్ని నమ్మేవారు, ఆధ్యాత్మికతను నమ్మేవారు పూర్తిగా వేరు వేరు. ఒకసారి ప్రపంచ పటాన్ని తీసుకోండి. అతి ఎక్కువగా మతం ప్రభావం ఉన్న ప్రాంతాలు గుర్తిస్తూ పోండి. భారతదేశంలో గానీ, భారతదేశానికి బయటగానీ ఆసియాలో, లాటిన్ అమెరికాలో, యూరప్‌లో ఎక్కడైనా సరే ఎక్కడెక్కడ అయితే మత ప్రభావం ఎక్కువ ఉందో, అక్కడల్లా మానవహక్కులు కొరవడుతున్నాయని మీరు గుర్తించగలరు. అక్కడంతా అణచివేత ఉంది. ఎక్కడైనా సరే. మతం అంటే పేద ప్రజల పాలిటి మత్తు మందూ అనీ, అణగారిన ప్రజల నిట్టూర్పు అనీ మన మార్క్సిస్ట్ స్నేహితులు అంటూ ఉండేవాళ్లు. నేనిప్పుడు ఆ చర్చలోకి వెళ్లను గానీ, ఇవాళ మాత్రం ఆధ్యాత్మికత అనేది తప్పనిసరిగా ధనికులు వినియోగిస్తున్న ఒక మాదక పదార్థం. ఎక్కడ చూసినా ఆధ్యాత్మికతను నమ్మే సమూహం అంతా ఒక సంపన్నవర్గం మాత్రమే. అంటే, గురువు గారికి అధికారం వస్తుంది, చాలా గౌరవం దక్కుతుంది, హోదా పెరుగుతుంది, సంపద పెరుగుతుంది (అది ముఖ్యం కాదని వాళ్లంటారనుకోండి) మొత్తం మీద అధికారమూ, సంపదా దక్కుతాయి. మరి శిష్యుడికి ఏం దొరుకుతుంది? చాలా మంది శిష్యులను నేను జాగ్రత్తగా గమనించాను. ఈ శిష్యులలో వేరు వేరు రకాల వారున్నారు. అందరూ ఒక్కలాంటి వాళ్లు కారు. విభిన్నమైన సమూహాల అనుయాయులు ఉన్నారు. విభిన్న తరహాల శిష్యులు ఉన్నారు. ఒక శిష్యుడు ధనవంతుడు. ఎన్నో విజయాలు సాధించినవాడు. జీవితంలో చాలా పైకి వచ్చినవాడు. విపరీతంగా ధనం సంపాదిస్తున్నవాడు. ఆస్తి పోగేస్తున్నవాడు. ఆయనకు అన్నీ ఉన్నాయి కనుక ఇక ముక్తి కావాలి. అందువల్ల గురువుగారు ఏం చెపుతారంటే, నువ్వు ఏం చేస్తున్నా సరే అదంతా నిష్కామకర్మ. నువ్వు కేవలం నీ పాత్ర పోషిస్తున్నావు. ఇదంతా మాయ. నువ్వు రోజు రోజూ పోగుచేసుకుంటున్న డబ్బు, నువ్వు కూడబెడుతున్న ఆస్తి ఇదంతా మాయ. దీనంతటితోనూ నీకు ఉద్వేగపూరితమైన సంబంధమేమీ లేదు. నువ్వు కేవలం నిమిత్త మాత్రుడివి. నువ్వు నా దగ్గరికి ఎందుకొచ్చావో తెలుసునా? నువ్వు ఒక శాశ్వత సత్యపు అన్వేషణలో ఉన్నావు. నీ చేతి నిండా మురికి ఉంటే ఉండవచ్చు. కానీ, నీ ఆత్మ, నీ అంతరాత్మ పరిశుద్ధమైనది. ఈ మాటలు ఈ శిష్యుడు తన గురించి తాను పొంగిపోతూ ఉంటాడు. అద్భుతమైన మనిషిని అనుకుంటాడు. వరుసగా ఏడు రోజుల పాటు ప్రపంచాన్ని దోపిడీ చేసి, ఏడో రోజు చివరన వెళ్లి గురువు పాదాల దగ్గర కూచుని 'అబ్బా, నేనెంత సున్నితమైన వ్యక్తిని' అని అనుభూతి చెందుతాడు.

ఇంకొక రకం ఉన్నారు. వీళ్లు కూడా సంపన్నవర్గం నుంచే వస్తారు. కానీ, వీళ్లు మొదటిరకం లాగా విజయసాధకులు కారు. విజయం సాధించడమైనా, వైఫల్యం చెందడమైనా సాపేక్షికమని మీకు తెలుసు. రోడ్డు పక్క పేవ్‌మెంట్ మీద జూదం ఆడే రిక్షావాలా వంద రూపాయలు సంపాదిస్తే మహా విజయం సాధించానని అనుకుంటాడు. ఒక కార్పొరేట్ సంపన్నుడు ముప్పై కోట్ల డాలర్లు సంపాదించాక, అతని సోదరుడు వంద కోట్లు సంపాదించాడని, అందువల్ల తాను పనికిమాలిన వాడినని అనుకుంటాడు. ఇలా తనకు తాను పనికిమాలిన వాడినని అనుకున్న ధనికుడు ఏం చేస్తాడు? అతనికి తక్షణమే ఒక గురువు కావాలి. ఆ గురువు హితబోధ చేస్తాడు. నువ్వు విఫలం అయ్యావని ఎవరన్నారు? నీకు వేరే లోకాలు ఉన్నాయి. నీకు వేరే దృష్టి ఉంది. నీ సోదరుడికి లేని ఊహలు నీకు ఉన్నాయి. నీ సోదరుడు విజయం సాధించాడని అనుకుంటున్నావేమో. తప్పు. ఈ ప్రపంచం క్రూరమైనది. నీకు తెలుసు. ఈ ప్రపంచం నిజాయితీగా నీకు చెపుతుంది. అయ్యా, పది సంపాదించవలసి ఉండగా మీరు మూడే సంపాదించారు. మరొక వ్యక్తి పదింట ఏడు సంపాదించాడు. లోకం నిన్ను అలా చూస్తుంది. నీకు తెలిసిన వాళ్లందరూ నిన్ను అట్లాగే చూస్తారు. ఇటువంటి హితబోధలతో ఈ శిష్యుడు సానుభూతి పొందుతాడు. తాను ఆడేది వేరే ఆట, అందరూ ఆడే ఆట లాంటిది కాదు అని అనుకుంటాడు.

ఇంకొక రకం ఉన్నారు. నేను వీళ్ల గురించి వ్యతిరేకతతో, లేదా, చిన్నచూపుతో, లేదా, కరకుగా మాట్లాడడం లేదు. వాళ్లపట్ల పూర్తి సానుభూతితోనే మాట్లాడుతున్నాను. ఈ రకం ఆధునిక కాలపు ఆధ్యాత్మికత గురువులకు అతి పెద్ద విశ్వసనీయమైన సమూహం. వాళ్లు అసంతృప్త జీవులైన సంపన్నుల భార్యలు.

ఆమె ఒక సంపూర్ణ వ్యక్తి. ఆమె తన వ్యక్తిత్వాన్నీ, కలలనూ, కోరికలనూ, తన సమస్త జీవితాన్నీ వివాహం అనే వేదిక మీద బలి పెట్టింది. అందుకు ప్రతిఫలంగా ఆమెకు దక్కినది ఆమెను ఎంత మాత్రం పట్టించుకోని భర్త. ఆ భర్త ఆమెకు ఎక్కువలో ఎక్కువ ఇద్దరు ముగ్గురు పిల్లలను ఇస్తాడు. అంతే. ఆయనకు ఆయన వ్యాపారాలలో, లేదా, ఇతర స్త్రీలతో గడపడంలో క్షణం తీరిక ఉండదు. ఈ స్త్రీకి తలవాల్చి ఏడవడానికి ఒక భుజం కావాలి. తన మనుగడ అంతా ఒక నిష్ప్రయోజక అస్తిత్వమని భావిస్తూ ఉంటుంది. ఆమెకు ఎటు చూసినా వెలుగు లేదు. ఆమె జీవితం ఒక శూన్యం నిండిన ఖాళీ. అన్నీ సౌకర్యాలు ఉన్నప్పటికీ ఆ జీవితానికి అర్థంలేదు. ఇదంతా విషాదకరం. కానీ, అక్షరాలా వాస్తవం.

మరొక రకం శిష్యులు ఉన్నారు. వాళ్లకు హఠాత్తుగా ఏదో విపత్తు వస్తుంది. అనూహ్యంగా కన్నబిడ్డ చనిపోతాడు. భార్య మరణిస్తుంది. భర్త మరణిస్తాడు. లేదా, వాళ్లు ఆస్తి కోల్పోతారు. వ్యాపారంలో విపరీతంగా నష్టం వస్తుంది. ఏదో ఒకటి జరిగి, వాళ్ల జీవితాలు కుదుపుకు గురవుతాయి. వాళ్ల ముందర ఒకే ఒక ప్రశ్న లేచి నిలబడుతుంది. ఇది మాకే ఎందుకు జరగాలి? ఈ ప్రశ్నను వారు ఎవరికి వేయాలి? వారు వెంటనే గురువు దగ్గరకు వెళతారు. ఇదంతా కర్మ ఫలితం నాయనా అని చెపుతారు గురువుగారు. కానీ, నా వెంట నడువు. నీకు మరో లోకం ఉంది అని ఆశ్వాసం ఇస్తారు. ఆ లోకంలో బాధలేదు, వేదన లేదు, మరణం లేదు. అక్కడికి చేరావంటే అది అమర లోకం. అక్కడ ఆనందం మాత్రమే ఉంది. దుఃఖం నిండిన ఈ మనుషులకు గురువు గారు ఈ మాటలు చెప్పి ఓదారుస్తారు. నన్ను అనుసరించండి. నేను మిమ్మల్ని స్వర్గానికి, కైవల్యానికి, బాధ లేని చోటికి తీసుకుపోతాను అని చెపుతారు. అయ్యా, నన్ను క్షమించండి. ఇది విచారకరమే. కానీ, వాస్తవం ఏమంటే అటువంటి స్వర్గం ఎక్కడా లేదు.

జీవితంలో తప్పనిసరిగా, ఎంతో కొంత నిష్పత్తిలో దుఃఖం ఉంది. వేదన ఉంది. అపజయాల అవకాశం ఉంది. కానీ, గురువు గారి మాటలతో వాళ్లకు ఎంతో కొంత సంతృప్తి దొరుకుతుంది.

మరి, వాళ్లకు అలా మెరుగైన మనస్థితి కలిగినప్పుడు, శాంతి దొరుకుతున్నప్పుడు నీ అభ్యంతరం ఏమిటి అని ఎవరైనా నన్ను అడగొచ్చు. నేనెప్పుడో చదివిన ఒక కథ నాకిక్కడ గుర్తొస్తుంది. అది చాలా పాత భారత కథ. ఒక ముని ఆ కథ చెప్పాడు. ఆకలిగొన్న ఒక కుక్కకు ఒక ఎండిపోయిన ఎముక దొరికిందట. అది దాన్ని కొరకడానికి ప్రయత్నిస్తే, ఆ ఎముక నుంచి ఏమీ రాలేదు కానీ, దాన్ని నాలుకనే అది కొరుక్కుందట. ఆ నాలిక నుంచి నెత్తురు బయటికి ప్రవహిస్తుంటే ఆ కుక్క మాత్రం అబ్బా, ఎముకలో సరిపోయే తిండి దొరికింది కదా అనుకుందట.

నాకు విచారం కలుగుతుంది. వేదనలో ఉన్న ఈ పెద్దలు ఇలా ప్రవర్తించకపోతే బాగుండునని అనిపిస్తుంది. వారి పట్ల గౌరవం ఉంది. మాదక ద్రవ్యాలు, మద్యం కూడా మానసిక శాంతినీ, ఉపశమనాన్నీ ఇస్తాయని చెపుతారు. కానీ, అటువంటి శాంతిని, అటువంటి ఉపశమనాన్ని కోరడం మంచిదేనా? ఎవరికైనా అది మనం సిఫారసు చేస్తామా? కచ్చితంగా చేయం. హేతుబద్ధమైన ఆలోచనలలో నుంచి పుట్టి పెరగని మానసిక శాంతి ఏదైనా ఆత్మవంచన తప్ప మరొకటి కాదు. సత్యం నుంచి దూరం తీసుకుపోయే ఉపశమనం ఏదైనా ఒక భ్రమ మాత్రమే. ఎండమావి మాత్రమే. ఇటువంటి ఉపశమనంలో ఒక భద్రత ఉందని నాకు తెలుసు. కానీ, ఈ భద్రత ఒక మూడు చక్రాల సైకిల్ మీద కూచున్నప్పుడు అనుభవించే భద్రత. మూడు చక్రాల సైకిల్‌ను నడుపుతున్నప్పుడు మీరు సురక్షితంగా ఉంటారు. పడిపోరు. కానీ, కాళ్లూ, చేతులూ సక్రమంగా ఉన్న పెద్దలు మూడు చక్రాల సైకిల్ నడపరు. వాళ్లు రెండు చక్రాల సైకిల్ నడుపుతారు. అలా నడపడంలో పడిపోవచ్చు. కానీ, అది జీవితంలో భాగం.

ఇంకొక రకం కూడా ఉన్నారు. వీళ్లు ఎటువంటి వాళ్లు అంటే, గోల్ఫ్ క్లబ్‌లో సభ్యులైన వారందరికీ గోల్ఫ్ మీద పెద్ద ఆసక్తి లేనట్టుగానే ఆశ్రమంలో కనబడే ప్రతి ఒక్కరూ ఆధ్యాత్మిక వ్యక్తి కానక్కరలేదు. నాకు తెలిసిన ఒక సినిమా నిర్మాత ఉన్నారు. ఒక గురువు గారికి కరుడుగట్టిన అనుయాయి. ఆ గురువు గారి ఆశ్రమం ఢిల్లీకి రెండు గంటల దూరంలో ఉంది. ఆ నిర్మాత నన్ను ఒకసారి వాళ్ల గురువు దగ్గరికి వెళ్లమని అడిగారు. ఆశ్రమానికి వెళ్లావంటే ఢిల్లీలోని ప్రముఖులందరూ నీకక్కడే కనబడతారు. నీకు తెలుసా, మా గురూజీ కాబోయే చంద్రస్వామి. చూస్తూండు. అన్నాడాయన. అంటే, ఇవాళ ఆధునిక గురువుల ఆధ్యాత్మిక ఆశ్రమాలు పైరవీలకూ, పనులకూ పరిచయ స్థానాలు అయ్యాయి.

నిజం చెప్పాలంటే ఆధ్యాత్మిక దృష్టి ఉన్న, మత దృష్టి ఉన్న ప్రజల పట్ల నాకు చాలా గౌరవం ఉంది. నేనిప్పుడు చెప్పిన కారణాలన్నీ ఉన్నప్పటికీ వాళ్లు మంచి వాళ్లు. ఒక కారణం కూడా చెప్పాలి. ప్రతి ఉద్వేగానికీ, ప్రతి అనుభూతికీ ఉన్నట్టుగానే దీనికి కూడా ఒక పరిమితి ఉంది.

ఎవరైనా ఒక అంశం వరకు చూడగలరు. ఆ తర్వాత చూడలేరు. ఒక అంశం వరకు వినగలరు. ఆ తర్వాత ఏ శబ్దాన్నీ గ్రహించలేరు. ఒకానొక సమయం వరకు దుఃఖించగలరు. క్రమంగా ఆ దుఃఖాన్ని అధిగమిస్తారు. ఒకానొక స్థలం వరకే సంతోషాన్ని అనుభవించగలరు. ఆ తర్వాత సంతోషం కూడా అయిపోతుంది. సరిగ్గా అట్లాగే, ఎవరికైనా మంచితనానికి కూడా ఒక నిర్ణీతమైన శక్తే ఉంటుంది. మీరు ఒక స్థాయి వరకే మంచివాళ్లుగా ఉండగలరు. మనిషిలో ఈ మంచితనపు సామర్థ్యం సగటున పది యూనిట్లు ఉంటుందనుకుంటే, ఆ మంచితనపు సామర్థ్యం మొత్తాన్ని అటు మసీదుకు వెళ్లి రోజుకు ఐదుసార్లు ప్రార్థనలు చేసే వారైనా, ఇటు గుడికి వెళ్లో, లేదా గురువు పాదాల దగ్గరో కూచునే వాళ్లయినా పూర్తిగా ఖర్చు పెట్టేస్తున్నారని నాకనిపిస్తుంది. అదంతా కూడా అనుత్పాదకమైన పద్ధతిలో ఖర్చు పెడుతున్నారనిపిస్తుంది. నేనెక్కడా ప్రార్థనలు చేయను. నేను ఏ గురువు దగ్గరికీ వెళ్లను. మసీదుకో, గుడికో, చర్చికో వెళ్లను. అప్పుడు నా మంచితనపు సామర్థ్యాన్ని నేను ఏం చేస్తాను? బహుశా ఆ మంచితనపు సామర్థ్యంతో నేను మరొకరికి సాయపడతాను. మరొకరికి తిండి పెడతాను. మరొకరికి ఆశ్రయం ఇస్తాను. మనుషులు తమలో ఉన్న మంచితనపు సామర్థ్యాన్నీ పూజలో, ప్రార్థనలో, మత విగ్రహాలను ఆరాధించడంలో ఆధ్యాత్మిక గురువులను కొలవడంలో ఖర్చు పెట్టే బదులు, ఆ మంచితనాన్ని మిగుల్చుకొని దాన్ని మరొకందుకు వాడితే వాళ్లకు నా అభినందనలు.

మతానికి చెందిన మనుషుల పట్ల ఇటువంటి భావాలు ఉన్నప్పుడు నాకు కృష్ణుడి మీదనో, కబీర్ మీదనో, గౌతముడి మీదనో అంత గౌరవం ఎలా ఉందని మీరు అడగవచ్చు. వాళ్లను నేనెందుకు గౌరవిస్తానో చెపుతాను. వాళ్లందరూ మానవ నాగరికతా చరిత్రలో గొప్ప దోహదం చేసినవాళ్లు. చరిత్రలో వేరు వేరు కాలాల్లో, వేరు వేరు పరిస్థితులలో వాళ్లు జీవించారు. వాళ్లందరి మధ్య ఒకే ఉమ్మడి సూత్రం ఉంది. వాళ్లు అన్యాయానికి వ్యతిరేకంగా నిలబడ్డారు. వాళ్లు అట్టడుగు ప్రజల కోసం పోరాడారు. రావణుడైనా, కంసుడైనా, ఫారో చక్రవర్తి అయినా, మతాధిపతులైనా, గాంధీ ముందులాగా బ్రిటిష్ సామ్రాజ్యమయినా, కబీర్ కాలంలోని ఫిరోజ్ తుగ్లక్ మతోన్మాద రాజ్యం అయినా వాళ్లందరూ ఆధిపత్యానికి వ్యతిరేకంగా నిలబడ్డారు. నాకు ఆశ్చర్యం కలిగించేదీ, నా అనుమానాలను నిజం చేసేదీ ఏమంటే ఇవాళ మాత్రం తమను తాము మతాధిపతులమని చెప్పుకునే వాళ్లు, విశ్వసత్యం తమకు మాత్రమే గ్రహింపుకు వచ్చిందని అనేవాళ్లు ఒక్కరు కూడా అధికారానికి వ్యతిరేకంగా నిలబడడం లేదు. పాలకవర్గాలకూ, సంపన్న వర్గాలకూ వ్యతిరేకంగా వీళ్లలో ఒక్కరు కూడా గొంతెత్తడం లేదు. వీళ్లు ధర్మం చేస్తారు. నిజమే. కానీ, ఆధిపత్య వ్యవస్థా, అధికారంలో ఉన్నవారు అంగీకరించినంత వరకే ఆ ధర్మం సాగుతుంది. ఇవాళ్టికీ దళితులకు ప్రవేశం లేని దేవాలయాలలోకి వారిని నడిపించుకు వెళ్లగలిగిన ఆధ్యాత్మిక గురువులు ఎవరైనా ఉన్నారా అని నా ప్రశ్న. దురాక్రమణదారులకూ, కాంట్రాక్టర్లకూ వ్యతిరేకంగా పోరాడుతున్న ఆదివాసుల హక్కుల కొరకు నిలబడే ఆధ్యాత్మిక గురువులు ఎవరైనా ఉన్నారా అని నా ప్రశ్న. గుజరాత్ మారణకాండకు బలి అయిన వారికోసం మాట్లాడిన, బాధితుల సహాయ శిబిరానికి వెళ్లిన గురువు ఎవరైనా ఉన్నారా అని నా ప్రశ్న.

ధనికులకు ఉచ్ఛ్వాసనిశ్వాసలు బోధించినంత మాత్రాన సరిపోదు. అవి కేవలం సంపన్నుల వినోద క్రీడ. ఇది కుటిల వాదుల మేలి ముసుగు. ఇది దుర్మార్గమైన వంచన. ఈ దుర్మార్గమైన వంచనను మీరు ఏ నిఘంటువులో చూసినా ఆధ్యాత్మికత అని పిలవలేరు. దానికి ఉన్నది ఒకే ఒక్క మాట బూటకం.

*(ఇండియా టుడే పక్షపత్రిక నిర్వహించే వార్షిక జాతీయ సదస్సుల పరంపరలో భాగంగా ఢిల్లీలో 2005 ఫిబ్రవరి 26న జరిగిన సదస్సులో జావేద్ అఖ్తర్ చేసిన ఉపన్యాసం. జావేద్ అఖ్తర్ హిందీ, ఉర్దూ కవి, నాటక రచయిత, సినిమా రచయిత. సినిమా నటి షబానా ఆజ్మీ సహచరుడు.)*

వీ

*ఇవాళ ప్రకృతికి, పర్యావరణానికి, మొత్తంగా మానవాళికి వ్యతిరేకంగా కార్పొరేట్ దోపిడీ కొనసాగుతోందనీ, దీనిని వ్యతిరేకించడమే మన బాధ్యత అనీ అంటున్నారు* **డా. వందనా శివ**

# భూగోళ వినాశనాన్ని అడ్డుకుందాం

మన కాలంలో యుద్ధాల గురించి ఆలోచించినప్పుడు మన మనసుల్లోకి వెంటనే ఇరాక్, అఫ్ఘనిస్తాన్ అనే పేర్లు వస్తాయి. కానీ, ఆ యుద్ధాల కన్న పెద్ద యుద్ధం భూగోళానికి వ్యతిరేకంగా జరుగుతోంది. ఈ యుద్ధానికి మూలకారణాలు ఇవాళ్టి ఆర్థిక వ్యవస్థలో ఉన్నాయి. ఈ ఆర్థిక వ్యవస్థ పర్యావరణ నైతిక పరిమితులను గౌరవించదు. అసమానతకూ, అన్యాయానికీ, అత్యాశకూ, ఆర్థిక కేంద్రీకరణకూ హద్దులున్నాయని అంగీకరించదు.

పిడికెడు కార్పొరేషన్‌లూ, శక్తిమంతమైన దేశాలూ మొత్తం భూగోళపు వనరుల మీద తమ అదుపు కావాలనుకుంటాయి. మొత్తం భూగోళాన్నే ఒక సూపర్ మార్కెట్‌గా తయారుచేసి ఏదయినా అమ్మకానికి దొరికేలా చేయాలనుకుంటాయి. వాళ్లు మన నీళ్లను అమ్మదలిచారు. మన జన్యువులను అమ్మదలిచారు. మన కణాలను అమ్మదలిచారు. మన అవయవాలను అమ్మదలిచారు. మన జ్ఞానాన్ని, సంస్కృతులను అమ్మదలిచారు. చిట్టచివరికి మన భవిష్యత్తును కూడా అమ్మదలిచారు.

ఇవాళ అఫ్ఘనిస్తాన్‌లోనో, ఇరాక్‌లోనో, మరొక చోటనో జరుగుతున్న యుద్ధాలు కేవలం 'చమురు కోసం నెత్తురు' చిందిస్తున్న యుద్ధాలు మాత్రమే కాదు. ఆ యుద్ధాలు ఇంకా ముందుకు సాగుతుంటే మనకు తేటతెల్లమయ్యేదేమంటే అవన్నీ ఆహారం కోసం నెత్తురు, జన్యువుల కోసం నెత్తురు, జీవ వైవిధ్యం కోసం నెత్తురు, నీటి కోసం నెత్తురు చిందించే యుద్ధాలుగా మారిపోతాయి.

ఇవాళ సైనిక, పారిశ్రామిక, వ్యవసాయ సామ్రాజ్యపు యుద్ధ మనసత్తత్వం మొన్‌సాంటో తన క్రిమినాశక మందులకు పెడుతున్న పేర్లలోనే స్పష్టంగా కనబడుతోంది. వాటి పేర్లు 'రౌండప్' (చుట్టు ముట్టడం), 'మాచెట్' (కమ్మకత్తి), 'లాసో' (తల్వార్). మొన్‌సాంటోతో ఇటీవలనే కలిసిపోయిన అమెరికన్ హోం ప్రాడక్ట్స్ అనే కంపెనీ కూడా తన క్రిమినాశక మందులకు ఇటువంటి దౌర్జన్యపూరితమైన పేర్లనే పెట్టింది. వాటి పేర్లు 'పెంటగాన్' (అమెరికా సైనిక ప్రధాన స్థావరం), 'స్క్వాడ్రన్' (సైనిక దళం). ఇదంతా యుద్ధ పరిభాష. కానీ, మానవ జీవితం సుస్థిరంగా ఉండాలంటే కావలసింది యుద్ధం కాదు. భూగోళంతో శాంతి.

అసలు ఈ భూగోళానికి వ్యతిరేకంగా యుద్ధం మనసులోనే మొదలవుతుంది. హింసాత్మక ఆలోచనలే హింసాత్మక చర్యలు రూపొందిస్తాయి. హింసాత్మక భావనలే హింసా సాధనాలను తయారు చేస్తాయి. ఇవాళ ప్రపంచపు పారిశ్రామిక, వ్యవసాయ ఆహార ఉత్పత్తి పద్ధతులన్నీ ఏ అలంకారాల మీదా, పోలికల మీదా ఆధారపడ్డాయో చూస్తే ఈ హింసాత్మక భావనలు తేటతెల్లమవుతాయి. యుద్ధ సమయంలో మనుషులను చంపడానికి విషపదార్థాలనూ, పేలుడు పదార్థాలనూ తయారు చేసిన కర్మాగారాలే, యుద్ధం ముగిసిపోయిన తర్వాత వ్యవసాయ రసాయనాలు తయారు చేస్తున్నాయి.

మన ఆహారం ఉత్పత్తి అవుతున్న పద్ధతిలో ఏదో దారుణమైన పొరపాటు ఉన్నదనే వాస్తవం 1984లో నన్ను చెళ్లున కొరడాతో కొట్టినట్టు మేల్కొల్పింది. ఒకవైపు పంజాబ్‌లో సాగిన హింసాకాండ, మరొకవైపు భోపాల్ దుర్ఘటన, రెండూ కూడా మన వ్యవసాయం యుద్ధంగా ఎలా మారిపోయిందో నాకు తెలిపాయి. అప్పుడే నేను మొదటిసారి 'ది వాయలెన్స్ ఆఫ్ ది గ్రీన్ రెవల్యూషన్' (హరిత విప్లవపు హింసాకాండ) రాశాను. అప్పుడే విషాలూ, సంహారకాలూ లేని వ్యవసాయాన్ని సాధించడం కోసం నవ ధాన్య ఉద్యమం ప్రారంభించాను.

యుద్ధ రసాయనాలుగా ప్రారంభమై, క్రిమిసంహారకాలుగా రూపం మార్చుకున్నప్పటికీ అవి చీడ పీడలను అదుపు చేయడంలో విఫలమయ్యాయి. ఇవాళ ఈ విష రసాయనాలకు ప్రత్యామ్నాయంగా జెనిటిక్ ఇంజనీరింగ్‌ను ప్రతిపాదిస్తున్నారు. కానీ, దాని వల్ల క్రిమి సంహారకాలూ, కలుపు మొక్కల సంహారకాలూ మరింత పెరిగి అదంతా రైతుల మీద యుద్ధంగా పరిణమించింది.

ఖరీదైన ఆహార పదార్థాలూ, ఖరీదైన రసాయనాలూ రైతులను అప్పుల వలయంలో కూరుకుపోయేలా చేశాయి. ఆ అప్పుల ఊబే రైతులను ఆత్మహత్యల వైపు నెడుతోంది. అధికారిక గణాంకాల ప్రకారమే 1997 నుంచి ఇప్పటికి రెండు లక్షల మంది భారతీయ రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు.

అందువల్ల ఈ భూగోళంతో శాంతిని పునరుద్ధరించడమే నైతికంగానూ, పర్యావరణపరంగానూ మన కర్తవ్యంగా ఉంది. ఈ కర్తవ్యం ఎప్పుడూ ఉన్నదే. కానీ, ఇప్పుడు మాత్రం మన మానవ జాతి ఉనికిలో ఉండాలంటే ఇది తక్షణ కర్తవ్యంగా మారింది.

నేల పట్ల, జీవవైవిధ్యం పట్ల, నీటి పట్ల, వాతావరణం పట్ల, పొలాల పట్ల, రైతుల పట్ల హింసను అమలు జరుపుతూ పోతే అంతిమంగా ఏర్పడేది ఒక యుద్ధ సమానమైన ఆహార వ్యవస్థ. అది ప్రజల ఆహార అవసరాలను తీర్చజాలదు. వంద కోట్ల మంది ప్రజలు

ఆకలితో అలమటిస్తారు. రెండు వందల కోట్ల మంది ప్రజలు ఆహార సంబంధమైన వ్యాధులతో అంటే, మితిమీరిన ఊబకాయం, మధుమేహం, రక్తపోటు, క్యాన్సర్ వంటి జబ్బులతో బాధపడతారు.

ఇటువంటి అస్థిర అభివృద్ధిలో మూడు స్థాయిల హింస ఇమిడి ఉంది. మొట్టమొదటి హింస భూగోళానికి వ్యతిరేకంగా సాగుతున్నది. దాన్ని పర్యావరణ సంక్షోభం అని చాలా మంది పిలుస్తున్నారు. రెండవ స్థాయి హింస ప్రజలకు వ్యతిరేకంగా జరిగేది. దాన్ని పేదరికమనీ, ఆకలి అనీ, విస్థాపన అనీ పిలుస్తున్నాం. మూడోస్థాయి హింస యుద్ధంలోనూ, ఘర్షణలోనూ జరిగేది. ఈ హింస ప్రపంచంలోని శక్తిమంతులు తమ అంతులేని దురాశాపూరిత ఆకలి తీర్చుకోవడానికి ఇతర సమాజాలలో, ఇతర దేశాలలో దొరికే వనరులను కొల్లగొట్టడానికి జరుపుతున్నారు.

జీవితపు ప్రతి అంశమూ వ్యాపారీకరణ జరిగినప్పుడు జీవించడమే చాలా ఖరీదైపోతుంది. మనుషులు రోజుకు ఒక డాలర్ కన్న ఎక్కువ సంపాదించినా పేదలుగానే ఉండిపోవలసి వస్తుంది. మరొక వైపు ద్రవ్య ఆర్థిక వ్యవస్థ లేకపోయినా, ప్రజలందరికీ భూమి మీదా, సారవంతమైన నేలల మీదా, శుభ్రమైన నీరు ప్రవహించే నదుల మీదా తగిన అధికారం ఉంటే వారు సంపన్న జీవితం గడపగలరు. అప్పుడు వారి సంస్కృతులు సంపన్నమవుతాయి. వారు అందమైన ఇల్లు నిర్మించుకోగల, ఆకర్షణీయమైన దుస్తులు వేసుకోగల, రుచికరమైన భోజనం తయారు చేయగల అద్భుత సంప్రదాయాలను కొనసాగించ గలరు. అప్పుడు సమాజంలో సమన్వయం కొనసాగుతుంది. సంఘీభావం ఉంటుంది. సామూహిక స్ఫూర్తి వెల్లివిరుస్తుంది.

మార్కెట్ ఆధిపత్యాన్ని అత్యున్నత స్థాయికి పెంచడం, మనిషి తయారు చేసిన డబ్బు అనే పెట్టుబడిని సమాజాలను సంఘటితం చేసే ఏకైక సూత్రం స్థాయికి పెంచివేయడం, ఆ డబ్బు ఉండడమే మనిషి శ్రేయస్సుకు ఏకైక కొలబద్దగా చూపడం ప్రకృతిలోనూ, సమాజంలోనూ మానవ జీవితాన్ని నడిపే, సుస్థిరం చేసే అన్ని క్రమాలను ధ్వంసం చేయడమే.

అందువల్ల మనం ఎంతగా ధనికలం అయిపోతూ ఉంటే పర్యావరణ పరంగా, సాంస్కృతికంగా అంతగా పేదలం అవుతూ ఉంటాం. డబ్బుతో మాత్రమే కొలిచే సంపద పెరుగుదల భౌతిక స్థాయిలో, సాంస్కృతిక స్థాయిలో, పర్యావరణ స్థాయిలో, మానసిక స్థాయిలో పేదరికం పెరిగిపోవడానికి దారితీస్తుంది.

జీవితానికి సంబంధించిన నిజమైన ద్రవ్యం జీవితం మాత్రమే. ఈ దృక్పథం కొన్ని ప్రశ్నలను రేకెత్తిస్తుంది. ఈ లోకంలో మనను మనం ఏమని భావించుకుంటున్నాం? మానవ జీవితం ఎందుకొరకని అనుకుంటున్నాం? మనిషి అంటే కేవలం డబ్బును తయారు చేసే వనరులను పుక్కిట పట్టే యంత్రం మాత్రమేనా? లేక, మనుషులుగా మనకేదన్న ఉన్నత ఆదర్శం ఉన్నదా? ఉదాత్త లక్ష్యం ఉన్నదా?

మనం ఇవాళ 'భూగోళ ప్రజాస్వామ్యం' అనే భావనను అలవర్చుకోవాలనుకుంటాం. ఆ భావన మనం సజీవ ప్రజాస్వామ్యాలను ఊహించడానికీ, నిర్మించడానికీ వీలు కల్పిస్తుంది. ఆ సజీవ ప్రజాస్వామ్యాలు అన్ని జీవజాతుల, అన్ని రకాల ప్రజల, అన్ని సంస్కృతులలోనూ అంతర్గర్భితంగా ఉన్న విలువను గుర్తించి గౌరవిస్తాయి. ఈ భూగోళానికి చెందిన మౌలిక వనరులను మనందరం న్యాయబద్ధంగా, సమానంగా పంచుకోవలసి ఉందని చెపుతాయి. భూగోళపు వనరులను వినియోగించే విషయంలో అందరం కలిసి నిర్ణయం తీసుకోవాలని చెపుతాయి.

ఈ భూగోళ ప్రజాస్వామ్యం భూమి మీద జీవితాన్ని నడిపే పర్యావరణ క్రమాలను పరిరక్షిస్తుంది. అదే అన్ని ప్రాథమిక మానవ హక్కులను పరిరక్షిస్తుంది. ఆ హక్కుల పునాది పైననే జీవించే హక్కు ఉంటుంది. జీవించే హక్కు అంటే మంచి నీరు కలిగి ఉండే హక్కు, మంచి ఆహారం పొందే హక్కు, ఆరోగ్యం పొందే హక్కు, విద్య పొందే హక్కు, ఉద్యోగాలూ, జీవనోపాధులూ పొందే హక్కు. అన్నీ అందులో భాగమే.

ఇవాళ మన ముందర ఒక సవాలు ఉంది. మనం ఎంచుకోవలసి ఉంది. కార్పొరేట్ అత్యాశకు సంబంధించిన మార్కెట్ సూత్రాలకు లొంగిపోతామా? భూగోళపు పర్యావరణ వ్యవస్థలనూ, జీవ వైవిధ్యాన్నీ కాపాడే పర్యావరణ సూత్రాలను గౌరవిస్తామా?

ఆహారాన్నీ, నీటినీ అందించడానికి ప్రకృతికి ఉన్న శక్తిని పరిరక్షిస్తేనే ప్రజల ఆహార, జల అవసరాలను తీర్చగలుగుతాం. మృతప్రాయమైన నేలలూ, మృత నదులూ ఆహారాన్ని ఇవ్వలేవు. నీటిని ఇవ్వలేవు.

అందువల్ల నేల తల్లి హక్కులను పరిరక్షించడమే ఇవాళ అత్యంత ముఖ్యమైన మానవ హక్కుల సామాజిక న్యాయ పోరాటం. మన కాలపు అతి విశాలమైన శాంతి ఉద్యమం అదే.

*(రచయిత భౌతిక శాస్త్రం, పర్యావరణ శాస్త్రాలలో శిక్షణ పొంది ఇరవై ఐదు సంవత్సరాలకు పైగా పర్యావరణవేత్తగా పనిచేస్తున్నారు. పర్యావరణంపై, వ్యవసాయ రంగంపై అనేక పుస్తకాలు రచించారు. సిడ్నీ శాంతి బహుమతి అందుకుంటున్న సందర్భంగా ఆస్ట్రేలియాలోని సిడ్నీ ఒపేరా హౌస్‌లో 2010 నవంబర్ 4న ఆమె చేసిన ఉపన్యాస పాఠం ఇది.)*

**రాబోయే సంచికలలో...**

- **జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం - బద్దుల కుమార్, మసాని మహేందర్, కేసరాజు సరిత**
- **ఉచిత, నిర్బంధ విద్యకు బాలల హక్కు చట్టం 2009 - ఎం. సంజీవరెడ్డి, ఎం. రాజేందర్ రెడ్డి**
- **భారతదేశంలో అభివృద్ధి, అధికారం, అవినీతి - డా. మహ్మద్ మస్లియుద్దీన్**
- **ఎ.బి.సి.డి.లుగా ఆదివాసులను వర్గీకరించాలి - పూకే రామకృష్ణ**

*సమాజం మనిషికి బతికే ఆసరా, భరోసా, భద్రత కల్పించలేకపోతోందనీ, సమాజంలో మౌలికంగా జరగాల్సిన మార్పుల అవసరాన్ని అర్థాంతర మరణాలు సూచిస్తున్నాయనీ అంటున్నారు* **డి.వి. రామకృష్ణరావు, వై. రామచంద్రం**

# సమాజ దుస్థితికి సూచిక అసహజ మరణాలు

వీక్షణంలో అసహజ మరణాలు సూచీని మొదలుపెట్టి డిసెంబర్ 2010 సంచికతో యాభై నాలుగు నెలలు పూర్తయ్యాయి. ఈ శీర్షిక ఆగస్ట్ 2006 సంచికలో జూలై సమాచారంతో ప్రారంభమయింది. నాలుగున్నర సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా రాష్ట్రంలో సంభవించిన అసహజ మరణాలపై వీక్షణంలో నమోదయిన సమాచారాన్ని విశ్లేషించే ప్రయత్నం ఇక్కడ చేస్తున్నాం. ఈ వ్యాసం మొదలుపెట్టే సమయానికి రాష్ట్రంలో వరదలతో నష్టపోయిన రైతులు రెండు వందల మందికి పైగా ఆత్మహత్యలతోనో, గుండెపోట్లతోనో చనిపోయారు.

ఈ శీర్షిక మొదలుపెట్టడానికి పూర్వరంగంలో రైతుల ఆత్మహత్యలే ప్రధాన ప్రేరణ. రైతులతో పాటు చేనేత రంగంలో సంభవిస్తున్న బలవన్మరణాలు, వరకట్న చావులు, నిరుద్యోగుల ఆత్మహత్యలు, గుర్తు తెలియని శవాలు, అనారోగ్యంతో వైద్యం అందక చనిపోతున్న వారు, అనేక రకాల ప్రమాదాల బారినపడి అకాల మరణం చెందుతున్నవారు... ఇలా అర్థాంతరంగా మరణించిన వారందరూ మనందరికీ సామాజిక రుగ్మతలను తెలియజేసి నిశ్శబ్దంగా వెళ్లిపోయినవారే. వీరందరి మరణాలు వివిధ సామాజిక రంగాలలోని, జీవన పార్శ్వాలలోని వైఫల్యానికి సూచికలుగానే మనం అర్థం చేసుకోవాలి.

అసహజ మరణాల సూచీ ఉద్దేశం వివిధ రంగాలలో పనిచేస్తున్న విధానకర్తలు, ఆలోచనాపరులు, ప్రజాస్వామిక మేధావులు, మొత్తంగా ప్రజానీకం వివిధ సామాజిక రంగాలలో సంభవిస్తున్న అసహజ మరణాల నివారణకు నడుం బిగిస్తారని ఒక ఆశ. అసహజ మరణాల నమోదు చేయడంలో మాకున్న లక్ష్యాన్ని సూచీలో తెలియజేశాం. ఈ యాభై నాలుగు నెలల్లో వీక్షణం పొందుపర్చిన సమాచారం ప్రకారం రాష్ట్రంలో 74,344 మంది అసహజ మరణాల పాలయ్యారు. అసలు సంఖ్య, నమోదు కాని మరణాల సంఖ్య ఇంతకు రెండు, మూడు రెట్లు ఉండవచ్చును. అంటే లక్షన్నర మందికి పైగా ఈ నాలుగున్నర సంవత్సరాలలో అసహజ మరణాలు పాలై ఉండవచ్చును. అంటే ఆ సంఖ్య సంవత్సరానికి సగటున ముప్పై అయిదు వేలు, రోజుకు కనీసం వంద మంది దాకా చనిపోతున్నట్లు మనం అంచనాకు రావచ్చు.

అన్ని జిల్లాల నుంచీ ఈ సమాచారం సేకరించే మా ప్రయత్నం కొనసాగుతోంది. ఈ సమాచారం ఇప్పుడు ఇరవై ఒక్క జిల్లాల నుంచి అందుతోంది. ఈ ప్రయత్నం ఎంత సమగ్రం, ఎంత శాస్త్రీయం, అంటే దీనికి ఉండే పరిమితులు, పరిధులు ఉండనే ఉన్నాయి. 2006 ఆగస్ట్ నుంచి మొదలైన అసహజ మరణాల సూచీ మొదట దినపత్రికల లోని ప్రధాన పేజీలలో నమోదయిన రాష్ట్ర వ్యాప్త సమాచార వివరాలతో వచ్చేది. 2007లో రాష్ట్ర వ్యాప్త సమాచారంతో పాటు ఆ సంవత్సరం చివరికి విడిగా ఆరు జిల్లాల నుంచి సమాచారం ప్రతినిధుల సహకారంతో అందడం మొదలయింది. 2008లో దిన పత్రికల ప్రధాన పేజీలలోని ప్రతినిధులు లేని జిల్లాల సమాచారంతో పాటు సంవత్సరాంతానికి 18 జిల్లాల సమాచారం అందడం మొదలయింది. 2009 చూస్తే పూర్తిగా జిల్లాల సమాచారంతోనే 21 జిల్లాల వివరాలు అందాయి. 2010లో అత్యధికంగా 20 జిల్లాల సమాచారం, అత్యల్పంగా 12 జిల్లాల సమాచారం అందింది. ఈ మొత్తం కాలంలో ఆయా జిల్లాల ప్రతినిధులు కొన్నిసార్లు సమాచారం అందివ్వలేకపోవడం, ప్రతినిధులు మారడం వంటివి కూడా జరిగాయి. ఈ సమాచార విశ్లేషణను జిల్లాల వారీగా, అంశాల వారీగా చేయవచ్చు. అక్టోబర్ 2009 నుంచి కొన్ని అంశాలను స్త్రీ, పురుషులుగా విభజించి సమాచారాన్ని అందించే ప్రయత్నం కూడా ప్రారంభించాం.

ఈ సూచిక మన 'అభివృద్ధి'ని అంచనా వేసుకోవడానికి, సరిచేసుకోవడానికి ఉపయోగపడాలనేది మా ఉద్దేశం.

అసహజ మరణాల సూచీలో సమాచారాన్ని విశ్లేషించుకునే ముందు మానవ సమాజ పరిణామ క్రమంలో, నాగరికతల అభివృద్ధి క్రమంలో మనుషులు ఎన్ని విధాలుగా అసహజ, అర్థాంతర మరణాల పాలయ్యారో స్థూలంగా ఒకసారి చూద్దాం. మనిషి ఆహార సేకరణ దశలో తినాల్సినవీ, తినకూడనివీ తెల్సుకొనే క్రమంలో తినకూడనివి తిని చనిపోయిన క్రమం ఉంది. ప్రకృతి విపత్తుల నుంచి, క్రూర మృగాల, విష జంతువుల బారి నుంచి తనను తాను కాపాడుకోలేక చనిపోయిన దశ ఉంది. వేటాడి జీవించే క్రమంలో ప్రమాదాలకు గురైన క్రమం ఉంది. కరువు కాలం దాపురించి ఆహారమే లేక సమూహాలు సమూహాలే తుడిచిపెట్టుకుపోయిన దశ ఉంది. ఒక సమూహం ఇంకో సమూహంపై యుద్ధాలు చేసినపుడు చనిపోయిన క్రమం ఉంది. ఇప్పటికీ సునామీలు, భూకంపాలు, తుపానుల్లో లక్షలాది మంది చనిపోవడం చూస్తూనే ఉన్నాం. ప్రాచీన కాలంలో ఎదురుపడిన మనిషిని లేక సమూహాన్ని మాత్రమే యుద్ధాలలో ఎదుర్కోవడం జరిగేది. ఆధునిక కాలంలోనయితే యుద్ధాలలో భూగోళమే తుడిచి పెట్టుకు పోయేటంత శక్తి కలిగిన మారణాయుధాలు ఉన్నాయి.

**జూలై 2006 నుంచి డిసెంబర్ 2010 వరకు ఏటా నమోదయిన మరణాలు**

| సంవత్సరం | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| **(1)** | **(2)** | **(3)** | **(4)** | **(5)** | **(6)** | **(7)** | **(8)** | **(9)** | **(10)** | **(11)** | **(12)** | **(13)** | **(14)** | **(15)** | **(16)** | **(17)** | **(18)** | **(19)** |
| 2006 | 108 | 7 | 436 | 0 | 0 | 0 | 201 | 137 | 0 | 48 | 450 | 371 | 231 | 50 | 0 | 5 | 37 | 137 |
| 2007 | 731 | 11 | 1286 | 33 | 0 | 0 | 623 | 460 | 40 | 216 | 1997 | 1447 | 383 | 49 | 14 | 6 | 220 | 620 |
| 2008 | 677 | 83 | 3755 | 64 | 8 | 9 | 1341 | 994 | 57 | 811 | 5132 | 3588 | 1754 | 36 | 8 | 8 | 373 | 1100 |
| 2009 | 741 | 94 | 5192 | 18 | 3 | 1 | 1539 | 1355 | 52 | 956 | 6031 | 4071 | 2663 | 16 | 11 | 1 | 422 | 760 |
| 2010 | 424 | 43 | 4463 | 0 | 0 | 129 | 1268 | 989 | 52 | 500 | 5292 | 3350 | 2495 | 17 | 11 | 3 | 290 | 880 |
| మొత్తం | **2681** | **238** | **15132** | **115** | **11** | **139** | **4972** | **3935** | **201** | **2531** | **18962** | **12827** | **7526** | **168** | **44** | **23** | **1342** | **3497** |

వ్యవసాయంతో పాటు స్థిర నివాసాలు వచ్చాక, రాచరికాలు, భూస్వామ్యం వచ్చాక, మత విశ్వాసాలు వేళ్లూనుకున్నాక అధికారంలోని వర్గాలు వారి విశ్వాసాల కోసం, ఆధిపత్యాల కోసం అనేక యుద్ధాలు చేశాయి. వాటిల్లో వేలాది మంది చనిపోయారు. అవి కొన్నిసార్లు మతాల పేరిట, మరికొన్నిసార్లు విస్తరణ కాంక్షతో జరిగాయి. ఇలాంటి ఆధిపత్య యుద్ధాలలో లక్షలాది మంది సామాన్యులు చనిపోయారు. ఆధునిక కాలానికి వచ్చేసరికి ప్రకృతి వనరులపై ఆధిపత్యం కోసం యుద్ధాలు జరుగుతున్నాయి. ఇటీవలి కాలం ఉదాహరణ చెప్పుకుంటే మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలు, హిరోషిమా, నాగసాకీలపై జరిగిన అణు బాంబు ప్రయోగాలతో లక్షలాది మంది చనిపోయారు. ఇప్పటికీ వాటి దుష్పరిణామాలు మానవాళిని వెంటాడుతూనే ఉన్నాయి.

మనిషి ప్రకృతితో, ప్రకృతికి లోబడి సహజీవనం చేసే దగ్గరి నుంచి ప్రకృతిని విచ్చలవిడిగా దోచుకునే వైపు, ప్రకృతి చలన సూత్రాలను, పునరుత్పత్తి శక్తిని దెబ్బతీసే వైపు త్వరితగతిన అడుగులు వేస్తున్న క్రమం మనకు కనబడుతోంది. ఇది మానవాళికే కాదు, సమస్త జీవావరణానికి ప్రమాదకరమవుతోంది. ఆధునిక కాలంలో మన ముందు తలెత్తుతున్న ప్రశ్నలను, వివిధ సమూహాల నుంచి వస్తున్న ప్రశ్నలను విచక్షణతో ఎదుర్కొని, ఉన్నతమైన ఆలోచనలతో పరిష్కరిస్తామా లేక బలప్రయోగంతో కొద్దిమంది లాభాల కోసం విధ్వంసాన్ని అనుమతిస్తామా అనేది మన ముందున్న ప్రశ్న.

మన దేశం ఇటీవలి చరిత్రను చూస్తే దేశ విభజన సమయంలో హిందూ–ముస్లిం ఘర్షణల్లో లక్షల సంఖ్యలో జనం చనిపోయారు. దేశంలో జరిగిన కొన్ని ఘోర మారణకాండలను పరిశీలిస్తే 1984లో ఇందిరా గాంధీ మరణాంతరం జరిగిన ఊచకోతలలో నాలుగు వేల మందికి పైగా సిక్కులు చనిపోయారు. 1984 భోపాల్ విషవాయువు ప్రమాదంలో ఇరవై ఐదు వేల మందికిపైగా చనిపోయారు. ఆ విషప్రభావంతో ఇప్పటికీ లక్షలాది మంది ప్రజలు అనేక వ్యాధులతో బాధ పడుతున్నారు. నూతన ఆర్థిక విధానాల అమలు ఫలితంగా ఇప్పటికే దేశవ్యాప్తంగా రెండు లక్షల పదహారు వేల ఐదు వందల మందికి (1997 నుంచి) పైగా రైతాంగం ఆత్మహత్యల పాలయ్యారు. 2002లో జరిగిన గుజరాత్ మారణకాండలో పదివేల మంది ముస్లింలు చనిపోగా, లక్షలాది మంది నిరాశ్రయులయ్యారు. దేశవ్యాప్తంగా అడపా దడపా చోటుచేసుకొన్న మత ఘర్షణలలో వేలాది మంది చనిపోయారు.

ఆరు దశాబ్దాలుగా కాశ్మీర్‌లో జరుగుతున్న అణచివేతలో ఎనభై వేలకు పైగా చనిపోగా, లక్షలాది కుటుంబాలు తీవ్ర ఇబ్బందులు, అణచివేతలు అనుభవిస్తూనే ఉన్నాయి. దేశంలో ఈశాన్య ప్రాంతాలలోని జాతిపోరాటాలలో వేలాది మంది చనిపోయారు.

తెలుగు నేలపై చూస్తే తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట కాలం నుండి ఈనాటి దాకా ప్రజల ఆకాంక్షలు వివిధ పోరాట రూపాలలో వ్యక్తమవుతూనే ఉన్నాయి. గత పదిహేనేళ్లలో మన రాష్ట్రంలో ఇరవై వేల మందికి పైగా రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. చేనేత కార్మికులు వందల సంఖ్యలో చనిపోయారు. నాలుగు దశాబ్దాలుగా తెలుగు నేలపై కొనసాగుతున్న ప్రత్యామ్నాయ ఉద్యమాలలో పది వేల మందికి పైగా అసువులు బాశారు. ప్రకృతి వైపరీత్యాలు, పాలనా వైఫల్యాల కారణంగా అనేక మంది చనిపోతూనే ఉన్నారు. దళితులపై

అంటరానితనం, అణచివేతల్లో భాగంగా కారంచేడు, చుండూరు, నీరుకొండ, పదిరికుప్పం, వేంపెంట ఇలాంటి అనేక ఘటనల్లో దళితులు హత్యలకు గురవుతూనే ఉన్నారు. ఇన్ని రకాల అణచివేతల మధ్య తమ అస్తిత్వాల ప్రకటన చేస్తూ వివిధ సామాజిక వర్గాల ప్రజలు ఆత్మగౌరవ పోరాటాలు కొనసాగిస్తూనే ఉన్నారు. సరైన దిశా నిర్దేశం లేక రాజకీయ అవకాశవాదాలకు విసిగిపోయి, నిరాశా నిస్పృహలతో ఇటీవలి తెలంగాణ ఉద్యమంలో నాలుగు వందల మందికిపైగా విద్యార్థులు ఆత్మహత్యలు చేసుకున్నారు.

అభివృద్ధి అనేది స్థానిక ఉత్పత్తి శక్తుల అభివృద్ధి, ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి, దానికి అనుబంధంగా ఉపరితలంలో విలువలకూ, ఆలోచనలకూ సంబంధించిన అభివృద్ధిగా కాకుండా మార్కెట్ శక్తుల అభివృద్ధి, వారి లాభాలే అభివృద్ధిగా నమ్మించే కుట్ర జరుగుతోంది. ఉత్పత్తి శక్తుల మధ్య వైరుధ్యాలను, ఉత్పత్తి సంబంధాలలోని వైరుధ్యాలను ఉపరితల సంస్కరణల ద్వారా పరిష్కరించడం సాధ్యమేనా?

రాష్ట్రం ఏర్పడిన మొదటి దశలో ప్రాథమిక రంగం (వ్యవసాయం, అడవులు, చేపల పెంపకం, గనులు) పై ప్రధానంగా ఆధారపడిన స్థితి నుండి ఇప్పుడు ఆర్థిక నిర్మాణంలో సేవా రంగం (వ్యాపారం, రెస్టారెంట్స్, హోటళ్లు, రవాణా, ఫైనాన్స్) ఆధిపత్యం వహిస్తోంది. 1960-61లో ఆర్థిక వ్యవస్థలో ప్రాథమిక రంగ భాగస్వామ్యం 63.49 శాతంగా, ద్వితీయ రంగం (మానుఫాక్చరింగ్, నిర్మాణ రంగం, విద్యుచ్ఛక్తి, గ్యాస్, నీటి పారుదల) 11.49 శాతంగా, సేవా రంగం 25.02 శాతంగా ఉండేది. డెబ్భై శాతం పైగా జనాభా వ్యవసాయంపై ఆధారపడి ఉండేది. కానీ, ఇటీవలి దశాబ్దంలో సేవా రంగం యాభై శాతానికి పెరగగా, ప్రాథమిక రంగం ఇరవై ఏడు శాతానికి, ద్వితీయ రంగం 23 శాతానికి పడిపోయాయి. మరో ముఖ్యమైన మార్పు సేవా రంగం పెరిగింది కానీ, ప్రభుత్వ రంగ పెట్టుబడులు తగ్గి, ప్రైవేట్ పెట్టుబడులు పెరిగాయి. మొత్తంగా చూసినప్పుడు జరిగిన 'అభివృద్ధి' ప్రాథమిక రంగంపై ఆధారపడి జరిగిన అభివృద్ధి కాకపోవడం, దానికి అనుబంధంగా జరిగిన అభివృద్ధి కాకపోవడం వల్ల ప్రాథమికరంగం నుంచి నెట్టివేయబడిన జనాభా తప్పనిస్థితిలో ముఖ్యంగా వ్యవసాయ రంగాన్నే అంటిపెట్టుకొని ఉండిపోవడమో, వలసలు పోవడమో, దిక్కుతోచని స్థితిలో బలన్మరణాల పాలు కావడమో జరుగుతోంది. జరిగిన అభివృద్ధి స్థానిక ఉత్పత్తి శక్తులను కలుపుకొని సాగిన అభివృద్ధి కాకపోవడం వల్ల ఈ అభివృద్ధికి ఆవలే చాలామంది మిగులు మనుషులుగా (మిగులు మనుషులు - శ్రమ చేసే శక్తి ఉండి, ఉత్పత్తిలో భాగం కాలేకపోయిన వారు. అభివృద్ధి ఫలాలు అందనివారు) మిగిలిపోతున్నారు. ఈ అభివృద్ధి ఫలాలు అందక రకరకాలుగా చనిపోతూనే ఉన్నారు.

అసహజంగా, అర్థాంతరంగా చనిపోతున్న వారిలో అత్యధికంగా ఈ నిచ్చెన మెట్ల వ్యవస్థలోని అట్టడుగున ఉన్న వర్గాల ప్రజలే. చనిపోయిన వారిలో దామాషా ప్రకారం చూసుకుంటే దళితులు, బహుజనులు, మహిళలు ఎక్కువ మంది ఉంటారనేది చెప్పకనే అర్థమయ్యే సత్యం. ఆదివాసీ ప్రాంతాలలో అతిసారా, మలేరియా, డయేరియా, డెంగ్యూ, క్షయ వంటి సాధారణమైన వ్యాధులతో ఇప్పటికీ ఏటా వందలాది మంది చనిపోతూనే ఉన్నారు. మనిషి శ్రమకు విలువలేని, మనిషి సంక్షేమం పట్టని వ్యవస్థ ఈ పరిణామాల నుంచి మనకు అవగతమవుతుంది. గుప్పెడు మంది లాభాలే కేంద్రంగా, ఆ

**నాలుగున్నర సంవత్సరాలలో రంగాల వారీగా నమోదయిన మరణాలు**

| శీర్షిక | మొత్తం మరణాలు | శాతం |
|---|---|---|
| **ఆత్మహత్యలు** | | |
| రైతాంగం | 2,682 | 3.61 |
| చేనేత | 238 | 0.32 |
| ఇతర | 15132 | 20.35 |
| **మొత్తం** | **18051** | **24.28** |
| **హత్యలు** | | |
| ఫ్యాక్షన్ | 115 | 0.15 |
| మతం | 11 | 0.01 |
| కులం | 139 | 0.19 |
| తగాదాలు | 4972 | 6.69 |
| **మొత్తం** | **5237** | **6.94** |
| **గుర్తు తెలియని** | **3935** | **5.29** |
| **ఆకలి** | **201** | **0.27** |
| ప్రమాదాలు | | |
| పని చేసే స్థలంలో | 2531 | 3.40 |
| రహదారి | 18692 | 25.51 |
| ఇతరాలు | 12827 | 17.25 |
| **మొత్తం** | **34320** | **46.16** |
| **వైద్యం అందక** | **7526** | **10.12** |
| **పోలీసు కాల్పుల్లో** | | |
| ఉద్యమకారులు | 168 | 0.23 |
| ఇతరులు | 44 | 0.01 |
| **మొత్తం** | **212** | **0.24** |
| **పోలీసులు, సైన్యం** | **23** | **0.03** |
| **మిస్సింగులు** | **1342** | **1.81** |
| **ప్రకృతి వైపరీత్యాలు** | **3497** | **4.71** |

గుప్పెడు మంది తమ ఆస్తులు పెంచుకోవడానికీ, అధికారాన్ని కాపాడుకోవడానికీ తోడ్పడే వ్యవస్థ మక కళ్లకు కనబడుతుంది.

ఈ నాలుగున్నర సంవత్సరాలలో అసహజ మరణాల తీరుతెన్నులు చూస్తే దాదాపు సగం మంది వివిధ రకాల ప్రమాదాల బారిన పడి చనిపోయారు. వివిధ ప్రమాదాలలో 34,320 (మొత్తంలో 46 శాతం) మంది చనిపోయారు. వీరిలో 18,962 మంది ఒక్క రోడ్డు ప్రమాదాలలో చనిపోయినవారే. రహదారి ప్రమాదాల తర్వాత వివిధ రంగాలలో ఆత్మహత్యలు చేసుకున్న వారు ఉన్నారు. అలా నాలుగున్నర సంవత్సరాలలో ఆత్మహత్య చేసుకున్న వారి సంఖ్య 18,051. మూడవ స్థానంలో సరైన వైద్యం అందక చనిపోయిన వారు 7,526 (మొత్తంలో

10 శాతం) మంది ఉన్నారు. ఈ ప్రమాదాలు గానీ, ఆత్మహత్యలు గానీ, వైద్యం అందకపోవడం గానీ మన సమాజ బాధ్యతారాహిత్యాన్ని, పాలకుల విధాన వైఫల్యాల్ని, నిర్లక్ష్యాన్ని ఎత్తిచూపుతాయి.

రోడ్డు ప్రమాదాలను పరిశీలిస్తే పెరిగిన జనాభాకు అనుకూలంగా ప్రభుత్వ రవాణా సదుపాయాలు పెరగకపోవడంతో ప్రజలకు ప్రైవేట్ వాహనాలపై, సొంత వాహనాలపై ఆధారపడే పరిస్థితి తలెత్తుతోంది. రవాణాకు తగినట్టుగా రోడ్ల నిడివి, వైశాల్యం, నాణ్యత పెరగపోవడం కూడా ప్రమాదాలకు దారితీస్తుంది. గ్రామాలలో ప్రభుత్వ రవాణా సౌకర్యాలు లేక ప్రైవేట్ ఆటోలపై, లారీలపై ప్రయాణాలు చేయాల్సి రావడంతో ఒకేసారి పదుల సంఖ్యలో సామాన్యులు చనిపోవడం మనం నిత్యం చూస్తూనే ఉన్నాం. నగరాలలో అయితే విద్యార్థుల నుంచి, ఉద్యోగులు, వివిధ జీవన రంగాలలోని వారిదాకా సొంత వాహనం లేకుండా జీవించలేని పరిస్థితి ఉంది.

ఒక విత్తనాల కంపెనీ అనుభవం చూస్తే, విత్తనాల మార్కెట్ సీజన్‌లో ఒక లారీ లోడ్ విత్తనాలను అనుకున్న గమ్యానికి ఉదయం ఆరు గంటల లోపు చేరిస్తే 1500 రూపాయలూ, ఎనిమిది గంటల లోపు చేరిస్తే 1000 రూపాయలూ, పది గంటల లోపు చేరిస్తే 500 రూపాయలూ అదనంగా చెల్లిస్తామని డ్రైవర్లను ఒక పరుగు పందెంలో పెట్టడం జరుగుతోంది. రాత్రి అంతా నిద్ర లేకుండా అత్యధిక వేగంతో ప్రయాణించే అవసరం తలెత్తి, ప్రమాదాలకు పరోక్షంగా కారణం అవుతోంది. ఇది ఒక ఉదాహరణ మాత్రమే. సరుకులు అమ్ముకోవడానికి, క్షణాల మీద లాభాలు చేసుకోవడానికి పెట్టుబడి సృష్టిస్తున్న పోటీలో మనిషి జీవితం పావుగా మారిపోయింది. దీనికి తోడు హైవేల మీదే మద్యం విక్రయాల ద్వారా కోట్లాది రూపాయలు లాభాలు చేసుకునే వ్యవస్థ వెన్నంటి ఉంది. 'చేపా చేపా ఎందుకు ఎండలేదు' అన్న విధంగా ప్రశ్న వేసుకొని పరిశీలిస్తే ఇలా ప్రతి చావు వెనక లెక్కలేనన్ని, ఊహించలేనన్ని లాభాపేక్ష పోటీలు ఉన్నాయి. ఈ పోటీలో ప్రతిసారీ ప్రాణాన్ని పణంగా పెడుతున్నది సామాన్యులే.

విధానాలకు సంబంధించి అమెరికా ఉదాహరణ చూస్తే అక్కడ ఫోర్డ్ కంపెనీ అక్కడి ప్రభుత్వ విధానాన్నే నిర్దేశించింది. దేశంలో రైల్వేలను అభివృద్ధి చేయవద్దనీ, అమెరికాలోని ప్రతి పౌరుడికి తాను కార్లు ఉత్పత్తి చేసిస్తాననీ వాగ్దానం చేసింది. అమెరికా ప్రభుత్వం ఆ కంపెనీ కోరినట్లు చేసింది. అమెరికా జనాభా ముప్పై కోట్లు ఉంటే, అక్కడి పౌరులకు ఉన్న కార్ల సంఖ్య ఇరవై ఏడు కోట్లు. ఈ కార్లలో పెట్రోల్ నింపడానికి, తన ఇంధన అవసరాల కోసం అమెరికా ఎన్ని యుద్ధాలైనా చేస్తుంది. అలాంటి అన్యాయమైన యుద్ధంలో భాగంగా ఇప్పటికే పద్నాలుగు లక్షల మందికిపైగా ఇరాక్ పౌరుల రక్తం చిందించింది. ఇంకా దేశ దేశాలలో పెట్రోల్‌తో సహా రకరకాల వనరుల కోసం అక్కడి ప్రజల రక్తం చిందిస్తూనే ఉంది. అంటే, ఫోర్డ్ కంపెనీ తన ఉత్పత్తులను అమ్ముకోవడానికి అనుకూలమైన విధానాలని ప్రజలపై రుద్దింది. ఇవ్వాళ మన దేశంలో విధానాల రూపకల్పన కూడా సరిగ్గా అలానే జరుగుతోంది. ప్రజల అవసరాల నుంచి, ఆకాంక్షల నుంచి కాకుండా పై నుంచి కిందకు రుద్దబడిన విధానాలే మనకు కన్పిస్తాయి.

అసహజ మరణాల సూచీ కేవలం కొన్ని అంకెల సముదాయమో, పట్టికో మాత్రమే కాదు. అవి మన రాజకీయార్థిక విధానాల వైఫల్యాలకు సూచికలు. వివిధ రంగాలలో వైఫల్యాలను, నిర్లక్ష్యాలను ఎత్తిపట్టి చూపడం ఈ పట్టిక ఉద్దేశం. ఈ అర్ధాంతర మరణాలు మనలో రేపుతున్న ప్రశ్నలకు సమాధానాలు, పరిష్కారాలు కనుగొనాల్సింది మనమే. అలాంటి పరిష్కారాలు కనుగొనడానికి, కొన్ని ప్రశ్నలు, కొన్ని ఆలోచనలు రేకెత్తించడానికి అసహజ మరణాల సూచీ మన ముందు ఉంది.

మన జ్ఞానం, మన నాగరికత సహజీవన సంస్కృతిని పెంపొందించేదై ఉండాలి. అన్నం పెట్టే రైతులు చనిపోయే స్థితి ఎందుకు వచ్చింది? మనకు బట్టనిచ్చే చేనేత కార్మికులు ఎందుకు చనిపోతున్నారు? వివిధ సామాజిక రంగాల, వివిధ అస్తిత్వాల ప్రజలు ఎందుకు ఆత్మహత్యల పాలవుతున్నారు? మతం, కులం, ఫ్యాక్షన్, ఇతర అనేకానేక కారణాలతో ఎందుకు హత్యలు జరుగుతున్నాయి? కొంతమంది మనుషులు గుర్తు తెలియని శవాలుగా ఎందుకు మిగిలిపోతున్నారు? ఒకపక్క వేల టన్నుల ఆహార గింజలు గోదాములలో పురుగులు, పందికొక్కుల పాలవుతుంటే, మరోపక్క ఇప్పటికీ ఆకలితో, పౌష్టికాహార లేమితో చనిపోతున్న వారికి మన సమాజం ఇచ్చే జవాబు ఏమిటి? పనిచేసే స్థలాలలో, రహదార్లపై, ఇతరత్రా అనేక కారణాల వల్ల ప్రమాదాలకు లోనవుతున్న మనుషులను ఆ ప్రమాదాల నుంచి మనం కాపాడలేమా...? ఆధునిక సమాజంలో(?) వైద్యం అందక, నిర్లక్ష్యంతో మనుషులు చనిపోవడం ఎటువంటి అభివృద్ధిని సూచిస్తుంది' ఈ మొత్తం పరిస్థితులు సమూలంగా మారాలని, ఉద్యమాలు చేస్తూ ప్రాణాలు అర్పిస్తున్న వారు అలా చనిపోవల్సిందేనా? రౌడీషీటర్లనో, తీవ్రవాదులనో ఇలా రకరకాల పేర్లతో కాల్పుల్లో మనుషులను కోల్పోవల్సిందేనా? తమ ఆస్తిని కాపాడుకోవడానికి, తమ అధికారాన్ని పదిలపర్చుకోవడానికి సమాజాన్ని, సమాజంలోని వైరుధ్యాలను బల ప్రయోగంతో అదుపులో ఉంచాలనుకొనే రాజ్య స్వభావం వల్ల విధి నిర్వహణలో పోలీసులు, సైన్యం చనిపోవల్సిందేనా?

ఇలా చెప్పుకుంటూ పోతే లాకప్ మరణాలు, మిస్సింగులు, వరకట్న చావులు, ఆస్తి తగాదాలతో చావులు, నిరుద్యోగంతో అసహాయ స్థితిలో యువత, చదువులో పోటీని తట్టుకోలేక ఆత్మహత్యల పాలవుతున్న విద్యార్థులు, ప్రకృతి వైపరీత్యాల వల్ల చనిపోతున్న నిస్సహాయులు, అభివృద్ధి పేరిట జరుగుతున్న విస్థాపన విధ్వంసాలు, తద్వారా పరిణమిస్తున్న ఆకలి చావులు, అర్ధాంతర మరణాలు మనమంతా వీటిని నివారించడానికి ఏమైనా చేయగలమా అనే ఆలోచన వైపుకు పురికొల్పాలనే ఉద్దేశంతోనే ఈ శీర్షిక.

అరవై ఏళ్లు పూర్తి చేసుకున్న రాజ్యాంగం ప్రకటించిన కనీస విలువలకూ, బాధ్యతలకూ కట్టుబడకుండా, ప్రజల ఆకాంక్షలకు అణచివేతే ఏకైక పరిష్కార విధానంగా ముందుకు సాగుతున్న ఈ పాలకులను, వారి విధానాలను ఎదుర్కోవాల్సింది మనమే.

2జి స్పెక్ట్రమ్, కామన్‌వెల్త్ గేమ్స్, ఆదర్శ్ హౌసింగ్ సొసైటీ ఇంకా ఇలాంటి అనేకానేక కుంభకోణాలలో దోచుకున్న లక్షల కోట్ల రూపాయలతో, మన దేశ పారిశ్రామికవేత్తలూ, పాలకవర్గాలూ స్విస్ బ్యాంకులలో దాచుకున్న రెండు వందల ఎనభై లక్షల కోట్ల రూపాయలతో మన దేశ వ్యవసాయాన్ని, సమాజాన్ని, ప్రతి పౌరుని అవసరాల్ని తీర్చలేమంటారా?

మన రాష్ట్రంలోనే కాకుండా దేశంలోని వేరు వేరు రాష్ట్రాలలో, ప్రపంచవ్యాప్తంగా జరుగుతున్న అర్ధాంతర మరణాలను లెక్కిస్తే ఎంతమంది ఉంటారో మనం ఊహించవచ్చు. ఈ భూగోళాన్ని మన

*దశాబ్దాలుగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, స్వయం నిర్ణయాధికారం కోసం కాశ్మీర్ ప్రజలు వ్యక్తం చేస్తున్న ఆకాంక్షలనూ, వారిపై కొనసాగుతున్న నిర్బంధం, అణచివేతలనూ దృష్టిలో ఉంచుకొని సృజన పత్రికలో జూన్-జూలై 1990 సంచికలో అచ్చయిన వ్యాసాన్ని దాని ప్రాధాన్యత రీత్యా యథాతథంగా పునః ప్రచురిస్తున్నాం. - సం.*

# కాశ్మీర్ ప్రజల స్వయం నిర్ణయాధికార హక్కు

'నీ ఇచ్ఛకు లొంగిపోయి ప్రముఖులమయ్యాం మేం
ఇప్పుడిక మాట్లాడతాం – మా బాధల గాథలు
మరొకసారి వినిపించక తప్పదు.
తీగల నిండా గళాలు నింపుకున్న మూగవీణ లాంటి వాళ్లం మేం
దుఃఖం మా పెదాల దాకా నిండి వచ్చినప్పుడు
మేం మాట్లాడతాం – ఇక తప్పదు'

**– మహమ్మద్ ఇఖ్బాల్**

ఈ మధ్య ప్రచార సాధనాలన్నిటిలోను కాశ్మీర్ లోయ వార్తలకు అతి ఎక్కువ ప్రాముఖ్యం లభిస్తోంది. ఒకటి రెండి మినహా మిగిలిన పత్రికలన్నీ, ఆకాశవాణి, దూరదర్శన్ వంటి ప్రభుత్వ బాకా సాధనాలన్నీ కాశ్మీర్ లోయలో పాకిస్తాన్ ప్రోత్సాహంతో బీభత్సం జరుగుతున్నదని ప్రచారం చేస్తున్నాయి. పాకిస్తాన్‌లో శిక్షణ పొందివచ్చిన ఉగ్రవాదులు కాశ్మీర్‌ను భారతదేశం నుంచి విడదీయాలనే కుట్రతో హింసాకాండకు పాల్పడుతున్నారని, అందువల్ల వేలాది మంది హిందువులు కాశ్మీర్ లోయను వదిలి శరణార్థులుగా వస్తున్నారని ప్రచారం చేస్తున్నాయి. ప్రభుత్వం ఆందోళనకారులతో మరింత కఠినంగా వ్యవహరించాలని సలహాలిస్తున్నాయి. ఆందోళనకారులను అణచివేసే క్రమంలో పెద్దఎత్తున పౌరహక్కుల ఉల్లంఘున జరిగినా ఫరవాలేదని బోధిస్తున్నాయి. పౌరహక్కుల ఉల్లంఘున జరుగుతున్నదని ఆధారాలతో సహా చూపిన వారిని దుమ్మెత్తిపోస్తున్నాయి. కాశ్మీర్ ప్రజల ఆందోళన వెనుక ఉన్న సామాజిక, చారిత్రక కారణాలను దాచిపెట్టి మతకల్లోలంగా, విదేశీ శక్తుల కుట్రగా ప్రచారం చేస్తున్నాయి.

ఈ ప్రచారమంతా ఉగ్రవాదులకు వ్యతిరేకంగా, పాకిస్తాన్‌కు వ్యతిరేకంగా సాగుతున్నట్టు కనబడుతూ సారాంశంలో ముస్లింలకు

---

పూర్వీకులు మనకు మంచి గాలితో, నీటితో, స్వచ్ఛమైన వాతావరణంతో, నాలుగు రకాల పంటలు పండించుకునే విధంగా అప్పజెప్పారు. మనం కూడా ఈ భూగోళాన్ని అలాగే మన పిల్లలకూ, తర్వాతి తరాలకూ అందిస్తామా అనేది మనముందున్న ప్రశ్న. ఈ సందర్భంలో 'తుపాకి గొట్టంపై భూగోళాన్ని, సూదిమొనపై ఆవగింజను నిలపలేమ'నే అలిశెట్టి ప్రభాకర్ కవితా పాదాలు గుర్తుకొస్తాయి. సామ్రాజ్యవాద యుద్ధ ప్రమాదాల నుంచి, అది సృష్టిస్తున్న మార్కెట్ పోటీల నుంచి, అది తీసుకువస్తున్న దుర్మార్గ విధానాల నుంచి, విధ్వంసం నుంచి మానవాళిని మొత్తంగా జీవావరణాన్ని మనమే కాపాడుకోవాలి.

చివరగా ఈ శీర్షికకు ఎంతో బాధ్యతతో ఎటువంటి పారితోషికం లేకుండా సమాచారం అందించే క్రమంలో చాలా ఆవేదనకు గురవుతూ, కలవర పడుతూ ఎప్పటికప్పుడు మాకు ఈ వివరాలు అందిస్తున్న మిత్రులు... ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష; ఖమ్మం– సి.ఎచ్. గిరిజ; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపురం – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – బి. దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహిమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ; నెల్లూరు – బాలగురువయ్య; ప్రకాశం – ఎల్. సాంబశివరావు; శ్రీకాకుళం – జి. సుధీర్; విశాఖపట్నం – కె.వి. రమణ, కె.వి. అరుణ; విజయనగరం – డి. సుధాకర్.

(ఖమ్మం – సి.ఎచ్. కృష్ణ; మహబూబ్‌నగర్ – రవికుమార్, ఏసురత్నం; మెదక్ – కె. రాజు, పి. రాజులు; నల్గొండ – డి. మహేష్; రంగారెడ్డి – వి. ఫణీంద్ర; వరంగల్ – కె. శ్యాంరావ్; అనంతపురం – ఎం. ఆదిశేషయ్య, సుమలత; కడప – ఎన్.ఎస్. ఖలందర్; నెల్లూరు – శ్యాంసుందర్ రావు, కె. సుబ్బనాచారి; ప్రకాశం – ఎన్. రవికుమార్, కె. మల్లికార్జున్; పశ్చిమ గోదావరి – టి. హేమలత, వీరంతా గతంలో కొన్ని నెలల పాటు ఆయా జిల్లాల నుంచి సమాచారం అందించారు.)

ఈ శీర్షికకు సమాచారం అందిస్తూ అర్ధాంతరంగా చనిపోయిన మా మిత్రుల గురించి మీతో పంచుకోకుండా ఈ వ్యాసం పూర్తికాదు. మహబూబ్‌నగర్ జిల్లా నుంచి డిసెంబర్ 2006 నుంచి పది నెలల పాటు మాకు సమాచారాన్ని అందించిన మిత్రుడు రవికుమార్ 29 ఆగస్ట్ 2007న రోడ్డు ప్రమాదంలో చనిపోయారు. అలాగే ఏప్రిల్ 2008 నుంచి మాకు కృష్ణా జిల్లా సమాచారం అందిస్తూ వచ్చిన బి. రమేష్‌బాబు 2 సెప్టెంబర్ 2010న అనారోగ్యంతో చనిపోయారు. సామాజిక బాధ్యతతో మెలిగిన వీరిద్దరూ ఇలాగ మన నుంచి అర్ధాంతరంగా వెళ్లిపోవడం వారి కుటుంబాలకే కాకుండా, సమాజానికి, వీక్షణం కుటుంబానికి కూడా తీరని లోటు.

*(రచయితలు వీక్షణం సహాయ సంపాదకులు, కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్)*

వీ

వ్యతిరేకంగా, కాశ్మీరులకు వ్యతిరేకంగా సాగుతున్నది. పైగా ఈ ప్రచారంతో యుద్ధ వాతావరణాన్ని రెచ్చగొట్టేందుకు భారత, పాకిస్తాన్ ప్రభుత్వాలు రెండూ శాయశక్తులా ప్రయత్నిస్తున్నాయి.

'యుద్ధంలో మొట్టమొదట బలి అయిపోయేది వాస్తవం' అనే మాట ఇవాళ కాశ్మీర్ విషయంలో అక్షరాలా రుజువవుతోంది. కాశ్మీర్ ప్రజల అసంతృప్తికి, ఆందోళనకు గల చారిత్రక కారణాలను వక్రీకరిస్తూ, అబద్ధాలు ప్రచారం చేస్తూ కాశ్మీర్ సమస్యను శాంతిభద్రతల సమస్యగా చిత్రించడానికి భారత ప్రభుత్వం తీవ్రంగా ప్రయత్నిస్తున్నది. కాశ్మీర్ సమస్యను కాశ్మీర్ ప్రజలతో సంబంధంలేని దౌత్య సమస్యగా చిత్రించడానికి పాకిస్తాన్ ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. మొత్తం మీద కాశ్మీర్ గురించిన వాస్తవాలు పత్రికలకు ఎక్కడం లేదు. ఆ వాస్తవాలను తెలుసుకుంటే భారత, పాకిస్తాన్ ప్రభుత్వాల వాదనలు, ప్రచారం చేస్తున్న అబద్ధాలు పేకమేడల్లా కూలిపోతాయి. కాశ్మీర్ ప్రజల పోరాటం ఎంతగా న్యాయసమ్మతమైనదో అర్థమవుతుంది.

'చారిత్రకంగా, భౌగోళికంగా, చట్టపరంగా, నైతికంగా భారతదేశంలో అంతర్భాగమైన కాశ్మీర్' ప్రస్తుతం పాకిస్తాన్ ప్రోద్బలంతో భారతదేశం నుండి విడిపోదలచుకున్నదనేది భారత ప్రభుత్వం, దాని సమర్థకులు చేస్తున్న ప్రధానమైన వాదన. అయితే కాశ్మీర్ చారిత్రకంగా, భౌగోళికంగా, చట్టపరంగా భారతదేశంలో 'అంతర్భాగంగా' మారిన చరిత్ర విచిత్రమైనది.

కాశ్మీర్ లోయ అనేక శతాబ్దాల పాటి స్వతంత్ర రాజ్యంగా ఉంటూ వచ్చింది. భారత ఉపఖండంలో ప్రవేశించిన సైన్యాలన్నీ ఆ వాయువ్య మూల నుంచే వచ్చినందువల్ల ఒక రాజకీయ పాలనా ప్రాంతంగా కాశ్మీర్ లోయ సరిహద్దులు మారుతూ వచ్చాయి. అయినా పద్నాలుగో శతాబ్దం వరకూ 'భారతదేశం' ఏర్పడనూ లేదు కాశ్మీర్ అందులో 'అంతర్భాగం' కానూ లేదు. అప్పటివరకూ ఈ ప్రాంతాన్ని బౌద్ధ, హిందూ మతాలకు చెందిన రాజవంశాలు పరిపాలించాయి. ఆ తర్వాత ఆ లోయలోనే ముస్లిం పాలకులు ఒక స్వతంత్ర రాజ్యాన్ని నెలకొల్పారు. 1587లో అక్బర్ సైన్యాలు కాశ్మీర్ మీద దండయాత్ర చేసి కాశ్మీర్‌ను మొగల్ సామ్రాజ్యంలో అంతర్భాగం చేశాయి. మొగల్ చక్రవర్తులు కాశ్మీర్‌ను తమ వేసవి విడిదిగా మార్చుకుని రెండు శతాబ్దాలు పాలించారు. 1752లో అఫ్ఘనిస్తాన్‌కు చెందిన అహ్మద్ షా అబ్దాలీ కాశ్మీర్ మీద దండెత్తి మొగల్ సైన్యాలను ఓడించాడు. తర్వాత 67 సంవత్సరాల పాటు పఠాన్ రాజుల కింద అటూ ఇటూగా స్వాతంత్ర్యం అనుభవిస్తుండిన సామంతరాజులు కాశ్మీర్‌ను పాలించారు. 1819లో సిక్ పాలకుడు మహారాజా రంజిత్‌సింగ్ కాశ్మీర్‌ను లోబరచుకున్నాడు. 1846 వరకు కాశ్మీర్ సిక్కు పాలకుల కిందనే ఉండింది. రంజిత్‌సింగ్ జమ్ము ప్రాంతాన్ని కూడ తమ ఆధీనంలోకి తెచ్చుకున్నాడు. 1846లో సిక్కు పాలకులకు, బ్రిటిష్ పాలకులకు మధ్య జరిగిన ఒప్పందాలలో బ్రిటిష్ పాలకులు కోటి రూపాయల కప్పం చెల్లించమని కోరారు. అంత కప్పం చెల్లించలేనంటూ సిక్కు మహారాజు మిగిలిన ప్రాంతాలతోపాటు జమ్ము, కాశ్మీర్‌లను కూడ బ్రిటిష్ వాళ్లకు అప్పగించాడు. కాని అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్ హార్డింగ్ ఈ విశాల భూభాగాన్ని ప్రత్యక్షంగా తమ అధీనంలో ఉంచుకోవడం అనవసరమైన ఖర్చుగా భావించాడు. అదే సమయంలో జమ్ము పాలకుల సంతతికి చెందిన గులాబ్‌సింగ్ తనను జమ్ము, కాశ్మీర్‌లకు స్వతంత్ర పాలకుణ్ని చేస్తే బ్రిటిష్ వాళ్లు కోరిన కప్పం చెల్లిస్తానన్నాడు. తర్వాత కొంత భూభాగాన్ని మినహాయించి ఈ కప్పాన్ని 75 లక్షల రూపాయలకు తగ్గించారు. ఈ షరతులతో 1846 మార్చ్ 16న బ్రిటిష్ ప్రభుత్వానికి, గులాబ్‌సింగ్‌కు మధ్య అమృతసర్‌లో ఒక ఒప్పందం కుదిరింది. గులాబ్‌సింగ్ బ్రిటిష్ ప్రభుత్వ ఆధిపత్యాన్ని గుర్తిస్తూనే స్వతంత్ర సంస్థానంగా కొనసాగుతానన్నాడు. ఆధిపత్యాన్ని గుర్తిస్తున్నందుకు నిదర్శనంగా సంవత్సరానికి ఒక గుర్రాన్ని, పన్నెండు మేలుజాతి మేకలను, మూడు జతల కాశ్మీర్ శాలువలను బ్రిటిష్ ప్రభుత్వానికి కానుకగా ఇస్తానన్నాడు. తర్వాత కాలంలో ఈ కానుక ఒక జత కాశ్మీర్ శాలువాలు, మూడు రుమాళ్లుగా తగ్గిపోయింది.

ఇవాళ జమ్ము-కాశ్మీర్‌గా పిలవబడుతున్న రాజకీయ పాలనా ప్రాంతం ఏర్పడడానికి నాంది ఈ అమృతసర్ ఒప్పందమే. అయితే ఈ పాలనా ప్రాంతం భౌగోళికంగా నాలుగు ముక్కలుగా ఉంటుంది. దక్షిణాన జమ్ము, మధ్య భాగాన కాశ్మీర్ లోయ, ఉత్తరాన గిల్గిత్, కాశ్మీర్ లోయకూ టిబెట్‌కూ మధ్యన లడఖ్. ఈ నాలుగు ప్రాంతాలలోను కాశ్మీర్‌లోయ మీద గులాబ్‌సింగ్ వెంటనే అధికారం సంపాదించలేకపోయాడు. బ్రిటిష్ సైన్యాల సహాయంతో గాని కాశ్మీర్ లోయ గులాబ్‌సింగ్ చేతికి రాలేదు. 1925 సెప్టెంబర్ 23 నుంచి 1947 అక్టోబర్ 26 వరకు జమ్ము - కాశ్మీర్ పాలకుడిగా ఉండిన లెఫ్టినెంట్ జనరల్ మహారాజా సర్ హరిసింగ్ ఈ గులాబ్‌సింగ్ వారసుడే.

కాశ్మీర్ లోయలో ముస్లింల జనాభా ఎక్కువ కాగా, జమ్ము ప్రాంతంలో హిందువుల జనాభా ఎక్కువ. మొత్తం మీద సంస్థానంలో ప్రజానీకం అత్యధికులు ముస్లింలు కాగా, పాలకుడు హిందువు. హరిసింగ్ రాచరిక నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా ప్రజల్లో చెలరేగిన అసంతృప్తికి అటు బ్రిటిష్ ప్రభుత్వం, ఇటు మతోన్మాదశక్తులు మతం రంగు పులమడానికి మంచి అవకాశం దొరికింది. 1920ల నాటి మోప్లా తిరుగుబాట్లు ఎట్లా మతకల్లోలాలుగా వక్రీకరించబడి చరిత్రకెక్కాయో, కాశ్మీర్ ప్రజాందోళన కూడ ఆ వక్రీకరణకే గురయ్యే అవకాశం తొలి నుంచీ ఉండింది. అయితే నిరంకుశ రాచరికానికి వ్యతిరేకంగా షేక్ అబ్దుల్లా నాయకత్వాన ప్రారంభమైన ప్రజాందోళన సంస్థాన వ్యాప్తంగా విస్తరించడం మాత్రమే గాక ఈ వక్రీకరణ జరగకుండా తగిన జాగ్రత్తలు తీసుకుంది.

కాశ్మీర్ ప్రజాందోళనకు నిర్మాణ రూపం ఇచ్చిన సంస్థ మొదట అఖిల జమ్ము కాశ్మీర్ ముస్లిం కాన్ఫరెన్స్‌గానే ప్రారంభమైంది. ముస్లిం కాన్ఫరెన్స్ కార్యక్రమం విప్లవాత్మకంగా, ఆచరణ శీలంగా ఉండేది. నిరంకుశ పాలకుడి స్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని స్థాపించడమే తమ లక్ష్యమని కాన్ఫరెన్స్ నాయకులు ప్రకటించారు. కాన్ఫరెన్స్ ప్రధాన కార్యాచరణ రైతాంగం మధ్య, శ్రామికుల మధ్య, నిరుపేదల మధ్య సాగింది. హిందూమత శక్తులు ఈ ఉద్యమాన్ని హిందూ వ్యతిరేకమైనదిగా చిత్రించడం ప్రారంభించాయి. కాన్ఫరెన్స్ పేరులోనే ముస్లిం అని ఉండడం ఈ స్వార్థపరశక్తులకు ఉపయోగపడింది. ఈ దుష్ప్రచారాన్ని మొగ్గలోనే తుంచివేసేందుకు షేక్ అబ్దుల్లా ప్రయత్నాలు ప్రారంభించాడు. మత విశ్వాసాలేవయినప్పటికీ, ప్రగతిశీల భావాలుగల కాశ్మీరీలందరినీ కాన్ఫరెన్స్ పతాకం కింద సమీకరించాలని ఆయన ప్రయత్నించాడు. మైనారిటీ వర్గాలకు అన్ని రక్షణలూ కల్పిస్తామని, కాన్ఫరెన్స్‌లో చేరమని

ఆయన విజ్ఞప్తి చేశాడు. నాలుగుసార్లు కాన్ఫరెన్స్ అధ్యక్షుడుగా ఎన్నికై, బహుళామోదం పొందిన నాయకుడుగా ఆయన హామీని సిక్కులు, హిందువులు అంగీకరించారు. హిందువులు, సిక్కులు సాంకేతికంగా ముస్లిం కాన్ఫరెన్స్ సభ్యులయే అవకాశం లేనప్పటికీ 1933 నుంచే ఈ ఐక్యత కొనసాగుతూ వచ్చింది.

"మన ముందు ఉన్న ప్రధాన సమస్య సంయుక్త కార్యాచరణను రూపొందించడం. బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరిచే మార్గంలో మనకు ఎదురవుతున్న అవరోధాలకు వ్యతిరేకంగా ఐక్య సంఘటనను నిర్మించడం. అందుకోసం మనం మన సంస్థను మతరహిత రాజకీయ సంస్థగా పునర్నిర్మించాలి. దాని ప్రణాళికలోను, నిబంధనావళిలోను తగిన సవరణలు చేయాలి. మన రాజకీయ సమస్యలను చర్చించే సమయంలో ముస్లింలు, ముస్లిమేతరులు అనే పద్ధతిలో ఆలోచించడం మాని మతతత్వాన్ని రద్దుచేయాలి" అని 1938 మార్చ్ 25న షేక్ అబ్దుల్లా అన్నాడు. అన్నట్టుగానే 1939లో అఖిల జమ్ము-కాశ్మీర్ నేషనల్ కాన్ఫరెన్స్ అనే కొత్త సంస్థ కుల, మత వివక్షలేని రాజకీయ కార్యాచరణ సంస్థగా, బాధ్యతాయుత ప్రభుత్వ ఏర్పాటు లక్ష్యంతో ఆవిర్భవించింది.

1944 సెప్టెంబర్ 29, 30 తేదీల్లో నేషనల్ కాన్ఫరెన్స్ తన కార్యక్రమాన్ని ప్రకటించింది. 'నయా కాశ్మీర్' పేరుతో ప్రసిద్ధమైన ఈ ప్రణాళిక కాశ్మీర్ సమస్యల పట్ల నేషనల్ కాన్ఫరెన్స్ వైఖరికి మార్గదర్శక సూత్రంగా పనిచేసింది. కాశ్మీర్‌ను ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో పునర్నిర్మించే ఈ ప్రణాళికా పత్రాన్ని మొదట ప్రభుత్వానికే సమర్పించారు. 'కాశ్మీర్ సమస్య భారతదేశపు సమస్యల తోనూ, మొత్తంగా ప్రపంచ సమస్యలతోనూ ముడివడి ఉన్నది... ఒక నూతన ప్రాపంచిక వ్యవస్థ నిర్మాణం కోసం ఆలోచనలు చెలరేగుతున్నప్పుడు నేషనల్ కాన్ఫరెన్స్ కూడ తాను నిర్మించదలచిన నూతన కాశ్మీర్ అవగాహనను స్పష్టంగా ప్రకటించదలచుకున్నది' అంటూ ఈ ప్రణాళికా రచన ప్రారంభమైంది.

ఈ ప్రణాళికలో రెండు భాగాలున్నాయి. మొదటి భాగంలో కాశ్మీర్ రాజ్యపు రాజ్యాంగం గురించి, రెండో భాగంలో జాతీయ ఆర్థిక ప్రణాళిక గురించి అవగాహనలున్నాయి. ఈ ప్రణాళిక ప్రకారం కాశ్మీర్ రాజ్యాంగం మత, తెగ, జాతి వివక్షలేని సర్వ సమానత్వాన్ని హామీ ఇస్తుంది. అన్ని రకాల పౌరహక్కులకు హామీ ఇస్తుంది. పనిచేసే హక్కు, పని లేకపోతే జీవనభృతి పొందే హక్కు కూడ ఈ రాజ్యాంగంలో ఉన్నాయి. అంతేకాదు, ప్రజల పక్షాన నిలిచినందుకు విచారణల పాలయ్యే విదేశీ పౌరులకు ఆశ్రయం కల్పిస్తానని కూడ ఈ రాజ్యాంగం హామీ ఇచ్చింది. ఆర్థిక ప్రణాళిక సమసమాజాన్ని రూపొందిస్తాననీ, ప్రతి మనిషికీ వ్యక్తికరణ పొందేందుకు, సంతృప్తి పొందేందుకు, కనీస నాగరిక జీవన ప్రమాణాన్ని పొందేందుకు సమాన హక్కులు కల్పిస్తాననీ వాగ్దానం చేసింది. జాతీయ స్వయం సమృద్ధి, జీవన ప్రమాణాల అభివృద్ధి, మారకం కోసం కాక వినియోగం కోసం ఉత్పత్తి తన లక్ష్యాలుగా ఈ ప్రణాళిక ప్రకటించింది. వ్యవసాయ రంగంలో భూస్వామ్యాన్ని రద్దుచేస్తానని, దున్నేవాడికే భూమి ఇస్తానని, సహకార క్షేత్రాలను ప్రోత్సహిస్తానని, అడవుల మీద ప్రజల ఆధిపత్యాన్ని అంగీకరిస్తానని ప్రకటించింది. పరిశ్రమలలో కీలక పరిశ్రమలన్నిటినీ ప్రభుత్వాధీనంలో ఉంచుతామనీ, బడా ప్రైవేట్ పెట్టుబడిని రద్దు చేస్తామనీ, గుత్త సంస్థల పెరుగుదలను నిరోధిస్తామనీ ప్రకటించింది. రైతుల, కార్మికుల, స్త్రీల హక్కుల పరిరక్షణ కోసం ప్రత్యేక వాగ్దానాలు చేసింది.

ఈ కార్యక్రమంతో నేషనల్ కాన్ఫరెన్స్ క్రియాశీల ఉద్యమాలు 1945లో విస్తృతంగా సాగాయి. ఈ సంవత్సరమే హరిసింగ్ తన ప్రధానమంత్రిగా పరమ నిరంకుశుడైన రామచంద్ర కక్‌ను నియమించుకున్నాడు. బ్రిటిష్ ఇండియాలో జరిగిన క్విట్ ఇండియా ఉద్యమం ప్రేరణతో నేషనల్ కాన్ఫరెన్స్ 1946లో 'క్విట్ కాశ్మీర్' అనే నినాదాన్ని ఇచ్చింది. మిగిలిన స్వదేశీ సంస్థానాలలో సాగుతున్న ప్రజా ఉద్యమాలేవీ ఇంత తీవ్రమైన నినాదాన్ని ఇవ్వలేదు. మహారాజు కాశ్మీర్‌ను వదిలి అధికారాన్ని ప్రజా ప్రతినిధులకు బదలాయించాలనేది నేషనల్ కాన్ఫరెన్స్ నినాదం లక్ష్యం. మిగిలిన చోట్ల ఆయా సంస్థానాధీశులను లాంఛన ప్రాయంగానైనా పాలకులుగా అంగీకరిస్తూనే బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడాలనే ఆకాంక్ష వ్యక్తం కాగా, షేక్ అబ్దుల్లా నాయకత్వంలోని నేషనల్ కాన్ఫరెన్స్ నిజమైన రాచరిక వ్యతిరేకతను వ్యక్తం చేసింది. పాలకులు నేషనల్ కాన్ఫరెన్స్ పైన, నాయకుల పైన భయంకరమైన నిర్బంధాన్ని అమలు చేశారు. 1946 మే 20న షేక్ అబ్దుల్లాను, వందలాది కార్యకర్తలను అరెస్టు చేశారు. ఎందరినో చంపేశారు. సంస్థానాన్ని పూర్తిగా సైనిక పాలనలోకి తీసుకుపోయారు.

ఈ ఆందోళనతో, నిర్బంధాలతో కాశ్మీర్ వాతావరణం వేడెక్కుతున్న సందర్భంలోనే భారతదేశానికి స్వాతంత్ర్యం ఇస్తానని బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది. భారతదేశం, పాకిస్తాన్ అనే రెండు స్వతంత్ర రాజ్యాలు ఏర్పడనున్నాయని, స్వదేశీ సంస్థానాలు తమ ఇష్ట ప్రకారం ఏ దేశంలోనైనా కలవవచ్చునని ప్రకటన వెలువడింది. భారత ఉపఖండాన్ని రెండు దేశాలుగా ఎట్లా విభజించాలనే విషయమై జవహర్‌లాల్ నెహ్రూకు, మహమ్మద్ అలీ జిన్నాకు మధ్య తలెత్తిన వివాదాన్ని పరిష్కరించే బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వం తీసుకుంది. భారత ఉపఖండాన్ని విభజించడానికి సర్ సిరిల్ రాడ్‌క్లిఫ్‌ను తీసుకువచ్చారు. ఒక సరిహద్దు కమిషన్‌ను ఏర్పరచి, ఆ కమిషన్‌కు అధ్యక్షుడుగా ఒక నిపుణుడైన ఇంగ్లిష్ బారిస్టర్‌ను నియమిస్తామని ప్రభుత్వం అంతకుముందే ప్రకటించి ఉంది. ఏ పక్షం పట్ల అనవసరమైన పక్షపాతం చూపకుండా ఉండేందుకుగాను భారత ఉపఖండం గురించి తెలియని వ్యక్తిని కమిషన్ అధ్యక్షుడుగా నియమిస్తామన్నారు. ఆ రకంగా సర్ సిరిల్ రాడ్‌క్లిఫ్ ఢిల్లీ చేరాడు. ఈ దేశం గురించీ, ఈ ప్రజల గురించీ, ఈ ప్రజల జీవన్మరణ సమస్యల గురించీ ఏ మాత్రం అవగాహన లేని రాడ్‌క్లిఫ్‌ను తీసుకువచ్చి, ఆ అవగాహన లేకపోవడమే అర్హతగా చెప్పి, రాడ్‌క్లిఫ్ ముందర ఒక భారత ఉపఖండం పటం పెట్టి దాన్ని రెండు ముక్కలు చేయమని ప్రభుత్వం ఆదేశించింది.

'ముస్లింలయినా, ముస్లిమేతరులయినా అత్యధికంగా నివసించే భాగాలు కలిసి ఉండేలా' చూడమని లార్డ్ మౌంట్‌బాటన్ రాడ్‌క్లిఫ్‌కు సలహా ఇచ్చాడు. అయితే ఈ 'మెజారిటీ జనాభా' ప్రమాణానికి రాడ్‌క్లిఫ్ ఒక మినహాయింపు ఇచ్చాడు. పంజాబ్‌కు ఉత్తర కొసన గురుదాస్‌పూర్ అనే చిన్న పట్టణం, దాని చుట్టూ ఉన్న ముస్లిం గ్రామాలు రాడ్‌క్లిఫ్ అవార్డు ప్రకారం భారతదేశంలోకి వచ్చాయి. అక్కడ ఆయన తన 'మత ప్రమాణాన్ని' వదిలేసి, రావినదిని సహజ సరిహద్దుగా గుర్తించాడు. భారతదేశం నుంచి జమ్ము-కాశ్మీర్‌లోకి వెళ్లగల ఏకైక భూమార్గం ఆ

గురుదాస్‌పూర్ పట్టణమే. ఆ పట్టణం రాడ్‌క్లిఫ్ అవార్డు ప్రకారం పాకిస్తాన్‌లోకి వెళ్లి ఉంటే భారత దేశానికి, జమ్ము-కాశ్మీర్‌కు మధ్య భౌగోళిక మార్గమే ఉండేది కాదు.

ఈ విధంగా జమ్ము-కాశ్మీర్ ప్రజా ఆకాంక్షలు పాలకుల ఎత్తుగడల మధ్య నలిగిపోయాయి. ఒకవైపు సంస్థానాధీశుడు సర్ హరిసింగ్ కాశ్మీర్‌ను స్వతంత్ర రాజ్యంగా కొనసాగిస్తానని, రెండు దేశాలలో దేనితోనూ కలవనని ప్రకటించాడు. పాకిస్తాన్, భారతదేశం రెండూ కాశ్మీర్ తమలో కలిసిపోవాలని కోరుకున్నాయి. ఈ రగులుతున్న వివాదానికి ఆజ్యంపోస్తూ పబ్బం గడుపుకోవడమే తమ లక్ష్యంగా బ్రిటిష్ పాలకులు తమాషా చూశారు. జమ్ము-కాశ్మీర్ ప్రజలు మాత్రం తమ మీది నుంచి నిరంకుశ రాచరికం తొలగిపోవాలని కోరుకున్నారు. హరిసింగ్‌ను 'క్విట్ కాశ్మీర్' అన్నారు.

కాశ్మీర్ ప్రజలు, వారికి నాయకత్వం వహిస్తున్న నేషనల్ కాన్ఫరెన్స్ ఒకవైపు, రాజా హరిసింగ్ ఒకవైపు, నెహ్రూ, మౌంట్‌బాటన్, జిన్నాలు మరోవైపు లాగుతూ ఉన్న ఈ చిక్కుముడి 1947 అక్టోబర్ నాటికి విచిత్రంగా తెగిపోయే పరిస్థితి వచ్చింది. 1947 ఆగస్ట్ 15న జమ్ము-కాశ్మీర్ సంస్థానం అటు పాకిస్తాన్‌తోను, ఇటు భారత దేశంతోను చేరకుండానే ఉండిపోయింది. ఆ సమయానికి జమ్ము-కాశ్మీర్ సంస్థానానికి రోడ్డు సంబంధాలు పాకిస్తాన్‌తోనే ఉన్నాయి. సంస్థానంలో ప్రధాన ఆదాయ వనరు అయిన కలపను పాకిస్తాన్‌లోకి ప్రవహించే నదులతోనే రవాణా చేసే స్థితి ఉంది. అందువల్ల రవాణా సౌకర్యాల దృష్ట్యా, ఆర్థిక వ్యవస్థ దృష్ట్యా సంస్థానానికి పాకిస్తాన్‌ను వదిలే అవకాశం లేదు. భారతదేశంతో కలిసినా, పాకిస్తాన్‌తో కలిసినా అంగీకరించని ప్రజలు హెచ్చు సంఖ్యలోనే ఉన్నారు. ఒకవైపు రాడ్‌క్లిఫ్ అవార్డు భారత దేశంతో రోడ్డు సంబంధాన్ని నెలకొల్పగా, మరోవైపు కొత్త ప్రధానమంత్రి జనక్‌సింగ్ రెండు దేశాలతోనూ యథాతథ ఒడంబడిక ప్రతిపాదించాడు. పాకిస్తాన్ యథాతథ ఒడంబడికపై వెంటనే సంతకం చేసింది. ఒడంబడికను పరిశీలించాల్సి ఉందనే కారణంతో భారత ప్రభుత్వం తాత్సారం చేసింది.

యథాతథ ఒడంబడిక మీద సంతకం చేసిన పాకిస్తాన్ ప్రభుత్వం, చెయ్యని భారత ప్రభుత్వం రెండు కూడా కాశ్మీర్ ప్రభుత్వం మెడలు వంచడం ఎట్లా అని ఎత్తులకు పై ఎత్తులు వెయ్యడం ప్రారంభించాయి. పాకిస్తాన్ ప్రభుత్వం కాశ్మీర్‌లోకి ఆహారం, పెట్రోలు, ఇతర నిత్యావసర వస్తువులు వెళ్లకుండా నిరోధించింది. రెండు దేశాల మధ్య ప్రయాణికుల రాకపోకలపై నిబంధనలు విధించింది. ఈ స్థితిలో కాశ్మీర్ ప్రభుత్వం భారత ప్రభుత్వాన్ని సాయం చెయ్యమని కోరింది. ఐదు వేల గాలన్ల పెట్రోలు కావాలని కోరితే, భారత ప్రభుత్వం ఐదు వందల గాలన్ల పెట్రోలు మాత్రం అందజేసింది. అతి వేగంగా మారిపోతున్న ఈ పరిస్థితుల్లో హరిసింగ్ మరోసారి ప్రధానమంత్రిని మార్చాడు. కొత్త ప్రధాని మెహర్‌చంద్ మహాజన్ 1947 అక్టోబర్ 15న బ్రిటిష్ ప్రధానికి ఒక ఫిర్యాదు చేస్తూ పాకిస్తాన్ ప్రభుత్వం యథాతథ ఒడంబడికను ఉల్లంఘిస్తున్నదన్నాడు.

అక్టోబర్ 22 నాటికి కాశ్మీర్, పాకిస్తాన్‌ల సరిహద్దులోని గిరిజన తెగలు కాశ్మీర్‌లోకి చొరబడడం ప్రారంభించాయి. అక్టోబర్ 24 నాటికి వాళ్లు మహురా పవర్‌హౌజ్‌ను స్వాధీనం చేసుకుని శ్రీనగర్‌కు విద్యుచ్ఛక్తి సరఫరా ఆపివేశారు. అక్టోబర్ 26 నాటికి శ్రీనగర్ చేరుతామని ప్రకటించారు. అక్టోబర్ 24 నాడే హరిసింగ్ భారత ప్రభుత్వం సహాయం కోరాడు. పరిస్థితిని స్వయంగా పర్యవేక్షించేందుకు రక్షణ కమిటీ తరఫున వెళ్లిన వి.పి. మీనన్ అక్టోబర్ 26న ఢిల్లీ చేరి 'కాశ్మీర్‌ను చొరబాటుదారుల నుంచి' రక్షించాలని సూచించాడు. అయితే అప్పటికే స్వతంత్ర దేశంగా ఉన్న కాశ్మీర్‌లోకి భారత ప్రభుత్వ సైన్యాలు ప్రవేశించడం సరైనది కాదనే వాదనను మౌంట్ బాటన్ ముందుకు తెచ్చాడు. కాశ్మీర్ సంస్థానం గనుక భారతదేశంలో విలీనం కావడానికి అంగీకరిస్తే, అప్పుడు కాశ్మీర్ భారతదేశంలో అంతర్భాగమవుతుందని, భారత సైన్యాలు కాశ్మీర్‌లోకి నిరభ్యంతరంగా వెళ్లవచ్చునని మౌంట్ బాటన్ అన్నాడు. సంస్థానంలోంచి చొరబాటుదారులను తరిమివేసి, శాంతిభద్రతలు నెలకొనగానే ప్రజాభిప్రాయ సేకరణ జరపాలని, ఆ షరతు మీదనే విలీనం జరగాలని కూడా అన్నాడు. నెహ్రూ ఇతర మంత్రులతో సహా అందరూ ఈ ప్రతిపాదనకు అంగీకరించారు. అట్లా ఒక నాటకీయ సన్నివేశంలో జమ్ము-కాశ్మీర్ సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చెయ్యక తప్పదని భారత ప్రభుత్వం హరిసింగ్‌పై ఒత్తిడి తెచ్చింది. వి.పి. మీనన్ రాసిన ప్రకారమే చొరబాటుదారులు కాశ్మీరీల మీద అత్యాచారాలు జరుపుతుండగా శ్రీనగర్ నుంచి పారిపోయి వచ్చి జమ్మూ రాజభవనంలో నిద్రపోతున్న హరిసింగ్‌ను నిద్రలేపి విలీన ఒప్పందం మీద సంతకం చేయించారు. ఆ ఒప్పందాన్ని ఢిల్లీకి తీసుకువచ్చిన తర్వాత కూడా రక్షణ కమిటీ ముందర సుదీర్ఘమైన చర్చ జరిగింది. 'శాంతి భద్రతల స్థితి అనుకూలించగానే సంస్థానంలో ప్లెబిసైట్ (ప్రజాభిప్రాయ సేకరణ) నిర్వహించడం జరుగుతుంది' అనే షరతుతో ఆ ఒప్పందాన్ని అంగీకరించారు.

1947 నవంబర్ 2న నెహ్రూ రేడియో ఉపన్యాసంలో కూడా ప్రజాభిప్రాయ సేకరణ జరుపుతామని హామీ ఇచ్చాడు. శాంతి భద్రతలు నెలకొనగానే ఐక్యరాజ్య సమితి వంటి అంతర్జాతీయ సంస్థల నేతృత్వంలో ప్రజాభిప్రాయ సేకరణ జరుపుతామనే హామీని కేవలం కాశ్మీర్ ప్రజలకు మాత్రమే కాక సకల ప్రపంచానికీ ఇస్తున్నామని నెహ్రూ అన్నాడు. ఇందుకు ప్రతిగా నవంబర్ 4న పాకిస్తాన్ రేడియోలో లియాఖత్ అలీ ఖాన్ మాట్లాడుతూ అసలు 1846లో జరిగిన అవమానకరమైన అమృతసర్ ఒప్పందం ఫలితంగా నీతిబాహ్యమైన, చట్టవ్యతిరేకమైన పాలన కాశ్మీర్‌లో సాగుతున్నదన్నాడు. నవంబర్ 21న నెహ్రూ తన వాగ్దానాన్ని మరొకసారి పార్లమెంట్‌లో కూడ ప్రకటించాడు. చొరబాటుదార్ల నెపం మీద భారత-పాకిస్తాన్ సైన్యాల మధ్య సాయుధ ఘర్షణలు సాగాయి. రెండు దేశాల మధ్య కాశ్మీర్ విషయమై తలెత్తిన వివాదం ఐక్యరాజ్య సమితి భద్రతా సమితికి చేరింది. ఐక్యరాజ్య సమితి తరఫున ఒక శాంతి సంఘం ఏర్పడి కాల్పుల విరమణ రేఖ 1949 జూలై 26న నిర్ణయమైంది. వాస్తవాధీన రేఖగా కూడా ప్రసిద్ధమైన ఈ సరిహద్దుకు ఒకవైపు పాకిస్తాన్ ఆక్రమణలోని కాశ్మీర్, మరో వైపు భారత ఆక్రమణలోని కాశ్మీర్ ఉండిపోయాయి. రెండు పక్షాలను ఆదేశించగల మధ్యవర్తిని నియమిస్తారని శాంతి సంఘం చేసిన ప్రతిపాదనను భారత ప్రభుత్వం వ్యతిరేకించింది. 1948 నుంచి 1957 వరకు ఐదుసార్లు భద్రతా సమితి కాశ్మీర్‌లో ప్లెబిసైట్ నిర్వహించాలని తీర్మానాలు చేసింది. భారత ప్రభుత్వం ఆ తీర్మానాలను ఖాతరు చేయలేదు. ప్లెబిసైట్ నిర్వహించే సమయంలో ఐక్యరాజ్యసమితి పర్యవేక్షణే ఉండాలని ఐక్య రాజ్య సమితి, పాకిస్తాన్‌లు వాదించగా, తన పర్యవేక్షణే ఉండాలని

భారత ప్రభుత్వం వాదించింది. మొత్తం మీద 1947 అక్టోబర్ 26న విలీన ఒప్పందం మీద సంతకాలు చేసినప్పటి నుంచీ తాము చేసిన వాగ్దానాలన్నిటినీ, ముఖ్యంగా ప్రజాభిప్రాయ సేకరణ వాగ్దానాన్ని భారత ప్రభుత్వం, కాంగ్రెస్ పార్టీ నాయకులు తుంగలో తొక్కుతూ వచ్చారు. ప్రతిపక్షాలు కూడ పాలక పక్షానికి వంతపాడడం ప్రారంభించాయి.

ప్లెబిసైట్ గురించి రాజకీయ స్థాయిలో ఈ వాగ్దానాలూ, వాగ్దాన భంగాలూ జరుగుతుండగానే రాజ్యాంగస్థాయిలో మరొక విచిత్రం జరుగుతూ వచ్చింది. 1947 ఆగస్ట్ 29న ప్రారంభించి 1949 నవంబర్ 26 వరకు భారత రాజ్యాంగ రచన జరిగింది. భారత రాజ్యాంగం 1950 జనవరి 26 నుంచి అమలులోకి వచ్చింది. ఈ రాజ్యాంగంలోని మొట్టమొదటి అధికరణం భారత పాలక వర్గాల విస్తరణ స్వభావానికి అద్దం పడుతుంది: 'యూనియన్ పేరు, భూభాగం' అనే శీర్షిక ఉన్న ఈ అధికరణంలో "1) ఇండియా, అంటే భారతదేశం రాష్ట్రాల యూనియన్‌గా ఉంటుంది. 2) రాష్ట్రాలు, భూభాగాలు మొదటి షెడ్యూల్‌లో చూపిన ప్రకారం ఉంటాయి. 3) భారత దేశపు భూభాగంలో అ) రాష్ట్రాల భూభాగాలు ఆ) మొదటి షెడ్యూల్‌లో చూపిన కేంద్ర పాలిత ప్రాంతాల భూభాగాలు ఇ) ఆక్రమించుకోబోయే (సంపాదించుకో బోయే) ఇతర భూభాగాలు కలిసి ఉంటాయి" అని రాశారు.

రాజ్యాంగ రచనా కమిటీ అధ్యక్షుడుగా డా. అంబేద్కర్ ఈ అధికరణానికి వివరణ ఇచ్చాడు. భారత రాజ్యాంగం నిర్మాణరీత్యా సమాఖ్యగా ఉన్నప్పటికీ, తాము కొన్ని సౌకర్యాల కోసం యూనియన్ అనే మాట వాడవలసి వచ్చిందన్నాడు. ఆ సౌకర్యాలు రెండు విషయాలను సూచిస్తాయని అవి, భారత సమాఖ్య తనలోని అన్ని భాగాల ఉమ్మడి ఒప్పందం మీద ఏర్పడినది కాదని, అంతర్భాగమైన యూనిట్లకు విడిపోయే స్వేచ్ఛలేదని ఆయన వివరించారు. ఈ రెండు విషయాలలో మొదటిది బలవంతపు ఐక్యత కాగా, రెండోది ఆ ఐక్యతను భంగం చేసే హక్కులేదని శాసించడం. అయితే కాశ్మీర్ విషయంలో ఈ వివరణ కూడా అన్వయించదు. కాశ్మీర్ పాలకుడికీ, కేంద్ర ప్రభుత్వానికీ మధ్య కుదిరిన ఉమ్మడి ఒప్పందం ప్రకారమే కాశ్మీర్ ఇండియన్ యూనియన్‌లో భాగమైంది. ఆ ఒప్పందానికి ప్రజల మద్దతు ఉన్నదా లేదా పరీక్షిస్తామని భారత ప్రభుత్వమే అనేకసార్లు ప్రకటించింది.

ఈ అధికరణలోనే చివరి వాక్యం ఇంకా భయంకరమైన ప్రతిపాదన చేస్తున్నది. 'ఆక్రమించబోయే ఇతర ప్రాంతాలు కూడ' భారతదేశంలో భాగమవుతాయంటే, భారత ప్రభుత్వం 1950 జనవరి 26 తర్వాత ఆక్రమించే ఏ ప్రాంతమైనా కూడా 'చట్టబద్ధంగా' భారతదేశంలో అంతర్భాగమే అవుతుంది. 1975 ఏప్రిల్ 26న సిక్కింను భారత ప్రభుత్వం ఇట్లా 'చట్టబద్ధంగానే' కబళించింది. కనుక 1947లో కాశ్మీర్‌ను విలీనం చేసుకుని, ఆ విలీనాన్ని చట్టబద్ధం చేయదలచు కోవడంలో కూడా ఆశ్చర్యం లేదు.

కానీ కాశ్మీర్‌లో అప్పటిదాకా ఉధృతంగా కొనసాగుతూ వచ్చిన ప్రజాపోరాటాన్ని, కాశ్మీరీలలో వ్యక్తమైన స్వాతంత్ర్యాకాంక్షను చూసిన తర్వాత భారత పాలకవర్గాలు సూటిగా కాశ్మీర్‌ను కబళించలేకపోయాయి. తత్ఫలితంగా వచ్చిందే రాజ్యాంగంలోని 370 అధికరణం. రాజ్యాంగంలోని ఒకటో అధికరణాన్ని మినహాయించి మిగతా అధికరణాలు జమ్ము కాశ్మీర్‌కు వర్తిస్తాయా లేదా అనే విషయాన్ని రాష్ట్రపతి రాష్ట్ర ప్రభుత్వాన్ని సంప్రదించిన తర్వాతనే నిర్ణయం తీసుకోవాల్సి ఉంటుందని ఈ అధికరణం చెపుతుంది. కేంద్ర జాబితాలో అయినా, రాష్ట్ర జాబితాలో అయినా రాష్ట్రం మీద పార్లమెంటరీ శాసనాధికారం చెల్లే అంశాలు విలీన ఒప్పందానికి లోబడి మాత్రమే ఉంటాయి. అంటే విలీన ఒప్పందం ప్రకారం రక్షణ, విదేశీ వ్యవహారాలు, సమాచార సంబంధాలలో మాత్రమే కేంద్ర ప్రభుత్వ అధికారం జమ్ము కాశ్మీర్‌లో చెల్లుతుంది. అయితే ఈ అధికరణం తాత్కాలికమైనదే. జమ్ము కాశ్మీర్‌లో ప్రత్యేకంగా రూపొందే శాసన నిర్మాణ సభ చేసే సిఫారసుల ఆధారంగా రాష్ట్రపతి అంతిమ నిర్ణయం తీసుకోవాలి. అప్పటి వరకు మాత్రమే 370 అధికరణం అమలులో ఉంటుంది.

రాజ్యాంగ రచనలో కల్పించక తప్పని ఈ 370 అధికరణం ద్వారా కాశ్మీరీలు ఎక్కడ లాభపడిపోతారోనని, ఈ అధికరణానికి తూట్లు పొడవడానికి భారత పాలకవర్గాలు మొదటి నుంచీ ప్రయత్నిస్తూ వచ్చాయి. మాటల్లో మాత్రం కాశ్మీరీ ప్రజల స్వయం నిర్ణయాధికార హక్కు పట్ల గౌరవాన్ని వ్యక్తం చేస్తూనే వచ్చారు. తమ భవిష్యత్ రాజ్యాంగాన్ని, భారతదేశంతో తమకు ఉండే సంబంధాన్ని అంతిమంగా నిర్ణయించుకోవలసింది కాశ్మీర్ ప్రజలేనని భారత ప్రభుత్వం పదే పదే చెప్పింది. రాష్ట్ర ప్రజలు ఎన్నుకునే శాసన నిర్మాణ సభకు ఈ అధికారం ఉంటుందని ప్రకటించింది. ఈ ఉద్దేశంతోనే రాష్ట్రంలో ఒక సర్వసత్తాక శాసన నిర్మాణసభ ఎన్నుకోబడి 1951 అక్టోబర్ 31న తొలి సమావేశం జరిపింది. అప్పటికే అక్కడ షేక్ అబ్దుల్లా ప్రధానిగా ప్రభుత్వం కొనసాగుతున్నది. విలీనం జరిగిన వెంటనే రాజా హరిసింగ్ పదవి నుంచి తప్పుకుని తాత్కాలిక అత్యవసర ప్రభుత్వాన్ని నిర్మించవలసిందిగా షేక్ అబ్దుల్లాను ఆహ్వానించాడు. షేక్ అబ్దుల్లా ప్రధానిగా కాశ్మీర్ ప్రభుత్వం కొనసాగుతుండగానే పైన వివరించిన రాజ్యాంగ వ్యవహారాలు సాగాయి. ఐక్యరాజ్య సమితి నుంచి వాస్తవాధీన రేఖ దాకా రాజకీయాలు సాగాయి. ఈ స్థితిలో నేషనల్ కాన్ఫరెన్స్, షేక్ అబ్దుల్లా స్వాతంత్ర్యాకాంక్షకూ, సామరస్యంతో పదవీకాంక్షకూ మధ్య, ప్రజాపునాదికీ, కేంద్ర ప్రభుత్వం వత్తాసుకూ మధ్య ఉగిసలాడడం ప్రారంభమైంది. 1951 అక్టోబర్ 31న సమావేశమైన శాసన నిర్మాణ సభ ముసాయిదా రాజ్యాంగాన్ని చర్చించడం ప్రారంభించింది. ఈ ముసాయిదాలో కాశ్మీర్ విలీనాన్ని ఆమోదించడం, రక్షణ, విదేశీ వ్యవహారాలు, సమాచార సంబంధాలు మినహా మిగిలిన అంశాలలో స్వయం నిర్ణయాధికారం అనే రెండు విషయాలున్నాయి. ఒకవైపు శాసన నిర్మాణ సభ కాశ్మీర్ రాజ్యాంగం గురించి చర్చిస్తుండగానే భారత పాలక వర్గాలు ఈ ప్రయత్నాల్ని వమ్ము చేసే ప్రయత్నాలు ప్రారంభించాయి. 1952 జూలైలో ఢిల్లీలో నెహ్రూకు అబ్దుల్లాకు చర్చలు జరిగాయి. అప్పటికే షేక్ అబ్దుల్లా ఇంకా కాశ్మీర్ స్వాతంత్ర్యాకాంక్షకు కట్టుబడి ఉన్నాడు. నెహ్రూతో జరిగిన చర్చల ఫలితంగా వెలువడిన ఢిల్లీ ఒప్పందంలో 'విలీన ఒప్పందంలో ప్రస్తావించిన అంశాలు మినహా మిగిలిన అన్ని అంశాలలోను రాష్ట్రానికే సార్వభౌమాధికారం ఉంటుంది' అనే అంగీకారం కుదిరింది. పాక్ ఆక్రమిత్ కాశ్మీర్ నుంచి జమ్ము-కాశ్మీర్‌కు వచ్చేవారిని పూర్తిస్థాయి పౌరులుగా గుర్తిస్తామని, భారతదేశంలోని ఇతర ప్రాంతాల నుంచి వచ్చేవారికి కాశ్మీర్‌లో స్థిరాస్తులు సంపాదించే వీలు లేదని ఈ ఒప్పందం నిర్దేశించింది.

ఈ సమయంలోనే రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ కాశ్మీర్‌కు వ్యతిరేకంగా జాతీయ దురహంకారాన్ని రెచ్చగొట్టడానికి, కాశ్మీర్

సమస్యను మత సమస్యగా చూపడానికి ప్రయత్నాలు ప్రారంభించింది. అనేకసార్లు చర్చలు, వాగ్దానాలు జరిగిన తర్వాతనే అంగీకరించిన కాశ్మీర్ ప్రత్యేక హక్కులను రద్దు చేయించడానికి ఆర్.ఎస్.ఎస్. ఉద్యమం చేపట్టింది. ఒకే దేశంలో ఇద్దరు ప్రధానులు, రెండు రాజ్యాంగాలు, రెండు పతాకాలు చెల్లవని, కాశ్మీర్‌ను భారతదేశంలో పూర్తిగా భాగం చేయాలని ఆర్.ఎస్.ఎస్. ఉద్యమం చేపట్టింది. ఈ ఉద్యమంలో భాగంగా ఆర్.ఎస్.ఎస్. శ్యాంప్రసాద్ ముఖర్జీ కాశ్మీర్ వెళ్లి అక్కడ అరెస్టయి సహజ కారణాల వల్లనే జైలులో చనిపోయాడు. దీనితో మతోన్మాద శక్తుల ఆందోళన ఇంకా విజృంభించింది. ఈ ఒత్తిడిని గమనిస్తూ వచ్చిన షేక్ అబ్దుల్లా స్వాతంత్ర్యం గురించి మరింతగా పట్టుబట్టారు. 1953 మేలో జరిగిన నేషనల్ కాన్ఫరెన్స్ కార్యవర్గ సమావేశం మళ్లీ ఒకసారి స్వతంత్ర కాశ్మీర్ ఆవిర్భావం గురించి ఆలోచించింది.

ఈ స్థితిలో నెహ్రూ ప్రభుత్వం షేక్ అబ్దుల్లాపై విరుచుకుపడి 1953 ఆగస్ట్ 9న ఆయనను ఆరెస్ట్ చేసింది. బక్షీ గులామ్ మహమ్మద్ ప్రధానమంత్రిగా కొత్త ప్రభుత్వం ఏర్పాటయింది. కాశ్మీర్ శాసన నిర్మాణ సభలోని చాలమంది సభ్యులు జైలు పాలయ్యారు. ఇట్లా ఎందరో సభ్యులు జైల్లో ఉండగా, ప్రజామోదం గల ప్రధాని పదవి నుంచి తొలగించబడి జైలు పాలు కాగా, 1954 ఫిబ్రవరిలో కాశ్మీర్ శాసన నిర్మాణ సభ సమావేశమయింది. నెహ్రూ ప్రభుత్వ కనుసన్నల్లో మెలిగే బక్షీగులామ్ మహమ్మద్ నాయకత్వాన విలీన ఒప్పందాన్ని ఏకగ్రీవంగా అంగీకరించడం జరిగింది. కాశ్మీర్ శాసన నిర్మాణసభ చేసిన ఈ తీర్మానం ఆధారంగా 1954 మే 14 నుంచి అమలులోకి వచ్చేలా భారత రాజ్యాంగాన్ని జమ్ము-కాశ్మీర్‌లను అన్వయింపజేసే ఉత్తర్వును రాష్ట్రపతి జారీచేశాడు. ఈ ఉత్తర్వు ప్రకారం కేంద్ర ప్రభుత్వ అధికారం కేవలం మూడు అంశాలకు మాత్రమే గాక కేంద్ర జాబితాలోని అన్ని అంశాలకూ వర్తిస్తుంది. ఈ ఉత్తర్వుకు కూడ 1963, 1964, 1965, 1966, 1972, 1974, 1986లలో సవరణలు చేసి కేంద్ర ప్రభుత్వం తన అధికారాలను విస్తృతమూ, పటిష్టమూ చేసుకుంది. ఈలోగా 1957 నవంబర్ 17న కాశ్మీర్ శాసన నిర్మాణసభ తన స్వంత రాజ్యాంగాన్ని ఆమోదించుకుంది. స్వంత రాజ్యాంగం ఆమోదించడంతో శాసన నిర్మాణ సభ పని తీరినట్టే గనుక అది రద్దయిపోయింది. భారత రాజ్యాంగంలోని 370 అధికరణం ప్రకారం రాష్ట్రపతి కాశ్మీర్ శాసన నిర్మాణ సభ సిఫారసు పైన మాత్రమే నిర్ణయాలు తీసుకోవలసి ఉంది గనుక 1957 తర్వాత రాజ్యాంగంలోని 370 అధికరణం ఒక చిక్కుముడి అయిపోయింది.

1956 మార్చ్ 29న లోక్‌సభలో ఒక ఉపన్యాసంలోను, ఏప్రిల్ 2న ఢిల్లీలో ఒక పత్రికా సమావేశంలోను నెహ్రూ స్పష్టంగా తాను ప్లెబిసైట్‌కు వ్యతిరేకమని చెప్పాడు. 1947 నుంచి చేస్తూ వచ్చిన వాగ్దానాలన్నిటినీ ఉల్లంఘిస్తూ, కాశ్మీర్‌లో అధికారంలో ఉన్న బక్షీ గులామ్ మహమ్మద్ ప్రభుత్వం తన మాట వింటుందనే నమ్మకంతో నెహ్రూ ప్లెబిసైట్‌ను వ్యతిరేకించాడు. అనుకున్నట్లుగానే కాశ్మీర్ శాసన నిర్మాణ సభ ఆమోదించిన రాజ్యాంగంలో మూడో అధికరణం 'జమ్ము - కాశ్మీర్ రాష్ట్రం భారత యూనియన్‌లో అంతర్భాగంగా ఉన్నది, ఉంటుంది' అని ప్రకటించారు.

భారత రాజ్యాంగంలో కాశ్మీర్‌కు కల్పించిన ఏకైక రక్షణ అయిన 370 అధికరణాన్ని పాలకవర్గాలు ఈ విధంగా బలహీనం చేశాయి. మరోవైపు రాష్ట్రంగా రాజ్యాంగ రచనను ఫార్సుగా మార్చివేశాయి. ఇక అప్పటిదాకా సాగుతూ వచ్చిన ప్రజాందోళనను, ఆ ఆందోళనకు నాయకత్వం వహించిన నేషనల్ కాన్ఫరెన్స్‌ను బలహీనం చేయడానికి ఢిల్లీ పాలకులు ఒకవైపు అణచివేత చర్యలను, మరోవైపు నాయకత్వాన్ని కొనివేయడాన్ని సాగించారు. షేక్ అబ్దుల్లాను మొదట ప్రివెంటివ్ డిటెన్షన్ కింద అరెస్ట్ చేసి 12 సంవత్సరాల పాటు జైలు పాలు చేశారు. 1964లో కొద్దికాలం పాటు విడుదల చేసి మళ్లీ 1965లో భారత రక్షణ నిబంధనల కింద అరెస్ట్ చేశారు. 1971లో రాష్ట్ర బహిష్కరణ విధించారు. చివరికి 1975 ఫిబ్రవరి 24న షేక్ అబ్దుల్లాకూ ఇందిరాగాంధీకీ మధ్య కుదిరిన ఒప్పందం ప్లెబిసైట్ డిమాండ్‌ను ఉపసంహరించుకుంటానని షేక్ అబ్దుల్లా ప్రకటించాడు. అయితే ఈ ఒప్పందం అమలులోకి రాలేదు. 1977 ఎన్నికలలో అధికారానికి వచ్చిన షేక్ అబ్దుల్లా రాష్ట్రంలో అమలవుతున్న అన్ని కేంద్ర చట్టాలను పునఃపరిశీలిస్తామని, రాష్ట్ర స్వయం ప్రతిపత్తిని కాపాడతామని అన్నాడు. అసలు ఎన్నికల ప్రణాళికలో 'నయా కాశ్మీర్' స్వప్నం గురించి మళ్లీ మాట్లాడాడు.

ఈలోగా 1953 తర్వాత రాష్ట్రంలోని ప్రజాందోళనను అణచివేసే క్రమంలో ఢిల్లీ ప్రభుత్వం అసలు రాజకీయ క్రమాన్నే రద్దు చేసింది, వికృతం చేసింది. 1953 తర్వాత, 1977 మినహా, కాశ్మీర్‌లో ఒక్క ఎన్నిక కూడ న్యాయంగా, సక్రమంగా జరగలేదు. ఒక్క ప్రభుత్వం కూడ ప్రజామోదంతో పూర్తికాలం పాలన జరపలేదు. షేక్ అబ్దుల్లా అరెస్టయిన తర్వాత అధికారానికి వచ్చిన బక్షీ గులామ్ మహమ్మద్ కూడ 1963లో బర్తరఫ్ అయి, అరెస్టయ్యాడు. తర్వాత షంసుద్దీన్ బర్తరఫ్ అయ్యాడు. తర్వాత సయ్యద్ మీర్ ఖాసిమ్ గద్దె ఎక్కాడు. ఈ ముఖ్యమంత్రుల మార్పులన్నీ కాశ్మీర్ మీద కేంద్ర ప్రభుత్వం మరిన్ని మరిన్ని అధికారాలు సంపాదించుకోవడానికి సాగించిన కుట్రలో భాగమే. 1982 వరకు అధికారంలో ఉన్న షేక్ అబ్దుల్లా తర్వాత ఆయన కొడుకు ఫరూఖ్ అబ్దుల్లా అధికారానికి వచ్చాడు. 1984 ఫరూఖ్ అబ్దుల్లాను కూడా బర్తరఫ్ చేసి గులాం మహమ్మద్ షా చేతికి అధికారం ఇచ్చారు. షా కూడ అధికారం పోగొట్టుకున్న తర్వాత హఠాత్తుగా రాజీవ్‌గాంధీకీ, ఫరూఖ్ అబ్దుల్లాకూ మధ్య మంతనాలు సాగి కాంగ్రెస్ (ఐ) కీ, నేషనల్ కాన్ఫరెన్స్‌కూ పొత్తు కుదిరింది. జాతి ఆకాంక్షలకు బూర్జువా ప్రజాస్వామిక శక్తులు నాయకత్వం వహించలేవు సరిగదా, ద్రోహం చేస్తాయనే మార్క్సిస్ట్ అవగాహనను, ఈ కాంగ్రెస్ - నేషనల్ కాన్ఫరెన్స్ మిశ్రమ ప్రభుత్వం రుజువు చేసింది. నేషనల్ కాన్ఫరెన్స్ ప్రజావిద్రోహ మార్గాన్ని చేపట్టి, రాష్ట్రంలో రాజకీయ క్రమమే విచ్ఛిన్నమైపోతున్న స్థితిని ప్రజలు సరిగానే అంచనా వేశారు. అందువల్లనే ఈ నాలుగు దశాబ్దాల లోను కాశ్మీర్‌లో ప్రజలు ఎన్నికలను పెద్ద ఎత్తున బహిష్కరిస్తూ వస్తున్నారు.

కాశ్మీరీల న్యాయమైన ఆకాంక్షలకు ఒకప్పుడు ప్రతినిధిగా నిలిచిన నేషనల్ కాన్ఫరెన్స్ సామరస్య రాజకీయాలకు బలియైపోయినా, ఎప్పటికప్పుడు కాశ్మీరీల సమరశీల శక్తి ఏదో ఒక నిర్మాణరూపం ధరిస్తూనే వస్తోంది. మొదటిసారి షేక్‌అబ్దుల్లాను అరెస్టు చేసిన తర్వాత ఆయన సలహా మీదనే ప్లెబిసైట్ ఫ్రంట్ నిర్మాణమయింది. 1975లో షేక్ అబ్దుల్లాకూ ఇందిరాగాంధీకీ మధ్య కుదిరిన ఒప్పందంలో షేక్ అబ్దుల్లా ప్లెబిసైట్ డిమాండ్‌ను వదులుకుంటానని అనడంతో ప్లెబిసైట్ ఫ్రంట్ రద్దయిపోయింది.

1965లో మఖ్బూల్ బట్, అమానుల్లాఖాన్‌ల నాయకత్వంలో జమ్ము-కాశ్మీర్ నేషనల్ లిబరేషన్ ఫ్రంట్ ఏర్పడింది. ఒక సి.ఐ.డి.

ఇన్‌స్పెక్టర్‌ను హత్య చేసిన నేరంపై మఖ్బూల్ బట్‌కు 1968లో మరణశిక్ష విధించారు. శిక్ష విధించబడిన తర్వాత మఖ్బూల్ బట్ శ్రీనగర్ సెంట్రల్ జైలు నుంచి తప్పించుకు పోయాడు. 1976లో ఆయన కాశ్మీర్ తిరిగి వచ్చి ఒక బ్యాంక్‌పై దాడి చేసి అరెస్టయ్యాడు. అప్పటినుంచి ఆయనపై ఉరిశిక్షను అమలు చేయకుండా ఎనిమిది సంవత్సరాల పాటు జైలులో ఉంచిన ప్రభుత్వం, ఇంగ్లండ్‌లో ఒక దౌత్యాధికారిని కె.ఎన్.ఎల్.ఎఫ్. కార్యకర్తలు చంపిన వారం రోజుల లోపే 1984 ఫిబ్రవరి 11న ఉరితీసింది.

కాశ్మీరీ జాతీయ ఆకాంక్షలకు నిర్మాణరూపం ఇవ్వడంలో మఖ్బూల్ బట్, అమానుల్లా ఖాన్‌ల కృషి గణనీయమైనది. ప్లెబిసైట్ ఫ్రంట్, కాశ్మీరీ వర్కర్స్ అసోసియేషన్, జమ్ము-కాశ్మీర్ లిబరేషన్ లీగ్, ముస్లిం కాన్ఫరెన్స్, పాకిస్తాన్ కాశ్మీరీ ఆర్గనైజేషన్, ఆజాద్ కాశ్మీర్ ఫ్రంట్ మొదలైన సంస్థలలోని క్రియాశీల కార్యకర్తలను వీళ్లు ఆకర్షించారు. ఇటువంటి శక్తులతో 1976-77ల్లో జమ్ము కాశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్ ఏర్పడింది. 1982 సెప్టెంబర్ 12న అమానుల్లా ఖాన్ నాయకత్వంలో భారతదేశానికి వ్యతిరేకంగా విస్తృత కార్యకలాపాల్ని కోరుతూ జె.కె.ఎల్.ఎఫ్. లో చీలిక వచ్చింది. ఇప్పుడు ఈ జె.కె.ఎల్.ఎఫ్. విస్తృత ప్రజా పునాదిని కలిగి ఉంది. ఇది కాక అనేక సంస్థలు ఉన్నప్పటికీ హిజ్బుల్ ముజాహిదీన్, పీపుల్స్ లీగ్, ఆ జమాయత్ - ఎ - ఇస్లామ్ వంటి సంస్థల పేర్లు ప్రముఖంగా వినిపిస్తున్నాయి. లక్ష్యాల ప్రకారంగా చూసినా, నిర్మాణ, పోరాట పద్ధతుల ప్రకారంగా చూసినా ఈ సంస్థల మధ్య తీవ్రమైన వ్యత్యాసాలు ఉన్నాయి. పాకిస్తాన్ ప్రోద్బలంతో పనిచేస్తున్న సంస్థలు, కాశ్మీర్‌ను పాకిస్తాన్‌తో విలీనం చేయాలనే కోరికతో పనిచేస్తున్న సంస్థలు లేకపోలేదు. ముస్లిం మతవాదంతో, హింసవాదంతో పనిచేస్తున్న సంస్థలు లేకపోలేదు. కాని అత్యధిక సంఖ్యాక కాశ్మీరీలకు ప్రాతినిధ్యం వహిస్తున్న జెకెఎల్ఎఫ్ కాశ్మీర్ విమోచన లక్ష్యంగా పెట్టుకుంది. రెండు దేశాల ఆక్రమణలోను ఉన్న కాశ్మీర్‌ను విముక్తం చేసి స్వతంత్ర కాశ్మీర్ ఏర్పరచాలనేది జెకెఎల్ఎఫ్ లక్ష్యం. జెకెఎల్ఎఫ్ మత వ్యవహారాలలో కూడ సెక్యులర్ వైఖరి తీసుకుంటున్నది. 'కాశ్మీరియత్‌గా' ప్రసిద్ధమైన కాశ్మీరీ సాంస్కృతిక జాతీయ ఐక్యతను అది పునాదిగా భావిస్తున్నది.

దశాబ్దాలుగా పేరుకుపోతూ వచ్చిన అసంతృప్తి, రాష్ట్రంలో ఆర్థిక వ్యవస్థలో తగిన అభివృద్ధి లేకపోవడం, జరిగిన అభివృద్ధి ఫలాలు కూడ కాశ్మీరీలకు అందకపోవడం, మొదలైన కారణాలు జాతీయాకాంక్షతో కలగలసి కాశ్మీరీ జాతీయ విముక్తి పోరాటం బలపడింది. సంచలనాత్మక సంఘటనలను మాత్రమే గుర్తించే ప్రచార సాధనాలకు 1989 నవంబర్ ఎన్నికల దాకా కాశ్మీరీల ఆందోళన పట్టనే లేదు. ఆ ఎన్నికలలో అనేక చోట్ల ఒక శాతం నుంచి పది శాతం వరకు మాత్రమే ఓట్లు పడ్డాయనే వార్త పత్రికలకెక్కింది. ఆ తర్వాత కేంద్ర హోం మంత్రి కూతురు రుబియా సయీద్‌ను జెకెఎల్ఎఫ్ కార్యకర్తలు కిడ్నాప్ చేయడంతో కాశ్మీర్ ఆందోళన పత్రికల్లో రోజువారీ వార్త అయింది. జెకెఎల్ఎఫ్ ఆందోళన వెనుక ఉన్న దశాబ్దాల చారిత్రక విషాదాన్ని పట్టించుకోకుండా, ప్రకటించకుండా ఉన్న ప్రచార సాధనాలన్నీ హఠాత్తుగా ప్రభుత్వ సమాచార పత్రాల్నే వార్తలుగా ప్రకటించడం మొదలుపెట్టాయి. కాశ్మీరీ ఆందోళనకారులను ఉగ్రవాదులుగా, పాకిస్తాన్ ఏజెంట్లుగా ముద్రవేసి ప్రచారం చేయడం మొదలుపెట్టాయి.

1990 జనవరి 19న జగ్‌మోహన్‌ను కాశ్మీర్ గవర్నర్‌గా నియమించడంతో ఈ దుష్ప్రచారం తారాస్థాయికి చేరింది. తనకు ఆర్.ఎస్.ఎస్. భావజాలంతో ఏకీభావం ఉందని బహిరంగంగా చెప్పుకునే జగ్‌మోహన్‌ను ఇటువంటి సున్నితమైన ప్రాంతానికి పంపడం ద్వారా కేంద్ర ప్రభుత్వం కాశ్మీర్ జాతీయాభిమానాన్ని తీవ్రంగా అవమాన పరిచింది. జగ్‌మోహన్ కాశ్మీర్‌కు వెళ్లిన వెంటనే ఆందోళనను మత కల్లోలంగా చిత్రించడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. కాశ్మీరీ పండితులకు, ముస్లింలకు మధ్య ఘర్షణలు జరుగుతున్నాయనే అబద్ధ ప్రచారం సాగించాడు. కాశ్మీర్ లోయలో హిందువులకు రక్షణ కల్పించలేమని, వాళ్లకు జమ్ముకు గాని, ఇతర రాష్ట్రాలకు గాని వెళ్లే ఏర్పాట్లు చేస్తామని ప్రచారం చేసి, మత విద్వేషాన్ని రెచ్చగొట్టాడు. జమ్ము వెళ్లిన హిందూ ఉద్యోగులకు పని చెయ్యకపోయినా జీతాలు ఇస్తూ శ్రీనగర్‌లోని ముస్లింల పట్ల వివక్ష ప్రదర్శించాడు. కాశ్మీర్ లోయను రోజుల తరబడి కర్ఫ్యూపాలు చేసి, పౌరజీవనాన్ని స్తంభింపచేశాడు. జగ్‌మోహన్ చర్యల వల్ల కాశ్మీరీల జాతీయాకాంక్షలు భారతదేశంలో నెరవేరవని, జాతీయ విముక్తి పోరాటం తీవ్రంగా సాగించవలసిందేనని రుజువైంది.

అయితే జాతీయ విముక్తి పోరాటాలు నిజంగా జాతి విముక్తిని సాధించి జాతీయాకాంక్షలను నెరవేర్చాలంటే కార్మికవర్గ పార్టీ నాయకత్వాన భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలుగా నిర్వహించబడక తప్పదు. బూర్జువా ప్రజాస్వామిక వర్గాల నాయకత్వంలో ఇటువంటి పోరాటాలు కొద్దికాలం పాటు సమరశీలంగా నడిచినట్టు కనిపించినప్పటికీ అంతిమంగా విద్రోహం పాలవుతాయనేది చరిత్ర చెప్పిన సత్యం. 1930ల్లో ప్రారంభమైన కాశ్మీరీ జాతీయ విముక్తి పోరాటానికి నాయకత్వం వహించడానికి ఐదు దశాబ్దాలు గడిచినప్పటికీ నిజమైన కార్మికవర్గ పార్టీ ఆవిర్భవించలేదు. భారత కమ్యూనిస్టు పార్టీ కాశ్మీర్ ప్రజాందోళన విషయంలో 1940ల్లో తీవ్రమైన చర్చలు చేసి, కాశ్మీరీల పోరాటాన్ని నిర్ద్వంద్వంగా సమర్థించింది గాని, 1950ల తర్వాత భారత కమ్యూనిస్టు పార్టీ, భారత కమ్యూనిస్టు (మార్క్సిస్ట్) రెండూ కాశ్మీరీలకు వ్యతిరేకంగా భారత పాలక వర్గాల బృందగానంలో గొంతు కలిపాయి.

1948లో భారత కమ్యూనిస్టు పార్టీ రెండో మహాసభ ఆమోదించిన రాజకీయ నివేదికలో కాశ్మీర్ ప్రజల స్వయం నిర్ణయాధికారాన్ని పూర్తిగా సమర్థించాయి. "... రెండు దేశాల సరిహద్దులలో ఉన్న రాష్ట్రాల గురించిన ఘర్షణలో ఇరుపక్షాలలోనూ ఉన్నది భూ ఆక్రమణ కోరికే తప్ప, ప్రగతిశీల అంశమేమీ కాదు. రెండు దేశాలూ వ్యక్తం చేస్తున్న ఈ భూదాహాన్ని ఇరుపక్షాల ఉన్న కార్మికవర్గమూ సమర్థించడానికి వీలులేదు. ఈ రెండు దేశాలూ కూడ ప్రజల స్వయం నిర్ణయాధికార హక్కును సమర్థించవు; ప్రజలు, రైతాంగం భూస్వామ్య పాలన నుంచి కోరుతున్న విముక్తిని సమర్థించవు" అని ఈ నివేదిక స్పష్టం చేసింది.

ఈ రెండో కాంగ్రెస్‌ను సమీక్షిస్తూ పొలిట్ బ్యూరో తయారుచేసిన నివేదికలో కాశ్మీర్ సమస్య ఇంకా వివరంగా ప్రస్తావనకు వచ్చింది. ఈ సమీక్ష ప్రకారం, కేంద్ర కమిటీ తరఫున భవానీసేన్ పాకిస్తాన్ సమస్యపై ఒక నివేదికను కాంగ్రెస్ ముందు చర్చకు ఉంచాడు. ఆ నివేదికలో, కాశ్మీర్‌లోకి భారత సైన్యాల ప్రవేశాన్ని పార్టీ ఆహ్వానించిందనీ, అది

పొరపాటనీ చెప్పాడు. భారతదేశం ప్రగతిశీలమైనదనీ, పాకిస్తాన్ అభివృద్ధి నిరోధకమైనదనీ తప్పుడు అవగాహనకు పార్టీ లోనయిందనీ భవానీసేన్ అన్నాడు. "మనకు సంబంధించి, విలీనమనేది ప్రశ్న కానేకాదు. అటువంటి విలీనమేదైనా భారత ప్రభుత్వానికి గానీ, పాకిస్తాన్ ప్రభుత్వానికి గానీ నిరంకుశ రాచరికంతో కలిసే పొత్తు మాత్రమే. ప్రజాస్వామిక విప్లవం సంపూర్ణంగా విజయవంతమయ్యేదాకా విలీనమయ్యే ప్రశ్నే తలెత్తదు. కష్టజీవులైన రైతాంగం భూమిని సాధించే దాకా, రాచరిక నిరంకుశత్వం రద్దయ్యేదాకా, అధికారం ప్రజల హస్తగతమయ్యే దాకా విలీనమనే ప్రశ్నేలేదు.." అని చెప్తూ, "నిజమైన మార్గాంతరాన్ని వీరోచిత తెలంగాణ రైతాంగం చూపుతున్నారు. ఈ సమస్యకు నిజమైన పరిష్కారం యుద్ధరంగం మీదనే ఉంటుంది. తెలంగాణలోని ప్రజాయోధులు, నిరంకుశత్వానికి వ్యతిరేకంగా వారి పోరాటం, సంస్థానాలలో ఏమి జరుగనున్నదో మాత్రమే కాదు, భారత దేశంలోనూ, పాకిస్తాన్‌లోనూ భవిష్యత్తులో ఏమి జరుగనున్నదో చూపుతున్నారు" అన్నాడు భవానీసేన్. "హైదరాబాద్‌కు, కాశ్మీర్‌కు మధ్య వ్యత్యాసం మన పాత అవగాహనకూ, కొత్త అవగాహనకూ మధ్య వ్యత్యాసమే... ఇప్పుడు సమస్యల్లా ప్రజలు హైదరాబాద్ మార్గాన్ని అనుసరిస్తారా, కాశ్మీర్ మార్గాన్ని అనుసరిస్తారా అనేదే. ప్రజలు హైదరాబాద్ మార్గాన్ని అనుసరించేలా చూడడం మన కర్తవ్యం" అన్నాడు భవానీసేన్.

అయితే ఈ స్పష్టమైన, సరైన అవగాహన పార్టీలో త్వరలోనే అంతరించి పోయింది. పై సమీక్ష 1948 మార్చ్‌లో వెలువడగా, ఆ సంవత్సరం డిసెంబర్‌లో పొలిట్‌బ్యూరోకూ, కేంద్ర కమిటీకీ ప్రధాన కార్యదర్శి ఇచ్చిన నివేదికలో ఈ అవగాహన మారిపోయింది. 'భారత ప్రజల ప్రజాస్వామిక విప్లవపోరాట వ్యూహం–ఎత్తుగడలు' పేరుతో ప్రసిద్ధమైన ఈ నివేదికలో, కాశ్మీర్ విషయమై అప్పటివరకు పార్టీ అనుసరించినది పెటీ బూర్జువా విప్లవ వాదమని, భారత, పాకిస్తాన్ రెంటినీ ఒకే గాటన కట్టివేయడం ద్వారా అది సామ్రాజ్యవాద కుట్రకు బలి అయిపోయిందని కొత్త సిద్ధాంతం తయారయింది. స్వతంత్ర కాశ్మీర్ అనే నినాదం ప్రస్తుత పరిస్థితుల్లో సామ్రాజ్యవాదానికి ఉపకరిస్తుందని అంటూ అసలు కాశ్మీరీ జాతి అనేదే లేదనే దాకా ఈ నివేదిక వెళ్లింది. ఇవాళ కాశ్మీరీలు స్వాతంత్ర్యాన్ని కోరితే రేపు గిల్గిత్‌లో కూడ స్వాతంత్ర్యాన్ని కోరరా అని ప్రశ్నించింది. ఈ తర్కమంతా నడిపి, అక్కడితో ఆగక, కాశ్మీరీలకు భారతదేశంలో కలిస్తే భారత కార్మికవర్గం అనే పెద్ద శక్తి అండ దొరుకు తుందని, పాకిస్తాన్‌లో కలిస్తే పాకిస్తాన్ కార్మిక వర్గం అంత శక్తివంతమైనది కాదుగదా అని కుతర్కమూ చేసింది. మొత్తం మీద ప్లెబిసైట్‌లో భారతదేశానికి అనుకూలంగా వోటు వెయ్యమని కాశ్మీరీలను కోరింది.

నిజానికి ఈ సమయం పార్టీలో సంక్షోభం సాగుతున్న సమయం. రెండో కాంగ్రెస్ నుంచి 1950 జనవరి దాకా బి.టి. రణదివె పార్టీ ప్రధాన కార్యదర్శిగా ఉన్నాడు. పైన చూసిన నివేదికలు, అవగాహనలు ఆకాలానివి. 1950 జూన్‌లో పార్టీ కేంద్ర కమిటీ పునర్నిర్మాణం జరిగింది. చంద్ర రాజేశ్వరరావు ప్రధాన కార్యదర్శిగా కొత్త కేంద్ర కమిటీ 1950 జూన్ 1న పార్టీ సభ్యులందరికీ ఒక లేఖ రాసింది. ఆ లేఖలో 'జాతుల సమస్యపై, పార్టీ రెండో కాంగ్రెస్ నాటి నుంచి పొలిట్ బ్యూరోలో జాతుల ఉద్యమాలను వ్యతిరేకించి, బడా బూర్జువా దురహంకారానికి సేవ చేసే అభివృద్ధి నిరోధక విధానం అమలవుతూ వచ్చింది' అంటూ కాశ్మీర్ భారతదేశంలో విలీనం కావడమే కమ్యూనిస్టు పార్టీ డిమాండ్ అనే తప్పుడు అవగాహన సాగిందని ఈ లేఖలో రాశారు.

1950 నాటికి కొనసాగుతూ వచ్చిన ఈ ఊగిసలాట త్వరలోనే అంతమయిపోయింది. జాతుల పోరాటాలను వ్యతిరేకించడంలో భారత కమ్యూనిస్టు పార్టీ పాలకవర్గ పార్టీలతో పోటీ పడే దశకు ఎదిగింది. భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్ట్) కూడ ఈ మూసలోనే జాతుల విముక్తి పోరాటాలను వ్యతిరేకిస్తూ వచ్చింది. ఈ రెండు పార్టీలూ కూడ కాశ్మీర్ సమస్యను కాశ్మీర్ ప్రజల సమస్యగా కాక భారతదేశానికి పాకిస్తాన్ సృష్టిస్తున్న సమస్యగానే ఇప్పటిదాకా చూస్తూ వస్తున్నాయి.

'జాతుల విముక్తిని కోరుతున్నాయి, దేశాలు స్వాతంత్ర్యాన్ని కోరుతున్నాయి' అని నిర్వచించదగిన యుగంలో పుట్టిన భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్ట్ – లెనినిస్ట్) తన కార్యక్రమంలో కాశ్మీర్ జాతి విముక్తి పోరాటాన్ని ప్రస్తావించింది. 1970 మేలో పార్టీ కాంగ్రెస్‌లో ఆమోదించిన కార్యక్రమంలో 'కాశ్మీరీలకు, నాగాలకు, మిజోలకు స్వయం నిర్ణయాధికార హక్కు నిరాకరించబడుతోంది' అని గుర్తించి, 'ప్రజల ప్రజాతంత్ర రాజ్యం భారతదేశాన్ని సమైక్య పరుస్తుంది, స్వయం నిర్ణయాధికార హక్కును గుర్తిస్తుంది' అని ప్రకటించారు.

కాశ్మీరీలు స్వయం నిర్ణయాధికారం కోసం పోరాడుతున్నారు. విస్తృతమైన ప్రజాపునాదితో, పటిష్టమైన నిర్మాణాలతో, క్రియాశీలకమైన పోరాట రూపాలతో కాశ్మీరీ జాతి విముక్తి పోరాటం నానాటికీ విజృంభిస్తున్నది. అయితే కార్మిక వర్గ పార్టీ నాయకత్వం కింద సాగనంత కాలం జాతి విముక్తి పోరాటాల భవిష్యత్తుకు హామీ లేదు. కాశ్మీరీ జాతి విముక్తి పోరాటం ఈ వాస్తవాన్ని గుర్తించాలని కోరుతూనే ఆ పోరాటం నూతన ప్రజాస్వామిక విప్లవంలో భాగం కావాలని ఆహ్వానిస్తూనే ఆ పోరాటకారులకు పూర్తి మద్దతు పలకడం, వారి మీద సాగుతున్న దమన కాండను ఖండించడం మన కర్తవ్యమవుతుంది.

**ముఖ్యమైన ఆధారాలు :**


కె.బి. కృష్ణ – ది ప్రాబ్లమ్ ఆఫ్ మైనారిటీస్, ఆర్, కమ్యూనల్ రిప్రజెంటేషన్ ఇన్ ఇండియా, జార్జి అలెన్ అండ్ అన్విన్, 1939

వి.పి. మీనన్ – ఇంటిగ్రేషన్ ఆఫ్ ది ఇండియన్ స్టేట్స్, ఓరియంట్ లాంగ్మన్ 1985 లారీ కాలిన్స్, డామినిక్ లాపియర్ – ఫ్రీడమ్ ఎట్ మిడ్‌నైట్, తరంగ్ పేపర్ బ్యాక్స్, 1982

ఫ్లారెన్స్ ఇలియట్ – ఎ డిక్షనరీ ఆఫ్ పాలిటిక్స్, పెంగ్విన్ బుక్స్, 1973; ఇ.ఎం.ఎస్. నంబూద్రిపాద్ – భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర, ప్రజాశక్తి బుక్ హౌస్, 1988

సుమిత్ సర్కార్ – మాడర్న్ ఇండియా, 1885–1947, మాక్మిలన్. 1983 ఎం.బి. రావు (సం.), డాక్యుమెంట్స్ ఆఫ్ ది కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియా 1948 – కా, పి.పి.ఎచ్., 1976

దుర్గాదాస్ బసు – ఇంట్రడక్షన్ టు ది కాన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇండియా, ప్రెంటిస్ హాల్, 1987

పి. ప్రసాదు – కన్నీటి ధారల్లో కాశ్మీర్ లోయ, ప్రజా పంథా ప్రచురణలు, 1990

*విద్యా సంస్థలూ, పరిశ్రమలూ, ప్రభుత్వాలూ ఉమ్మడిగా కలిసి పనిచేయడం ద్వారానే మానవ వనరుల అభివృద్ధి జరుగుతుందని అంటున్నారు* **డా. తడకమళ్ల శేఖర్**

# మానవ వనరుల వినియోగంతోనే ఆర్థికాభివృద్ధి

చారిత్రకంగా వివిధ దేశాల ఆర్థికాభివృద్ధి క్రమాన్ని పరిశీలిస్తే వేరు వేరు దశల్లో జరిగిందని తెలుస్తుంది. వ్యవసాయాన్ని యాంత్రీకరించడం దగ్గర నుంచి పారిశ్రామికీకరణ, స్వేచ్ఛా వాణిజ్య విధానం వరకు అన్నీ దశలవారీగానే జరిగాయి. ఫ్యాక్టరీల ప్రాతిపదికన నడిచే తక్కువ ప్రమాణాలు గల రంగాల నుంచి, పెట్టుబడి ఆధారంగా నడిచే మధ్యస్త ప్రమాణాలు గల రంగాల నుంచి, నవీకరణ ప్రాతిపదికన నడిచే ఉన్నత ప్రమాణాలు గల రంగాల వరకు మార్పు చెందుతూ ఆర్థిక వ్యవస్థలు పురోగమించాయి. జపాన్, కొరియా, తైవాన్ లాంటి అనేక దేశాలు ఇదే సూత్రంపై అభివృద్ధిని సాధించాయి. అయితే హార్వర్డ్ యూనివర్సిటీకి చెందిన మైకెల్ పోర్టర్ ప్రకారం అభివృద్ధి అనే భావన దేశ దేశానికీ మారుతుందనీ, ఆ దేశానికున్న బలాల చుట్టూ వనరులను సమీకరించడం ద్వారా అభివృద్ధి సాధ్యమవుతుందనీ అంటారు.

భారతదేశం ఇంకా అభివృద్ధి చెందుతున్న దేశాల జాబితాలోనే ఉంది. అనగా ఫ్యాక్టరీల ప్రాతిపదికతో పురోగమించే దశలోనే ఉంది. నిపుణులు సూచించినట్లుగా విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల ద్వారా ఉత్పత్తి రంగాన్ని వేగంగా సాంకేతిక పరిజ్ఞానంతో ఆధునీకరించి, నవీకరణ ప్రాతిపదికగా నడిచే రంగాలతోనే భారత్‌లో అభివృద్ధిని సాధించవచ్చు.

భారతదేశం అత్యధిక జనాభాతో ప్రపంచంలో రెండవ స్థానంలో ఉంది. 2008లో దేశ జనాభా నూట పద్నాలుగు కోట్లకు (113.9 కోట్లు) దగ్గరగా నమోదయినట్లు ప్రపంచబ్యాంక్‌కు చెందిన అభివృద్ధి సూచికలు ఇటీవల వెల్లడించాయి. ఇంత పెద్ద మొత్తంలో ఉన్న జనాభా సంక్షేమాన్ని కాపాడడం పెద్ద సవాలే అయినప్పటికీ ఈ జనాభా వల్ల అద్భుతమైన ప్రతిభ, నైపుణ్యం, శ్రామికశక్తిని పెంచుకోవడానికి మంచి అవకాశం కలుగుతుంది. భారత్ జనాభా లక్షణాలను పరిశీలిస్తే ఈ విషయం తెలుస్తుంది. దేశం మొత్తం జనాభాలో 15 సంవత్సరాల వయస్సు పైబడినవారు నలభై శాతం మంది ఉన్నారు. రానున్న పదిహేను సంవత్సరాలలో మరో 150 మిలియన్ ప్రజలు 15-59 వయో జాబితాలో చేరుతారు. దీనివల్ల మనదేశం మేధోసంపత్తి పరంగా అద్భుతమైన శక్తిమంతమైన దేశంగా తయారవుతుంది. అది ముఖ్యమైన మానవ వనరులను పటిష్టపరుచుకుంటూ, దేశ ప్రగతికి వినియోగించుకోవలసిన అవసరం ఉంది. సహజ అభివృద్ధికి, దేశాభివృద్ధికి మానవ వనరులు అత్యంత కీలకమైనవని చెప్పవచ్చు.

సరళీకృత ఆర్థిక విధానాల వల్ల మానవ వనరుల అభివృద్ధి, వినియోగం మరింత పెరగడానికి, ఉపయోగించే నైపుణ్యాలు పెరగడానికి అవకాశం ఏర్పడింది. కార్పొరేట్ రంగం, పారిశ్రామిక మేధావుల సహకారంతో నూతన తరానికి పరిజ్ఞానం, నైపుణ్యం విద్యామర్మాలను తెలియచెప్పే అవకాశాన్ని ఈ సరళీకృత ఆర్థిక విధానాలు కల్పించాయి. మానవ వనరుల అభివృద్ధి అనేది ప్రతి ఒక్కరు తమ శక్తిని గుర్తెరిగి పనిచేసేలా చేస్తుంది.

సాధారణంగా మానవ వనరుల అభివృద్ధిని ఉద్యోగం, కార్పొరేట్ దృష్టితో చూస్తాం. కానీ, మానవ వనరుల అభివృద్ధి అనేది సాంప్రదాయకమైన విద్య నుంచే ప్రారంభమై నిరంతరం కొనసాగవలసిన అవసరం ఉంది. మానవ వనరులను అభివృద్ధి చేయడానికి, వాటిని సమర్థవంతంగా వినియోగించడానికి ఉపయోగపడే ప్రధాన సాధనాలలో విద్య అనేది ముఖ్యమైనది. మన దేశంలో 2010-11 బడ్జెట్‌లో పాఠశాల, విద్యారంగానికి కేటాయించిన మొత్తం రు. 31,036 వేల కోట్లు. ఈ మొత్తం అనేది దేశంలో గల విస్తారమైన మానవ వనరుల అభివృద్ధికి ఎంత మాత్రం సరిపోదన్నది నిర్వివాదాంశం. అందువల్లనే మానవ వనరుల అవసరాలు తీర్చేందుకు పారిశ్రామికవేత్తల, మేధావుల సంయుక్త సహకారం అవసరం.

అభివృద్ధికి కారణమైన మూలకారకాలలో విద్య ప్రధానమైనది. విద్య మనిషిలోని ప్రతిభా, పాటవాలను, సామర్థ్యాన్ని వెలికితీసే టార్చ్‌లైట్ వంటిది. అందువల్ల విద్యను ప్రాథమికస్థాయి నుంచే పటిష్టపర్చవలసిన అవసరం ఉంది. ఏడు అభివృద్ధి చెందుతున్న దేశాలతో మనదేశ విద్యా విధానాన్ని పోల్చి చూస్తే నాణ్యమైన విద్యలో మనదేశం కింది నుంచి మూడవ స్థానంలో ఉందని 'అస్సోచామ్-ఎకోపల్స్' అనే సంస్థ చేసిన అధ్యయనంలో వెల్లడయింది. అంతేకాకుండా ప్రాథమిక, మాధ్యమిక విద్యలోను ఇతర అభివృద్ధి చెందుతున్న దేశాలతో పోలిస్తే బాగా వెనుకబడి ఉందని ఇదే సంస్థ వెల్లడించడం మరింత ఆందోళన కలిగించే అంశం.

మన దేశంలో ప్రాథమిక విద్యను మెరుగుపర్చడం కోసం, నిరక్షరాస్యతను నిర్మూలించడం కోసం మన ప్రభుత్వాలు నిర్బంధ, ఉచిత, ప్రాథమిక విద్యను అమలు చేస్తున్నాయి. అయినప్పటికీ ప్రాథమిక విద్యలో నమోదవుతున్న విద్యార్థుల శాతం అత్యంత తక్కువగా 98.1 శాతం మాత్రమే నమోదయింది. ఇదే శాతం బ్రెజిల్‌లో అత్యధికంగా 148.5 శాతం ఉంది. చైనాలో 116.2 శాతం, రష్యాలో 113.8 శాతం నమోదయ్యాయి. చివరికి ఇండోనేషియాలో 110.9 శాతం, దక్షిణాఫ్రికాలో 105.1 శాతం నమోదవుతూ భారత్ కంటే ముందంజలో నిలవడం మరింత ఆందోళన కలిగిస్తుంది.

అంతేకాకుండా మన దేశంలో మధ్యలో బడి మానివేసే డ్రాపవుట్స్ శాతం కూడా ఎక్కువగానే ఉందని చెప్పవచ్చు. భారత మానవ వనరుల మంత్రిత్వ శాఖ తెలిపిన గణాంకాల ప్రకారం 2006-07లో ప్రాథమిక విద్యలో 25 శాతం, మాధ్యమిక విద్యలో 46 శాతం, ఉన్నతవిద్య (సెకండరీ విద్య)లో 59.88 శాతం విద్యార్థులు మధ్యలోనే బడి మానేస్తున్నారు. వీరిలో బాలుర కంటే బాలికలే ఎక్కువగా ఉండడం విశేషం.

గ్రామీణ ప్రాంతాలలో డ్రాపవుట్స్ శాతం ఎక్కువగా ఉంది. ఇందుకు కారణాలు పరిశీలిస్తే - గ్రామీణ ప్రాంతాలలో శ్రామికులు వ్యవసాయ పనుల్లో నిమగ్నం కావడం, గ్రామీణ ప్రాంతాలలో ఉపాధ్యాయుల కొరత, గైర్హాజరీ, సిబ్బంది పరిజ్ఞానం లోపంతో ఉన్న పాఠశాలలు మొదలైనవి. ఈ పరిస్థితిని నివారించి విద్యా విధానాన్ని ప్రణాళికాబద్ధంగా పటిష్టపరచాలన్న ఉద్దేశ్యంతో విద్యా సంస్థల స్థాపనకు పలు పరిశ్రమలు ముందుకొస్తున్నాయి. ఈ దిశగా పలు కార్పొరేట్ సంస్థలు విద్యా సంస్థలను నెలకొల్పుతున్నాయి. అయితే వాటిని కేవలం పట్టణ ప్రాంతాలలోనే ఏర్పాటు చేస్తున్నారు. అందువల్ల గ్రామీణ ప్రాంతాలలో చదువుకునే పిల్లలు ముఖ్యంగా వారిలో మెజారిటీ విద్యార్థులు అణగారినవర్గాలకు చెందినవారు విద్యలో వెనుక బడుతున్నారు.

పైన పేర్కొన్న అసమానతలను నివారించడానికి పారిశ్రామిక వేత్తలు గ్రామీణ ప్రాంతాలలో ప్రభుత్వంతో సంయుక్తంగా కలిసి విద్యాలయాలను నెలకొల్పవలసిన అవసరం ఉంది. ఉన్న పాఠశాలలో కొన్నింటిని దత్తత తీసుకొని మెరుగుపర్చవలసి ఉంది. నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా తీర్చిదిద్దడం, పేదవర్గాల పిల్లలకు చేయూతనిచ్చి, వారిలోనున్న సామర్థ్యాలను వెలికితీస్తూ మానవ వనరులను పెంచ వలసిన అవసరం ఉంది. ఈ దిశగా ప్రభుత్వాలు, పరిశ్రమలు తమ కృషిని మరింత పెంచవలసిన అవసరం ఉంది.

ఇప్పటికీ టైమ్స్ ఆఫ్ ఇండియా అనే సంస్థ 'భారత్ కు బోధించు' (టీచ్ ఇండియా) అనే పేరుతో ఒక కార్యక్రమాన్ని చేపట్టగా, పిల్లలకు చదువు చెప్పేందుకు విద్యావంతులు తమ వంతుగా కొంత సమయాన్ని కేటాయిస్తున్నారు. దీనిని మిగిలిన పరిశ్రమలు కూడా ఆదర్శంగా తీసుకొని మరింత అభివృద్ధి చేయవలసిన అవసరం ఉంది.

మానవ వనరులను అభివృద్ధి చేసే క్రమంలో మరొక ముఖ్యాంశం ఏమంటే, వృత్తి విద్యను అభివృద్ధి చేయడం. వృత్తి విద్య వల్ల నైపుణ్యం లేనివారిని నిపుణులుగా తీర్చిదిద్దడమే కాక ఉపాధి అవకాశాల కల్పనకు కూడా వృత్తి విద్య ఉపకరిస్తుంది. ప్రాథమిక స్థాయి నుంచే సాంకేతిక పరిజ్ఞానానికి అనుగుణంగా పాఠ్య ప్రణాళికలు తయారు చేయాలి. భవిష్యత్తులో వృత్తి విద్యా కోర్సులకు పెద్ద మొత్తంలో పెట్టుబడులు సమకూర్చాలి. ఉపాధి అవకాశాలు మెండుగా ఉన్న మేనేజ్‌మెంట్, ఇంజనీరింగ్, ఇతర వృత్తి విద్యాకోర్సులను అభివృద్ధి చేయవలసిన అవసరం ఉంది. ప్రతి సంవత్సరం లక్షలమంది ఇంజనీరింగ్ పట్టభద్రులు తయారవుతున్నప్పటికీ వారిలో 25 శాతం మాత్రమే ఉద్యోగార్హులని ఇన్ఫోసిస్ టెక్నాలజీస్ ఛైర్మన్ నారాయణ మూర్తి వ్యాఖ్యానించారు.

అందువల్ల నైపుణ్యం లేనివారికి, నిరుద్యోగులుగా ఉన్నవారికి అదనంగా శిక్షణ ఇవ్వవలసి ఉంటుంది. అందువల్ల పాఠ్యాంశాల రూప కల్పనలో ప్రాథమిక శిక్షణ, సైద్ధాంతిక పరిజ్ఞానం మొదలైన అంశాలను మెరుగుపర్చినట్లయితే నైపుణ్యంగల, సామర్థ్యాలుగల పట్టభద్రులు తయారయ్యే అవకాశం ఉంది. ఈ విధంగా పరిశ్రమల, విద్యాసంస్థల, ప్రభుత్వాల ఉమ్మడి కృషి ఫలితంగా మనదేశంలో మానవ వనరులను అభివృద్ధి చేసుకోవచ్చు. ఇందుకు అవసరమైన సమగ్రమైన విధానాన్ని రూపొందించుకొని అధిక జనాభాగల మన దేశంలో ప్రజలలో ఉన్న మానవ వనరులను సమగ్రంగా వినియోగించుకొని అభివృద్ధి సాధించడం పెద్ద కష్టమైన పనేమీ కాదు. అందుకు ప్రభుత్వాల చిత్తశుద్ధి, పారిశ్రామికవేత్తల తోడ్పాటు అవసరం.

*(రచయిత లెక్చరర్)*

### ప్రజాసాహితి కార్యాలయం ఏర్పాటుకు సహకరిద్దాం

గత ముప్పై నాలుగు సంవత్సరాలుగా ప్రజా సంస్కృతికి నిబద్ధమై సాగుతున్న సాహిత్య మాసపత్రిక 'ప్రజాసాహితి'. అంకితభావంతో కూడిన నిమగ్నత వల్లనే ఇది క్రమబద్ధంగా నెల నెలా ప్రచురితమౌతోంది. ప్రగతిశీల దృక్పథంతో, బాధ్యతతో కూడిన కర్తవ్యదీక్షతో ఇది నడుస్తోంది. ఇప్పటికి వెలువడిన 331 సంచికలలో 40 ప్రత్యేక సంచికలూ, 60 విశేష సంచికలూ ఉన్నాయి.

'ప్రజాసాహితి' సొంత కార్యాలయం ఏర్పర్చుకోడానికి నిర్ణయించడం మనమందరం సంతోషించదగ్గ విషయం. విజయవాడలో ఏర్పాటు చేసుకోబోతున్న ఈ కార్యాలయం కోసం రచయితలుగా, కళాకారులుగా, సాహిత్యాభిమానులుగా తగిన చేయూతనందించడం మనందరి కనీస కర్తవ్యం. ప్రజాసాహిత్యాభినందరూ ఈ కార్యాలయ నిర్మాణానికి తగు విధంగా సహకరించవలసిందిగా కోరుతున్నాం.

ఇట్లు :

సామల సదాశివ, త్రిపురనేని మహారథి, శీలా వీర్రాజు, కొలకలూరి ఇనాక్, కాకరాల, ప్రొ. వకుళాభరణం రామకృష్ణ, అంపశయ్య నవీన్, ప్రొ. కె.ఆర్. చౌదరి, గూడ శ్రీరాములు (భిలాయ్), కడియాల రామమోహనరాయ్, విరియాల లక్ష్మీపతి, బి.ఎ.వి. రామారావునాయుడు, సింగమనేని నారాయణ, డా. కేశవరెడ్డి, కొడవటిగంటి రోహిణీప్రసాద్, సింగంపల్లి అశోక్‌కుమార్, ప్రొ. జయధీర్ తిరుమలరావు, సి.ఎచ్. మధు, ప్రతిమ, మోహన్, టి.వి., పాపినేని శివశంకర్, కాత్యాయని విద్మహే, రావు కృష్ణారావు, భూపాల్, ప్రొ. హయాత్, అట్లూరి మురళి, కాత్యాయని, మేడిపల్లి రవికుమార్, సయ్యద్ నశీర్ అహ్మద్, చల్లపల్లి స్వరూపరాణి, మచ్చ ప్రభాకర్ (ముంబాయి), దార్ల వెంకటేశ్వరరావు, కె.పి. అశోక్‌కుమార్

ప్రకటన విడుదల చేసినవారు : **కొత్తపల్లి రవిబాబు,** ప్రధాన సంపాదకుడు, ప్రజాసాహితి; **దివికుమార్,** ప్రధాన కార్యదర్శి, జనసాహితి

ఆన్‌లైన్‌లో విరాళాలు పంపడానికి బ్యాంక్ అకౌంట్ నంబర్ - **0680101004936, కెనరా బ్యాంక్, గవర్నరుపేట, విజయవాడ**
ఆన్‌లైన్ వివరాలు పంపినవారు ఆ విషయం వెంటనే కొత్తపల్లి రవిబాబు 9490196890కి ఫోన్ చేసి తెలియజేయండి

మనియార్డర్లు, చెక్కులు, డ్రాఫ్టులు ప్రజాసాహితి పేరుతో పంపించవలసిన చిరునామా
**ప్రజాసాహితి**
28-9-1, జలీల్‌వీధి,
కార్ల్ మార్క్స్ రోడ్డు, విజయవాడ - 520001

*ఆదివాసులనూ, వారి సాంస్కృతిక వైవిధ్యాన్నీ, పర్యావరణాన్నీ కాపాడాల్సిన బాధ్యత మనందరిపైన ఉందని అంటున్నారు* **కొంగర కృష్ణప్రియ**

# గిరిజనుల సామాజిక, ఆర్థిక సంస్కృతులు

**భా**రతదేశం సువిశాల, సహజ ఆర్థిక వనరులు కలిగిన, భిన్న సాంప్రదాయాలు మిళితమైన దేశం. అయితే ఎన్నో రకాల సంస్కృతి, సాంప్రదాయాలు కలిగిన భారతదేశంలో గిరిజనుల సంస్కృతీ, సాంప్రదాయాలకు ఒక విశిష్ట స్థానం ఉంది. గిరిజనులు లేదా ఆదివాసులు సర్వసాధారణంగా అడవులలో, కొండలలో నివసిస్తుంటారు. అందువలన వారి జీవన విధానం ప్రకృతిలో అంతర్భాగంగా ఉంటుంది. ప్రకృతిలో సాధారణ జీవితాన్ని గడిపే గిరిజనులు అభివృద్ధి కార్యకలాపాల వలన తమ సాధారణ జీవితంలోనే ఎన్నో సమస్యలను ఎదుర్కొంటున్నారు. అసలు 'గిరిజనులు అంటే ఎవరు? వారి సంస్కృతి, సాంప్రదాయాలేమిటి? వారికి, ప్రకృతికి విడదీయరాని సంబంధం ఎలా ఉంది? అభివృద్ధి కార్యక్రమాలు వారికి ఎందుకు నష్టం కలిగిస్తున్నాయి? ఇలా గిరిజనులకు సంబంధించిన కొన్ని జీవన సామాజిక విషయాలను తెలియజేయడం ఈ వ్యాసం ముఖ్య ఉద్దేశం.

ప్రపంచం అంతటా బహుళ దేశాలు – జాతులూ, వేష, భాష, ఆచార వ్యవహారాలూ, అలవాట్లూ ఉన్నాయి. అయితే ఏ జాతికా జాతిని, ఏ భాషకా భాషను 'తెగ' అని అనవచ్చు. కానీ అలా కాకుండా వారి సామాజిక, ఆర్థిక పరిస్థితులను బట్టి, వెనుకబాటుతనాన్ని బట్టి, అభివృద్ధి ఫలాలు అందకుండా ఉన్నవారిని 'ట్రైబ్స్'గా గుర్తించడం జరిగింది.

మొట్టమొదటిసారిగా భారత రాజ్యాంగం ప్రకారం ఆర్టికల్ 342 'షెడ్యూల్డ్ ట్రైబ్' అనే పదాన్ని ఉచ్చరించింది. ఏది ఏమైనప్పటికీ ఈ ట్రైబ్ అనే పదం భారత ప్రభుత్వం రాజ్యాంగంలో పొందుపరచలేదు. ఇది కేవలం పాలకులు వాడే పదజాలం మాత్రమే. ఒక సమూహానికి లేక ఒక సమాజ నిర్మితికి ఇచ్చిన పదం మాత్రం కాదు. అయితే సామాజిక, ఆర్థిక సంస్కృతులలో సంస్కృతి వైవిధ్యం ఉన్న ప్రదేశాలలో అభివృద్ధికి అతి దూరంగా ఉన్న సమూహాలను గుర్తించి తయారు చేసిన పట్టిక మాత్రమే. అయితే వీటిని గుర్తించడానికి గానూ ప్రాదేశిక వెనుకబడిన తనం, వెనుకబడిన ప్రదేశాలలో నివాసాన్ని నెలకొల్పుకున్న ప్రజల, వివిధ జాతుల, సంస్కృతులు, ఆదిమ ఆర్థిక వ్యవస్థలు, ఒక జాతికి, ఇంకొక జాతికి ఉన్న భిన్నమైన అలవాట్లు అతి ముఖ్యంగా గమనించవలసింది ఏమనగా వారి జీవన సామాజిక, ఆర్థిక పరిస్థితులు. వీటన్నిటినీ గుర్తించే వీరిని 'గిరిజనుల జాబితా' లేక 'షెడ్యూల్డ్ ట్రైబ్స్' లేక అనుశుచిత్ జనజాతి అని వివరించడం జరిగింది.

అసలు గిరిజనులు అంటే ఎవరు? గిరి అంటే కొండ, జనులు అంటే ప్రజలు. కొండల్లో నివసించే ప్రజలు లేక ఆదివాసులు లేక ఆదిమ జాతి ప్రజలు అని అర్థం. అంతే కాకుండా, వీరిని బన్ వాసిస్ అనీ, కాస్ట్ ఆఫ్ ఫారెస్ట్ (వన్యజాతి ప్రజలు) అనీ, పహారీ పీపుల్ (కొండ ప్రజలు) అనీ కూడా అంటారు. అనగా సాధారణ జన జీవన స్రవంతితో సమానంగా అభివృద్ధి చెందక పోవడం మనం గమనించవచ్చు.

గిరిజనులు ఒకేరకమైన భాషను మాట్లాడుతూ, ఒకేరకమైన పద్ధతులను, అలవాట్లను పాటిస్తూ ఒక సమూహంగా ఏర్పడతారు. ఈ విధంగా ఏర్పడిన సమూహాన్ని తెగ అని అంటారు. వీరు అభివృద్ధి అంచుల మీద మార్జినలైజ్డ్ పీపుల్‌గా, సెగ్రిగేటెడ్ పీపుల్‌గా, ఐసోలేటెడ్ కమ్యూనిటీస్‌గా రిమోట్ ఏరియాలో నివసిస్తుంటారు. అంతర్జాతీయ గిరిజనులపై అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టిన సంస్థ (ఇంటర్నేషనల్ వర్క్ గ్రూప్ ఫర్ ఇండీజినస్ అఫైర్స్ –ఐ.డబ్ల్యు.జి.ఐ.ఎ.) లేటెస్ట్ రిపోర్ట్ – మే 2008 ప్రకారం భారతదేశంలో 635 తెగలు ఉన్నట్లుగా అంచనా వేశారు. కానీ 461 తెగలను మాత్రమే షెడ్యూల్డ్ తెగలుగా గుర్తించారు. భారతదేశంలో ఎనిమిది కోట్ల 43 లక్షల ఆదివాసీ జనాభా ఉంది.

ఈ తెగలను ఒక్కో ప్రదేశంలో ఒక్కో పేర్లతో పిలుస్తుంటారు. ఉదాహరణకు, ఆంధ్రప్రదేశ్‌లో యానాది, భిల్, చెంచు అనీ, నాగాల్యాండ్‌లో నాగా, సిటెంగ్ అనీ, రాజస్థాన్‌లో గామిత్, ఖతోడి అనీ, జమ్ము–కాశ్మీర్‌లో లడఖ్, గుజ్జర్ అనీ ఇంకా చాలా రకాల పేర్లతో వీరిని పిలుస్తుంటారు.

అలాగే ఈశాన్య రాష్ట్రాలయిన నాగాలాండ్, త్రిపుర, మణిపూర్, మిజోరాం, మేఘాలయ, అస్సాంలలో అధిక అక్షరాస్యత కలిగిన ప్రజలు ఉన్నారు. వీరిని 'క్రిస్టియన్ ట్రైబ్స్' అని అంటారు. అలాగే గుజరాత్ నుండి నార్త్ ఈస్ట్ వరకు ఉన్నటువంటి రాష్ట్రాలలో ఎక్కువ మంది గిరిజనులు నివసిస్తున్నారు. ఈ ప్రాంతాన్ని 'సెంట్రల్ ట్రైబల్ బెల్ట్' అని కొంతమంది అంటారు. సుమారు 85 శాతం గిరిజనులు ఈ ప్రాంతంలోనే జీవిస్తున్నారు. వీరు ఇంకా అడవులలోనే ఉంటూ ఎటువంటి అభివృద్ధి ఫలాలు అందని పరిస్థితులలో ఉన్నారు.

గిరిజనులు అడవులతో, ప్రకృతితో కలిసిపోయి ఎర్త్ బేస్డ్ పీపుల్‌గా, వాటర్ బేస్డ్ పీపుల్‌గా ప్రకృతితో మిళితమై ప్రత్యక్ష, పరోక్ష అవినాభావ సంబంధం కలిగి ఉంటారు. అడవులలో దొరికే ఫలాలు, కూరగాయలు తింటూ జీవనాన్ని సాగిస్తుంటారు. ఇటువంటి గిరిజన ప్రజల జీవన విధానాన్ని ప్రభావితం చేసే సామాజిక, ఆర్థిక సంస్కృతుల గురించి తెలుసుకున్నట్లైతే –

ఆదివాసీ ప్రజల సామాజిక జీవన పరిస్థితులలో భాగమైన మత పద్ధతులను గమనించి, వీరు అనేక రకాల మతపద్ధతులు పాటిస్తుంటారు. ఒక తెగ మత పద్ధతులకు, ఇంకొక తెగ మత పద్ధతులకు చాలా భిన్నత్వం కనిపిస్తుంది. ఒక తెగ పద్ధతులను ఇంకొక తెగ పాటించాల్సిన అవసరం లేదు. కానీ ఒకే తెగలోని వారందరూ మాత్రం కచ్చితంగా ఒకే రకమైన

పద్ధతులను పాటించవలసి ఉంటుంది. కొన్ని తెగలలో ఎక్కువగా ప్రకృతి ఆరాధన ఉంటుంది. అనగా ప్రకృతిలో భాగమైన నదుల్లోనూ, రాళ్లలోనూ ప్రతిచోటా కూడా దేవతలు, దెయ్యాలు ఉంటాయని వీరు నమ్ముతుంటారు. వీటి వలన ఎటువంటి చెడు జరగకుండా ఉండడం కోసం ప్రకృతిని ఆరాధిస్తుంటారు. కొన్ని తెగలలో సూర్య, చంద్రులని పూజిస్తుంటారు. గిరిజన ప్రజలకు గిరిజనేతరులతో సంబంధాలు ఏర్పడడం వలన వారి మత పద్ధతులలో కొన్ని మార్పులు సంభవించాయి. హిందూ మతం, క్రైస్తవ మతం అమలులోకి వచ్చాయి. ఈ మతాలు గిరిజన ప్రజల జీవనాన్ని చాలా వరకు ప్రభావితం చేశాయి. కొంతమంది గిరిజనులు క్రైస్తవ మత పద్ధతులను, మరికొంతమంది హిందూ మత పద్ధతులను ఆచరించడం మొదలుపెట్టారు. తెగల ప్రజలు హిందూ, క్రైస్తవ మతాలను విశ్వసించినప్పటికీ వారి మత పద్ధతులను మాత్రం మరిచిపోలేదు. గిరిజన సమాజాలలో పూనకం (షమానిజం) ఎక్కువగా కనిపిస్తుంటుంది. కొన్ని సమయాలలో కొన్ని మానవాతీత శక్తులు కొంత మంది వ్యక్తులలో ప్రవేశించి, కొన్ని పనులు చేస్తాయని వీరు నమ్ముతారు. ఈ మానవాతీత శక్తులు తరచూ ఆవహించే వారిని గణాచారి (షమన్) అని అంటారు. ఈ గణాచారి వ్యవస్థ దాదాపు భారతదేశంలోని అన్ని తెగలలోనూ కనిపిస్తుంటుంది.

అదే విధంగా వివాహ పద్ధతులను గమనిస్తే, భారతదేశంలోని అన్ని గిరిజన తెగలలోనూ వివాహం అనేది ఒక ఆచారంగా, సాంప్రదాయంగా పరిగణించబడుతుంది. అన్ని తెగలు ఆచరించే అలవాట్లు, పద్ధతులు వేరుగా ఉన్నప్పటికీ వివాహ వ్యవస్థ మాత్రం ప్రతి తెగలోనూ కనిపిస్తుంది. కానీ వివాహ పద్ధతులు మాత్రం ఒక్కో తెగలో ఒక్కో రకంగా ఉంటాయి.

వీరు ఆచరించే వివాహ పద్ధతులు రెండు రకాలు:

1) అంతర్వివాహం; 2) బహిర్వివాహం.

అంతర్వివాహ పద్ధతిని గమనిస్తే, వివాహం చేసుకోదలచిన వధూ వరులిద్దరూ ఒకే తెగకు సంబంధించిన వారై ఉండాలి. ఒకే తెగలోని వ్యక్తులను వివాహం చేసుకోవడం వలన, ఆ తెగ విచ్ఛిన్నం కాకుండా ఉంటుంది. ఒక తెగలోని పద్ధతులు, అలవాట్లు, వేరొక తెగలోని పద్ధతులు, అలవాట్లలో చాలా మార్పులు ఉంటాయి. కాబట్టి ఒక తెగలోని వారు ఇంకొక తెగలో నివసించడం కష్ట సాధ్యమవుతుంది. అందువలన భారతదేశంలోని గిరిజన తెగలు ఈ పద్ధతిని ఎక్కువగా పాటిస్తుంటాయి.

బహిర్వివాహ పద్ధతిని గమనించినట్లైతే, వివాహం చేసుకోదలచిన వధూ వరులిద్దరూ వేరు వేరు తెగలకు చెందిన వారై ఉండాలి. ఈ పద్ధతి గిరిజన తెగలలోనే కాకుండా సాధారణ సమాజాలలో కూడా మనకు కనిపిస్తుంటుంది.

అదే విధంగా కుటుంబం – బంధుత్వం మనిషి సత్ప్రవర్తనను అలవర్చుకునేందుకు చాలా అవసరం. కుటుంబ సభ్యుల సంఖ్యను బట్టి కుటుంబాలను రెండు రకాలుగా విభజించవచ్చు.

1. సరళ కుటుంబం; 2. ఉమ్మడి కుటుంబం

సరళ కుటుంబంలో భార్య, భర్త, వారి పిల్లలు ఉంటారు.

ఉమ్మడి కుటుంబంలో భార్య, భర్త, పిల్లలకు తోడుగా బాగా దగ్గరి బంధువులు కూడా కలిసినట్లయితే అది ఉమ్మడి కుటుంబం అవుతుంది.

కొన్ని తెగలలో బహు భార్యత్వ కుటుంబాలు (పాలిగమోస్ ఫామిలీ) ఉంటాయి. అనగా ఒకే భర్తకి ఎంతమంది భార్యలైనా ఉండవచ్చు. మరికొన్ని తెగలలో బహు భర్తృత్వ కుటుంబాలు (పాలియన్డ్రొస్ ఫామిలీ) ఉంటాయి. అనగా ఒకే స్త్రీకి ఎక్కువ మంది భర్తలుంటారు.

కొన్ని తెగలలో కుటుంబ యజమాని తల్లి ఉంటుంది. ఇటువంటి కుటుంబ వ్యవస్థని 'మాతృస్వామిక కుటుంబం' (మట్రియార్కల్ ఫామిలీ) అని అంటారు. మరికొన్ని తెగలలో కుటుంబ యజమాని తండ్రి ఉంటాడు. ఇటువంటి కుటుంబ వ్యవస్థని పితృస్వామిక కుటుంబం (పాట్రియార్కల్ ఫామిలీ) అని అంటారు. ఇలా సహకరించుకునే బంధువర్గాన్నే బంధు సమూహం అని అంటారు.

అలాగే గిరిజనుల జీవితాలలో కళ అనేది ఒక భాగంగా ఉంటుంది. కానీ నాగరికత పేరుతో కొత్త జీవనరీతులు గిరిజనులలో ప్రవేశించడం వలన వారి జీవితం స్తంభించిపోయింది. పారిశ్రామిక ప్రగతి వలన గిరిజనుల ఆట, పాట, కళలు తమ ప్రాభవాన్ని, స్వచ్ఛతను కోల్పోతున్నాయి.

ఈ విధమైన సామాజిక అంశాలన్నీ ప్రతి తెగలో ఉన్నప్పటికీ 'ఎవరీ ట్రైబ్ ఈజ్ డిఫరెంట్ అండ్ ఎవరీ ట్రైబ్ ఈజ్ యూనీక్' అనేది ప్రతి తెగలోనూ ఉంటుంది.

**ఆర్థిక జీవన పరిస్థితులు**

మిగులు ఆర్థిక వ్యవస్థ ఏర్పడక ముందు 'ఉత్పత్తి–వినియోగం' ఉండేది. కానీ ఆధునిక ప్రపంచంలో సంబంధాలు పెరిగి మిగులు ఆర్థిక వ్యవస్థ ఏర్పడినప్పటి నుండీ 'ఉత్పత్తి–వినియోగం–పంపిణీ' అమలులోకి వచ్చి ఆర్థిక తేడాలు ఏర్పడ్డాయి. పూర్వకాలంలో గిరిజన తెగలలో ద్రవ్యం ఉండేది కాదు. అప్పటి వరకు వారి ఆర్థిక వ్యవహారాలన్నీ ద్రవ్యం లేకుండానే వస్తు మార్పిడి పద్ధతి (బార్టర్ ఎకనామిక్ సిస్టం) ద్వారానే జరిగేవి. కానీ తర్వాత ఆధునిక ప్రపంచంతో సంబంధాలు ఏర్పడడంతో ద్రవ్య ఆర్థిక వ్యవస్థ (మానిటరైజ్ద్ ఎకానమీ) ఏర్పడింది.

మొదటగా మానవ సమాజం ఆవిర్భవించిన సందర్భంలో ఆహార సంగ్రాహక వ్యవస్థ ఉండేది. అది అభివృద్ధి చెందుతూ ఆహార సేకరణ దశకు మార్పు చెందింది. ఆ దశలో ద్రవీకరణ, యంత్రీకరణ లాభాలు లేని వ్యవస్థగా కొనసాగుతూ కుల, జాతి, లింగ, వర్ణ భేదాలు లేకుండా ఉండేది. తర్వాత ఈ దశ నుండి వేటాడే దశకు చేరుకున్నారు. ఆహార సేకరణ, వేటాడే దశ నుండి క్రమక్రమంగా అభివృద్ధి చెందుతూ పశుపోషణ, వ్యవసాయం నేర్చుకున్నారు. వ్యవసాయం అభివృద్ధి చెందడానికి చాలా సమయం పట్టింది.

గిరిజనుల వ్యవసాయం రెండు పద్ధతులలో ఉంటుంది – 1) పోడు వ్యవసాయం; 2) స్థిర వ్యవసాయం.

అడవులలో, కొండలలో నివసించే ప్రజలు ఎక్కువగా పోడు వ్యవసాయ పద్ధతి ద్వారానే వ్యవసాయం చేస్తుంటారు. వారు నివసిస్తున్న ప్రాంతాలలోనే కొంత భూమిని వ్యవసాయానికి అనుకూలంగా మార్చుకుంటారు. అక్కడ కొంతకాలం పంటలు పండించిన తర్వాత ఆ భూమిలో భూసారం తగ్గిపోవడంతో మరల వేరే స్థలంలో వ్యవసాయం చేస్తారు. దీన్నే పోడు వ్యవసాయం అంటారు. అదే విధంగా పోడు వ్యవసాయం చేసే భూమిని మార్చకుండా ఎన్ని సంవత్సరాలు అయినా అక్కడే వ్యవసాయం చేయడాన్ని స్థిర వ్యవసాయం అంటారు. భారతీయ గిరిజన తెగల్లోని పోడు వ్యవసాయం చేసే కొన్ని తెగలు స్థిర వ్యవసాయం చేయడానికి మార్పు చెందాయి. స్థిర వ్యవసాయం వలన సంచార జీవనం నుండి మార్పు చెంది స్థిర నివాసాలు ఏర్పడ్డాయి.

గిరిజన ప్రాంత ప్రజలు అడవులలో నివసిస్తూ, అటవీ భూములను వారి సొంత భూములుగా చేసుకొని వ్యవసాయం చేస్తూ జీవిస్తుంటారు. కానీ గిరిజనేతరులతో వీరికి కొన్ని సంబంధాలు ఏర్పడడం వలన గిరిజనేతరులు ఏజెన్సీ ప్రాంతాలలో ఉన్న భూములలో 48 శాతం భూమిని ఆక్రమించుకొన్నారు. దానితో గిరిజనుల ఆర్థిక జీవనం అనేక కష్ట, నష్టాలకు గురవుతోంది. వీరి ఆర్థికస్థితులు మెరుగ్గా ఉండక పోవడం వలన

వడ్డీవ్యాపారుల దగ్గర అప్పులు చేసేవారు. వీరు గిరిజనులను మోసం చేస్తూ ఎక్కువ డబ్బు వసూలు చేస్తుండేవారు. దాంతో వీరి రుణ భారం పెరిగిపోయేది. ఎప్పటికీ రుణం తీర్చలేని పరిస్థితి ఏర్పడేది. దాంతో వ్యాపారులు రుణభారం కింద గిరిజనుల భూములను సొంతం చేసుకునేవారు. గిరిజన ప్రజలు చదువురాని వారు కావడం వలన వడ్డీ వ్యాపారులు దొంగ లెక్కలురాసి వారిని మోసం చేసేవారు. రుణం అనేది వీరి ఆర్థిక జీవనంలో ఒక భారం అయిపోయింది. వడ్డీ వ్యాపారులకు రుణం చెల్లించకపోతే, వారిచేత వెట్టి చాకిరీ చేయించుకునేవారు. తద్వారా గిరిజన ప్రజలు 'బానిస'లుగా జీవించవలసి వచ్చేది.

దేశం నాగరికంగా అభివృద్ధి చెందడం కోసం, పరిశ్రమలు నిర్మించడం కోసం అడవులను నరికివేయడం వలన అడవి మీద ఆధారపడి జీవించే గిరిజన తెగల జీవనం దెబ్బతింది. అటవీ సంపదను అంతా కూడా పారిశ్రామికవేత్తలు మార్క్స్ చెప్పిన శ్రమ దోపిడీ విధానాన్ని అవలంబిస్తూ పట్టణ కేంద్రాలకు తరలించుకు పోతూనే ఉన్నారు. బహిర్గత శక్తులు అయిన అప్పటి వలసవాద దేశాలు, ఇప్పటి సామ్రాజ్యవాద శక్తులు గుత్తపెట్టుబడి రూపాన అటవీ సంపదను దోచుకుంటున్నాయి. అప్పటి నుండి ఇప్పటి వరకు ఇదే కొనసాగుతోంది. వీరందరూ కలిసి గిరిజనులను ప్రకృతి నుండి వేరు చేసి నిరాధారులుగా, నివాస స్థలాలు లేని వారుగా చేస్తున్నారు.

ఈ విధంగా వారు ఆర్థిక జీవనంలో ఎన్నో సమస్యలను అధిగమిస్తూ తమ జీవితాలను ముందుకు నడుపుతున్నారు.

గిరిజన ప్రాంతాలలో పారిశ్రామిక సంస్థలు నెలకొల్పడం కోసం అడవులలోనూ, కొండ ప్రాంతాలలోనూ ఉన్న చెట్లను నరకడం వలన పర్యావరణానికి భద్రత లేకపోవడమే కాకుండా, ఆ పరిశ్రమలు వెదజల్లే విషవాయువుల వలన పర్యావరణం పూర్తిగా దెబ్బతిని అటవీ ప్రాంత ప్రజల జీవనానికి తీరని నష్టం కలిగింది. అంతేకాకుండా, అడవులలో అనేక రకాలయిన సహజ వనరులు, ఔషధ గుణాలను ఇచ్చే చెట్లు కూడా ఉంటాయి. వీటన్నిటికీ కూడా చాలా నష్టం కలుగుతుంది. అలాగే అనేక రకాలయిన జంతువులు అడవులలో నివసిస్తుంటాయి. ఫ్యాక్టరీలు, ప్రాజెక్టుల కోసం అడవులను నాశనం చేస్తుండడంతో అటవీ ప్రాంతంలో నివసించే జీవజాతి జీవనానికి హాని కలుగుతుంది, జీవ సంతతి నశించిపోతుంది. అందుకోసం ప్రజలు వారి అటవీ ప్రాంతాలను, పర్యావరణాన్ని కాపాడుకోవడానికి ఉద్యమాలు చేశారు. వాటిలో మచ్చుకు కొన్నింటిని ఉదాహరణగా చెప్పవచ్చు:

**చిప్కో ఉద్యమం (1974-1990)**

ఈ ఉద్యమం ఉత్తర్‌ప్రదేశ్‌లోని చమోలి జిల్లా, గోపేశ్వర్ దశోలి గ్రామంలో జరిగింది. ఈ ఉద్యమం మొదలవడానికి కారణం, ఆట వస్తువులు తయారు చేసే ఫ్యాక్టరీ కోసం చెట్లు నరికివేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఆ చెట్లను నరకడానికి వచ్చిన కూలీలను చెట్లు నరకనివ్వకుండా, ప్రకృతితో వారికి ఉన్న సంబంధాన్ని విడదీయ నీయకుండా చెట్లను కౌగిలించుకొని, చెట్లతో పాటే మమ్మల్ని నరకమని ఉద్యమం సాగించారు. ఈ ఉద్యమమే చిప్కో ఉద్యమంగా పేరుగాంచింది. ఇది దాదాపు పదిహేను సంవత్సరాల పాటు సాగింది. ఈ ఉద్యమానికి చండీప్రసాద్ భట్, సుందర్‌లాల్ బహుగుణ నాయకత్వం వహించారు.

**నర్మదా బచావో ఆందోళన (1985)**

నర్మదా నది మధ్యప్రదేశ్‌లో పుట్టి, మహారాష్ట్ర సరిహద్దు గుండా గుజరాత్‌కు చేరి, గుజరాత్‌లోని అరేబియన్ సముద్రంలో కలుస్తుంది. అయితే ఈ నదిలోని నీరు దాదాపు 90 శాతం సముద్రంలో కలుస్తుండడం వలన ఈ నదిపై ఆనకట్టలు కట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఒకేసారి 135 చిన్న డ్యాంలు, 30 పెద్ద డ్యాంలు కట్టాలని నిర్ణయించారు. ముప్పై పెద్ద డ్యాంలలో ఒకటి సర్దార్ సరోవర్ ప్రాజెక్ట్. ఇది గుజరాత్‌లో ఉంది. ఈ డ్యాం కట్టడం వలన అడవులు ముంపుకు గురవుతున్నాయి. అడవులలో నివసించే ఆరు వేల మందికి పైగా నిర్వాసితులు అవుతున్నారు. కాబట్టి డ్యాం కట్టడానికి వీలు లేదని అక్కడ అటవీ సంపదమీద ఆధారపడి జీవించే ప్రజలు ఆందోళనలు సాగించారు. ఉద్యమానికి మేధాపాట్కర్‌తో సహా అనేక మంది ప్రజాస్వామికవాదులు అరుంధతీ రాయ్ నాయకత్వం వహించారు. ఈ ఉద్యమం దాదాపు మూడు దశాబ్దాలుగా కొనసాగుతూనే ఉంది.

**పోలవరం ప్రాజెక్ట్**

పశ్చిమ గోదావరి జిల్లా పోలవరం గ్రామంలో 2004లో ఈ ప్రాజెక్ట్ ప్రారంభం అయింది. ఈ ప్రాజెక్ట్ కట్టడం వలన ప్రత్యక్షంగా ఆరు మండలాలు, పరోక్షంగా 388 గ్రామాలు ముంపుకు గురవుతున్నాయి. ఈ ప్రాజెక్ట్ వలన ఖమ్మం జిల్లాలో పాపికొండలు అనే అభయారణ్యాలు ముంపుకు లోనవుతాయి. పాపికొండలు అరణ్యాలలో అనేకమంది కొండజాతి ప్రజలు నివసిస్తున్నారు. వారు కేవలం అడవిపైనే ఆధారపడి జీవిస్తున్నారు. అలాంటప్పుడు అడవులను నరికివేసి ఈ ప్రాజెక్టులు, డ్యాంలు, ఫ్యాక్టరీలు కట్టడం వలన వారి జీవనం దెబ్బతినడమే కాకుండా, పర్యావరణ సమస్యలు కూడా తలెత్తి వీరందరూ కష్టాల బారిన పడుతున్నారు.

పరిశ్రమల కోసం ప్రాజెక్టులను అటవీ ప్రాంతాలలో నెలకొల్పడం వలన అటవీ ప్రాంత ప్రజల జీవనం అస్తవ్యస్థమవుతుంది. ఈ ప్రాంత ప్రజలకు అనేక రకాల పర్యావరణ సమస్యలు ఏర్పడుతున్నాయి. ప్రకృతి వనరులను ప్రతి వ్యక్తీ ఉపయోగించుకోవాలే గానీ, పర్యావరణ సమతుల్యతను దెబ్బతీయ కూడదూ. పర్యావరణ సమతుల్యతను పాటించడంలో ప్రభుత్వం కూడా ప్రజలతో పాటు బాధ్యతాయుతంగా ప్రవర్తించాలి. ప్రజలకు పర్యావరణ హక్కుల గురించి తెలిసేలా ప్రభుత్వం కృషి చేయాలి. పర్యావరణ భద్రతని సామాజిక, ఆర్థిక అభివృద్ధిలో భాగంగా అంతర్జాతీయ చట్టంలో ఒక లక్షణంగా తీసుకురావాలి.

అయితే ఎప్పటి నుండో అభివృద్ధి కార్యక్రమాలు జరుగుతున్నప్పటికీ గిరిజన సమూహాలకు ఎటువంటి ప్రత్యేక చర్యలు ఉపయోగ పడలేదని, ప్రపంచమంతటా ఇండిజీనస్ పీపుల్స్‌పై జరిపిన పరిశోధనలు సంతృప్తికరంగా లేవనీ నిర్ధారణ అయింది. అందుకని దేశంలోని ఈ 635 జాతులపైన వారు కోల్పోయిన సంస్కృతిని ప్రోత్సాహపరిచే విధంగా, పరిశోధనలు జరపాలి. ఈ విభిన్న జాతులు తమ అభివృద్ధికై తమ ప్రణాళికలను తామే రూపొందుంచుకొని, అక్కడి పరిస్థితులను గమనిస్తూ తమ ప్రతినిధులుగా తమ నాయకులను తామే నియమించు కొని వారినే పాలి భాగస్తులుగా చేయాలి. సమాన ఆర్థిక పౌరతత్వాన్ని, తమ సంపద తమకే దక్కేటట్లుగా కొత్త స్వరూపాన్ని కల్పించుకోవాలి.

ప్రస్తుతం మనం ప్రకృతితో ఈ విధమైన సంబంధాన్ని కలిగి ఉన్నామంటే ప్రకృతిపై ఆధారపడి కొండలలో, అడవులలో నివసించే ప్రజల ప్రత్యక్ష, పరోక్షమైన ఉద్యమాల ఫలితమే. ఈ పరిస్థితి ఈ మాత్రమైనా కొనసాగాలన్నా, ముందుతరాలకు స్వచ్ఛమైన గాలిని, ప్రశాంతమైన వాతావరణాన్ని అందించాలన్నా ప్రభుత్వం అమలు చేసే పథకాలను గురించి అందరికీ అవగాహన ఉండాలి. ప్రకృతిలో అవినీతి, దోపిడీ అనే కాలుష్యం లేకుండా ఉన్నప్పుడే పరిశుభ్రమైన, భద్రత కలిగిన పర్యావరణాన్ని ముందు తరాలకు అందించవచ్చు.

*(రచయిత పరిశోధక విద్యార్థి)* వీ

ప్రాచీనతే ప్రమాణంగా మనుషులకు ఆటవిక దశలో ఏర్పడిన భావజాలం ఇప్పటికీ రకరకాల విశ్వాసాల రూపంలో కొనసాగుతుందనీ, ప్రాచీనత అంటే జ్ఞానం పరిపక్వం కాని దశకు సంబంధించిందనీ అంటున్నారు **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# సృష్టి ప్రతిపాదనలు

మానవుల సామాజిక జీవితం నిరక్షరాస్యదశలో మొదలైనటు వంటిది. ఇప్పుడు మనకది అజ్ఞానంతో కూడుకున్నదిగా అనిపించవచ్చు గాని తమ జీవితాలకు అవసరమైన వ్యవహారిక ప్రపంచ జ్ఞానాన్ని పొందడానికి అప్పటివారికి చదువు రాకపోవడం ఏమీ ప్రతిబంధకం అనిపించి ఉండదు. లిపీ, పుస్తకాలూ వగైరాలేవీ సృష్టికాని ఆ దశలోని పరిస్థితులే వేరు. యాభై ఏళ్ల కిందటి ఆఫీసుల్లో కంప్యూటర్లు లేకపోవడం ప్రతిబంధకం అనిపించనట్టే ఆనాటి ప్రజలు ప్రకృతిని గమనించి, పెద్దవారినుంచి విషయాలు నేర్చుకుంటూ జీవితపు సమస్యలను ఎదుర్కొనే ప్రయత్నం చేశారు. మనకన్నా ప్రకృతికి సన్నిహితంగా ఉండిన వారి జీవితాల్లో జంతువులకు భిన్నమైన పద్ధతిలో మానవనైజం అనేదొకటి ఏర్పడడానికి ముఖ్యకారణం వారి మేధోపరిణామమే.

పరిసరాలను ఎప్పటికప్పుడు గమనిస్తూ మనుగడను కొనసాగించేందుకు మనుషులకు పనికొచ్చినవి వారి ఆలోచనలే. మెదడు ముందుభాగంలోని లలాటికలంబిక ముందాలోచనకూ, ఊహాశక్తికీ ఆధారం. తక్కిన నరవానర జాతులలో కనబడనంత అభివృద్ధి మనుషులకు ఈ భాగంలో జరిగింది. దీని పనితనం నానాటికీ పెరుగుతూ పోయింది. ప్రకృతిలో నిత్యమూ పునరావృతం అయే పేటర్న్‌లను కనిపెట్టడం ఇందులో ముఖ్యంగా ఉండేది. ఇటువంటి ఊహాశక్తి మనుషులకు చాలా లాభించింది. ఊహలూ, కల్పనలూ, భావనలూ లేకుండా అప్పటి మానవసముదాయాలు రోజువారీ కష్టాలను ఎదుర్కోగలిగి ఉండేవికావు. ఎటొచ్చీ ఊహాశక్తి అనేది రెండంచుల కత్తివంటిది. చీకటి గుహలోకి ప్రవేశిస్తున్నప్పుడు అందులో ఏదైనా క్రూరమృగం పొంచి ఉందేమోనన్న అనుమానం మనుషుల ప్రాణాలు కాపాడే ఉంటుందిగాని ఆ గుహలోనే, కంటికి కనబడని అతీతశక్తులేవో కూడా ఉండవచ్చునే సందేహం అపోహలకే దారితీస్తుంది. ఆలోచనలన్నీ ఒకే విధంగా ఉండవు.

నిత్యావసరాలైన ఆకలిదప్పులూ, తలదాచుకునే చోటూ, ప్రాణ భయమూ మొదలైన ఈతి బాధలు కాక దీర్ఘకాలిక పద్ధతిలో తమకూ, తమసాటి వారికీ పనికొచ్చే తాత్విక చింతన కూడా తొలి మానవ సముదాయాల్లో మొదలయింది. సృష్టిని గురించిన జిజ్ఞాస కూడా అందులోని భాగమే. చేతులతో పనిచెయ్యడం జంతువులకు సాధ్యంకాదు. మనుషుల కార్యాచరణ గిజిగాడు గూడు కట్టినట్టుగా జరగదు. పనుల వెనక ఉద్దేశాలూ, ఆలోచనలూ ఉండితీరుతాయి. తమ చేతులతో పని చెయ్యడం, ఆ పని తాలూకు ఫలితాలూ మనుషులకు కొట్టవచ్చినట్టుగా తెలుస్తూ ఉండేవి. చిన్న జంతువులను పట్టుకోవడానికి ఉచ్చులు బిగించినా, ఒక రాతిగదనో, వాడిములికిగల బాణాన్నో తయారుచేసినా ఆ పనుల కార్యకారణ సంబంధం వారికి స్పష్టంగా గోచరించేది.

ఎవరైనా మట్టి పిసికి కుండను తయారుచేస్తే తప్ప దానంతట అది తయారవదు. మరి మనచుట్టూ ఉన్న ప్రపంచం ఎలా తయారయింది? కొండలనిగాని, చెట్లనిగాని, జంతువులనిగాని, మనుషులని గాని ఎవరు తయారుచేస్తున్నారు? అలాంటిదేదీ కనబడదే? ఎవరో తయారుచేస్తే తప్ప ఏదీ దానంతట అదే తయారుకాజాలదనే గట్టినమ్మకం మనుషులకు ఆటవికదశలో ఏర్పడి, ఇప్పటికీ భావజాలంగా కొనసాగుతోంది. సృష్టికర్తను ఊహించుకోకుండా ప్రపంచపు ఉనికిని చాలామంది ఈ నాటికీ గుర్తించలేకపోవడానికి కారణం అదే. అణువుల్లోనూ, జీవకణాల్లోనూ తలెత్తే భౌతిక, రసాయనిక ప్రక్రియలను వివరిస్తున్నప్పుడు కూడా 'దాన్నే మనవాళ్లు భగవంతుడని భావించారు' అంటూ చటుక్కున అడ్డొచ్చేవారు చాలామంది కనిపిస్తారు. కర్తృత్వం (లేదా ఎవడో ఒక సృష్టికర్త) లేకుండా ఏదీ జరగదనే నమ్మకమే అందుకు కారణం. ఇదొక ఆదిమ భావన అనీ, అనుభవం ద్వారా రూపొంది నటువంటి సహజమైన అపోహ అనీ వారు ఒప్పుకోరు.

లోకసృష్టిని గురించిన తొలి తాత్విక భావనలు చాలా ప్రాచీన మైనవి. ఇవి ప్రపంచంలో ప్రతిచోటా పుట్టుకొచ్చాయి. స్థానిక నాగరికతలను బట్టి వివిధ ప్రతిపాదనలు వివిధ ప్రాంతాల్లో వ్యాప్తి చెందాయి. బేబిలోనియాలో ఒకానొక సముద్రదేవత దేవగణాలపై సాగించిన కుట్రను భగ్నం చేసేందుకని మార్డుక్ అనేవాణ్ణి సృష్టించినట్టుగా నమ్మకం ఉండేది. అందుకు ప్రతిఫలంగా మార్డుక్ తనకు అంతులేని శక్తులు ప్రసాదించమని కోరుకుంటాడు. ఆ తరవాత అతని ఆధ్వర్యంలో జరగవలసినవన్నీ జరుగుతాయి. ఈజిప్ట్ నాగరికతలో ఒక ఆదిదేవత వమనం నుంచీ, లాలాజలంనుంచీ లోకం సృష్టి అవుతుంది. ఆఫ్రికాలోని బకూబా ధోరణి ప్రకారం మొదట్లో అంధకారంతో జలమయంగా ఉన్న లోకాన్ని ఊహించారు. ఒక పెద్దరాక్షసుడు తన కడుపునొప్పి కారణంగా సూర్యచంద్రులనూ, నక్షత్రాలనూ వమనం చేసుకున్నాడట. వాటి వేడిమివల్ల తేమ అంతా ఇగిరిపోయిందట. మరొకసారి వాంతి చేసుకున్నాక ప్రపంచమూ, స్త్రీ పురుషులూ, జంతువులూ అంతా ఉద్భవించారట.

ఆఫ్రికాలోనిదే అయిన మాసాయి తాత్వికచింతనలో ప్రపంచం తొలిసారిగా ఒక చెట్టుబోదె నుంచి రూపొందింది. ఆసియా సంస్కృతుల్లో ఎక్కువగా తొలి ప్రపంచాన్ని జలమయంగా భావించారు. కొందరు చీకటితోనో, రూపరహితంగానో, ఒక అండం, లేదా బీజరూపంలోనో విశ్వం మొదలయిందని నమ్మారు. ఫిన్లండ్ ప్రజలు ఒక ఆదిమపక్షి గుడ్డు నుంచి లోకమంతా బైటికొచ్చిందని అనుకున్నారు. నార్వేవారు ఉత్తరాన ఉన్న మంచుకూ, దక్షిణాన ఉన్న నిప్పుకూ మధ్య తలెత్తిన ప్రక్రియలే సృష్టికి కారణమని భావించారు. తక్కిన ప్రపంచంతో

సంబంధం లేకుండా పెంపొందిన అమెరికా ఆదిమతెగల్లో సృష్టిని గురించిన భావనల్లో సర్పాల పరికిణీ వంటిది ధరించిన ఆదిమాత ప్రస్తావన కనిపిస్తుంది. కొన్ని తెగల్లో పురుష అంశ కలిగిన ఆకాశానికీ, స్త్రీ అంశ కలిగిన భూమికీమధ్య సంపర్కం మొదలయిందనే నమ్మకం ఉండేది.

ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుంటే కొంత అమాయకంగా, కొంత పరిమిత ఊహాశక్తితో, కొంత గుడ్డి నమ్మకాలతో మొదలైనట్టుగా అనిపిస్తున్న ఈ ప్రతిపాదనలన్నీ అప్పటివారు తమ సమాజం ఒకటిగా ఉండి బాగుపడాలనే ఉద్దేశంతోనే అవలంబించి ఉంటారనేది గుర్తించాలి. ఈ రోజుల్లో ఒక్క మాత్రతో నయం చెయ్యగలిగే రోగాల చికిత్సకు ఏ పంతొమ్మిదో శతాబ్దంలోనో మేటివైద్యులు ఎంతో కష్ట పడేవారని మనం గుర్తించినట్టే ఏ యుగానికా యుగంలో ప్రజలు తమకు అర్థమైనంత మేరకు లోకంలో తమకు కనబడుతున్న, కనబడనటువంటి వింతలకు వివరణలిచ్చే ప్రయత్నాలు చేశారనేది మరిచి పోకూడదు. అంతమాత్రాన ప్రాచీన సంస్కృతిని గౌరవించడానికి ప్రతి పురాతన తత్వధోరణీని నెత్తిన పెట్టుకోనవసరం లేదు. అటువంటి వాటి చారిత్రక, సామాజిక నేపథ్యాలను అర్థం చేసుకోవాలి.

జుడాయిజం, జొరాస్ట్రియన్, క్రైస్తవ, ఇస్లాం మతాలన్నీ ఆవిర్భవించినది తొలి నాగరికతలకు పుట్టినిల్లయిన పశ్చిమాసియాలోనే. అందుకే వాటి మూలాల్లో కొంత సామ్యం కనిపిస్తుంది. తొలిసారిగా పర్వతమెక్కి పది ఈశ్వరాజ్ఞలని సంపాదించుకొచ్చిన మోసెస్ తన తెగలలోని ప్రజలు సాగిస్తున్న విగ్రహారాధనను ఈసడించుకున్నాడు. బంగారు లేగదూడవంటివాటిని ఆరాధించే సంస్కృతి అప్పట్లో ఉండేది. అలాకాకుండా అగ్నినో, రూపరహితుడైన ఒక ఈశ్వరుణ్ణో ఆరాధించాలనే వైఖరి మొదల యింది. తొలి ఆరాధన అంతా చెట్లకూ, జంతువుల విగ్రహాలకూ జరిగేది. ఇటువంటి ఆదిమభావనల స్థానంలో కొంత ఉన్నతమైన తాత్వికచింతన ప్రతి ప్రాంతంలోనూ తలెత్తడానికి ఒక కారణం ఒక్కొక్క తెగలోనూ ఒక్కొక్క బొమ్మను పూజిస్తూ ఇతర తెగలతో కయ్యాలకు దిగడమే. అందరికీ వర్తించే తాత్వికధోరణులను ప్రతిపాదిస్తున్నప్పుడు కొంత నైరూప్యభావనలు చోటుచేసుకోలేక తప్పలేదు.

బెబిలోనియాలో క్రీ.పూ. 2000 ప్రాంతాల్లోనే వ్యాప్తిలో ఉన్న మతభావనలు అప్పటికే ఎన్ని వేల సంవత్సరాలనుంచీ కొనసాగుతూ వచ్చాయో తెలియదు. ఇవన్నీ తరవాత రూపొందినటువంటి మతాల్లో భాగాలైపోయాయి. వీటిని ప్రశ్నించ సాహసించినవారిని సవాలు చేసేందుకు వీటి ప్రాచీనతనే కారణంగా చూపుతారు. ప్రాచీనకాలం అనేది జ్ఞానసంపద పరిపక్వం కానటువంటి దశ అని వారు ఒప్పుకోరు. ప్రాచీనయుగాల్లో దేవుళ్లూ, దేవతలూ మనుషులతో సంభాషిస్తూ, వారితో ఎక్కువ సంబంధబాంధవ్యాలు నెరిపేవారనే భావన గ్రీక్ పురాణాల్లోకూడా కనిపిస్తుంది. అవన్నీ ఎప్పుడు మొదలై, ఎప్పుడు నిలిచిపోయాయో ఎవరూ చెప్పరు. మనుషులు ఆటవిక, అనాగరిక, బర్బరదశలన్నీ దాటి ముందుకు వచ్చారని ఆమోదించేవారు మధ్యలో ఈ స్వర్ణయుగం ఎప్పుడొచ్చి అంతమయిందో వివరించరు.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

## భోపాల్ దుర్ఘటన

భోపాల్ దుర్ఘటన జరిగి 26 ఏళ్లు కావస్తున్న సందర్భంగా, బాధితులు డిసెంబర్ 2న భోపాల్ టాకీస్ నుంచి యూనియన్ కార్బైడ్ పెస్టిసైడ్స్ కంపెనీ వరకు కాగడాల ప్రదర్శన ద్వారా ర్యాలీ నిర్వహించారు. ఈ సందర్భంగా యూనియన్ కార్బైడ్ మాజీ చైర్మన్ వారన్ అండర్సన్‌పై చట్టపరమైన చర్యలు తీసుకోవాలని బాధితులు డిమాండ్ చేశారు. విషాదం జరిగి 26 సంవత్సరాలు పూర్తయినా నష్టపరిహారం చెల్లింపునకు సంబంధించి తమకు ఇచ్చిన మాటను కూడా నిలుపుకోవడంలో కేంద్ర ప్రభుత్వం విఫలమైందని బాధితులు, వారి కుంటుంబ సభ్యులు ఆగ్రహించారు. తమకు న్యాయమైన నష్టపరిహారం దక్కాలని డిమాండ్ చేశారు.

## కొత్త రాష్ట్రాల కోసం ధర్నా

దేశ వ్యాప్తంగా కొత్త రాష్ట్రాల కోసం ఉద్యమిస్తున్న 21 ప్రాంతాల ప్రతినిధులు ఫెడరేషన్ న్యూ స్టేట్స్ (ఎఫ్ఎన్ఎస్–కొత్త రాష్ట్రాల సమాఖ్య) ఆధ్వర్యంలో డిసెంబర్ 12న ఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద ధర్నా నిర్వహించారు. ఈ సందర్భంగా ఎఫ్ఎన్ఎస్ నాయకులు ఆర్.కె. తోమర్ మాట్లాడుతూ శ్రీకృష్ణ కమిటీతో సంబంధం లేకుండా తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు కోసం కేంద్రం పార్లమెంట్‌లో బిల్లు ప్రవేశ పెట్టాలని, అలాగే మిగతా 20 రాష్ట్రాల డిమాండ్‌లను పరిశీలించాలని కోరారు.

## 11 మందికి జైలు శిక్ష

బీహార్‌లో జరిగిన దానా కుంభకోణం కేసులో 11 మంది మాజీ ప్రభుత్వ అధికారులను సిబిఐ ప్రత్యేక న్యాయస్థానం దోషులుగా ప్రకటించింది. వీరికి 5 నుంచి 6 ఏళ్ల జైలు శిక్షతో పాటు ఒక్కొక్కరికి రు. 5 లక్షల జరిమానా విధించింది. సిబిఐ ప్రత్యేక న్యాయమూర్తి ఎ.హెచ్. అన్సారీ డిసెంబర్ 1న శిక్షను ఖరారు చేశారు. దానా కేసులోని మొత్తం 52 మంది నిందితుల్లో 28 మందికి శిక్షపడింది.

## రాజా, రాడియా ఆస్తులపై సిబిఐ దాడులు

దేశంలోనే అతిపెద్ద కుంభకోణంగా చెప్పుకుంటున్న 2జి స్పెక్ట్రమ్ కేటాయింపుల్లో ఒక లక్షా డెబ్బై ఆరు వేల రూపాయల అవినీతికి పాల్పడ్డాడన్న నేరారోపణపై టెలికమ్యూనికేషన్ శాఖా మాజీ మంత్రి ఎ. రాజాను డిసెంబర్ 24న సిబిఐ ప్రశ్నించింది. ఆయనకు సంబంధించిన సంస్థలపై, సంబంధీకుల ఇళ్లపై సిబిఐ దాడులు నిర్వహించింది. 2007 సెప్టెంబర్ 2008 జనవరి మధ్య స్పెక్ట్రమ్ పొందిన పలు టెలికం కంపెనీల్లో మంత్రి సన్నిహిత కంపెనీలు, సన్నిహితులు ఉండడంపైనా సిబిఐ అధికారులు ప్రశ్నించారు.ఇదే కేసులో తమిళ మైయమ్ అనే తమిళ సాంస్కృతిక స్వచ్ఛంద సంస్థపై, అలాగే కార్పొరేట్ లాబీయిస్ట్ నీరా రాడియా, ఐఎఎస్ అధికారి ప్రదీప్ బైజల్ నివాసాలపై ఏకకాలంలో డిసెంబర్ 14న సోదాలు నిర్వహించింది.

## రాడియా టేపుల్లోని వ్యక్తులు

నీరా రాడియా టేపులపై రతన్ టాటా వేసిన పిటిషన్‌పై విచారణ ముగిసే వరకు అందులోని వ్యక్తుల పేర్లను బహిర్గత పరచవద్దని టాటా కేసులో మీడియా జాగ్రత్తగా వ్యవహరించాలని సుప్రీం కోర్టు హెచ్చరించింది. రాడియా టేపుల లీకేజీ పిటిషన్ పై ఆదాయపు పన్ను శాఖకు, సిబిఐకి, కేంద్ర ప్రభుత్వానికి, టేపుల్లోని సంభాషణలను ప్రచురించిన ఓపెన్, ఔట్‌లుక్ పత్రికలకు కూడా సుప్రీం కోర్టు డిసెంబర్ 2న నోటీసులు జారీ చేసింది.

## కొనసాగుతున్న గుజ్జర్ల ఆందోళన

ప్రభుత్వ ఉద్యోగాల్లో ఐదు శాతం రిజర్వేషన్ కావాలని రాజస్థాన్‌లోని బయానాలో ఆందోళన చేపట్టిన గుజ్జర్లకు ప్రభుత్వానికి మధ్య డిసెంబర్ 26న జరిగిన చర్చలు విఫలమయ్యాయి. తమ డిమాండ్లను ప్రభుత్వం అంగీకరించకపోవడంతో రాస్తారోకో, రైలురోకో ఆందోళనలు కొనసాగించాలని నిర్ణయించారు. తమ డిమాండ్లను పూర్తిగా పరిష్కరించేంతవరకు పోరాటాన్ని మధ్యలో వదిలేది లేదని గుజ్జర్ల నాయకుడు కల్నల్ కిరోరి సింగ్‌బీ బైంస్లా అన్నారు.

## భారత్‌లో పెరిగిన సెల్‌ఫోన్ల వాడకం

దేశంలో సెల్‌ఫోన్ల వినియోగదార్ల సంఖ్య మొత్తంగా 70 కోట్లు దాటింది. గత అక్టోబర్ ఒక్క నెలలోనే 1.8 కోట్ల మంది కొత్తగా వినియోగ దారులయ్యారు. టెలికాం రెగ్యులేటరీ అథారిటీ(ట్రాయ్) లెక్కల ప్రకారం గతంలో 68 కోట్లకు పైగా ఉన్న సెల్ వినియోగదారుల సంఖ్య ఈ ఏడాది అక్టోబర్‌లో 706.69 మిలియన్లకు చేరుకుంది. దేశం మొత్తం మీద వైర్‌లైన్, వైర్‌లెస్ ఫోన్‌ల వినియోగదార్ల సంఖ్య 74.2 కోట్లకు చేరుకుంది. వైర్‌లెస్ ఫోన్ కనెక్షన్‌లలో ప్రైవేటు రంగ సంస్థ అయిన ఎయిర్‌టెల్ 14.6 కోట్ల సెల్ కనెక్షన్‌లతో అగ్రభాగాన ఉంది.

## హక్కుల నేతకు జీవిత ఖైదు

ప్రముఖ హక్కుల ఉద్యమకారుడు, చిన్న పిల్లల డాక్టరైన బినాయక్ సేన్ సహా మావోయిస్టు నాయకుడు నారాయణ్ సన్యాల్, వ్యాపారవేత్త పీయూష్ గుహలకు దేశద్రోహ నేరం కింద రాయపూర్ జిల్లా కోర్టు యావజ్జీవ కారాగార శిక్ష విధించింది. భారత ప్రభుత్వంపై మావోయిస్టుల పోరాటానికి సహకరిస్తున్నాడనే నేరంపై వీరికి ఈ శిక్ష విధిస్తున్నట్లు రాయ్‌పూర్ అడిషనల్ డిస్ట్రిక్ట్ అండ్ సెషన్స్ జడ్జి బి.పి. వర్మ డిసెంబర్ 24న తన తీర్పులో పేర్కొన్నారు. హక్కుల సంఘాలు తీర్పుకు వ్యతిరేకంగా తమ నిరసనను తెలయపర్చాయి. సేన్ తరపు న్యాయవాది ఈ తీర్పుపై తాము అప్పీలు చేస్తామని చెప్పారు. ఈ తీర్పును నిరసిస్తూ సేన్‌ను విడుదల చేయాలని డిసెంబర్ 27న అంతర్జాతీయ మేధావి నోమ్‌చామ్‌స్కీ, రోమిలాథాపర్‌తో సహా 80 మంది మేధావుల సంతకాలతో కూడిన పత్రికా ప్రకటనను ఢిల్లీలో విడుదల చేశారు. సేన్‌ను విడుదల చేయాలని కోరుతూ రాష్ట్రపతి ప్రతిభాపాటిల్‌కు ఇంటర్నెట్ ద్వారా 5700 మంది సంతకాలు చేశారు. వీ

## అసాంజె అరెస్ట్

వికీలీక్స్ వ్యవస్థాపకుడు జూలియన్ అసాంజె 8 డిసెంబర్ 2010న లండన్ పోలీసుల ముందు లొంగిపోయాడు. అత్యాచారానికి పాల్పడ్డారన్న ఆరోపణపై స్వీడన్ కోర్టు అతనిపై అరెస్ట్ వారెంట్ జారీచేసింది. వెస్ట్ మినిస్టర్స్ మేజిస్ట్రేట్ కోర్టు అతనికి డిసెంబర్ 14 వరకు రిమాండ్ విధించింది. అసాంజె అరెస్ట్‌ను ఖండిస్తూ ప్రపంచ వ్యాప్తంగా పలువురు మానవ హక్కుల కార్యకర్తలు, మేధావులు తమ నిరసన వ్యక్తం చేశారు. డిసెంబర్ 14న అతనికి బెయిల్ మంజూరైనా కూడా అతనిని విడుదల చేయలేదు. డిసెంబర్ 16న అసాంజేను అతని స్నేహితుని ఇంట్లోనే గడిపే షరతుపై బెయిల్ మంజూరు చేశారు.

## గ్రీస్‌లో సార్వత్రిక సమ్మె

గ్రీస్‌లో ప్రభుత్వం ప్రకటించిన కార్మిక సంస్కరణలు, పొదుపు చర్యలకు నిరసనగా డిసెంబర్ 15న ఉద్యోగ, కార్మిక సంఘాలు దేశవ్యాప్త సమ్మె ప్రకటించాయి. దీంతో దేశవ్యాప్తంగా అంతా పౌర పరిపాలన స్తంభించిపోయింది. ఫ్యాక్టరీలు, ఆస్పత్రులు, రవాణా సంస్థలు అన్నీ మూతపడ్డాయి. విమాన సర్వీసులు కూడా రద్దయిపోయాయి. ఏథెన్స్ నగరంలో జరిగిన ర్యాలీలో వేలాదిగా ప్రజలు పాల్గొని ప్రభుత్వ సంస్కరణల విధానాలకు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలు నిర్వహించారు. ఈ సమ్మెలో విలేకరులు కూడా పాల్గొన్నారు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం అతిపెద్ద ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోవడంతో ప్రభుత్వం పొదుపు చర్యలు, సంస్కరణ విధానాలను ప్రకటించింది. ప్రభుత్వం ప్రతిపాదించిన కొత్త కార్మిక చట్టాలు కార్మికుల హక్కులను కాలరాసే విధంగా ఉన్నాయనీ, ఈ ప్రతిపాదనలను తక్షణమే ఉపసంహరించాలనీ గ్రీస్‌లోని అతి పెద్ద కార్మిక సంఘం జి.ఎస్.ఇ.ఇ. ఉపనేత స్టాథిస్ అనెస్టిస్ తెలిపారు.

## ఇటలీలో నిరసనలు

విశ్వవిద్యాలయాల బడ్జెట్ కోతలకు నిరసనగా ఇటలీ రాజధాని రోమ్‌లో డిసెంబర్ 15న విద్యార్థులు ఆందోళన ప్రదర్శనలు జరిపారు. ఇందులో భాగంగా పార్లమెంట్ భవనంలోకి వెళ్లేందుకు ప్రయత్నించడంతో ప్రదర్శకులకూ, పోలీసులకూ మధ్య ఘర్షణ జరిగింది. ఈ ఘర్షణలో కనీసం వంద మంది దాకా విద్యార్థులూ, పోలీసులూ గాయపడ్డారు. విద్యార్థులు అతి తక్కువ సంఖ్యలో ఉన్నారంటూ ఫ్యాకల్టీలకు నిధుల కోత, ఇతర కీలకమైన ఫ్యాకల్టీలకు వనరులను తగ్గించడం వంటివి ప్రభుత్వం సంస్కరణలలో భాగంగా చేపడుతోంది.

## చమురు బాధ్యులపై దావా

గల్ఫ్ ఆఫ్ మెక్సిలో ఈ ఏడాది ఏప్రిల్‌లో చమురు లీకేజ్‌కు కారణమైన బి.పి., ఇతర కంపెనీలపై అమెరికా డిసెంబర్ 16వ న్యూ ఆర్లియన్స్ కోర్టులో దావా వేసింది. బావి తవ్వడంలో ఫెడరల్ రక్షణ నిబంధనలను బేఖాతరు చేసినట్లు ఆ కంపెనీలను అమెరికా ప్రభుత్వం విమర్శించింది. అయితే ఈ ఆరోపణలను బి.పి. కంపెనీ ఖండించింది. జరిగిన ఘటనలో పూర్తి బాధ్యత తమ కంపెనీదే కాదనీ, తవ్వకంలో పాల్గొన్న ఇతర కంపెనీల బాధ్యతగా కూడా ఉందనీ పేర్కొంది. మెక్సికో గల్ఫ్, బీచ్‌లు, చిత్తడినేలలకు జరిగిన కాలుష్యానికి వందల కోట్ల నష్టపరిహారాన్ని, వాటిని శుద్ధి చేయడానికి అయిన ఖర్చును చెల్లించాలని ప్రభుత్వం దావాలో డిమాండ్ చేసింది. ఈ దావాలో పేర్కొనట్లుగా బిపి పూర్తిగా నిర్లక్ష్యంగా లేదా ఉద్దేశపూర్వకంగానే తప్పుగా వ్యవహరించినట్లు రుజువైతే సముద్రంలో లీకైన సుమారు 20.6 కోట్ల గ్యాలన్ల చమురుకు గాను బిపి కంపెనీ దాదాపు 2,110 కోట్ల డాలర్లు ప్రభుత్వానికి చెల్లించవలసి వస్తుంది. ఇంకా ఆ ప్రమాదంలో చనిపోయిన పదకొండు మంది కార్మికులకు కూడా నష్టపరిహారాన్ని చెల్లించాల్సి ఉంటుంది.

## తిరిగి ఎన్నికైన అలెగ్జాండర్ లుకషెంకో

బెలారస్ అధ్యక్షుడిగా అలెగ్జాండర్ లుకషెంకో నాల్గవ సారి తిరిగి ఎన్నికయ్యారు. డిసెంబర్ 20న ప్రకటించిన ఎన్నికల ఫలితాల్లో ఆయనకు ఎనభై శాతం ఓట్లు వచ్చాయని అధికార వర్గాలు తెలిపాయి. అయితే ఎన్నికల్లో పెద్ద ఎత్తున అవకతవకలు జరిగాయని ఆరోపిస్తూ ప్రతిపక్ష కార్యకర్తలు నిరసన తెలుపుతూ ప్రభుత్వ ప్రధాన భవనం ముందు నిరసన ప్రదర్శనలు చేయడంతో పోలీసులు వారిని అరెస్టు చేశారు.

## వికీలీక్స్‌పై ఆర్థిక నిర్బంధం

అమెరికా అధికారిక రహస్యాలు బయటపెడుతున్న వికీలీక్స్ వెబ్‌సైట్ సంస్థపై, దాని వ్యవస్థాపకుడు జూలియన్ అసాంజెపై అమెరికా కక్ష్య సాధింపు చర్యలను మొదలుపెట్టింది. అసాంజెపై అత్యాచార ఆరోపణతో అరెస్టు చేయించింది. వికీలీక్స్ సంస్థ బ్యాంక్ లావాదేవీలను స్థంబింపజేసింది. మాస్టర్ కార్డ్, పేపాల్, వీసా తదితర ఆర్థిక సంస్థలు వికీలీక్స్‌తో తమకు ఉన్న ఆర్థిక వ్యవహారాలను ఆపేశాయి. అమెరికాలోని అతిపెద్దదైన బ్యాంక్ ఆఫ్ అమెరికా కార్పొరేషన్ కూడా వికీలీక్స్ బ్యాంక్ కార్యకలాపాలను స్థంబింపజేసింది. ఎన్ని అవరోధాలు సృష్టించిన, ఎన్ని ఎదురు దెబ్బలు తగిలినా వికీలీక్స్ తన పని తాను చేసుకుపోతుందని అసాంజె అన్నారు.

## బ్యాంకాక్‌లో ఎమర్జెన్సీ ఎత్తివేత

థాయ్‌ల్యాండ్ ప్రభుత్వం బ్యాంకాక్‌లో ఏప్రిల్‌లో విధించిన ఎమర్జెన్సీని డిసెంబర్ 21న తొలగించింది. అయితే, దాని స్థానంలో నూతన భద్రతా చట్టం విధించింది. ఈ చట్టం కింద అనుమానమున్న వారిని ఎలాంటి అభియోగాలు మోపకుండానే ఒక వారం వరకూ నిర్బంధించే అధికారం ప్రభుత్వానికుంటుంది. ఎనిమిది నెలల క్రితం ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా రెడ్‌షర్ట్స్ కార్యకర్తలు పార్లమెంట్ భవనంపై దాడి చేసినప్పుడు ఎమర్జెన్సీ విధించింది. ఆందోళనలను అణచడానికి ప్రభుత్వం రెడ్‌షర్ట్స్ వాలంటీర్లపై తీవ్రమైన అణచివేతను, నిర్బంధాన్ని అమలు చేసింది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : **రాంకి, వై. రామచంద్రం**

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 నవంబర్ 2010 నుండి 20 డిసెంబర్ 2010 వరకు అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 2,203)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| **(1)** | **(2)** | **(3)** | **(4)** | **(5)** | **(6)** | **(7)** | **(8)** | **(9)** | **(10)** | **(11)** | **(12)** | **(13)** | **(14)** | **(15)** | **(16)** | **(17)** | **(18)** | **(19)** | **(20)** | **(21)** | **(22)** |
| ఆదిలాబాద్ | – | 7 | – | 12 | 20 | 7 | 4 | 1 | 2 | 4 | 1 | 3 | 2 | 1 | 14 | 28 | – | – | – | 1 | – |
| హైదరాబాద్ | – | – | – | 8 | 10 | – | 1 | – | 1 | 6 | 6 | 4 | 1 | – | 32 | 16 | – | – | – | 19 | – |
| కరీంనగర్ | 1 | 12 | 1 | 23 | 52 | 16 | 25 | 4 | 4 | 10 | – | 4 | 3 | 8 | 34 | 30 | – | – | – | 13 | 1 |
| ఖమ్మం | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| మెదక్ | – | 3 | – | 13 | 22 | 4 | 5 | 6 | 3 | 2 | 2 | 5 | – | 9 | 46 | 16 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | 8 | – | 21 | 25 | – | – | – | – | 1 | 9 | 6 | 7 | 12 | 50 | 28 | – | – | – | – | – |
| నల్గొండ | 1 | 6 | 1 | 12 | 16 | 1 | 3 | 3 | 3 | 4 | 6 | 6 | 8 | 7 | 65 | 21 | – | – | 3 | – | – |
| నిజామాబాద్ | – | – | – | 4 | 19 | 3 | 2 | 1 | – | 1 | – | 2 | 2 | – | 24 | 7 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 8 | – | 7 | 10 | 6 | 13 | 4 | 5 | 6 | 3 | 3 | 2 | 8 | 38 | 4 | – | – | – | 1 | – |
| వరంగల్ | – | 5 | – | 6 | 5 | 5 | 5 | 2 | 3 | 3 | – | – | – | 5 | 20 | 5 | – | – | – | – | – |
| అనంతపూర్ | – | 10 | – | 15 | 5 | 5 | 9 | 5 | – | 2 | 2 | 3 | 1 | 2 | 33 | – | – | – | – | 2 | 5 |
| చిత్తూరు | – | 1 | – | 5 | 7 | 10 | 6 | – | – | 1 | 14 | 12 | 9 | 5 | 51 | – | – | – | – | – | – |
| కర్నూలు | – | 8 | – | 11 | 16 | 2 | 11 | 2 | 4 | 5 | 3 | 3 | 2 | 3 | 24 | 16 | – | – | – | 4 | – |
| గుంటూరు | – | 18 | – | 2 | 6 | – | 1 | 1 | – | 5 | 13 | 14 | 2 | 2 | 59 | 45 | – | – | – | 1 | 1 |
| నెల్లూరు | – | – | – | 5 | 8 | 1 | 2 | 2 | – | 3 | 3 | 7 | 3 | 4 | 28 | 13 | – | – | – | – | – |
| కడప | – | 4 | – | 4 | 6 | 2 | 2 | 1 | 2 | 2 | 2 | 5 | 9 | – | 18 | 8 | – | – | – | – | – |
| ప్రకాశం | – | 18 | 8 | – | – | 19 | 8 | – | 8 | 5 | – | – | – | 12 | 28 | 18 | – | – | – | 2 | 16 |
| శ్రీకాకుళం | – | 7 | – | 3 | 4 | 3 | 5 | 1 | – | – | 5 | 5 | – | – | 19 | 12 | – | – | – | – | – |
| విజయనగరం | – | – | – | 2 | 4 | 3 | 5 | 2 | 1 | 4 | – | 1 | – | 2 | 19 | 12 | – | – | – | – | 2 |
| తూర్పు గోదావరి | – | 9 | – | 7 | 16 | 2 | 3 | 1 | 2 | 4 | 3 | – | 6 | 2 | 34 | 30 | – | – | – | 5 | – |
| మొత్తం | **2** | **124** | **10** | **160** | **251** | **89** | **110** | **36** | **38** | **68** | **72** | **83** | **57** | **82** | **636** | **309** | **–** | **–** | **3** | **48** | **25** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ;
మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గౌడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; వరంగల్ – ఎ.కుమార్;
అనంతపూర్ – కె. నాగేశ్వరచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్;
గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; శ్రీకాకుళం – జి. సుధీర్; ప్రకాశం – ఎల్. సాంబశివరావు, విజయనగరం – డి. సుధాకర్

# వీక్షణం రచయితలకు సూచనలు

ఎనిమిది సంవత్సరాలలో, నూట పదమూడు సంచికలలో వీక్షణం దాదాపు పద్దెనిమిది వందల వ్యాసాలు, రచనలు ప్రచురించింది. వీటిలో నిడివిలోనూ, వస్తువులోనూ, చెప్పిన పద్ధతి లోనూ, సుబోధకత లోనూ చాల వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యాన్నంతా గౌరవిస్తూనే, పత్రికలో అచ్చయ్యే వ్యాసాలను ప్రామాణికం చేయడానికి రచయితలు ఈ కింది సూచనలు పాటిస్తే బాగుంటుందని భావిస్తున్నాం.

- రచన మరీ చిన్నది (ఒక పేజీ కన్న తక్కువ) కాకుండానూ, మరీ పెద్దది (ఐదు పేజీల పైన) కాకుండానూ ఉంటే బాగుంటుంది. రచన ఐదు పెజీలకు మించితే రెండు మూడు సంచికలలో వేయవలసి వస్తుంది గనుక రచయిత అభిప్రాయం పాఠకులకు అందడం కష్టమవుతుంది. మూడు–నాలుగు పేజీల రచన (1800 – 2500 పదాలు) వీక్షణం కు సరిగ్గా సరిపోతుంది.
- చేతిరాతతో పంపేవారయితే వీలయినంత కుదురుగా, చదవడానికి వీలుగా, పంక్తుల మధ్య ఖాళీ వదులుతూ, కాగితానికి ఒకవైపునే రాసి పంపాలి. కంపోజ్ చేసి పంపేవారయితే, డబుల్ లైన్ స్పేసింగ్ లో కాగితానికి ఒకవైపునే అచ్చువేసి పంపాలి. యూనికోడ్ లో గాని, పేజ్ మేకర్ లో గాని కంపోజ్ చేసేవారు సాఫ్ట్ కాపీ సి.డి. ద్వారాగాని, ఇ మెయిల్ లోగాని పంపితే మంచిది.
- రచయితలు తప్పనిసరిగా తమ రచన ఫొటో కాపీ తమ దగ్గర ఉంచుకోవాలి.
- రచనతో పాటు తప్పనిసరిగా రచయిత సంక్షిప్త పరిచయం, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఇమెయిల్ వగైరా వివరాలు పంపాలి.
- వీక్షణం కార్యాలయానికి రచన అందిన వెంటనే అందినట్టుగా రచయితలకు సమాచారం పంపుతాం. రెండువారాలలోగా ఆ రచనను ప్రచురణకు స్వీకరిస్తున్నదీ లేనిదీ తెలుపుతాం. తక్షణ ప్రాముఖ్యత ఉన్న అంశం మీద రచన అయితే రెండు–మూడు నెలల లోపు అచ్చువేస్తాం. సాధారణ రచనలు అచ్చువేయడానికి ఆరు నెలల వరకూ పట్టవచ్చు.
- మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణం కు పంపగూడదు.
- దీర్ఘకాలిక తాత్విక, రాజకీయార్థిక, సామాజిక అంశాల మీద మాత్రమే కాక, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపైన కూడ రచనలు పంపాలని రచయితలకు విజ్ఞప్తి. ఆ విషయం మీదనే మరొకరు రాసినా, అన్ని దృక్పథాల రచనలు అచ్చు వేయడం వీక్షణం ఉద్దేశ్యం. క్షేత్ర పరిశోధనా నివేదికలు, విధానాల అమలు తీరుతెన్నులు, ప్రజాజీవితంలో మార్పులు, వివిధ దృక్కోణాలు, విభిన్న సామాజిక శాస్త్ర పరిశీలనాంశాలు వీక్షణంలో ప్రాధాన్య ప్రచురణాంశాలు. సాహిత్య రంగానికి సంబంధించిన రచనలకు వీక్షణంలో చోటు కల్పించడం సాధ్యం కాదు.
- రచయిత అభిప్రాయాలను మార్చడం ఎప్పుడూ జరగదు. కాని నిడివి దృష్ట్యాగాని, సాంకేతిక కారణాల దృష్ట్యాగాని రచనలు కుదించే, మార్చే పరిస్థితి రావచ్చు. ఇలా ఎడిట్ చేయడానికి రచయితలు ఆమోదించాలి.

# వీక్షణం రచయితల సమావేశానికి ఆహ్వానం

| | | |
|---|---|---|
| **తేది** | **:** | **30 జనవరి 2011 ఆదివారం** |
| **సమయం** | **:** | **ఉదయం 10 గంటల నుంచి భోజన విరామం దాకా** |
| **స్థలం** | **:** | **ఎమెస్కో సమావేశ మందిరం,**<br>సాధూరాం కంటి ఆస్పత్రి పక్కన, గగన్‌మహల్ రోడ్<br>లిబర్టీ దగ్గర, దోమల్‌గూడ, హైదరాబాద్.<br>**(భోజన ఏర్పాటు ఉంది)** |

*ప్రాంతీయ, దేశీయ, అంతర్దేశీయ పరిణామాలపై అవగాహనలను, తెలుగు సమాజం తనతో తాను జరుపుతున్న సంభాషణను అక్షరబద్ధం చేస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం ప్రతి సంవత్సరం తన రచయితల మధ్య సంభాషణకు కూడ వేదిక కల్పిస్తున్నది. వీక్షణం నాలుగు సంవత్సరాల కింద ఈ వార్షిక రచయితల సమావేశం ప్రారంభించింది. వీక్షణం రచయితలు, పాఠకులు, అభిమానులు, సిబ్బంది కలిసి కూచుని వీక్షణంలో అచ్చవుతున్న రచనల గురించీ, అచ్చు కావలసిన అంశాల గురించీ చర్చించుకోవడానికి, పత్రిక వెలువడుతున్న తీరు గురించి అభిప్రాయాలు, సలహాలు, సూచనలు పంచుకోవడానికి, గతాన్ని సమీక్షించుకుని భవిష్యత్తుకు మార్గాలు వేసుకోవడానికి ఈ సమావేశాలు జరుగుతున్నాయి. ఈ వరుసలో ఐదవ సమావేశంగా ఈ సంవత్సరానికి గాను వీక్షణం రచయితల సమావేశం జనవరి 30 ఆదివారం ఉదయం 10 నుంచి భోజన విరామం దాకా ఎమెస్కో సమావేశ మందిరం (సాధూరాం కంటి ఆస్పత్రి పక్కన, గగన్ మహల్ రోడ్, దోమలగూడ) లో జరుగుతుంది.*

*ఇప్పటికే వీక్షణంలో రచనలు చేసి ఉన్నవారు, వీక్షణంలో రచనలు చేయదలచుకున్నవారు, వీక్షణం పాఠకులు, వీక్షణం అభిమానులు, మొత్తంగా తెలుగు సమాజ జీవితం గురించి, ప్రజల గురించి ఆలోచించే ప్రతి ఒక్కరూ ఈ సమావేశానికి ఆహ్వానితులే.*

వివరాలకు : కార్యాలయం – 040 6684 3495
(ఉదయం 10.30 నుంచి సాయంత్రం 5.30 గంటల వరకు)

# వీక్షణం
# సి.డి.ఆర్.సి, బి1 కలెక్టివ్ ప్రచురణలు



**ఫిఫ్టీ ఇయర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్**
**(1956–2006)**
పేజీలు 206 – వెల రు. 225



**ఒక దళారీ పశ్చాత్తాపం**
జాన్ పెర్కిన్స్
తెలు అనువాదం – కొణతం దిలీప్
పేజీలు 172 – వెల రు. 50



**ఇన్ సర్చ్ ఆఫ్ మెథడ్**
ముదునూరి భారతి
పేజీలు 368, వెల రు. 200



**మీరు – నేను – ఆర్థికం**
వి. హనుమంతరావు
పేజీలు 215 – వెల రు. 60



**ఇండివిద్యువల్, సబ్ గ్రూప్స్, గ్రూప్స్ అండ్ ఫ్రీడమ్**
ముదునూరి భారతి
పేజీలు 60, వెల రు. 75



**కుట్రాజకీయం**
అమెరికా దుర్మార్గాల శతాబ్ది
స్టీఫెన్ కింజర్
తెలు అనువాదం – కొణతం దిలీప్
పేజీలు 114 – వెల రు. 40



**క్రైసిస్ అండ్ డెవలప్‌మెంట్**
**ఇన్ మార్క్సియన్ ఫ్రేమ్‌వర్క్**
ముదునూరి భారతి
పేజీలు 106, వెల రు. 80



**అభివృద్ధిని ఇలా చూద్దాం**
వ్యాసాలు, సమీక్షలు
ముదునూరి భారతి
పేజీలు 206 – వెల రు. 80



**మెథడాలజీ ఆఫ్ సోషల్ ఎంక్వైరీ**
ముదునూరి భారతి
పేజీలు 208, వెల రు. 150



**ఆన్ ఎద్యుకేషన్**
ముదునూరి భారతి, ఆర్.ఎస్. రావు
పేజీలు 142, వెల రు. 100



**కొత్తచూపు**
'అభివృద్ధి వెలుగునీడలు', ఇతర వ్యాసాలు
ఆర్. ఎస్. రావు
పేజీలు 296 – వెల రు. 100

ప్రతులకు, వివరాలకు :

# వీక్షణం

301, మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

# స్వేచ్ఛా సాహితి ప్రచురణలు



**పావురం**
కవిత్వం
ఎన్. వేణుగోపాల్
పేజీలు 109 - వెల రు. 30



**రాబందు నీడ**
అమెరికా యుద్ధోన్మాదంపై వ్యాసాలు
(1989-2006)
ఎన్. వేణుగోపాల్
పేజీలు 111 - వెల రు. 25



**గంగానమ్మ**
నవలిక
విజయ
పేజీలు 61 - వెల రు. 15



**పరిచయాలు**
ప్రభావశీల వ్యక్తుల గురించి అక్షరచిత్రాలు
ఎన్. వేణుగోపాల్
పేజీలు 194 - వెల రు. 50



**విశ్వాంతరాళం**
కొడవటిగంటి రోహిణీప్రసాద్
పేజీలు 189 - వెల రు. 70



**మానవ పరిణామం**
కొడవటిగంటి రోహిణీప్రసాద్
పేజీలు 211 - వెల రు. 75



**జీవకణాలూ నాడీకణాలూ**
కొడవటిగంటి రోహిణీప్రసాద్
పేజీలు 184 - వెల రు. 80



**నవలాసమయం**
నవలా విమర్శ వ్యాసాలు, సమీక్షలు
ఎన్. వేణుగోపాల్
పేజీలు 176 - వెల రు. 50



**తెలంగాణ విమోచనోద్యమం తెలుగు నవల**
సమాజ సాహిత్య సంబంధాలు - ఒక విశ్లేషణ
వరవరరావు
పేజీలు 363 - వెల రు. 75



**కల్లముందరి చరిత్ర**
నాలుగు దశాబ్దాల విప్లవోద్యమం
సమకాలిక వ్యాఖ్యలు
ఎన్. వేణుగోపాల్
పేజీలు 309 - వెల రు. 80



**జాత్యహంకారి హిట్లర్**
చేలూరు రమాదేవి
పేజీలు 171 - వెల రు. 80



**వరవరరావు కవిత్వం**
పేజీలు 868 - వెల రు. 300



**లేచినిలిచిన తెలంగాణ**
ఎన్. వేణుగోపాల్
పేజీలు 211 - వెల రు. 75


ప్రతులకు, వివరాలకు :

## స్వేచ్ఛా సాహితి

జి1, మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

